





# ఉప వేదాలు

## నృత్య కళ

# శృంగార ప్రకాశము





## సదాశివ సమారంభాం


గురు దక్షిణామూర్తి


గురు వేదవ్యాస మహర్షి


గురు శుక మహర్షి


గురు నారద మహర్షి


గురు వాల్మీకి మహర్షి


గురు శ్రీకృష్ణ

## శంకరాచార్య మధ్యమాం


గురు దత్తాత్రేయ


గురు బాబాజీ


గురు గౌతమ బుద్ధ


గురు ఆదిశంకరాచార్య


గురు రామానుజాచార్యులు


గురు జ్ఞానేశ్వర్


గురు రవిదాస్


గురు కబీర్ దాస్


గురు చైతన్య మహా ప్రభువు


గురు నానక్


గురు రాఘవేంద్ర స్వామి


గురు వీరబ్రహ్మేంద్ర స్వామి


యోగి వేమన

## అస్మదాచార్య పర్యంతాం


గురు త్రైలింగ స్వామి


గురు లాహిరి మహాశయ



గురు రామకృష్ణ పరమహంస, అమ్మ శారదాదేవి


గురు వివేకానంద


గురు సాయి బాబా


గురు అరబిందో


గురు రమణ మహర్షి


గురు యోగానంద


గురు భక్తివేదాంత ప్రభుపాద


గురు మళయాళస్వామి


గురు విద్యాప్రకాశానందగిరి


గురు చంద్రశేఖర పరమాచార్య

## వందే గురుపరంపరాం..




నన్ను "నేను" తెలుసుకోవటానికి

నన్ను "నేను" మార్చుకోవటానికి

నన్ను "నేను" చేరుకోవటానికి

మరియు అత్యుత్తమ జీవన విధానానికి

కావలసిన భక్తి,జ్ఞాన,కర్మ,ధర్మ సమాచారం ఒకేచోట తెలుగులో ఉచితంగా!

సాధారణంగా వేదాంతం తెలుసుకోవాలనే కోరిక వుంటుంది, కాని గ్రంధాలు అందుబాటులో లేవు. ఇంకొకరి దగ్గర గ్రంధాలు వుంటాయి, కాని జిజ్ఞాసువులకి ఎక్కడ ఉన్నవో తెలియదు. అలాగే కొన్ని లైబ్రరీ లో కొన్ని రకాల పుస్తకాలు మాత్రమే లభ్యం అవుతున్నాయి, అంతేగాక విలువైన గ్రంధాలు సరైన సంరక్షణ లేక కనుమరుగైపోతున్నాయి, కనుక మన అందరి కోసం భారత ప్రభుత్వం పురాతన ఆధ్యాత్మిక గ్రంధాలను సంరక్షించే నిమిత్తం ఎంతో శ్రమతో కంప్యూటరీకరణ ద్వారా ఒక చోట చేర్చుతూ ఆన్ లైన్ చేయటం జరిగింది. ఇటువంటి విలువైన జ్ఞాన సంపదను మరింత సులభంగా అందుబాటులోకి తీసుకురావటానికి సాయి రామ్ సేవక బృందం ఉడతా భక్తి గా ఇప్పటివరకి దాదాపు **5000** పుస్తకాలను వివిధ వర్గాలుగా విభజించి PDF(eBOOK) రూపంలో ఆన్ లైన్ లో ఉచితంగా అందించటం జరిగింది. కనుక ప్రతి ఒక్కరు ఈ సదవకాశాన్ని సద్వినియోగం చేసుకోగలరు. ఇందుకు సహాయం అందించిన భారత ప్రభుత్వపు వెబ్ సైట్( డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా http://www.new.dli.ernet.in), ఆర్కైవ్ వెబ్ సైట్(https://archive.org), గూగుల్ వెబ్ సైట్(https://www.google.co.in), మైక్రోసాఫ్ట్ వెబ్ సైట్(http://www.microsoft.com) కు మేము ఋణపడివున్నాము.అలాగే ఇటువంటి బృహత్తర కార్యక్రమానికి పెద్ద మొత్తం లో గ్రంధాలను అందించిన తిరుమల తిరుపతి దేవస్థానమునకు కూడా మనం ఋణపడివున్నాము. సాయి రామ్ సేవక బృందం కోరుకొనేది ఒక్కటే, ప్రతి ఇల్లు ఆధ్యాత్మిక జ్ఞాన గ్రంధాలతో నిండిపోవాలన్నదే మా కోరిక.

ఈ గ్రంధాలను ఉచితంగా ఆన్ లైన్ లో చదువుటకు, దిగుమతి(డౌన్లోడ్) చేసుకొనుటకు గల మార్గాలు:

1) భారత ప్రభుత్వపు వెబ్ సైట్: http://www.new.dli.ernet.in లేక http://www.dli.ernet.in
2) సాయి రామ్ వెబ్ సైట్: http://www.sairealattitudemanagement.org
3) సాయి రామ్ గూగుల్ సైట్: https://sites.google.com/site/sairealattitudemanagement
4) ఆర్కైవ్ వెబ్ సైట్: https://archive.org/details/SaiRealAttitudeManagement

ఈ జ్ఞాన యజ్ఞం పై గల సలహాలు,సూచనలకు సేవక బృందాన్ని సంప్రదించుటకు: sairealattitudemgt@gmail.com

సాయి రామ్ భక్తి,జ్ఞాన సమాచారం: https://www.facebook.com/SaiRealAttitudeManagement

సాయి రామ్ భక్తి,జ్ఞాన సంబంధ వీడియోలు: https://www.youtube.com/user/sairealattitudemgt

ఈ జ్ఞాన యజ్ఞంలో ప్రతి ఒక్కరు పాల్గొని, ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకొని,మీరు సంతృప్తులైతే మరొక సాధకునికి, జిజ్ఞాసువులకు మార్గం చూపించగలరని ఆశిస్తున్నాము. మీరు చదువుకోవటంలో ఏమైనా ఇబ్బంది కలిగితే సేవక బృందంను సంప్రదించగలరు. ఒకవేళ మా సేవలో ఏమైన పొరపాటు వస్తే మన్నించగలరు.

ఈ గ్రంధపు భారత ప్రభుత్వ డిజిటల్ లైబ్రరీ గుర్తింపు సంఖ్య: 2990100051800

గమనిక: భక్తి,జ్ఞాన ప్రచారార్ధం **ఉచితంగా eBook** రూపంలో భారత ప్రభుత్వపు సహాయంతో ఇవ్వడం జరిగింది. ఈ గ్రంధముపై వ్యాపార,ముద్రణ హక్కులు రచయిత,పబ్లిషర్స్ కి గలవు, కనుక వారిని సంప్రదించగలరని మనవి చేసుకొంటున్నాము.

**SaiRealAttitudeManagement**(SAI RAM) - సాయి నిజ వ్యక్తిత్వ నిర్వహణ(సాయి రామ్)

* సర్వం శ్రీ సాయినాధ పాద సమర్పణమస్తు *

## భారత ప్రభుత్వపు వెబ్ సైట్ - డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా

## http://www.new.dli.ernet.in

Digital Library of India: In ×

www.new.dli.ernet.in

# Digital Library of India

Hosted by: Indian Institute of Science, Bangalore in co-operation with
CMU, IIIT-H, NSF, ERNET and MCIT for the Govt. of India and 21 major participating centres.

Home | Vision | Mission | Goals | Benefits | Content Selection | Current Status | People | Funding | Copyright Policy | FAQ | RFP

Books Journals Newspapers Palm-Leaves (Manuscripts)

Title: Ramayanam
Author:
Year: to
Subject: Any Subject
Language: Telugu
Scanning Centre: Any Centre

Clear | Search

Presentations and Report
Statistics Report
Status Report
Feedback | Suggestions | Problems | Missing links or Books

Click here for PDF collection
DLI MIRROR at IUCAA Data Center PUNE

DLI

For the first time in history, the Digital Library of India is digitizing all the significant works of Mankind.

Click Here to know More about DLI New!

| Books | Journals | Newspapers | Manuscripts |
|---|---|---|---|
| Rashtrapati Bhavan<br>CMU-Books<br>Sanskrit<br>TTD,Tirupathi<br>Kerala Sahitya Akademi | INSA | Times of India<br>Indian Express<br>The Hindu<br>Deccan Herald<br>Eenadu<br>Vaartha | Tamil Heritage Foundation<br>AnnaUniversity NEW! |

**Title Beginning with.**

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

**Author's Last Name**

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

**Year**

| 1850-1900 | 1901-1910 | 1911-1920 | 1921-1930 | 1931-1940 | 1941-1950 | 1951- |
|---|---|---|---|---|---|---|

**Subject**

| Astrophysics | Biology | Chemistry | Education | Law | Mathematics | Mythology | Religion | For more subjects... |
|---|---|---|---|---|---|---|---|---|

**Language**

| Sanskrit | English | Bengali | Hindi | Kannada | Marathi | Tamil | Telugu | Urdu |
|---|---|---|---|---|---|---|---|---|

# అతి విశిష్టం ఈ దానం!

స్వామి వివేకానంద

"దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం" అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్న్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.

రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని ఝళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!

మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, జవసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!

ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. "నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది" అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖



మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014

శ్రీమన్మహారాజాధిరాజ భోజదేవ

# శృంగారప్రకాశము

## సాహిత్యప్రకాశము



ఆంధ్రప్రకాశము:

శ్రీ జమ్ముల మడక మాధవరామశర్మ
అభినవభారతి : గుంటూరు



కృతిస్వీకర్త:

శ్రీ నన్నా గోపాలకృష్ణయ్య
శ్రీవిజయదుర్గా కలాభవనము : విజయవాడ.

# ఆ ము ఖ ము

శ్రీయుత:లు పసల సూర్యచంద్రరావు గారు
ఆంధ్రప్రభుత్వ సంగీత నాటక అకాడమి అధ్యక్షులు
శాసనమండలి సదస్యులు (M. L. C.)

భారతీయ సాహిత్య శాస్త్ర ప్రస్థానములలో "రస ప్రస్థానము" ఒక యపూర్వఘట్టము. విశ్వసాహిత్యచరిత్రలో "నాన్యతో దర్శనీయము"

"శృంగార వీర కరుణాద్భుత రౌద్ర హాస్య
బీభత్స వత్సల భయానక శాంత నామ్నః
ఆమ్నాసిషుర్దశ రసాన్సుధియో, వయం తు
శృంగారమేవ రసనా ద్రస మామనామః"

నాంది ప్రథమశ్లోక మననే శృంగారమునకు కాంతా విమిశ్ర తత్త్వముతో అవ్యక్తత్వమును, కృత విప్రలంభశబ్దముచే వ్యక్తత్వమును పురారి శరీరమునకు భావించిన భోజదేవుని రసోపాసన అనన్యము అపూర్వము కదా!

భరతముని అష్టరసములనె చెప్పినాడు. ఆనంద వర్ధనాభినవ గుప్తపాదులు శాంతమును జేర్చి "రసములు తొమ్మిది" అని నిష్కర్షించి యున్నారు. విశ్వనాథ కవిరాజు "వత్సల" రసమును పదియవ రసముగా చేర్చినాడు. అయితే, ఈ తొమ్మిదింటిలోను రసరాజ మేది? అను ప్రశ్న వచ్చి నప్పుడు కరుణాది రసముల పేర్లు వినవచ్చి నప్పటికి "శృంగారమె రసరాజ" మని కొందరు ముక్తకంఠముతో పలికి యంగీకరించినారు.

శృంగారము రసరాజ మనుటలో భోజునకు విప్రతిపత్తి లేదు. అంతియే కాదు. ఆయన ఇంకను ముందునకు పోయి "శృంగార మొక్కటియే రసము" అని నిర్ధరించినాడు. భోజుని దృష్టిలో "అహంకారము అభిమానము శృంగారము" ఈ మూడు నభిన్నార్థకములు. ఇట్టి శృంగారరస స్వరూపమును ప్రకాశింప జేయుటకు పూనుకొనిన గ్రంథము కావున నిది "శృంగారప్రకాశ" మైనది.

శృంగారప్రకాశము 36 ప్రకాశముల బృహద్గ్రంథము. శృంగారము నవలంబముగా జేసికొని సర్వ సాహిత్యశాస్త్ర విషయములను భోజమహారాజు మౌలిక మయిన పనూత్నపద్ధతిలో నిందు వివరించి యున్నారు. ఇదియే యిందలి విశిష్టతల లోని విశిష్టత.

ఈ శృంగారప్రకాశ విశిష్టతను P. H. D థీసిస్సు ద్వారా లోకమున కెరుక పఱచిన ప్రథములు Dr. వి. రాఘవన్ గారు. కాని ఇది ఆంగ్ల గ్రంథము. ఇంతటి యుదాత్త మయిన శృంగారప్రకాశము సంస్కృతమూలము పూర్ణముగా నింత వఱకును ప్రకటితము కాక పోవుటయే బాధాకర మయిన విషయము. ఇంక దేశభాషల లోనికి గాని, విదేశభాషల లోనికి గాని ఇది యనూదితము కాలేదని వేరుగా జెప్ప నక్కఱ లేదు.

ఇట్టి పరిస్థితులలో శృంగారప్రకాశము నాంధ్రీకరించుటకు చేసెడి యత్నము సాహస మనక తప్పదు. అయినను,

మహోపాధ్యాయ దర్శనాచార్యాది బిరుదాంచితులు

శ్రీ జమ్ములమడక మాధవరామశర్మ గారు సాహసించి దీని యాంధ్రీకరణమునకు పూనుకొనినారు. పూనుకొనుటయే కాదు సర్వసమర్థముగ నిర్వహించినారు. అందులకు వారిని నేను అభినందించుచున్నాను.

మిత్రులు శ్రీ నర్రా గోపాలకృష్ణయ్య గారు సహజ సహృదయత్వముతో ఈ మధుర మంజుల కృతి స్వీకరించుటకు ప్రకాశింప జేయుటకు పూనుకొనుట వారి రసజ్ఞతను వ్యక్తపఱచుచున్నది.

శ్రీ శర్మగారి ఈ శృంగారప్రకాశము ఈ సాహిత్య ప్రకాశము సహృదయుల మన్ననలను పొందగలదని విశ్వసించుచున్నాను.

పసల సూర్యచంద్రరావు

7–9–1970

# కృతిస్వీకర్త

# శ్రీ నర్రా గోపాలకృష్ణయ్య గారు

విజయవాడలో సత్యనారాయణపురములో స్వసౌధములో శ్రీవిజయదుర్గా కళా భవనములో సాధారణ సంవత్సరారంభమున మహాసభ నేర్పాటు చేసినాడు. మా నాన్నగారు శ్రీ జమ్ములమడక మాధవరామశర్మ రచించిన శృంగార ప్రకాశము ఆ సభలో ప్రకాశిత మగునని శ్రీగోపాలకృష్ణయ్య కృతి ప్రకాశనాసక్తుడై ప్రకాశ స్వీకర్తయగునని ఉల్లాసమున మేమును సభకు వచ్చితిమి. కృతిస్వీకారసభా సౌందర్యము భావించి భావించి సర్వానందము మేము అందుకొంటిమి మా అమ్మ శ్రీకామాక్షీ హైమవతీ దేవియు ఆనాడు ఆ సభలో ఆ వైభవములో ఆ సన్నివేశములో ఉన్నచో మా నాన్న భావస్వభావరీతిని మేము చూడ వలెనని తలచితిమి. మా కన్నులు తడిసినవి. "వీడు నా పెద్ద కుమారుడు పేరు వాసుదేవ. వీడు భవభూతి శర్మ. పెద్దపిల్ల శ్రీభామతీదేవి అత్తవారింట ఉన్నది. ఇది నా చిన్నపిల్ల శ్రీమతీ దేవి" అని ఇంకను అని పద్యాలు చదివేవాడేమో. మే మెవ్వరము పుట్టక పూర్వము మా నాన్న మా అమ్మ అంగీకారముతో శృంగారప్రకాశము లోని 22వ ప్రకాశము ఆరంభించి వినిపించి నాడని, మా అమ్మ "ఇన్నిరకాలేమిటి" అన్నదని మా నాన్న వారం వారం వ్రాసికొన్న వానిని చూచి అనుకున్నాము అస్తు. ఈ నాడు మా నాన్న అద్వితీయుడుగా ఇంత చేయగలుగుటలో.

శ్రీ నర్రా గోపాలకృష్ణయ్య గారు సర్వహేతువు. మా నాన్న సంవత్సరాదినాడు జన్మించినాడు. ఆ పండుగ అసలందరికి పండుగ. మాకు మరీపండుగ ఆ నాడే కృతిసమర్పణము కృతిస్వీకారము. మా నాన్నను చూస్తూ ఉంటే మాకు మాటలు రావు.

శ్రీ గోపాలకృష్ణయ్యగారు కృష్ణామండలము ఇంటివల్లిలో ఉండేవారు తండ్రి శ్రీ లక్ష్మీనారాయణ, తల్లి చలసాని వారి ఆడపడుచు శ్రీమతి పున్నమ్మ శ్రీగోపాలకృష్ణయ్య తల్లిని తండ్రిని నిత్యము భావించును. నాగయ్య శ్రీరాములు వేంకటరామయ్య సోదరులు స్నేహితులను చూచినపుడు ముందుగా గోపాలకృష్ణయ్యకు సోదరులు కన్పడుదురు ప్లవంగ శ్రావణ కృష్ణాష్టమి ఆదివారము ది 29-9-1907 నాడు గోపాలకృష్ణయ్యగారు జన్మించిరి. మా నాన్న కన్న కొన్ని నెలలు చిన్న. తెనాలి తాలూక ఈమనిలో, తెనాలి జాతీయ విద్యాలయములో కొంత కాలము విద్య నభ్యసించినాడు జాతీయోద్యమములో స్వచ్ఛంద సేవకుడై తన విద్య నుద్యమమున కర్పించెను. దేశభక్తి సముద్యమమున జేయవలయు వానిని గుర్తించెను. 1924 లో వివాహ మయినది. సౌభాగ్యవతి కుంకుమశోభిత

శ్రీ రుక్మిణీదేవి శ్రీగోపాలకృష్ణ ధర్మపత్ని. చిననాటి నుండియు శ్రీదేవీ నవరాత్ర పూజాసక్తు డయిన గోపాలకృష్ణయ్యకు శ్రీరుక్మిణీదేవీ సాహచర్యమున జన్మ సహజ మయిన వివిధకలాసక్తి వికసించినది. సంతర్పణములు సంగీత సభలు వాద్యవిధులు సత్కారములు సత్కార్యములు సద్వితీయుడై సరసముగా నిర్వహించెను. వారణాసి వంశప్రతిష్ఠము అయిన "ఘంట బ్రహ్మ" వాద్యవాదనముల నైపుణి అందుకొనెను. మణి గురు శ్రీ వైద్యనాథ అయ్యరు సన్నిధిలో మృదంగమునకు వరుసలు నేర్పెను, కలాభిరుచి పుదుక్కోట దక్షిణామూర్తి సన్నిధిలో కంజరిని గూడ పట్టించినది ఇది యంతయు 1936లోపుగా నయిన విద్యా సమారాధనము అప్పటి నుండి కలాచతురుడు కలా ధర్మ మర్మ విదుడు నయిన శ్రీగోపాలకృష్ణయ్య కనకదుర్గాక్షేత్రము విజయవాడ వాస్తవ్యుడై కలాస్పందము కలిగించెను.

శ్రీరుక్మిణీ గోపాలకృష్ణ సంతానము సంతతము సంస్కృతిపర మయిన కలామయజీవనమె సంతరించు కొనుట సర్వము జననాంతరసంస్కారము కుమారుడు చి॥ చంద్రశేఖరరావు పొందు ఇంజనీయరుగా సన్నిధిలో నున్నాడు. చంద్రశేఖర సహచారిణి శ్రీమతి హైమవతి B.S.c సర్వవిధులలో సహచారిణి కోడలు శ్రీహైమవతి దేవీనామ భూషిత యగుట గోపాలకృష్ణయ్యకు కత్యంత మాదరపాత్ర మయినది. కనకదుర్గా దేవీభక్తి ప్రసాదముగా శ్రీరుక్మిణీకృష్ణుల కూతురు శ్రీకనకదుర్గ జన్మించినది. నర్రా కనకదుర్గ భరతభూషణ, నాట్యనిపుణ, వాద్యకుశల సంగీతచతుర, భాషాకోవిద, సంగీతకలాశాలా నాట్యవిద్యాచార్య శ్రీ కనకదుర్గ ఇట్టి విశిష్ట యగుటకు సర్వదా సర్వథా శ్రీ రుక్మిణీకృష్ణులె హేతువు శ్రీ కనకదుర్గ వాసిరెడ్డి కనకదుర్గ యయినది. కనకదుర్గా జాని శ్రీ హనుమంతరావు కలాహృదయుడు.

శ్రీగోపాలకృష్ణభవనములో నెప్పుడు విన్నను మనుమలు మనుమరాండ్రు రవీంద్రప్రసాదు లీలాలక్ష్మి నళినీదేవి సత్యభామ రుక్మిణీదేవి కలకలస్వనములతో గతిసుందరముగ సంచరించు చుందురు శ్రీరుక్మిణీదేవి శ్రీగోపాలకృష్ణ సూచనానుసారమున తమ భవనమునందు నిత్యము నిత్యార్చనాపరాయణ శ్రీగోపాలకృష్ణయ్య శ్రీరుక్మిణీభావానుసారమున సర్వకార్య నిర్వాహణ ధూర్వహుడు. అందరు యుగళారాధకులు.

చిరకాలము సంగీతసభలలో మృదంగము ప్రయోగించి కంజరి మంజుల ద్వనులు విన్పించి తన కలాహృదయమును మధురముగా ప్రకాశింప జేసిన శ్రీ గోపాలకృష్ణయ్య అందరి యభిమానమునకు పాత్రుడయ్యెను. వాద్యవాదన నిపుణులందరిలో నింతటి క్రమవిన్యాస పాటవము కలదా? గాయకులు గాన మొనరించినంత వఱకు వాదకులు పటుప్రజ్ఞ ప్రదర్శింపగలరు. అనంతరము వాదనకలా పాండిత్య వైదగ్ధ్య ప్రదర్శన కౌశలమును వీరి నుండి యెందరు గుర్తించిరో మా కేమి తెలియును? ముఖవాద్య విధానమున మృదంగమునకు పలుకులు నేర్పగల వారు, వేగముగ వేవేగముగ వైదగ్ధ్యము ప్రదర్శింప గలవారు ఎందరుందురో? శ్రీగోపాలకృష్ణయ్య ఒడలు మఱచి సర్వము దేవీపరముగ నివేదించును శ్రీవిజయదుర్గాకలాభవనము శ్రీరాజరాజేశ్వరీ భవనము శ్రీకనకదుర్గా నృత్యకలా కేంద్రము సకల సభానిర్వహణము సర్వము దేవీభక్తి నిదర్శనము.

ఆలిండియా రేడియో అడ్వయిజరి కమిటి మెంబరుగా, భరతనాట్యమునకు మృదంగవిద్యావిధానమునకు సిలబసు నిర్మాతగా, నాట్యప్రదర్శనోత్సవ సంధాతగా, సంగీతకలాశాలలకు స్వరూప సంపాదకుడుగా, ప్రదర్శన ప్రతిస్పర్థా ప్రాశ్నికుడుగా, నిర్ణాయకుడుగా, పరీక్షకుడుగా, భావుకుడుగా, ప్రయోక్తగా, వీణా వేణు స్వరశ్రుతి భావయితగా, ప్రశస్తిభాజనుడయిన శ్రీగోపాలకృష్ణయ్య విశిష్టతలను మేమెట్లు గుర్తింపగలము? శ్రీ కృష్ణయ్య శిష్యసంక్రాంత విద్యావైభవము నాట్య నృత్య నృత్తము లాచరించు శ్రీకనకదుర్గ హస్తవిన్యాసములో గతిసంచారములో పదవిక్షేపములో వలనములో వర్తనములో నంతట శ్రీ కృష్ణోపదేశసాఫల్యము భాసించును. కావుననే అసీదృశ ప్రయోగముల నీ వ్యక్తి యభినందింపదగు. శ్రీగోపాలకృష్ణయ్య బహుశ్రుతుడు. భాషావిదుడు కలావిద్విదుడు సంఖ్యావత్సరసుడు.

ఇట్టి శ్రీ గోపాలకృష్ణయ్య నాటకకలాపరిషత్తునకు కలాపరిషత్తులకు పరిషత్తులకు కోశమై హృదయకోశ మిచ్చెను. గ్రంథములు రచింపజేసెను. ముద్రించి యిచ్చెను. కవులకు విద్వాంసులకు కథాకథకులకు వాద్యవాదకులకు పోషణమిచ్చి ప్రోత్సాహమిచ్చి గుప్తదానము లొనరించియు హృదయవాణి ముఖవాణియగుట నభిలషింపదు. నానా వ్యాపార సంస్థాపకుడై సర్వయాజ

మాన్యముకల వా డయినను "శ్రీహైమవతీ చంద్రశేఖరు లద్వయమతులై గతి ప్రగతులు పరిశీలించు కొందురు" అని భావించి భావసుందరుడుగ నుండును.

ఇట్టి తుష్టి ఇట్టి పుష్టి సర్వమంగలాస్పద శ్రీ రుక్మిణీదేవి భాగ్య మని శ్రీ నరాగ్రిగోపాలకృష్ణయ్య గారు సర్వదా సర్వథా సంభావించు చుందురు. ఏవం విధవిశేషవిశిష్టులకు మా నాన్నగారు:

శృంగార ప్రకాశము

భావోపాయనముగ సమర్పించుట సకల సచేతన చేతో మోద సంపాదన మని మేము సంభావించుచున్నాము.

కుమార మాధవరామశర్మ శాస్త్రి.
భవభూతిశర్మ M. Sc.
శ్రీ మ తీ దే వి



# షయ ప్రకాశము



౧. ఈ శాస్త్రమున శృంగార మభిధేయము. ఆత్మస్థిత మగు అహంకార గుణవిశేషము శృంగారము. అది యాత్మశక్తి రసనీయ మయినచో రస మగును. రసమున్నందున రసికు డను ప్రసిద్ధి కలుగును. శృంగారమె రసము. వీరాదులు రసములు కావు. శృంగారేతరము లన్నియు భావములు శృంగారము పరివేష్టించి యుండును. భావ్యమానము భావము. రస్యమానము రసము రత్యాదిభావములు శృంగారప్రభవములు. నటాభినయమున కవి కావ్యమున సామాజికులు రసమాస్వాదింతురు కవివచన సమర్పితములు ప్రత్యక్షదృష్టముల కన్న విశిష్టములుగా నుండును,

అభినేతృభ్యః కవీనేవ బహుమన్యామహే
అభినయేభ్యశ్చ కావ్యమేవ

౨. శబ్దార్థముల సాహిత్యము కావ్యము. శబ్దము ద్వాదశవిధము. అర్థము ద్వాదశవిధము. సాహిత్యము ద్వాదశవిధము: ప్రకృత్యాదులు శబ్దవిశేషములు, క్రియాదు లర్థవిశేషములు. అభిధాదులు సాహిత్యవిశేషములు

కః పునః శబ్దః ? యేనోచ్చరితేనార్థః ప్రతీయతే
కోఽర్థః? యః శబ్దేన ప్రత్యాయతే
కిం సాహిత్యం ? యః శబ్దార్థయోః సంబంధః

ప్రకృతి – ప్రత్యయ – ఉపస్కార – ఉపపదములు అను నాలుగు శబ్దవిశేషములు ప్రథమమున గలవు. ౧–౬౩.

౩. ఏకాదశము. రసావియోగప్రకాశము. ౬౩–౯౯౪ కావ్యసౌందర్యము రసావియోగము – ఆత్మనః అహంకారగుణవిశేషః సచేతసా రస్యమానః రసః – భావము శృంగారప్రభవము – శృంగారియగు వానికె రత్యాదులు ౪౯ కలుగును. భావ్యమానము భావము – భావనాపథాతీతము రసము – రత్యాదులు రస వ్యవహార యోగ్యములు కావు.

౪. ఆత్మాభిమానోపాధికరసము మూడు విధములు — ప్రబంధములలో శృంగారము రెండువిధముల నుండును — వాక్యవిషయము ప్రబంధవిషయము — గుణాలంకారసన్నివేశమున రసము — అలంకారసంసృష్టిలో రసప్రకర్ష — రూపకాదుల సంసృష్టి రసావియోగహేతువు.

౫. సంసృష్టి రెండు విధములు — ప్రధానాంగభావము సమకక్ష్యత — గుణరసాదుల కలంకారప్రతిపత్తి ౭౨ — రసాదుల కలంకారత — రస పూర్వకోటి ౭౪ — రసమధ్యమావస్థ ౭౫ — ఉత్తమకోటి ౭౬ — ఉత్కర్ష లేకున్న రసము గుణము ౭౮ — సంసృష్టి సంకర వ్యవస్థ ౯౧ — అలంకారములకు వక్రోక్తి వ్యవహారము ౯౨ — స్వభావోక్తి రసోక్తి-రత్యాదులు సాతిశయములై శృంగారాదు లగుట ౯౭ — రససంఖ్య ౧౦౧ — న హి బహవో రసాః అపి త్వేక ఏవ శృంగారో రసః రసమున రసాంతరోత్పత్తి ౧౦౩ — వికల్పము — ఖండనము

౬. రసావస్థలు ౧౦౯ — అంతట అహంకారమె మూలము — ఉత్కంఠాభిషంగాదులు ౧౧౯ — అలంకారసంకరము షట్ప్రకారము ౧౨౨ — గుణవిభాగము — రత్యాదుల సంకరములు ౧౨౬ అలంకారసంకరవిశేషములు ౧౩౧ — గుణరససంకరము ౧౩౨ — రసాధికసంకరము ౧౩౬ — గుణాలంకారసంకరము ౧౩౯ — రసాలంకారసంకరము ౧౪౩ — ఇట్లు వాక్యవిషయ రసావియోగము.

౭. ప్రబంధవిషయ రసావియోగము ౧౪౯ — దోషహానము — గుణోపాదానము — పరిబంధరూపము ౧౫౧ — ప్రేక్ష్యము శ్రవ్యము — తద్భేదములు — నాటకాదులు ఆఖ్యాయికాదులు — నాటకాది లక్షణము ౧౫౩ — నాటికాదులు ౧౬౨ — అనభినేయభేదములు ౧౬౭ — సాహిత్యప్రకాశము శృంగారప్రకాశము — గుణాలంకారవిభాగము — గుణాలంకార లక్షణయోగము ౧౭౨ — ముప్పది విశేషములు — వానివివరణము — మహాకావ్యము ౧౯౨.

౮. ద్వాదశము ౧౯౫ — ప్రబంధాంగ చతుష్షష్టి చతుష్టయము, ప్రథమ చతుష్షష్టి విశదీకరణము ౧౯౬ — ద్వితీయ చతుష్షష్టి. ౨౧౧—తృతీయ చతుష్షష్టి ౨౩౧ తురీయ చతుష్షష్టి ౨౩౩.

౯. త్రయోదశము ౨౩౫ — రతిప్రకాశనము — పురుషార్థశృంగారములు —

రత్యాదులు ముప్పది రెండు – శృంగారభేదము – జన్మానుబంధాదిసంబంధము – రతి అష్టవిధము ౨౪౩ – నైసర్గికాది భేదములు.

౧౦. సాహిత్యప్రకాశము, సమీక్షాప్రకాశము – ౨౪ విషయముల సంగ్రహము – హర్షాదిభావవర్గము ౨౫౫ – ద్వితీయవర్గము – నాయక నాయికా భేదములు – ఉద్దీపనోపనిషత్తు ౨౫౩ – చతుష్షష్టికలలు – ౨౫౭రసానుభూతి ౨౫౯ ధర్మాదిశృంగారములు – కామశృంగారము ౨౬౩.

౧౧ అనురాగస్థాపనము – చతుష్షష్టి భేదములు – ౨౬౬ ప్రతిప్రకారమష్టవిధములు – వీని విశేషములు – అన్నియు ౧౨౨౦లా ఫలములు – సంభోగభేదములు ౨౭౨ – విప్రలంభము – భేదములు – మానాదినిరుక్తి ౨౮౮ – అభియోగము ౨౦౫ – అభిసరణము – దూతవిశేషములు – లేఖసంప్రేషణము – మానప్రకాశము – ప్రవాసము-ప్రాప్తిస్కంధాదులు ౨౬౪ – సంభోగారంభము – కామసర్వస్వము – కావ్యజీవితము – శృంగారప్రకాశము.

# శ్రీ భో జ మ హా రా జు

మాళవాధీశుడు విద్వచ్చక్రశిరోమణి శిష్టశిరోమణి సకలశాస్త్ర విద్యా నిర్మాణాపూర్వప్రజాపతి చతురశీతి బిరుదవిరాజితుడు అవ వద్యనిఖిల విద్యాభిజ్ఞ సర్వజ్ఞ సార్వభౌముడు · రామాయణచంపువు - శాలికథ - శృంగారమంజరి - విద్వాన్విద్వినోదములను, సరస్వతీకంఠా భరణ-శృంగారప్రకాశములను, సరస్వతీకంఠాభరణవ్యాకరణమును, అమరవాఖ్య - సంయమినామమాలను, రాజమార్తాండ - యుక్తి కల్పతరు-వ్యవహారసముచ్చయ - రత్నమాలలను, రాజమృగాంక - విద్వజ్జన వల్లభ - భుజబలనిబంధ - ప్రశ్నచింతామణులను, యోగ సూత్ర వృత్తిని, రాజమృగాంక-చారుచర్య-ఆయుర్వేద సర్వస్వము లను, సమరాంగణ సూత్రధార - శాలిహోత్రోన్నయములను, తత్త్వ ప్రకాశమును, కోదండమండనమును, గీతప్రకాశమును ఇంక ననేక ములను రచించెనని ప్రసిద్ధి యున్నది. ఇవి కావ్య-సాహిత్య - వ్యాక రణ - నిఘంటు - ధర్మ - జ్యోతిష - యోగ - వైద్య - స్థాపత్య యంత్ర - శైవ - ధనుర్వేద - సంగీతములకు సంబంధించినవి. సర స్వతీకంఠాభరణ - శృంగారప్రకాశ - రాజమృగాంక - సమరాం గణసూత్రధార ప్రముఖములు భోజబిరుదములు.

ఇప్పటి నా ఈ ఆంధ్రప్రకాశము సకల భోజప్రకాశాదరము గలుగ జేయునది యగునేని సహృదయప్రకాశము ప్రకాశితము కాగలదు.

శ్రీ మాధవరామశర్మ.

శ్రీ మన్మహా రాజాధిరాజ

శ్రీ భోజ మహారాజ విరచిత

# శృంగార ప్రకాశము

ఆంధ్ర ప్రకాశము


శ్రీ జమ్ములమడక మాధవ రామ శర్మ



అభినవభారతి : : గుంటూరు

కృతి ప్రకాశనము

శ్రీ నర్రా గోపాల కృష్ణయ్య

శ్రీ విజయ దుర్గా కళాభవనము

సత్యనారాయణ పురము : : విజయవాడ

'శృంగారమేవ రసనా ద్రస మామనామః'

శ్రీ

శ్రీమన్మహారాజాధిరాజ

శ్రీ భోజమహారాజవిరచిత

# శృంగార ప్రకాశము

## ప్రథమ ప్రకాశము:

అచ్ఛిన్నమేఖల మలబ్ధదృఢోపగూఢ
మప్రాప్తచుంబన మవీక్షిత వక్త్రకాంతి
కాంతావిమిశ్రవపుషః కృతవిప్రలంభ
సంభోగసఖ్యమివ పాతు వపుః పురారేః॥

యత్పాదపంకజ రజః పరిమార్జితేషు
చేతస్సు దర్పణతలామలతాం గతేషు
శబ్దార్థ సంపద ఉదారతరా స్ఫురంతి
విఘ్నచ్ఛిదేఽస్తు భగవాన్ స గణాధినాథః.

# శృంగార ప్రకాశము

## ఆంధ్ర ప్రకాశము

అచ్ఛిన్నమేఖలము అలబ్ధాలింగనము అప్రాప్త చుంబనము అదృష్టముఖకాంతి యగు దేవీసహిత దేహము కల శ్రీశివుని విప్రలంభ సంభోగసఖ్యము కలదిగా నున్న దేహము రక్షించు గావుత. అని గ్రంథారంభమున మంగలాచరణము. ఈ శ్లోకార్థమును శ్రీ భోజదేవుడు సప్తమప్రకాశములో నీ విధముగా నిరూపించినాడు. గ్రంథారంభమున నా యర్థమును భావించుట యుక్తము.

'అత్ర కావ్యార్థస్తావత్ కాంతావిమిశ్రవపుషః పురారేః వపుః అచ్ఛిన్నమేఖలం ఇత్యాది విశేషణయోగాత్ విప్రలంభ సంభోగయోః సఖ్యసంపాదకమివ – ఇత్యుత్ప్రేక్షమాణాం రక్షతు.'

అని యిచట అభిధీయమాన మగు వాక్యార్థము. 'కాంతావిమిశ్రవపుషో వపుః' అనుటచే 'శివుని మూర్తియే సాంసారిక కర్మలలో సంగత మగును. ఆత్మ సంగతము కాదు" అని భాసించును. 'మూర్తి'పదము కాక 'వపుః' పదము గ్రహించుట వలన, కేవలము విశ్వరక్షణముననె కాక సృష్టిసంహారములందు నీతడె వ్యాపించునని' ప్రతిపాదిత మగును. 'వప్-బీజసంతానే, ఛేదనేపి' వప్ ధాతువు సృష్టిలో సంహారమున నున్నది. 'బీజం వపతి. కేశాన్వపతి. 'కృతి విప్రలంభ సంభోగ సఖ్యమివ' అనుటచే సహానవస్థానములచే దుర్ఘటములగు పదార్థముల గూడ ఈతడు పరస్పరము ఘటించు నని జ్ఞాపిత మగును. 'పురారేః' అనుటచే 'కాంతాసహితదేహు డయినను ఇట్టి యరివధాదివ్యాపారములలో సమర్థుడె' యని సత్యాపిత మగును. ఇట్లిచట వాక్యార్థము ప్రతీయమాన మగును. ఇట్లపారమనన్యసాధారణ మయిన యైశ్వర్య మున్నందున ఈతడె నమస్కా-

ర్యుడు. అన్యుడు నమస్కార్యుడు కాడు'' అని తాత్పర్యము భాసించును.

శాస్త్రారంభమున స్పష్టముగా తాత్పర్య పర్యంతము వ్యాఖ్యానింప వలెను. అభీష్టదేవతను స్తుతింపవలెనని శిష్టాచారము. దాని వలన విశిష్టమగు అదృష్టసంపత్తి కలుగును. సమీహిత ఫలావాప్తి కలుగును. అభీష్టదేవత ద్వివిధ. అధికృత, అనధికృత, అని. 'తత్రాధికృతానధికృతయోరధికృతాయాం ప్రతిపత్తిర్గరీయసీ' అధికృతా నధికృతము లలో అధికృతమున ప్రవృత్తిగొప్పది. అని యధికృతులు స్తుతింతురు. ఈ శాస్త్రమున శృంగార మభిధేయము. ఇందు భగవాన్ మహేశ్వరుడు సర్వజ్ఞు డగుటచే సౌభాగ్యమున దయితజాని యగుటచే స్వాతంత్ర్యమున పరమపరిపూర్ణు డగుటచే సమర్థు డగుటచే నధికృతు డయినట్లుగా నితరులు తద్విధేయ వైభవులు శక్రాదు లధికృతులు కారు. ఇంది చెప్పినదే ప్రతీయమానము. తాత్పర్య రూపము నిరూపిత మగును.

ఈ శాస్త్రమున శృంగారము వక్తవ్యము. అది రెండు విధములు. సంభోగము, విప్రలంభము అని. విప్రలంభము లేకున్న సంభోగమున ప్రకర్ష యుండదు. కావున మొదట విప్రలంభమునె చెప్పవలెను. అది నాలుగు విధములు. ప్రథమానురాగము, మానము, ప్రవాసము, కరుణము అని. సంభోగము కన్న నిది విచిత్రమగుట విస్తరముగా నిరూపిత మగును. విప్రలంభమున నాలుగవస్థలుండును. సత్తి, జన్మ, అనుబంధము. ప్రకర్షము అని ఇట్లు చతుర్భేదము. చతురవస్థము, విచిత్రము నయిన విప్రలంభమును పూర్వార్థమున నిరూపింప యత్నించెను. శ్లోకములో 'అచ్ఛిన్న మేఖలం' అనుటచే ప్రథమానురాగము లక్షిత మగును. ప్రథమానురాగము మేఖలాచ్ఛేదావధి కదా! 'అలబ్ధదృఢోపగూఢం' అనుటచే మానము లక్షితమగును. మానమున్న దృఢోపగూఢము లభింపదు.

'అప్రాప్త చుంబనం' అనుటచే ప్రివాసము లక్షిత మగును. ప్రివాసమున చుంబనాదులు లభింపవు. 'అవీక్షిత వక్త్రికాంతి' అనుటచే కరుణము లక్షితమగును. కరుణమున వక్త్రికాంతి కాన రాదు కదా!

అవస్థలలో గూడ నీ పదములె. 'అచ్ఛిన్న మేఖలం' విప్రలంభ సత్త్వలో నుండును. మేఖల యచ్ఛిన్న మగుచో సంభోగార్థి కవశ్య ముగా విప్రలంభము కలుగును. అది దీని ప్రథమావస్థ. 'అలబ్ధ దృఢోపగూఢం' విప్రలంభ జన్మలో నుండును. మేఖలాచ్ఛేదము లేదేని విప్రలంభము కలవాడు సంభోగము పొందలేక ప్రేయసిని ప్రార్థించును. 'అయి! ప్రియతమా! మేఖలాచ్ఛేద మిష్టపడవేని ఆలింగన మయిన గాఢముగా నిమ్ము!' అని. దీని నామె యంగీకరింప దేని వానికి విప్రలంభము జనించును. ఇది ద్వితీయావస్థ. 'అప్రాప్త చుంబనం' విప్రలంభానుబంధమున నుండును. విప్రలబ్ధుడు సర్వాంగీ ణముగా ప్రియాసంశ్లేషము పొందనేరక ముఖసంయోగమేని యభిల షించును. అది లేమి విప్రలంభము వాని ననుబంధించును. అది దీని తృతీయావస్థ. 'అవీక్షిత వక్త్రికాంతి' విప్రలంభప్రకర్షముననుండును. అపేక్షణీయాలింగనాదులు లేకపోగా కాముకులు ప్రియాముఖావ లోకనము నయిన బహుమానింతురు. అదియు పొందనేరని వారలకు విప్రలంభ మతిశయించును. అది దీని తురీయావస్థ.

ఇట్లు చతుర్విధము చతురవస్థ మయిన విప్రలంభము చాతుర్వి ధ్యమున చాతురవస్థ్యమున వేరు వేరుగా వ్యవహృతమై 'విచిత్రము' అనబడును. సంభోగమును నాలుగువిధములు. ప్రథమాను రాగా నంతర – మానానంతర – ప్రవాసానంతర–కరుణానంతర సంభోగమని. దీనికిని సత్త్వ జన్మ – అనుబంధ – ప్రకర్షము లను నాలు గవస్థలు కలవు. ఇట్లు చతుర్భేదము చతురవస్థ మయిన సంభోగము 'కాంతా విమిశ్రవపుషః' అనుటచే చిత్ర మగుట సంక్షేపముగనె యుపలక్షిత

మగును. 'విమిశ్ర'పదము నందలి 'వి' ఉపసర్గము క్రియావిశేషణార్థ వాచక మయినందున, ప్రథమానురాగానంతరమున, మానానంతర మున ప్రవాసానంతరమున కరుణానంతరమున నే యే విశేషమున సాధ్వసోత్కంపముగా, సేర్ష్యాకషాయముగా, సౌత్సుక్యరభసముగా సహర్షవిస్మయముగా కాంతతో మిశ్రీభావము కలుగుచున్నదో యది యంతయును నుద్దిష్ట మగును. ఇచట మిశ్రపదముచే నీ చతుర్విధ సంభోగ మాక్షిప్త మగును. ఇచట కాంతాశబ్దము స్త్రీపర్యాయము కాగా;

"నామాపి స్త్రీతి పంహ్లాది వికరోత్యేవ మానసం"

స్త్రీ యనునామము నాహ్లాది మనోవికృతి కలిగించునన్నట్లు సంభోగముయొక్క సత్తాసంజ్ఞ కల యాద్యావస్థ ప్రతీయమాన మగును. కాంతాశబ్దము మనోజ్ఞపర్యాయ మేని,

"కిం పునర్దర్శనం తస్యా విలాసోల్లసిత భ్రువః"

విలాసనముల్లాసి భ్రూవిశేషములు కల యా స్త్రీదర్శన మిక 'కింపునః?'యనినట్లు సంభోగము యొక్క జన్మసంజ్ఞ కల ద్వితీయా వస్థ ప్రతీత మగును. కాంతాశబ్దము 'వృషస్యంతీ' పర్యాయమేని (కామయమాన) 'అను రాగము కల యనురూపమగు వనిత లభింప దేని మరల తపమేమంచిది.'

"పువరపి సులభం తపోఽనురాగీ
యువతిజనః ఖలు నాప్యతేఽనురూపః"

అనినట్లు సంభోగము యొక్క, అనుబంధసంజ్ఞ కల తృతీయా వస్థ ప్రతీయమాన మగును. కాంతాశబ్దము వల్లభా పర్యాయ మేని.

"యదేవ రోచతే మహ్యం తదేవ కురుతే ప్రియా
ఇతి వేద్మిన జానామి తత్ప్రియం యత్కరోతి సా"

నా కిష్టమగునదే ప్రియ యాచరించు నని నాకు తెలియును, కాని యామెయేమి ప్రియ మాచరించునో తెలియదు.' అనినట్లు ప్రకర్ష సంజ్ఞ కల సంభోగ తురీయావస్థ ప్రతీతమగును. ఇట్టిది చతుర్భేదము చతురవస్థ మయిన విప్రలంభము. విశేషముగా వర్ణింప దలపెట్టిన సంభోగమిచట దిఙ్మాత్రముగ సూచిత మయిన దని యిచటి తాత్పర్యము.

ఇందు విశేషాధికారి నిర్ణాయక విశేషముల వార్తయేమి? 'కాంతావిమిశ్రవపుషః' అనుపదమునకు తంత్రమున (ఒకే పర్యాయము) వ్యాఖ్యానాంతరముల నిరూపించుటలో నవి సూచితములై యయినవి. ఇందు, 'విప్రలంభ సంభోగములలో సాహాయ్య మొనర్చినట్లున్న శివదేహము కాంతావిమిశ్రదేహులగు పురుషులను స్త్రీలను రక్షించు గావుత' అను వ్యాఖ్య యుక్తము. 'వి' ఉపసర్గము. క్రియావిశేషము నందువలె క్రియావైపరీత్యమున గూడ నున్నది కావున 'విమిశ్ర' శబ్దమున సంయుక్తుల వలె వియుక్తులు నిరూపితు లగుదురు. 'విభక్తి - విక్రీత' పదము లుదాహరణము. కాగా, కాంతావిమిశ్రదేహులగు పురుషులు, కాంత-అవిమిశ్రదేహు లగు వనితలు సంయుక్తులు వియుక్తులును శృంగారాధికారులుగా రెండు విధముల నాయక విశేషములు ప్రతీయమానము లగును. పురారికిని వపుశ్శబ్దము విశేషణము కాగా యౌవన పల్లవిత లావణ్య లక్ష్మీకము సమగ్రాత్మ గుణ సంపదాశ్రయ మగు శరీరము సూచిత మగును. సామాన్య సృష్టి సంహారములు వపుశ్శబ్దమున సూచితములు కావు. సృష్టి సంహారము లందువలె కాంతి యందును వపుశ్శబ్దము ప్రవర్తించుట కలదు. 'కాంతా విమిశ్ర వపుషః' అను సమాసపదాంతర్గతము లయిన విభక్తి సంయుక్తి క్రియలకు గమకములై 'అచ్ఛిన్నమేఖలం' మొదలగునవి విశేషణము లగుచున్నవి.

అచ్ఛిన్నమేఖలాదులు వియోగపక్షమున సంబద్ధము లగును కాని సంభోగ పక్షమున నెట్లు సంబంధించు చున్నవి? ఇట్లు. రాగాంధులై కాంతలతో సంయుక్తులై పరమానందమగ్నులై మేఖలాచ్ఛేదనాలింగనము చుంబన మాలోకన మొనర్చుటకును వారు సమర్థులగుట లేదు.

"తద్యథా ప్రియయా ప్రియా పరిష్వక్తో న
బాహ్యం కించన వేద నాంతరమితి"॥

ప్రియాసంపరిష్వక్తుడై బాహ్యమాంతర మేమియు గుర్తింపడని యున్నది కదా! ఇంకను.

ధన్యాః స్థ యాః కథయథ ప్రియసంగమేపి
విస్రబ్ధచాటుకశతాని రతాంతరేషు
నీవీం ప్రతి ప్రణిహితే తు కరే ప్రియేణ
సఖ్యః శపామి యది కించిదపి స్మరామి.

చెలియలారా! మీరు ధన్యలె! ప్రియసంగమ మునను రతాంతరము లందును రహాశ్శతములను చెప్పుచున్నారు. నేనో ప్రియుడు ముడికై చేతిని జాపగా నేమియు నెఱుగను. ఏమియు గుర్తులేదు. ఒట్టు సుమీ! ఇట్లే 'అచ్ఛిన్నమేఖల' శ్లోకమున సంభోగపక్షసంగతిని భావించునది.

అఖండ వాక్యార్థ పక్షమున వ్యాఖ్యాన మిట్లుండును. ఇట్లిందు పదముల కన్వయ ముండును.

"పాతు. కిం? విశ్వం. కుతః? అపాయేభ్యః. కిం తత్?
వపుః. కస్య? పురారేః కీదృశస్య? కాంతావిమిశ్ర
వపుషః. కిం విశిష్టం? అచ్ఛిన్నమేఖలం అలబ్ధ
దృఢోపగూఢం అప్రాప్తచుంబనం అవీక్షితవక్త్రకాంతి.
కథముత్ప్రేక్ష్యమాణం? కృతవిప్రలంభ సంభోగసఖ్య మివ"

ఈ శ్లోకమున నాలుగు మంగలార్థవచనము లున్నవి. అచ్ఛిన్న శబ్దము, బహువ్రీహిసమాసము విశ్వం-అపాయేభ్యః - అను అధ్యాహ్రియమాణపదద్వయము కల ద్వాదశపదనాంది, పదావిశ్లేషవిశేషోక్తి గర్భ మయిన యుత్ప్రేక్షకల యాశీరలంకారము అను నివి మంగలార్థములు.

> "మంగలార్థాః శాస్త్రాదౌ ప్రయుక్తాః కర్తుః శ్రోతుః
> అధ్యేతురధ్యాపయితుశ్చ మంగలమావహంతి."
> యదాహః
> "మంగలాదీని మంగలమధ్యాని మంగలాంతాని చ
> శాస్త్రాణ్యవ్యాహత ప్రసారాణి ఆయుష్మచ్ఛ్రోతృకాణి చ భవంతి"

శాస్త్రారంభమున ప్రయుక్తము లయిన మంగలార్థవచనములు కర్తకు శ్రోతకు అధ్యేతకు అధ్యాపయితకు మంగలము కూర్చునవి యగును. మహాభాష్య మిట్లు చెప్పినది. ఆదిలో మధ్యలో నంతములో మంగలము కల శాస్త్రము లవ్యాహతప్రసారము కల వగును. ఆయుష్మచ్ఛ్రోతృకము లగును. అని.

ననుః ఈ శ్లోకములో 'విశ్వం' అను కర్మపదశ్రవణము లేదు. 'అపాయేభ్యః అను అపాదానపదశ్రవణము లేదు. ఇది ద్వాదశపదనాంది యెట్లగును?' ఉచ్యతే. పద్యములో 'పాతు' అనునది శ్రుతిపదము. అనేకపదనిబంధన మేకశబ్దవిషయ మగు విధ్యాదికము శ్రుతియర్థము. అది వేరు విధమున కుదరదు. స్వసిద్ధికై కర్మ-కరణ-కర్తృ-అధికరణాదిక మాక్షిప్తము చేయును. అపు డది సర్వశ్రుతిపదార్థమగును. అచట కర్తృకర్మాదిక ముపాదీయమాన మయినను నియమమునకో యనువాదమునకో యగును. సామాన్య మాక్షిప్తమగుచో నుపాదీయమాన మగు విశేషము నియమమున కగును. 'పాతు వః పరమజ్యోతిః' విశేష మాక్షిప్తమగుచో నది యనువాదమున కగును. 'దేవో జలం వర్షతి' ప్రకృతమున నొక విశేషము కలదు'

"అష్టవర్షం బ్రాహ్మణ ముపనయీత తమధ్యాపయేత్"

అను వచనమున—'స్వాధ్యాయోఽ-ధ్యేతవ్యః'-అను స్థలమున 'ద్విజేన – ఆచార్యాత్' అనుపాత్తము లయిన నవశ్యముగా సన్నిహితము లగును. అట్లే యీ శ్లోకమున ఈశ్వరకర్తృక మయిన'పాతు' అర్థ మపాయ నిర్ధారణార్థ మయినందున సృష్టిసంహారముల వలె విశ్వవిషయ మగును. అప్పుడు 'అపాయేభ్యః – విశ్వం' అను పదద్వయ మనుపాదీయమాన మయినను నియతముగా సన్నిహిత మగును. ఇట్లు కర్మాపాదానశ్రుతి యున్నందున నిది ద్వాదశపద నాంది యగును.

నను! మహేశ్వరు డశరీరుడు కదా! విశ్వోత్పత్తి స్థితి ప్రలయ కారణత్వ మభ్యుపగత మయినను 'వపుఃపాతు' అని చెప్పుట యేమి? మహేశ్వరు డశరీరియె. అయినను వైశ్వరూప్యమున నది యుపపన్న మగును. తత్త్వవిదు లిట్లు శివుని స్తుతించిరి. 'మూలజాలము చేతన శక్తులు భోక్తృసమూహము జ్ఞానము తదధినాయకవ్రజము సర్వము నీ స్మృతిలో 'యుగపత్' అవభాసించును 'అశరీరిశివస్మృతి సర్వ మవభాసింప జేయును గావున 'వపుః పాతు' అనుట సంగతమె యగును.

'కాంతా విమిశ్ర వపుషః' అను పురారివిశేషణము వేరు విధమున వ్యాఖ్యానింతురు. 'కాంత' శబ్దమున శివుని యెనిమిది మూర్తులు నిరూపితము లగును.

౧. కం పానీయం అంతే అస్యా ఇతికాంతా పృథ్వీ

౨. కం సుఖం అంతేషు ఆసామితి కాంతా ఆపః

౩. కో వాయుః అంతే అస్యేతి కాంతో వహ్నిః

౪. కం తోయం అంతరితి కాంతో వాయుః

౫. కం బ్రహ్మ అంతే అస్యేతి కాంతం ఆకాశం

౬. కాంతిః దీప్తిః తదతిశయవాన్ కాంతః సూర్యః

౭. కాంతిః కామనీయకం తదతిశయవాన్ కాంతః చంద్రమాః

౮ కాంతిః వాల్లభ్యం తదతిశయవాన్ కాంతః ఆత్మా.

'కాంతాః అవంతి' = 'కాంతావినః' రక్షణ స్వభావము కల-భవ-ఉగ్ర-భీమాది మూర్తిపతులు కాంతాదిపదవాచ్యులు. 'మిశ్ర' శబ్దము పూజా వచనము. 'ఆర్యమిశ్ర' మొదలగు పదములకు వలె 'కాంతా వి మిశ్ర'. సమాస ముపపన్నము 'కాంతా వి మిశ్రం వపుః యస్య' అను బహువ్రీహి సమాసమున వైశ్వరూప్యము సిద్ధ మగును కావున వివక్షితార్థసిద్ధి యున్నది.

ఇచట – 'అచ్ఛిన్నమేఖలం'–మొదలగు వాని కన్వయమెట్లు? అవియు వపువునకు విశేషణము లగును. 'అచ్ఛిన్నమేఖల' పదమున నిది నిరుక్త మగును. జఘనపరిక్షేపసూత్రమును మేఖల=మొలనూలు అందురు. అది యపరిచ్ఛిన్నముగా దేనికి కలదో యది యచ్ఛిన్న మేఖలము. అలబ్ధదృఢోపగూఢ మనుట అగాధత్వము దురవగాహత్వము సూచితమగును. 'దుంహతీతి దృఢః=ఆధారః తస్య ఉపగూఢం ఉపశ్లేషః ప్రతిష్ఠాస్థానం' ఆధారాలింగన మనుపలబ్ధ మయినచో నది యలబ్ధదృఢోపగూఢము. అప్రాప్తచుంబన మనుటచే నిరవధికౌన్నత్యము భాసించును. చుంబన మనగా వక్త్రిసంయోగము. అది యప్రాప్తము కావున నప్రాప్తచుంబనము. అపీక్షిత వక్త్రికాంతి యనుటచే నప్రతిమాన పరిసూక్ష్మత సూచితము. ఈ కాంతి యెటునుండి యెటుచేరునో యేమియు గోచరము కాదు. 'కృత విప్రలంభ సంభోగ పక్ష్యమివ' అనుటచే, పరమార్థము గోచరము కానందున వంచితమయి నట్లు పృథివ్యాదిప్రసిద్ధరూప ముననె సంభుజ్యమానముగ నున్న శరీర మని గోచరించును. ఈవిశేషణపంచకమున-శివతనువు పరతర మగుట అపరిచ్ఛిన్న మని దురవగాహ మని నిరవధిక మని యజ్ఞేయ మని యవిజ్ఞాతపరమార్థ మని భాసించును.

నను! 'పాతు' అనునది విధ్యర్థమున లేదు. ఆశీరర్థమునను న్నది. అచట విశేషముండదేని స్వరూపమున నాత్మవిషయముగనె యుండును. కాన విశ్వవిషయమగుట యెట్లు? ఉచ్యతే, ఇతడు నా వాడు 'ఇతడుపరుడు' అను వికల్పము లఘు చేతసులకె. ఉదార చరితులకో 'వసుధైవ కుటుంబకం' యద్వా; క్రమాగత విశ్వ పాలనమున పూర్వవిదులచే నియుక్తుడయిన మహామహేశ్వరుడొక ప్రం విశేషరూపుడు. వర్ణాశ్రమాచారస్థితుడనై నేను గ్రంథ రచనా వ్యగ్రుడనుకాగా నాపై 'మాభూద్వ్యాకోపః' వ్యాకోపము లేకుండు గావుత' అనుభావమున నాపాలన నియుక్తుడు తత్సమర్థుడయిన మహేశ్వరునె ప్రార్థించుచున్నాడనుట యిందలి విశేషము. కాని యీవాక్యమున వేరొక వక్త లేడు. కావున దీనిలో విశ్వము కర్మగా గోచరించును. 'రక్షితో రాజా రాజ్యం రక్షతి'అని లోకన్యాయము. కాన తనయందును రక్షణీయతాశీరర్థము ప్రసరించును. ఆత్మవిషయమున మూడు ఏషణలున్నవి. 'ప్రాణైషణా విత్తైషణా పరలోకైషణాచ'రాజునకు ప్రాణైషణయె విత్తైషణ యదియే పరలోకైషణయగును. ఆరాజునకు ప్రకృతి రాజ్యమె శరీరము. అదియే విత్తము. దానిస్వామ్య మాతడనుభవించును. యథోక్త దండాచరణమున కరాదానాదులవలన సంపాదిత మయిన ధనము యశము రాజు విత్తము. అదియాతని ధర్మము. ఆ ధర్మమున నాతడు_ 'ఇమమముం చ లోకం జయతి 'ఇహ పరముల జయించును. ఈసర్వ మపాయములనుండి విశ్వము రక్షించుట కుపహిత మగును. 'ఇష్టా దేవతా స్తోతవ్యేతి శిష్టాచారః' ఇష్టదేవతను స్తుతింప వలెనని శిష్టాచారము. ఇది కేవల మాశీః స్తుతి కాదు 'గుణోత్కర్ష ప్రకాశనేన సర్వాతి ఉపర్యారోపణం స్తుతిః, గుణాతిశయము ప్రకాశింప జేసి సర్వాధికముగా నిరూపించుట స్తుతి యగును. అట్టి స్తుతి తా నాశీంచినఫలమున కేక కారణముగా నిరూపించినదె స్పష్ట మగును. కాని

'నమ స్తస్మై-సజయతి' అను వానిచే నది ప్రకాశింపదు. ప్రకృత శ్లోకమున 'అశాస్యమానాభిమత ఫలైకహేతుతా ప్రకాశమున' అట్టి స్తుతి ప్రతీత మగుచున్నది.

## ద్వితీయ శ్లోకము

శ్రీ గణపతి స్తుతి పరమయిన శ్లోకార్థ మీ విధముగ భావనీయము. భావకుల మనస్సులు ఏ గణాధినాథుని పాదపద్మ పరాగములచే పరిమార్జితములై దర్పణతలము వలె విమలత కలవి, కాగా శబ్దార్థసంపద లుదారతరములై స్ఫురించునో అట్టిభగవాన్ గణాధినాథుడు విఘ్నవినాశవమున కగు గావుత.

ఈ శ్లోకమును గూడ భోజుడు సప్తమమున నిట్లు వ్యాఖ్యానించెను. దర్శనమున ధ్యానమున భావించి గణపతిని మనసు నందారోపింప వలె నని యుపదేశార్థ మిందు భాసించును. ఆ దర్శ తలములు భస్మచే నిర్మలీకృతము లగును. 'అస్మై స్మృత్యుపహిత మయిన తత్పాదపరాగము న మానసములు నిర్మలీకృతము లగును. శబ్దార్థ సంపద ఉదారతరా భవంతి' అనుటచే - దర్పణ తలము లందు వలె నిర్మలము లయిన మనసు లందు సర్వపదార్థములు స్ఫురించు నని యావేదిత మగును. 'విఘ్నచ్ఛిదేऽస్తు భగవాన్ స గణాధినాథః' అనుటచే పూర్వము చెప్పిన విధమున ఆభిగామిక మయిన గుణసంబంధము విశద మగును. అవిఘ్నప్రార్థనముచే - చికీర్షిత మయిన తన మహనీయారంభవిశేషము ప్రతిపాదిత మగును. ఇట్లిచట వాక్యార్థము ప్రతీయమానగుమచు - తత్పాదపంకజస్మరణమున నె యింతటి విశేషము లభించు చుండగా సాక్షాదారాధనమున నెంతటి ఫలమో కలుగు నని తాత్పర్యార్థము గోచరించును.

ఈ శ్లోకమున కఖండవాక్యార్థపక్షమున వ్యాఖ్యానముస్పష్టము ఈ పద్యమున పంకజ – దర్పణ – అర్థసంపత్–భగవదాది శబ్దములు గౌణీయవృత్తి ద్వారమున మంగలార్థములు. ఇదియు ద్వాదశపద నాంది. ఇందును – రూపక – ఉపమా–శ్లేష – సమాధిగర్భ మయిన కారణమాల యంగముగా నున్న యాశీరలంకారము యోజనీయము. సంబంధిపదాధ్యాహారమున త్రయోదశపద నాంది యగునో? కాదు. శబ్దార్థసంపత్పరిస్ఫురణమె యిచట సంబంధిగా నున్నది. ఇట్లిచట కారణమాల సంగతము. భగవానుడు పాదపంకజమార్జనమున మార్జనము నైర్మల్యమున, నైర్మల్యము శబ్దార్థసంపదలపరిస్ఫురణమున పరిస్ఫురణము ప్రబంధవిఘ్నచ్ఛేదనమున కారణ మగును. కావున పాదపంకజదర్పణతలామల – రజస్సులు రూపక–ఉపమా–శ్లేషములకు స్థానములు. 'ఉదారతరాః శబ్దార్థసంపదః స్ఫురంతి' అనుట సమాధియు గోచరించును. ఉదారదర్శన లయినవనిత లాదర్శతలములందు బాగుగా నలంకృత మయిన తమ రూపములను దర్శింతురు. వక్తకిది యుదారవాక్కులకు సూచనాపర మని నిశ్చయించుట యిచటి తాత్పర్య మగును. అందుననె 'తాత్పర్యమేవ వచసి' యనుట యుక్తము.

## శృంగారమె రసము

౩. ఆత్మస్థితం గుణవిశేషమహంకృతస్య
శృంగారమాహు రిహ జీవిత మాత్మయోనేః
తస్యాత్మశక్తి రసనీయతయా రసత్వం
యుక్తస్య యేన రసికోఽయమితి ప్రవాదః ॥

౪ సత్త్వాత్మనా మమల ధర్మ విశేష జన్మా
జన్మాంతరానుభవ నిర్మిత వాసనోత్థః
సర్వాత్మ సంపదుదయాతిశయైక హేతుః
జాగర్తి కోపి హృది మానమయో వికారః ।

౫ తాత్పర్యమేవ వచసి ధ్వనిరేవ కావ్యే
సౌభాగ్యమేవ గుణసంపది వల్లభస్య
లావణ్యమేవ వపుషి స్వదతేఽంగనాయాః
శృంగార ఏవ హృది మానవతో జనస్య ।

౬. శృంగార వీర కరుణాద్భుత రౌద్ర హాస్య
బీభత్స వత్సల భయానక శాంత నామ్నః
ఆమ్నాసిషుర్దశ రసాన్సుధియో వయం తు
శృంగార మేవ రసనాద్రస మామనామః !

ఆత్మస్థిత మగు నహంకార గుణ విశేషమును శృంగార మందురు. అది మన్మథజీవితము. తగిన విధమున నది యాత్మశక్తి రసనీయమగునేని రసత్వము పొందును. అట్టి రస మున్నందుననే రసికుడు అను ప్రసిద్ధియు వచ్చినది సత్త్వప్రకృతి కల సహృదయుల సహృదయమున నభిమానమయ మగు నొకానొక వికృతి యున్నది. అది విమల ధర్మ విశేషమున జనించును. జన్మాంతరానుభవసిద్ధములయిన సంస్కారములవలన నది యావిర్భవించును. సర్వవిధాత్మ సంప దుదయముల కది హేతువు వచనమున తాత్పర్యమే యాస్వాద్యము కావ్యమున ధ్వనియే యాస్వాద్య మగును. వల్లభుని గుణ సంపదలో సౌభాగ్యమే సంభావ్యము. అంగనాదేహమున లావణ్యమె రస్యము. అభిమానము కల వాని హృదయమున శృంగారమె యాస్వాద్యమాన మగును, శృంగారము – వీరము – కరుణము – అద్భుతము – రౌద్రము– హాస్యము–బీభత్సము – వత్సలము–భయానకము – శాంతము అను పదిరసములను కొందరు సుధీమణులు పరి

భాషించిరి. 'వయం తు' ఆస్వాద మున్నందున శృంగారమునె రస మని నిశ్చయింతుము. 'శృంగారమె రసము' అను భోజుని సిద్ధాంతమున కిది మూలసూత్రము. ఇదియె గ్రంథమున వివృత మగును. అహం కారము – అభిమానము–శృంగారము మూడు నభిన్నార్థములు.

వీరాదులు రసములు కావు.

౭. వీరాద్భుతాదిషు చ యేహ రసప్రసిద్ధిః
సిద్ధా కుతోపి వటయక్షవదావిభాతి
లోకే గతానుగతి కత్వవశా దుపేతాం
ఏతాం నివర్తయితు మేష పరిశ్రమో నః ॥

వీరాద్భుతాదులలో రసప్రసిద్ధి యెట్లో సిద్ధ మయినది. అది వట యక్ష సదృశము. "ఇహ వటే యక్ష స్తిష్ఠతి' 'ఈ వటవృక్షమున యక్షమున్నది.' అనునది యజ్ఞాత మూలప్రవర్తక మయిన ప్రవాదము. వీరాద్భుతాదు లందలి రసప్రసిద్ధియు నిట్టిదే. 'గతానుగతికో లోకః న లోకః పారమార్థికః" లోకము గతానుగతికముగా నుండును. పరమార్థము గుర్తింపదు.' అని నట్లు గతానుగతికత్వ వశమున వచ్చిన యీ ప్రతీతిని నివర్తింప జేయుటకే మా యీ పరిశ్రమము. "వీరాదులు రసములుకావు. శృంగారమె రసము' అని నిరూపించుటకే యీ గ్రంథ ముపక్రమించి నా మని భావము.

రత్యాది భావములు శృంగారోద్దీపకములె కాని రసములు కావు. రసశబ్ద నిరుక్తి వాని యందు లేదు. ఈ యంశ మిచట నిరూపిత మగును.

అప్రాతికూలికతయా మనసో ముదాదేః
యస్సంవిదోఽనుభవహేతు రిహాభిమానః
జ్ఞేయో రసః స రసనీయతయాత్మ శక్తేః
రత్యాదిభూమని పునర్వితథా రసోక్తిః॥

రత్యాదయోర్ధశత మేక వివర్జితాని
భావాః పృథగ్వివిధ భావభువో భవంతి
శృంగారతత్త్వమభితః పరివార యంతః
సప్తార్చిషం ద్యుతిచయా ఇవ వర్ధయంతి॥

మనసున కప్రతికూలముగా హ్లాది సంవిదను భూతిలో హేతువగు నభిమానమె రస మని విజ్ఞేయము. అచట ఆత్మశక్తి రసనీయమగును గదా! రతి మొదలగు భావములు రసము లనుట వితథము. అం దాత్మ శక్తి రసనీయము కాదు. సంవిదను భూతి హేతువె రసము. సంవిద్రూపము కాని తదనుభవము కాని రసము కాదు ఒకటి తక్కువగా నేబది రెండు రత్యాదిభావములు కలవు. అవి వివిధభావస్థానములు అవి యన్నియు శృంగారతత్త్వమునంతట పరివేష్టించి యుండును. అన్నిటి కేంద్రమున శృంగారతత్త్వ ముండును. అగ్నికాంతులు అగ్నిని పరివేష్టించుకొని వృద్ధిచేయు నట్లు రత్యాదులు శృంగారతత్త్వమును సముల్లసింప జేయును.

అభావనోదయ మనన్యధియా జనేన
యో భావ్యతే మనసి భావనయా స భావః
యో భావనాపధ మతీత్య వివర్తమానః
సాహంకృతో హృది పరం స్వదతే రసోఽసౌ॥

రత్యాదయో యది రసాః స్యురతి ప్రకర్షే
హర్షాదిభిః కిమపరాద్ధమతద్విభిన్నైః
అస్థాయినస్త ఇతి చేద్భయహాస శోక
క్రోధాదయో వద! కియచ్చిర ముల్లసంతి॥

స్థాయిత్వమత్ర విషయాతిశయాన్మతం చే
చ్చింతాదయః కుత ఉత ప్రకృతేర్వశేన
తుల్యైవ సాఽఽత్మని భవేదథ వాసనాయాః
సందీపనాత్తదుభయత్ర సమానమేవ॥

భావన ముదయించినది మొదలుగా ననన్యధీకుడై మానవుడు మానసమున భావనముచే దేనిని భావించునో యది భావము. భావ్యమానము భావము. భావనాపథ మతిక్రమించి మానవుడు నాహంకారహృదయమున వివర్తమాన మగు దేనిని ఉత్కటముగా నాస్వాదించునో యది రసము. రస్యమాన మాస్వాద్యమానము రసము. మానసున భావ్యమానము భావ మని హృదయమున రస్యమానము రస మని భావరసముల వివేకము. ప్రకర్షాతిశయము కలుగగా సముల్లాసము కలుగగా రతిహాసాదులు రసములగునని యందురు. అట్లే యయినచో నతద్విభిన్నము లయిన—ప్రకర్షాతిశయము కలిగిన హర్షాదు లేమి యపరాధ మొనర్చినవి. అవియు రసములు కా వచ్చును కదా! హర్షాదులు స్థాయిభావములు కా వని యందురో? భయ హాస శోక క్రోధాదులు స్థాయిభావములు కా గలుగు చున్నవా? అవి మాత్ర మెంతకాల ముండ గలవు? సముల్లసన మున్నంత మాత్రమున భావములు రసములు కా జాలవని భావము. 'రత్యాదులకే పరప్రకర్ష నియతము కాదు. చింతాదులకును పరప్రకర్ష కలుగ వచ్చును. తీవ్రతర సంస్కారము కలుగునేని యే దేని స్థాయిత్వము కలది కాగలదు. సంస్కారోత్పత్తి విషయాతిశయమున గలుగ వచ్చును. నాయక ప్రకృతివలన గలుగ వచ్చును. నాయక ప్రకృతి సాత్త్విక రాజస తామస భేదమున త్రివిధము. తదనుబంధము వలన తథావిధానుభవ భావన ముత్పన్న మగును' ఇట్టి భావమును మనసున సంభావించు కొని 'స్థాయిత్వమత్ర' శ్లోక భావమును భావింపవలసి యున్నది. 'విషయాతిశయ సంపద రత్యాదులకు గలదు. అట్టి రత్యాదులు ప్రకృతివశమున స్థాయిత్వము కలవి కాగలవు.'' అను మత మభిమత మేని చింతాదులకు నట్టి స్థాయిత కలుగ వచ్చును. విషయాతిశయము నాయకప్రకృతి వశత వానికి నుండ వచ్చును. అట్టి స్థాయిత రత్యాదులకు చింతాదులకు తుల్యమె

కదా! ఆత్మలో వాసనాసందీపన మందు నిండుచుండును. తగిన సంస్కారోత్పత్తి రత్యాదులకు వలె చింతాదులకును సమానము. కావున రత్యాదులే స్థాయిత కలవై రసము లగు ననుట పొసగదు. హర్షాదులు గ్లాన్యాదులు చింతాదులు స్థాయిత కలవై రసము లగుట నంగీకరింప నట్లు రత్యాదులు రసము లగు ననుట యంగీకార్యము కాదు.

కావున నీ విషయము సిద్ధ మయినది. రత్యాదులు శృంగార ప్రభవములై, అవి యేకోనపంచాశద్భావములు. వీరాదులు మిథ్యారస ప్రవాదములు. శృంగార మొక్కటియె చతుర్వర్గైక కారణ మగు రసము. అట్టి యీ శృంగారరస మనుభవైక గమ్య మగుట వలన సర్వవిషయ మగుట వలన దురవసేయము. విదగ్ధ శైలూషులు చతుర నటులు సమర్థముగా నభినయము లందు ప్రదర్శించినచో సామాజికు లవధరింతురు. మహాకవులు ప్రబంధము లందు విశదముగా ప్రతిపాదింతురేని యది విద్వన్మనీషా విషయముగా నవతరింపగలదు. వాగ్మివచో నివేదితము లాస్వాద్యమానము లగునట్లు ప్రత్యక్షముగా ప్రతిపాదితము లయిన పదార్థ మీవిధముగా నాస్వాద్యమానములు కాజాలవు.

"తత్ర న తథా పదార్థాః ప్రత్యక్షేణ ప్రతీయమానాః
స్వదంతే, యథా వాగ్మినాం వచోభిరావేద్య మానాః"

సుకవి వచస్సమర్పితము లయిన పదార్థ విశేషము లుస్మీలితములై ప్రకాశించును. వాని ప్రత్యక్షసత్త యట్లుగా చిత్తవికాసము కూర్ప జాలదు కావున.

"అతః అభినేతృభ్యః కవీనేవ బహుమన్యా మహే
అభినయేభ్యశ్చ కావ్యమేవేతి"

నటుల కన్న కవులనె బహుమానింతుము. అభినయముల కన్న కావ్యమునె బహుమానింతుము.

### కా వ్య శ బ్దా ర్థ ము

తత్పునః శబ్దార్థయోస్సాహిత్య మామనంతి
తద్యథా: "శబ్దార్థౌ సహితౌ కావ్యం" ఇతి.

శబ్దార్థముల సాహిత్యము కావ్య మని తద్విదు లనిరి.
'శబ్దార్థౌ సహితౌ కావ్యం' అని వారి సంభాష.

"కః పునః శబ్దః? యేనోచ్చరితేనార్థః ప్రతీయతే."

శబ్ద మన నేమి? దేని యుచ్చారణమున నర్థము ప్రతీతమగునో యది శబ్దము. అది ద్వాదశవిధము.

| | | | |
|---|---|---|---|
| ప్రకృతి | ప్రత్యయము | ఉపస్కారము | ఉపపదము |
| ప్రాతిపదికము | విభక్తి | ఉపసర్జనము | సమాసము |
| పదము | వాక్యము | ప్రకరణము | ప్రబంధము |

"కోఽర్థః? యః శబ్దేన ప్రత్యాయ్యతే"

అర్థ మన నేమి? ఏది శబ్దమున గోచరించునో యది యర్థము. అర్థము ద్వాదశ విధము.

| | | | |
|---|---|---|---|
| క్రియ | కాలము | కారకము | పురుషము |
| ఉపాధి | ప్రధానము | ఉపస్కారార్థము | ప్రాతిపదికార్థము |
| విభక్త్యర్థమ | వృత్త్యర్థము | పదార్థము | వాక్యార్థము |

"కిం సాహిత్యం? యః శబ్దార్థయోః సంబంధః"

సాహిత్య మన నేమి? శబ్దార్థముల సంబంధము సాహిత్యము అది ద్వాదశవిధము.

| | | | |
|---|---|---|---|
| అభిధ | వివక్ష | తాత్పర్యము | ప్రవిభాగము |
| వ్యపేక్ష | సామర్థ్యము | అన్వయము | ఏకార్థీభావము |
| దోషహానము | గుణోపాదానము | అలంకారయోగము | రసావియోగము |

"న కేవలా ప్రకృతిః ప్రయోక్తవ్యా న చ కేవలః ప్రత్యయః."

అని ప్రయోగనియమము కలదు. కేవల ప్రకృతి ప్రయోగింప రాదు. కేవలము ప్రత్యయమును ప్రయోగింపరాదు. అయినను శాస్త్ర ప్రక్రియా వ్యవహారమున ధర్మనియమమునకై ప్రకృతి – ప్రత్యయ విభాగ కల్పన మొనరించిరి. శబ్దార్థ భావనమున ప్రత్యయమున కన్నప్రధానముగా నుపాదాన కారణమువలె స్వీకరింప బడు దానిని 'ప్రకృతి' యని వ్యపదేశింతురు.

ఆ ప్రకృతి మూడు విధములు. ధాతురూపము – ప్రత్యయ రూపము, ప్రాతిపదికరూపము. అని

ధాతురూప ప్రకృతి.

ధా తు వు లా రు వి ధ ము లు

పరిపఠితములు – అపరిపఠితములు – పరిపఠితా పరిపఠితములు
ప్రత్యయధాతువులు–నామధాతువులు–ప్రత్యయ నామధాతువులు

౧ పరిపఠితధాతువులు భూవాదులు భూయాత్, జాయంతాం. స్వీకుర్వంతి.

కవిః సృజతి కావ్యాని హృద్యాదధతి సజ్జనః
సూతే ముక్తాః పయోరాశిర్వహంతి తరుణీస్తనాః
న రుణత్సీంద్రియగ్రామం న శ్రుణోషి గురోర్వచః
నోపార్జయసి మిత్రాణి కథం గృహ్ణాస్యరిశ్రియః॥

కవి కావ్యముల సృజించును. సజ్జనులు హృదయమున ధరింతురు. సముద్రుడు ముత్తియముల నావిర్భవింప జేయును. తరుణీస్తనములు ధరించును. ఇంద్రియముల నిగ్రహింపవు. గురువచనము వినవు మిత్రుల సంపాదింపవు. శత్రుసంపదల నెట్లు గ్రహింతువు?

౨. అపరిపఠితధాతువులు, ఆందోలయతి, ప్రేంఖోలయతి, విక్లబంతే మొదలగునవి.

3 సూత్రములలో పఠితము లగును గాని భూవాదులలో పఠితములు కావు అట్టివి పరిపఠితాపరిపఠితములు. 'స్కు' మొదలగునవి. అనుస్కునుహి – నిష్టభ్నాతి – 'ఇత్యాదులు

౪. ప్రత్యయధాతువులు. సనాద్యంతములు.

మీమాంససే న శాస్త్రాణి కృతార్థయసి నార్థినః
గోపాయసి న సంత్రస్తాన్ కిముద్ధతమటాట్యసే
సూర్యీయతి సుధారశ్మిం నరకీయతి నందనే
కామం కామయమానా త్వాం సా జీవంతీ మృతాయతే

శాస్త్రములను మీమాంసింపవు. యాచకులను కృతార్థుల జేయవు. భయపడిన వారిని రక్షింపవు. ఉద్ధతముగా దిరుగుదువేమి? నిన్ను కామించు నామె చంద్రుని సూర్యుని జేయుచున్నది. నందన వనమున నరకములో వలెనున్నది. జీవించియు చనిపోయి నట్లున్నది.

౫. నామధాతువులు కండ్వాదులు కండూయతి–వల్గూయతి–అసూయతి – మంతూయతి మొదలగునవి.

౬. పరిపఠిత ధాతువులకు నామత్వ సిద్ధికై కాని, నామములకు ధాతుత్వసిద్ధికై కాని క్విబాది ప్రత్యయములు లోపించును. అవి ప్రత్యయమున నామములు ధాతువులు నగును. 'ప్రతిభూః మి తృపూః మొదలగునవి.

సవితా విధవతి విధురపి సవితరతి తథా దినంతి యామిన్యః
యామినయంతి దినాన్యపి సుఖదుఃఖవశీకృతే మనసి॥

మనస్సు సుఖదుఃఖ వశీకృతము కాగా సూర్యుడు చంద్రుడగును. చంద్రుడు సూర్యు డగును. అట్లె రాత్రులు దినము లగును. దినములు రాత్రు లగును.

## ౨ ప్రత్యయ రూప ప్రకృతి

సుప్ – తిజ్ – కృత్–తద్ధిత – ధాతుప్రత్యయ – స్త్రీప్రత్యయ భేదమున ప్రత్యయములు షట్ప్రకారములు. ఆ ప్రత్యయాంత ప్రకృతియు ప్రత్యయ రూపమున షట్ప్రకారమె యగును.

౧. సుప్ప్రత్యయాంతము:– అహంయుః, శుభంయుః సాయంతనం, చిరంతనం, సమూం సమీనాదులు.

౨. తిజ్ ప్రత్యయాంతము:– పచతితరాం, గచ్ఛతి తమాం, ఆస్తికః, నాస్తికః.

౩. కృత్ ప్రత్యయాంతము:– కృత్రిమం, సాంరావిణం, శ్యేనంపాతా, ఆఢ్యం కరణీ.

౪. తద్ధిత ప్రత్యయాంతము: – దాక్షాయణః, కుతస్త్యః, తత్రత్య ః

౫, ధాతుప్రత్యయాంతము:–చికీర్షా, యాయావరః, మృగయా యాయజూకః.

౬. స్త్రీ ప్రత్యయాంతము:– ద్రౌపదేయః, కాద్రవేయః; బహుస్త్రీకః, సువధూకః.

## ౩ ప్రాతిపదిక రూప ప్రకృతి

నామ – అవ్యయ – అనుకరణ – కృత్ – తద్ధిత సమాసములు ప్రాతిపదికము లారు విధములు.

౧ నామప్రాతిపదికము:– శబ్దవ్యుత్పత్తి న పేక్షింపకయే సత్త్వ భూతార్థమును నిరూపించునవి నామము లగును. నామములు ౧ ‘ఆవిష్ట లింగములు, ౨ అనావిష్ట లింగములు అని రెండువిధములు.

౧ జాతిద్రవ్య పరిమాణవాచకము లావిష్ట లింగములు ఇందు జాతి రెండువిధములు ఆకృతివ్యంగ్య – ఉపదేశవ్యంగ్య అని.

౧. ఆకృతివ్యంగ్య - గౌః, సర్పః, సింహః, కుమారీ, స్త్రీ పుమాన్
౨. ఉపదేశవ్యంగ్య-బ్రాహ్మణః, క్షత్రియః, మూర్ధాభిషిక్తః సూతః చండాలః

ద్రవ్యము సాపేక్షము, అనపేక్షము నని రెండు విధములు.

౧. సాపేక్షము — గురుః, పితా, మాతా, దుహితా.

౨. అనపేక్షము:- చైత్రః, ఇంద్రః, ప్రాచీ, శచీ.

పరిమాణము నియత మనియత మని ద్వివిధము,

౧. నియతము - ద్రోణః, పలం, క్రోశః, పణః, గణః

౨. అనియతము - సంఘః, సార్థః, సమాజః, వర్గః, పరిషత్. వనం, సేనా. పంక్తిః

## అనావిష్ట లింగములు

గుణ - సంఖ్యా - వచన - సర్వనామము లనావిష్ట లింగములు

౧ గుణము ద్వివిధము, అనురంజకము, అననురంజకము. అనురంజక యోగము వలన తదనురక్తము లనురంజకములు. అననురంజక యోగము వలన తద్విపరీతము లననురంజకములు

౧ అనురంజకములు:- శ్వేతః, స్వాదుః, శీఘ్రః, దీర్ఘః, వక్రః, యువా, వృద్ధః

౨ అననురంజకములు:- దక్షః జడః, ఖలః, సాధుః, శూరః, లఘుః, గురుః.

౨ సంఖ్య ద్వివిధ, లింగవతి, అలింగ.

౧ లింగవతి:-ఏకః, ఏకా, ఏకం. త్రయః, తిస్రః, త్రీణి, చత్వారః, చతస్రః, చత్వారి

౨ అలింగః:- పంచప్రాతిపదికార్థాః, షడ్విషయాః అష్టౌవసవః, దశదిశః.

* * *

౩ సర్వనామములు ద్వివిధములు, సర్వాదులు అసర్వాదులు

౧ సర్వాదులు:- సర్వః, విశ్వః, యః, సః, ఏష., అయం, త్వం. అహం,

౨ అసర్వాదులు:- ప్రథమః, చరమః, పూర్వః, పరః, దక్షిణః, స్వః, సకలః,

## ౨ అవ్యయప్రాతిపదికము

సామాన్యముగా నవ్యయములు అలింగములు. అసంఖ్యలు, అశక్తికములు. అవ్యయము లారు విధములు - అవ్యయములు, నిపాతలు, గతి, ఉపసర్గలు, కర్మప్రవచనీయములు, విభక్తిప్రతిరూపములు.

## 1 అవ్యయములు

సామాన్యముగా శక్తిసంఖ్యాయోగమున స్వరాదు లవ్యయములగును. మూడులింగములలో సర్వవిభక్తులలో సర్వవచనములలో సమానముగనె యుండి మారకుండు నది యవ్యయము.

అవ్యయములు ద్వివిధములు -సత్త్వగంధులు అసత్వగంధులు. ఇందు సత్త్వగంధు లారు విధములు.

ద్రవ్యరూపములు - గుణరూపములు - క్రియారూపములు

జాతిరూపములు - సంజ్ఞారూపములు - సంబంధిరూపములు

అసత్త్వగంధు లారు విధములు.
క్రియాపేక్షములు – క్రియాద్రవ్యాపేక్షములు – క్రియావిశేషణములు ద్రవ్యవిశేషణములు–క్రియావిష్టరూపములు–క్రియాద్రవ్యావిష్ట రూపములు.

## సత్త్వగంధులు

౧ సత్త్వగంధిద్రవ్యరూపములు – స్వః, దివః, భువః, రోదసీ, మహాః, హాహా
౨ ,, గుణరూపములు:–శశ్వత్, సామి, సాచి, ద్రాక్, మనాక్, ఈషత్
౩ ,, క్రియారూపములు.–స్వస్తి, స్వాహా, స్వధా, వషట్, హంత.
౪ జాతిరూపములు;– శం, సాయం, ప్రాతః, నక్తం, దివా, హ్యః, శ్వః
౫ సంజ్ఞారూపములు – ఓం, స్వాహా, హ్రాం, హ్రీం, క్లీం
౬ సంబంధిరూపములు –అంతః, అంతరా, మధ్యే, సమయా, నికషా

## అసత్త్వగంధులు

౧ క్రియాపేక్షములు:– ద్వంద్వం, యథాయథం, అన్యోన్యం, ఉత్తరాధరం.
౨ క్రియాద్రవ్యాపేక్షములు:– సాకం సార్థం, సమం, వినా, పృథక్ నానా
౩ క్రియావిశేషణములు:– ముహుః, పునః భూయః, శనైః, ప్రాయః.
౪ ద్రవ్యవిశేషణములు –అలం, మృషా, వృథా, ముధా, ఉచ్చైః నీచైః
౫ క్రియావిష్టరూపములు –శశ్వత్, సపది, పురా, సాంప్రతం, కామం.
౬ క్రియాద్రవ్యావిష్టరూపములు:– ఆవిః, ప్రాదుః, తిరః, సాక్షాత్, ధిక్

## ౨. నిపాతలు

చాదులు నిపాతసంజ్ఞ కలవి. ఇవి జాత్యాదిప్రవృత్తినిమిత్తములు కావు అసత్త్వభూతార్థములను జెప్పును. లింగసంఖ్యా శక్తు

లుండవు. "ఉచ్చావచేష్వర్థేషు నిపతంతీతి, నిపాతాః" ఉచ్చావచార్థములందు నిపతించు నవి కావున నిపాత సంజ్ఞకల వయినవి. నిపాతి లవ్యయవిశేషములె. ఇవియారు విధములు.

విధ్యర్థములు – అర్థవాదార్థములు – అనువాదార్థములు
నిషేధార్థములు–విధినిషేధార్థములు – అవిధినిషేధార్థములు

విధ్యర్థములు:-

మంగలం – అధికారః – సంభ్రమః
నియోగః – సముచ్చయః– వికల్పః

౨ అర్థవాద–

కుత్సా – ప్రశంసా – విషాదః
హర్షః – ఈర్ష్యా – విస్మయః

౩ అనువాద –

స్మరణం – ఉపమా – అభ్యుపగమః
అనుప్రశ్నః – పరకృతిః – పురాకల్పః

౪ నిషేధ—

ప్రతిషేధః – నివారణం – అపాకరణం
అసూయా – గర్హణా – వినిగ్రహః

౫ విధినిషేధ —

సంబోధనం – అనుకంపా – వితర్కః
ప్రశ్నః – పక్షాంతరం – హేత్వపదేశః

౬ అవిధి నిషేధ—

పదపూరణం – పాదపూరణం – వాక్యపూరణం
అలంకార పూరణం–వాక్యాలంకారః–పదసంస్కారః

వీని యుదాహరణముల నిట్లు గుర్తించునది.

౧ మంగలార్థములు. ఓం - అథ - దిష్ట్యా - శశ్వత్ - కచ్చిత్

౧. ఓం అగ్నిమీళే పురోహితం
౨ అథాతో బ్రహ్మజిజ్ఞాసా
3. దిష్ట్యా వర్ధసే
౪. శశ్వదభ్యేష్యామహే
౫. కచ్చిదభ్యేష్యా మహే.

౨ అధికారార్థములు:- అథ - పునః - పశ్చాత్ - భూయ;

౧. అథ శబ్దానుశాసనం
౨. పునః ప్రభాతం పునరేవ శర్వరీ
3. పశ్చాదావాం విరహాగుణితం
౪. భూయశ్చాహ త్వమసి శయనే

౩ సంభ్రమార్థములు, యావత్ - తావత్ - నను - పురా - హంత

౧. యావత్సో ఏవ సమయః సమమేవ తావత్
౨. నను గచ్ఛామి భోః!
3. అధీష్వ మాణవక! పురా విద్యోతతే విద్యుత్
౪. హంత ప్రశాధి।

౪ నియోగార్థములు - పరం - వై - వావ - ఏవ - తు

౧ ధర్మః సఖా పరమహో పరలోక యానే
౨ వేదో వై ధర్మమూలం
3 ద్వే వావ బ్రహ్మణో రూపే
౪ ఆత్మైవేదమగ్ర ఆసీత్
౫ ఆఖ్యాస్యామి తు తే

౫ సముచ్చయార్థములు -చ, వా, అపి, తథా

౧ అహం చ త్వం చ వృత్రహన్

౨ వాయుర్వా త్వామనుర్వాత్వా

౩ దంతైరపి నఖైరపి

౪ హాకీతో౽త్రిరహాం తథా

౩. వికల్పార్థములు·- వా - అథో - యది - చణ్ - చేత్ - మా

౧ రాజ్యం వా కర్తవ్యం భాషణం వా శ్రోతవ్యం

౨ నదీషు స్నాయాదథో దేవఖాతే

౩ యది శమః కిం తపసా

౪ త్వం చ గంతా కిమత్రమే

౫ ఉపాధ్యాయశ్చేదాగచ్ఛేదాశంసే యుక్తోధీయాయ

౬ మా కదాచిదిదమపి స్యాత్

౨. అర్థవాదార్థములు

౧ కుత్సార్థములు - హా - ధిక్ - నామ - కిం - హా

౧ హా కిమేవం ప్రవర్తసే

౨ ధిక్ ప్రమాద

౩ కో నామాయం సవితురుదయో యత్ర న స్వే స్ఫురంతి

౪ కిమధీతే దేవదత్తః

౫ త్వం హా బ్రాహ్మణోసి

౮ ప్రశంసార్థములు·-పశ్య-అహా-అహో-చిత్

౧ పశ్య మాణవకో భుంక్తే

౨ అహా మాణవకో భుంక్తే

౩ అహో దేవదత్తః పచతి శోభనం

౪ ఆచార్యశ్చిదిదం బ్రూయాత్

౯ విషాదార్థములు -హీ-హా-హంత-బత-నామ

౧ హీ మహీశో దృశ్యతే

౨ హా ప్రియే జానకి!

౩ నిరాశ్రయా హంత హతా మనస్వితా

౪ అహో బత మహత్కష్టం

౫ క్వ నామ గమిష్యసి

౧౦ హర్షార్థములు - దిష్ట్యా - హంత - బత - కథం - కచ్చిత్

౧ దిష్ట్యా న స్మృతోఽసి సఖే

౨ హంత జీవితాః స్మః

౩ సైవేయం బత మే ప్రియా

౪ కథం వత్సో మే రామభద్రః

౫ కచ్చిజ్జీవతి పార్వతీ

౧౧ ఈర్ష్యార్థములు - హ - కింతు - అపి - నామ - యదినామ

౧ స్వయం హ ఓదనం భుంక్తే ఉపాధ్యాయం సక్తూన్ పాయయతి

౨ విద్వానసి కిం తు కితవః

౩ మాతర్యపి మృతాయాం దీవ్యసి

౪ భవతు నామ కామచారీ తథాప్యసౌ పతిరేవ

౫ అసి తపస్వీ యది నామ మూర్ఖః

౧౨ విస్మయార్థములు : హీ - చన - నామ - పశ్య

౧ హతవిధిలసితానాం హీ విచిత్రో విపాకః

౨ యాచితా యే న కుర్వంతి పురుషాః కేచనైవ మే

౩ అంధో నామ పర్వతమారోక్ష్యతి

౪ పశ్య మాణవకో బ్రూతే.

ప్రయోగానుసారమున నితరముల ననుసరించునది. ఇది యర్థవాద మున కన్న నితరము లందును ప్రసరించును.

## ౩. అనువాదార్థములు

౧౩ స్మరణార్థములు:- అమ్ - ఆ - అయే - నామ - నూనం

౧ అమ్ సైషా పంచవటీ

౨ ఆ జ్ఞాతం జటాయురేష

3 అయే దేవో దాశరథిః

౪ స నామాయం భవిష్యతి

౫ మానమేషా జానకీ

౧౪ ఉపమార్థములు - ఇవ - వా-చిత్ - న - ప్రతి

౧ రాజేవ బ్రూయాత్

౨ మణీవోష్ట్రస్య లంబేతే

3 అగ్నిశ్చిత్ భాయాత్

౪ మృగో న భీమః కుచరో గిరిష్ఠాః

౫ అభిమన్యుర్జునతః ప్రతి

౧౫ అభ్యుపగమార్థములు,-తథా - ఆమ - అథ - సత్యం

౧ స తథేతి ప్రతిజానాతు

౨ ఆమ యథా బ్రవీషి

3 గమిష్యతి భవానథ కిం

౪ సత్యమసారః సంసారః

౧౬ అను ప్రశ్నార్థములు.- నను - ను - హుం - నకిల - ననుకిల

౧ అకార్షీః కటం దేవదత్త? నను కరోమి భోః?

౨ కథం ను కరిష్యామి?

౩ అపి భవాన్ మకరందః? హుం స ఏవాస్మి

౪ న కిం లైవం?

౫ నను కిలైవం?

౧౭ పరకృత్యర్థములు:- ఇతి - ఏవంకిల - ఖలు - స్మ-అపి

౧ నిత్యః శబ్ద ఇతి మీమాంసకాః

౨ ఏవం కిల ఉపాధ్యాయః పఠతి

౩ ధన్యాః ఖలు ధర్మమాచరంతి

౪ ఇతి స్మ ఉపాధ్యాయః కథయతి

౫ సోపి మాం జానాత్యేవ

౧౮ పురాకల్పార్థములు:- పురా - ఇతికిల - ఇతిస్మ - ఇతిహాస్మ

౧ వలేన స్మ పురాధీయతే

౨ ఇతి కిల శ్రూయతే పురాణేషు

౩ ఇతి స్మ బ్రహ్మవాదినః పూర్వే వదంతి

౪ ఇతి హ స్మ తత్ర భవాన్ భాగురాయణః

ఇతరముల గూడ నిట్లె యనుసరింప దగును. ఇవి యను వాదార్థమున గూడ గలవు.

## ౪. నిషేధార్థములు

౧౯ ప్రతిషేధార్థములు:- న - అ - అన - నో - కిం - నహి

౧ యుగపన్నైకధర్మాణాం

౨ శశ్వత్త్వం అబ్రాహ్మణ ఇవ భాషసే

౩ అనోపమా తే బుద్ధిః

౪ తస్య తుల్యోపి నో భవాన్

౫ కిం గతేన కరిష్యసి

౬ న హి న హి ప్రేమ అనిమిత్తే సతి

౨౦ నివారణార్థములు:- మా - మాజ్ - అలం-కృతం - పర్యాప్తం.

౧ మా కరిష్యసి

౨ మా కార్షీః

౩ అలం కృత్వా

౪ కృతం సాహసేన

౫ పర్యాప్తం భయేన

౨౧ అపాకరణార్థములు:- ఆ· - ఓం - ధిక్ - ఖర్ - అరే

౧ ఆః పాప ప్రతిహతోఽసి

౨ ఓం కిమేవం వదసి

౩ ధిక్ త్వా జాల్మ

౪ ఖర్ దుష్టే పిశాచి

౫ అరే దురాత్మన్

౨౨ అసూయార్థములు హి-అహో-హంహో-అహో-అరే-అరరే.

౧ స హి వ్యాహరతు కథంహి వ్యాకరిష్యతి

౨ వృషల గ్రామమహో గమిష్యతి

౩ హంహో గమిష్యసి గ్రామం

౪ అహో జాయే మనసా తిష్ఠహో రే

౫ అరే నాహమున్మత్తః

౬ అరరే మహారాజం ప్రతి కుతః క్షత్రియాః

23 గర్హణార్థములు. కథం-యత్-యది-యదా-జాతు-అపి - యచ్చ-యత్నం.

౧ కథం నామ తత్ర్య భవాన్ వృషలం యాజయేత్
౨ యత్ తత్ర భవాన్ వృషలం యాజయేత్
౩ యది తత్ర భవాన్ వృషలం యాజయేత్
౪ యదా తత్ర ,, ,,
౫ జాతు తత్ర ,, ,,
౬ అపి తత్ర ,, యాజయతి
౭ యచ్చ తత్ర భవాన్ వృషలమయాజయిష్యత్
౮ యత్ర తత్ర ,, ,,

౨౮ వినిగ్రహార్థములు. అహ - త్వై - హై - వం - నను

౧ అయం అహ ఇదం కరోతు
౨ అయం త్వై తత్ర గంతా
౩ బృహస్పతిర్వై దేవానాం పురోహిత ఆసీత్
౪ వరమద్య కపోతః శ్వో మయూరాత్

౫ నను వక్తృవిశేషనిస్పృహా గుణగృహ్యా వచనే విపశ్చితః ఇత్యే యితర ప్రయోగములను యథాయోగ మనుసరించునది. ఇవి నిషేధాతిరిక్తార్థము లందు నుండును.

## ౫. విధినిషేధార్థములు

౨౯ సంబోధనార్థములు. హే, హై, అయి, అహో, హంహో, భోః;

౧ హే దేవదత్త
౨ హై యజ్ఞదత్త
౩ అయి విష్ణుమిత్ర
౪ అహో మహారాజ
౫ హంహో మహాబ్రాహ్మణ

౩ భో॥ పాంథ ప్రవర్తస్వ వా నివర్తస్వ వా

౨౯ అనుకంపార్థములు. అ - ఇ - ఉ - ఏ - ఓ -

౧ అ అవేహి

౨ ఇ ఇంద్రం పశ్య

౩ ఉ ఉత్తిష్ఠ

౪ ఏ ఇత ఏహి

౫ ఓ ఓషతి త్వాం తరణిః

౨౭ వితర్కార్థములు:- కిం - ను - ఉత - స్విత్ - ఇవ

౧ కిమయం స్థాణుః కిం పురుషః

౨ అహిర్ను రజ్జుర్ను

౩ ధూమాయో మూయ ముత కపోతః

౪ పద్మమేతన్ముఖం స్విద్భాతి

౫ తామ్యతీవ వత్సో మే మకరందః

28 ప్రశ్నార్థములు. సత్యం - కచ్చిత్ - అపి - ఉత

౧ సత్యం భోక్ష్యసే

౨ కచ్చిజ్జీవతి మే మాతా

౩ అపి క్రియార్థం సులభం సమిత్కుశం

౪ ఉత దండః పతిష్యతి

29 పక్షాంతరార్థములు. నను-పునః-తు-యావత్ - అథో-చిత్

౧ నన్వరణ్యమేతన్న గృహం

౨ స పరత్యయం పునశ్చేతే

౩ స రోదిత్యయం తు హసతి

౪ జానేఽన్యోయం యావత్స ఏవ
౫ అథో శవస్తే న మదర్థముజ్ఝితః
౬ కశ్చిచ్ఛంత్తే కశ్చిదోభజయతి

30 హేత్వపదేశార్థములు :- ను - అతః - యత్ తత్ -
౧ వత్స క ఏహి కిమిహ ను తే ధానకాః
౨ అతస్త్వామర్థయామి
3 యదయం దదాతి తత్సుభగః
౪ యేన లభతే తేన స్తౌతి.

ఇట్లితరములను యథాప్రయోగము గుర్తించునది. ఇవి విధినిషేధాతి రిక్తము లందును ప్రసిద్ధములు.

## ౬. అ వి ధి ని షే ధా ర్థ ము లు

౩౧ పదపూరణార్థములు -: ఉ-ఉత-ఆహో-వై-హి-వా-ఖలు-స్విత్
కిము,కిముత,ఉతాహో,నవై,నహి,అథవా,
నఖలు, ఆహోస్విత్

౩౨ పాదపూరణార్థములు కిం-సీమ్-తు-చ
శిశిరం జీవనాయ కిం
ప్రసీమ్ ఆదిత్యో అసృజద్విధర్తా
దేవః స తు న మానుషః
విలోలదృష్టం హరిణాంగనాసు చ

౩౩ వాక్యపూరణార్థములు - ఏవ - ఆహో - ఆ
నరం చ నారాయణమేవ చ

అథో ఖల్వాహుః
ఆ ఏవం ను మన్యసే

34 అలంకారార్థములు: . భంగశ్లేష - భాషాశ్లేష - యమక -
వక్రోక్తి - చిత్ర - అనుప్రాస - పదావృత్తి -
ప్రశ్నోత్తర - మొదలగునవి యలంకారములు
౧ భంగశ్లేష - న వార్యంతే - న చార్యంతే - న స్మార్యంతే -
న హసంతి - న హీయంతే - న వైరాయతే
౨ భాషాశ్లేష - స హి అహో రణే కథ్థతేపి యో నరాయా
3 యమక - యోషితాం గాత్రం న ఖలూనం నఖలూనం
4 వక్రోక్తి - శస్త్రం న ఖ లు వోఢవ్యం
5 చిత్ర - నను హోమధనారాద్యో
ద్యో రా నా ధ మ హో ను న
౬ అనుప్రాస - స హి మహేశో వర్తితే
౭ పదావృత్తి - ప్రాసే ప్రాసేఽమునా రణే
౮ ప్రశ్నోత్తర - కా ననాచ తిమిరాదపి కాలే

35 వాక్యాలంకారార్థములు. ఆర్షిక - ఆర్షిపుత్రక - ఇత్యాదులు
వైదిక వాక్యముల కలంకార హేతువులు
అనోఖలు - అథఖల్వేతర్హి - అహో ను ఖలు భో :-
హా ధిక్కష్టం భోః-ఇతి హస్మ భగవాన్పునర్వసురాత్రేే, యః
న హ వై సశరీరస్య సతః ప్రియాప్రియయోరుపహతిరస్తి -
న వా అరే జాయాయై కామాయ జాయా ప్రియా భవతి.

36 పదసంస్కారార్థములు రెండు విధములు
౧ విధిరూప పదసంస్కారము
౨ నిషేధరూప పదసంస్కారము

వీనిలో విధిరూపము - ప్లుతవిధి - ద్విర్వచనవిధి - లడాదివిధి - పరరూపాదివిధి యని చతుర్విధము - నిషేధరూపము, పరరూపాది ప్రతిషేధము - సంహితాప్రతిషేధము - పదాదేశాది ప్రతిషేధము - నిపాత ప్రతిషేధము అని నాలుగు విధములు

విధిరూపపదసంస్కారము

౧ ప్లుతవిధి.

దేవదత్త హైక - హేక దేవదత్త

౨ ద్విర్వచనవిధి.

పరి పరి త్రిగర్తేభ్యో వృష్టో దేవః
ఉపోప మే పరామృశ

3 లడాదివిధి.

జాతు తత్ర భవాన్ వృషలం యాజయేత్
యత్ తత్ర భవాన్ వృషలం యాజయేత్

౪ పరరూపాదివిధి.

అద్యేవ ఝడితి ఆచ్ఛాదయతి
మాచ్ఛిదత్

౨. నిషేధరూప పద సంస్కారము

౧ పరరూపాది ప్రతిషేధము

మా కార్షీత్ - మా స్మ కార్షీత్

౨ సంహితా ప్రతిషేధము.

అ అవేహి - ఇ ఇంద్రం పశ్య - ఉ ఉత్తిష్ఠ.

3 పదాదేశాది పతిషేధము.

పుత్రమనుజిజ్ఞాసతి - అస్నాత్వా భుంక్తే.

౪ నిఘాతప్రతిషేధము –

యద్ దేవదత్తః పచతి

యది దేవదత్తం: పచతి

దేవదత్తః పచతి చ ఖాదతి చ

గర్దభాంశ్చ కాలయతి వీణాం చ పరివాదయతి

గర్దభాన్వా కాలయతి వీణాం వా పరివాదయతి

## గతి – ఉపసర్గము

సమాసార్హము లయిన నిపాతములె కొన్ని గతులు. ఆ యా సూత్రములచే నివి సూచితములు. గతివిశేషము లయిన ప్రాదులు ఉపసర్గసంజ్ఞ కలవి. ఇరువది యయిదుగా పరిగణితములు.

వాచక – ద్యోతక – విశేషక – సహాభిదాయక – కార్యార్థక – నిరర్థక భేదములతో నున్నవి.

౧ వాచకములు :

౧ ప్రర్షభం – ప్రగతా ఋషభా అస్మాద్వనాత్

౨ పరాసుః – పరాగతా అసవోఽస్య

౩ అపమన్యుః – అపగతో మన్యుమరస్య

౪ సమక్షం – సంగతమక్షేణ

౫ అనునాసికః – అనుప్రాప్తో నాసికాం

౬ నిర్మక్షికం – మక్షికాణాం అభావః

౭ విపక్షః – విరుద్ధః పక్షః

౮ ఆయుధం – ఆదాయ యుధ్యతే

౯ సుభద్రం – సమృద్ధిర్భద్రాణాం

౧౦ ఉపాధ్యాయః – ఉపేత్య అధీయతే అస్మాత్

౧౧ పికః – అపిహితః కాయతి

ద్యోతకములు ప్రతిష్ఠతే – పరాక్రమతే – అపకరోతి – పిధత్తే

౩. విశేషకములు రెండు విధములు ప్రకృత్యర్థవిశేషకములు-ప్రత్యయార్థ విశేషకములు - అని. అందు

౧. ప్రకృత్యర్థ విశేషకములు.
ప్రవర్ధతే - పలాయతే - అపవదతే - అవలోకతే
విలోకతే - ఆలోకతే - నిషీదతి - అధివసతి. మొ॥

౨. ప్రత్యయార్థ విశేషకములు.
సుమనాయతే-దుర్మనాయతే-అపహస్తయతి-అవచూర్ణయతి
ఉపవీణయతి - ఉపశ్లోకయతి - విపాశయతి - నిరూపయతి

౪. సహాభిధాయకములు. ప్రస్నుతే - ప్రాణితి - ప్రాప్నోతి - ఆచష్టే
ఆశాస్తే - అధీతే - అత్యేతి - అభివాదయతే - పరిష్వజతే

౫. కార్యార్థములు - విజయతే-పరాజయతే విరరామ - ఉపరరామ-
ఉపస్కురుతే - విషహతే

౬. నిరర్థకములు - ప్రారంభతే - అపహరతి - నిష్ఠీవతి - విగాహతే
ఆశ్రయతి - అధ్యాగచ్ఛతి.

## కర్మప్రవచనీయములు

ప్రాదులే క్రియా విశేషజన్యము లయిన సంబంధమును ప్రకాశింప జేయునేని కర్మప్రవచనీయము లగును. కర్మ ప్రవచనీయ సంజ్ఞ అధికారమున సూచితము లయిన 'అను' ప్రభృతులు పదునొకండును 'లక్షణా'ది ద్వావింశత్యర్థములును వీని యవధారణమున సూచకములు. అన్వాదులు వివిధార్థము లగు దుండుట వ్యాకరణశాస్త్ర ప్రసిద్ధము.

## విభక్తి ప్రతిరూపావ్యయములు.

సుబంత-తిజంతానుకారులుగా నుండు అవ్యయములు విభక్తిప్రతిరూపావ్యయములుగా నున్నవి. ఇవి ప్రత్యేకముగా నారారు విధములు.

ప్రకృత్యర్థ - ప్రత్యయార్థ - ఉభయార్థ

అనుభయార్థ - ప్రకృత్యంతరార్థ - ప్రత్యయాంతరార్థ భేదములు రెండు వర్గములందును గలవు.

సుబంతానుకారులు.

౧ ప్రకృత్యర్థములు ఉచ్చైః - నీచైః- చిరాయ
౨ ప్రత్యయార్థములు ఆరాత్ - అకస్మాత్ - ఏకపదే
3 ఉభయార్థములు. అహం, శుభం. పాపే, మధ్యే
౪ అనుభయార్థములు. ఋతే - దిష్ట్యా - సాక్షాత్
౫ ప్రకృత్యంతరార్థములు కృత్ - దివా-దోషా
౬ ప్రత్యయాంతరార్థములు. సాయం, స్వయం, చిరస్య

తిఙంతానుకారులు

౧ మన్యే - శంకే అయే
౨ ఏహి - అపేహి - పశ్య
3 అస్తి - అసి - అస్మి
౪ యాతి, నయాతి, వర్తతే, నవర్తతే
౫ అస్తు - భవతు - పూర్యతే
౬ ఆహ - స్యాత్ భూయాత్

వ్యాకరణశాస్త్రము నందలి అవ్యయప్రకరణమున పఠితములయిన "అమ్ - క్త్వా - ల్యప్ - తుమున్ - ణముల్ - ఖముఞ్" అనునాగు కృత్ప్రత్యయములు ఆరు విధముల నున్నవి.

క్రియారూప-క్రియాఫలరూప-క్రియావిశేషణరూప - క్రియావధిరూప-క్రియాకర్మరూప-క్రియావయవరూప

౧. క్రియారూపములు :- చకాసాంచకార - విదాంకుర్వంతు - అలంకృత్వా-అలమాలప్య-అలం భోక్తుం-శ్రోతుం శ్రోత్రం-ద్రష్టుంచక్షుః.

౨ క్రియాఫలరూపములు :- భోక్తుం ప్రజతి-పక్తుం పచతి-భోక్తుం ఈష్టే-భోక్తుం ప్రభవతి.

౩. క్రియావిశేషణరూపములు :- ఇత్థంకారం - తథాకారం - నానాభావం-ద్విధాభావం-తూష్ణీంభావం.

౪. క్రియావధిరూపములు .- భుక్త్వా వ్రజతి-అగ్రేభోజం వ్రజతి.

ద్వ్యంగులోత్కర్షం ఖండికాశ్ఛినత్తి
శయ్యోత్థాయం రాజద్వారమేతి
కన్యాధర్శం వరయతి. యావజ్జీవమధీతే

౫. క్రియాకర్మరూపములు - శక్నోతి భోక్తుం - జానాతి భోక్తుం-కామయతే భోక్తుం-కమితుం కామయతే.

౬. క్రియావయవరూపములు .- మూలకోపదంశం భుంక్తే
దండోపఘాతం గాః కాలయతి. పార్శ్వోపపీడం శేతే
భ్రూవిక్షేపం జల్పతి. నామగ్రాహమాకారయతి
ఇవి క్రియాకర్మావయవరూపములుగా గూడ నున్నవి.
జీవగ్రాహం గృహ్ణాతి హస్తగ్రాహం గృహ్ణాతి
జీవనాశం నశ్యతి
మిగిలిన యిరువది నాలుగు వేదమున గలవు.

## అవ్యయీభావము

అవ్యయీభావము ద్వివిధము. సత్త్వభూతార్థము-అసత్త్వభూతార్థము. అని

౧. సత్త్వభూతార్థములు :- ఉపకుంభం - నిర్మక్షికం - సబ్రహ్మ - మధ్యేసముద్రం-ద్విముని. పంచనాదం.

౨. అసత్త్వభూతార్థములు. అధిస్త్రి - అనురథం - యథాశక్తి - ఆపాటలిపుత్రం - అభ్యగ్ని - ద్విపరి

ప్రాతిపదికప్రకృతికి సంబంధించిన నామ - అవ్యయముల స్వరూప మింతగా నిరూపిత మయినది. ఇక మూడవది యగు,

### 3. అ ను క ర ణ ము

నిరూపింప వలసి యున్నది. "శబ్దస్య తాద్రూప్యేణాభిధానం అనుకరణం" శబ్దమును తద్రూపమున జెప్పుట యనుకరణ మన దగి యున్నది. అనుకరణము ఆరు విధములు.

౧. వ్యక్త వర్ణ సాదృశ్యోక్తి
౨. వ్యక్త పద సాదృశ్యోక్తి
3. వ్యక్త వాక్య ,,
౪. అవ్యక్త వర్ణ ,,
౫. అవ్యక్త పద ,,
౬. అవ్యక్త వాక్య ,,

వీని యుదాహరణము లీ విధమున నున్నవి.

౧ ఛిన్నేవ పతతా వహ్నౌ యన్ముఖేన హఠాత్కృతే
స్వేతి హేతి హరేణోక్తే స్వాహాసీత్ సైష రావణః.

ఛిన్నమయిన రావణుని శిరము వహ్నిలో పడునపుడు శివుడు స్వా-హా - అనగా నా రావణుడు స్వాహా యయ్యెను. ఇందు స్వాహా పదము నందలి వ్యక్తవర్ణసాదృశ్యము స్పష్టము.

గచ్ఛేతి వక్తుమిచ్ఛామి మత్ప్రియ త్వత్ప్రియైషిణీ
నిర్గచ్ఛతి ముఖాద్వాణీ "మా గా" ఇతి కరోమి కిం?

ప్రియుడా! నీ ప్రియము కోరుదాననై 'గచ్ఛ' పొమ్ము! అనవలె ననియె తలతును. కాని నా ముఖము నుండి 'మా గా' పో వలదు అని వాణి వెలువడును, ఏమి చేయుదును ఇందు 'గచ్ఛ - మాగా' పదములు వ్యక్తరూపమున నున్నవి.

త్వం జీవితం త్వమసి మే హృదయం ద్వితీయం
త్వం కౌముదీ నయనయోరమృతం త్వమంగే
ఇత్యాదిభిః ప్రియశతై రనురుధ్య కాంతాం
తామేవ శాంత మథవా కిమతః పరేణ

ఉత్తరరామచరితములో వనదేవత వాసంతి రామునితో ననుట. రామా! 'నీవు జీవితము నీవు నా రెండవ హృదయము నీవు నా కన్నులకు కౌముది నా దేహమున నీవు అమృతము' ఇట్లు ప్రియశత ములతో సీత నాయ పట్టుకొని ఆ సీతనే!' చాలును. ఇటు పైమాట లేల? ఇట్లనుటలో 'అట్టి సీత నెట్లు పరిత్యాగ మొనరించితి' వను వాక్యవ్యక్తి యున్నది.

గతేర్ధరాత్రే పరిమంద మందం
గర్జంతి యత్ప్రావృషి కాలమేఘాః
అపశ్యతీ వత్సమివేందుబింబం
తత్ శర్వరీ గౌరివ హుం కరోతి॥

మందమందముగా నర్ధరాత్రి గతింపగా ప్రావృట్కాలమున కాలమేఘములు గర్జించు చున్నవి. అది, వత్సమును చూడని గోవు వలె చంద్రబింబము చూడని శర్వరి హుంకార మొనరించుచున్నది. ఇందు హుం' అనుట యవ్యక్త వర్ణసంపత్తి.

చటచ్చటితి చర్మణి చ్ఛిమితి చోచ్ఛలచ్ఛోణితే
ధగద్ధగితి మేదసి స్ఫుటరవోఽస్థిషు ష్ఠా గితి
పునాతు భవతో హరేరమరవైరి రాజోరసి
క్వణత్కరజ పంజర క్రకచ కాష జన్మాఽనలః

శ్రీనరసింహుడు హిరణ్యకశిపుని వక్షోవిదారణ మొనర్చు నపుడు నఖము లనెడు రంపము కషణము వలన గలిగిన యగ్ని చర్మ ముపై 'చట చ్చట' అని రక్తము చిమ్ము నపుడు 'చిమ్ చిమ్'అని, క్రొవ్వుపై 'ధగ్ ధగ్' ఎముకలపై 'ష్ఠా ష్ఠా' అని స్ఫుటముగానున్న

రవము మిమ్ము పవిత్ర మొనరించు గావుత ఇందు చటచ్చటతి మొద లగునవి యవ్యక్తపదములు.

పి పి ప్రియ స స స్వయం ము ము ముఖాసవం దేహి మే
త త త్యజ దు దు ద్రుతం భ భ భ భాజనం కాంచనం
ఇతి స్ఖలితజల్పితం. మదవశాత్కురంగీదృశః
ప్రగే హసిత హేతవే సహచరీభిరధ్యైయత॥

ప్రియుడా! నాకు స్వయముగా నీ ముఖాసవ మిమ్ము వేగముగా బంగారు భాజనము విడుము. ఇట్లు మద్యమదమున తొట్రుపడు మానిని మాట ప్రాతస్సమయమున హాసము కలిగించినది. చెలియ లట్లా మాటనే నేర్చిరి దీనిలో 'పి పి ప్రియ' మొదలగు నవి కూడిన వాక్య మవ్యక్తరూపమున నుండుట స్పష్టము.

అనుకరణము లెట్లున్నను సాధుత కలవియె యగును. వాని విశేషము లిట్లుండును.

౧ సాధువు లర్థయుక్తము లగు పదములు
౨ సాధువు లర్థసహితము లగు వాక్యములు
౩ అశక్తికృత మగు అసాధుశబ్ద రూపము
౪ అపభ్రంశ రూపములు
౫ అనర్థకము లయిన వర్ణములు
౬ అవ్యక్త వర్ణ పద వాక్య వచనములు

ఇంతవరకు ప్రాతిపదికప్రకృతికి సంబంధించిన నామావ్యయాను కరణములు సూచితము లయినవి. ఇక కృత్తుల సూచింపవలెను.

## కృత్ప్రాతిపదికములు

భావకారకము లను నిరూపించు ధాతు ప్రత్యయములకు 'కృత్తులు' అని పేరు. ఇవి యారు విధములు.

లింగి - అన్యలింగి - స్వలింగి అలింగి
శక్త్యాద్యపేక్షములు - అనుప్రయోగాద్యపేక్షములు.

౧ లింగి ప్రత్యయములు. ద్రవ్యవచనము లయిన 'అణ్' ఆదులు.
కుంభకారః - పంకజం - దాత్రం - కృకవాకుః

౨ అన్యలింగి - గుణవచనము లయిన 'ణ్వుల్' ఆదులు
కారకః, కారికా. కారకం_దర్శనీయః, దర్శనీయా, దర్శనీయం

౩ స్వలింగి - ఉత్పత్తిలో నియతలింగాపేక్ష కలవి
పక్తిః- పచనం - పాకః - శయ్యా - సుప్తం

౪ అలింగిప్రత్యయములు. అసత్త్వభూతార్థములై లింగ - సంఖ్యా - శక్తులను గ్రహింపకుండునవి 'తుమున్' మొదలగునవి.
కాలో భోక్తుం - అలం కృత్వా - ఖలు ప్రహృత్య

౫ శక్త్యాద్యపేక్షములు. శక్తిహేతు మల్లక్ష్య క్రియాపేక్షములు. 'శతృ' ప్రత్యయము మొదలగునవి.
వ్రజతా కృతం - ఆర్జయన్ వసతి - చంక్రమ్యమాణోఽధీతే.

౬. అనుప్రయోగాద్యపేక్షములు. అను ప్రయోగ మపేక్షించునవి తద్ధితాదుల యనుషంగము కలవి. 'ణముల్' మొదలగునవి.
రైపోషం పుష్యతి - చోరంకారమాక్రోశతి॥
ప్రాతిపదిక ప్రకృతికి సంబంధించిన కృత్తులు సూచితములు.

తద్ధిత ప్రాతిపదికములు.

భావకారక సంబంధము కలవై స్వార్థనిరూపకము లగునవి అధాతుప్రత్యయములుగా నుండునవి తద్ధితములు. ఇవియారువిధములు.

అలోపి - లోపి - సర్వలోపి
ఆదేశి - ప్రదేశి - అప్రదేశి,........రూపములు.

౧ అలోపితద్ధితలు - నిరను బంధములు
అశ్వత్థ - అశ్వత్థామ - సభ్య:- సఖ్యం - దేవదత్తరూప్యః
౨ లోపి తద్ధితలు సానుబంధములు
బ్రాహ్మణ్యం - వైయాకరణ - కైదార్యం
3 సర్వలోపి తద్ధితలు వీనికి లుపాదులచే నేమియు మిగులదు.
చరకా - పాంచాలా - గార్గీ - సామగ్రీ
౪ ఆదేశి తద్ధితలు. - వీనికి 'ఆయన్' మొదలగు నవి యాదిష్టము లగును. ఐలికాయన - ఆత్మనీనం - శాశ్వతికం.
౫. ప్రదేశి తద్ధితలు ప్రకృతి కాది మధ్యవిషయములుగా నుండునవి
బహుతృణం - బహురాజా - త్వయకా
౬. అప్రదేశితద్ధితలు. అంత్యావయవభూతములుగా నుండునవి.
వాక్త్వచం - ప్రత్యురసం - యువజాని - సరజసం.

ఇంత వఱకు ప్రాతిపదిక ప్రకృతికి సంబంధించిన సామాన్యయానుకరణకృత్తులు సూచితములు.

## సమాసప్రాతిపదికము.

వేరు వేరుగా నుండు నర్థముల కేకార్థభావ ముండుట సమాసము. సమాస మారు విధములు.

౧ సుబంతములు ౨ తిజంతములు 3 సుప్తిజంతములు
౪ సుబ్ధాతువులు ౫ సుబంతనామములు ౬ నామములు

౧ సుబంతములు రాజపురుష:-నీలోత్పలం-ధవఖదిరౌ. ఇచట సామర్థ్యమున్న నే సమాసము కలుగును. సామర్థ్య మనునది సంబంధము. అట్టి సంబంధము రెండింటికి ప్రధానోపసర్జనభావ మున్న నే కలుగును. పరస్పర మపేక్ష లే నట్టి రెండు ప్రధానములకు గాని రెం డుపసర్జనములకు గాని సంబంధము ఘటింపదు.

ప్రధానోపసర్జనభావము రెండు విధములు· అభిధీయమానము-ప్రతీయమానము నని వైయధికరణ్య మున్నపుడు అభిధీయమానము వ్యతిరేక విభక్తితో నుండును.

"కుంభస్య సమీపం – రాజ్ఞః పురుషః"

ఇచట – 'ఉపకుంభం' అని పూర్వపదప్రధాన మయిన యవ్యయీభావ సమాసముకలుగును 'రాజపురుషః' అను రెండవదానిలో నుత్తరపద ప్రధాన మయిన తత్పురుషసమాసము కలుగును. ప్రధాన మగునది. యవిచలిత స్వార్థముగా ప్రథమా విభక్తిచే నభిహితమగును. ఉపసర్జనముగా నుండునది ప్రధానానుగ్రహమునకై షష్ఠ్యాదులచే వ్యతిరేక విభక్తి నాశ్రయించును. ఇవి సుబంతముగా నుండగనే కలుగును.

ప్రతీయమానము సామానాధికరణ్య ముండగా తుల్య విభక్తిగా నుండును.

నీలం చ తదుత్పలం చ నీలోత్పలం
అష్టసు కపాలేషు సంస్కృతః అష్టాకపాలః।

ప్రతీయమానోపసర్జన ప్రధానభావము కలవానికి విశేషణ విశేష్యభావమున సామానాధికరణ్య మున్నప్పుడు సమాసము కలుగును. అదితుల్య విభక్తికత్వముననె కలుగును గావున సుబంతత్వమున్నది రెండిట సమానవిభక్తికత్వము లేకున్నప్రాధాన్యము కాని యప్రాధాన్యము కాని భాసింపదు. రెండును సుబంతములుగానున్ననె తుల విభక్తికత్వ ముండును. కావున నంతట సుబంతమున సుబంతము సమసించునని తెలియునది.

౨. తిజంతములు – అశ్నీత పిబతా–ఖాదత మోదతా–ఆఖ్యాతి మాఖ్యాతమున సమసించుట విహితము.

3. సుప్తింతములు : అదిచసి ప్రావర్షత్ - అను వ్యచలత్- అస్తిక్షీరా - సుబంత తిఙంతములకు సమాస మిచట గలదు. సమాస శాస్త్రవిధానమున వీనియర్థ మిట్లవభాసించును.

'అవక్షిప్తోసి న పచసి త్వమభిహితోఽపి వృషల'

వృషలా! చెప్పినను నీవు వండితివి కావు ఛీ! ప్రకర్షేణా వర్షత్ - బాగుగా వర్షించెను.

పశ్చాద్విశిష్టం చలనమకరోత్ - పిమ్మట సరిగా చలించెను.

అస్తి క్షీరమస్యాః - దీనికి పా లున్నవి.

౪. సుబ్ధాతువులకు - అంతర్గిః - ప్రతిభువౌ

వీనియందు విశిష్టకార్యసిద్ధికై క్విబంతము ప్రత్యయ నామధాతువయి నందున సుబ్ధాతువులకు సమాసము.

౫. సుబంతనామములు. చర్మకారః-ధనక్రీతా - బ్రాహ్మణాచ్ఛంసీ- సరసిజం,

చర్మకార పదమున పూర్వపదమునకు పదాంతము లక్షణ న లోప మునకై సుబంతత్వ మున్నది. 'ధనక్రీతాపదమున-సా హితస్య ధనక్రీతా ప్రాణేభ్యోపి గరీయసీ' అను శిష్టప్రయోగ మున్నందున ఉత్తరపదమునకు సుబుత్పత్తి కలుగగా టా బుత్పత్తి వలన ఆకారాంత మయి నందున 'జీష్' ఉదయింపదు. 'బ్రాహ్మణాచ్ఛంసీ - సరసిజం - అను స్థల ములందు పూర్వపదములలో నాక్షాత్తుగా సుప్ శ్రవణమున్నది. ఉత్తరపదములందు ప్రయోజనము లేనందున విభక్తి లేదు.

౬. నామములు. అసూర్యంపశ్యా రాజదారా.- కృతపూర్వీ కటం. వీనిలో 'అసూర్యం పశ్యా' అను స్థలమున - నఞ్. సూర్య పదములకు దృశిక్రియతో సంబంధమున్నది కాని వానికి పరస్పరము సంబంధము లేదు. కావుననే సామర్థ్యము లే నందున విభక్తి లేదు.

ఇచట – సూర్యమపి న పశ్యతి’ అను నర్థమున ‘నఞ్’ సూర్యకర్మకిదృశిక్రియ నపేక్షించును. కాని సూర్యసత్త నపేక్షింపదు. వీనికి సామర్థ్యము లేకున్నను సామములకే సమాసము విహితమయినది. ఇట్లే ‘కృతపూర్వీ కటం’ ప్రయోగమును గుర్తించునది. ‘కృతం పూర్వం కటం అనేన’’ వీనిచే పూర్వము కిట మొనరింప బడినది.’ అను విధమున కృత శబ్దమునకు కటాపేక్ష యున్నందున పూర్వ శబ్దముతో సంబంధము లేదు. సామర్థ్యము లేదు. కావుననే అసుబంతములయిన కృతపూర్వ పదములకు సమాసము విహిత మయినది.

సుబంతములు తిజంతములు సమసించుననుటలో సుబంతాభ్యాం-తిజంతాభ్యాం’ అని ద్వివచనమున్నది. అది వివక్షితము కాదు. కావున రెండు మూడు బహుపదములతో సమాసములు కలుగవచ్చును. అవ్యయీభావము కర్మధారయము రెండుపదములతో నుండును. శాకప్రతి – పురుషవ్యాఘ్రః’ షష్ఠీలక్షణము కాల పరిమాణలక్షణ మయిన తత్పురుషము రెండు పదములతో మూడుపదములతో నుండును. ‘రాజ గవీక్షీరం – రాజ గో క్షీరం’ బహువ్రీహి ద్వంద్వ సమాసములు రెండు మూడు బహుపదములతో నుండును. ‘చిత్రగుః– ప్లక్ష న్యగ్రోధా – మత్తబహు మాతంగం – శంఖ దుందుభి వీణాః’

ఇంతవరకు పండ్రెండు విధములయిన శబ్దములలో మొదటి దగు ‘ప్రకృతి’ విస్తృతముగా వివేచిత మయినది. ఇక రెండవది యగు ప్రత్యయము నిరూపింపవలసియున్నది.

## ప్రత్యయము

ఇటుపై ప్రత్యయాదుల స్వరూపము నిరూపింపదగును. ‘ప్రతీయతేఽనేనార్థ ఇతి ప్రత్యయః’ దీనిచే నర్థము గోచరించు గావున నిది ప్రత్యయ మగును. ప్రత్యయము మూడు విధములు.

౧. ధాతు ప్రత్యయము, ౨. ప్రత్య య ప్రత్యయము 3. ప్రాతి పదిక ప్రత్యయము. ఇందు ధాతుప్రత్యయ భేదము లాఱు గలవు.

సనాదులు – తిబాదులు – తుమునాదులు
తవ్యాదులు – ణ్వులాదులు – ఉణాదులు

౧ సనాదులు.

ఇచ్ఛాప్రయోజకము లయిన వ్యాపారాది క్రియలలో క్రియా సమభిహారాదులలో విధీయమానము లగు ప్రత్యయములను సనాదు లందురు. ఇవి క్రియావచనము లయి నందున భూవాదుల వలె ప్రత్యయాంతరము నపేక్షించు నవి యగును.

చికీర్షతి – అధ్యాపయతి – పాపచ్యతే – గోపాయతి – ఋతీయతే – కామయతే

౨ తిబాదులు.

క్రియా ప్రధానములు కర్తృ కర్మలలో క్రియలో విహితము లగును. సాధ్యరూపము పొందిన క్రియలను చెప్పునవి కావున ప్రత్యయాంతరము నపేక్షింపవు. ఇట్టి వానిని తిబాదు లందురు.

వ్రజతి దేవదత్తః – పచ్యతే ఓదనః
రజ్యతి వస్త్రం – లూయతే కేదారః

3 తుమునాదులు.

క్రమరహితము లయిన క్రియలను జెప్పునవియసత్త్వభూతార్థములు సాధ్యభావమున విహితము లగునవి తుమున్ ఆదులు.

పక్తుమిచ్ఛతి – అధీత్య స్నాతి – పాయంపాయంవ్రజతి

౪ తవ్యాదులు

భావకర్మలందును కర్త్రాదు లందును తవ్యాదులు విధీయమానము లగును.

గంతవ్యం భవతా - లూయమానః కేదారః - వాస్తవ్యో లోకః దుర్గమో మార్గః

౫ ణ్వులాదులు.

సామాన్యముగా కర్త్రర్థమునను కర్మాదు లందును విహితము లగునవి ణ్వులాదులు.

పాచకః పుమాన్ - కన్యామలంకరిష్ణుః

పాదహారకః పంకః - ప్రియంకరణం శీలం

౬. ఉణాదులు

సర్వకారకము లందును సిద్ధభావమున నివి విహితము లగును. సామాన్యముగా నివి ద్రవ్యవచనము లగును.

శీతో వాయుః - వత్సలా ధాత్రీ

వృద్ధ ఉపాధ్యాయః - రమ్యః ప్రాసాదః

౨. ప్రత్యయ ప్రత్యయములు.

యదాదులు - ఘాదులు - మబాదులు - ఫగాదులు

యుజాదులు - థగాదులు - ప్రత్యయ ప్రత్యయములు.

యదాదులు

సుబంతముల నుండి యుత్పన్నము లగును. భవాపత్య స్వార్థమత్వర్థాదు లం దుండును. ఇవి యదాదులు.

అపన్నవ్య.- చిరంతనం - ఆముష్యాయణః - శుభంయుః.

౨ ఘాదులు.

తిఙంతముల నుండి యుత్పన్నములగును. ప్రకర్షాపకర్ష కుత్సా ప్రశంసాదులలో ప్రయుక్తము లగును. ఇవి ఘాదులు.

పచతితరాం - జల్పతికల్పం - స్వపితిదేశ్యం

౩ మబాదులు.

కృత్తుల నుండి యుత్పన్నము లగును. నివృత్తి స్వార్థమత్వర్థాదుల ప్రయుక్తము లగును.

కృత్రిమం - సాంరావిణం - శ్యైనంపాతా

౪ ఫగాదులు.

జీవద్వంశ్య ప్రశస్త కుత్సిత స్వార్థాదులలో ప్రయుక్తములు. అపత్యాదితద్ధితాంతము మల నుండి యుత్పన్నములు ఫగాదులు

గార్గ్యాయణ - దాక్షాయణ - ఆభిజిత్య:

౫ యుజాదులు.

సిద్ధభావ తాచ్ఛీల్యోపాధి కర్త్రాదుల యందు ప్రయుక్తములు. ణిజాది ధాతు ప్రత్యయాంతములనుండి యుత్పన్నము లగునవి యుజాదులు.

యాయజూక - యాయావరః

౬ ధగాదులు.

అపత్యాద్యర్థ స్వార్థ శక్తి సంఖ్యాదు లందు ప్రయుక్తములు స్త్రీ ప్రత్యయాంత సముత్పన్నము లగునవి ధగాదులు.

గాంగేయః - యావతేయః - సువధూకః

3 ప్రాతిపదిక ప్రత్యయ భేదములు.

ఇవి యారు విధములు.

టాబాదులు - స్వాదులు తసిలాదులు.

కాదులు - అణాదులు - క్యజాదులు

౧ టాబాదులు.

ప్రకృతి లింగమును జెప్పునవి ప్రాతిపదికమున కంటె ఉత్పన్నము లగునవి టాబాదులు.

ఖట్వా - బ్రహ్మబంధూః - యువతిః

౨ స్వాదులు.

ప్రకృత్యర్థ సంఖ్యాభిధాయకములు ప్రాతిపదికమున గలుగునవి స్వాదులు.

కుండం - కుండే - కుండాభ్యాం - కుండేభ్యః

3 తసిలాదులు.

సుబంత ప్రాతిపదిక ముల కన్న స్వార్థాదు లం దుత్పన్నము లగునవి శక్తిమాత్రాభిధాయకములు సోపాధిశక్త్యభిధాయకములు గాని యగునవి తసిలాదులు.

యతః - యత్ర - కదా - బహుశః

4 కాదులు.

సుబంత ప్రాతిపదిక కన్న స్వార్థాదు లందు గలుగునవి కుత్సా ప్రశంసాతిశయానతిశయోపాధి గా, అనుపాధి గా నుండు సుబ్వింత ప్రాతిపదిక యిచట గ్రాహ్యము.

అశ్వకః-వైయాకరణరూపః-పటుతరః

5. అణాదులు.

సమర్థ ప్రాతిపదిక కన్న సమర్థ కారకభావములం దుత్పన్నము లగునవి అణాదు లని గ్రాహ్యము.

ఔపగవః-తావకీనః-వామదేవ్యం - బ్రాహ్మణత్వం -
పౌరోహిత్యం.

6. క్యజాదులు.

సమర్థప్రాతిపదిక కన్న గలుగు నవి. కర్మాదికారకోపహిత కియేచ్ఛాచార ద్వ్యర్థాదు లం దుండునవి క్యజాదులు.

చిత్రీయతే-పుత్రకామ్యతి-శ్యేనాయతే
లోహితాయతి-కంఘూయతే-ముండయతి.

ద్వాదశవిధ శబ్దవిశేషములలో ప్రకృతి ప్రత్యయములు నిరూపితము లయినవి. మూడవదియగు ఉపస్కారము ప్రకృతము. తన్నిరూపణము ప్రస్తుతము.

## ఉపస్కారము

ప్రకృతి ప్రత్యయముల సంస్కారమున కుపస్కార మని పేరు. ఈ సంస్కారము ఉపసర్గ-ఉపగ్రాహ-ఆగమ-లోప-వర్ణవికార-వికరణాది రూపముగా నుండును. ఉపస్కారము త్రివిధము.

ప్రకృత్యుపస్కారము-ప్రత్యయోపస్కారము -
ఉభయోపస్కారము నని.

ఈ మూడును భూషణ - సమవాయ - అధ్యాహార - వైకృత - యత్న-ప్రతియత్న భేదమున ప్రత్యేకముగా షట్ప్రకారము లగును.

౧. ప్రకృతికి భూషణ రూపములు నిరర్థకోపసర్గ స్వార్థిక వైకల్పికాదులు.

౧. అధ్యాగచ్ఛతి - పర్యాగచ్ఛతి - ప్రలంబతే।
౨. పావకః-పాద్గుణ్యం-మానసం.
౩. ఆపి-మృద్వీ-కమండలూః,

౨. ప్రకృతికి సమవాయ రూపములు సార్థకోపసర్గ సన్, క్యజాదులు.

౧. ఆశాస్తే - ప్రతిష్ఠతే - సుమనాయతే
౨. జుగుప్సతే-గోపాయతే-కామయతే
౩. పుత్రీయతి-పుత్రకామ్యతి-శ్యేనాయతే

౩. ప్రకృతికి అధ్యాహారరూపములు సహాభిధాయకోపసర్గ ద్విర్వచన, సుడాగమాదులు.

౧. అధీతే-అధ్యేతి-సంగ్రామయతే
౨. జుగుప్సతే-అరార్యతే-ఉదిపతి
౩. ఉపస్కురుతే-అపప్తత్-మధ్వస్యతి

౪. ప్రకృతికి వైకృతరూపములు వర్ణ వ్యత్యయ విపర్యయాపాయాదులు.

౧. నిషించతి-ప్రణయతి-ఉశంతి

౨. తరుః - సింహః - సత్త్వః

౩. సంతి - ఘ్నంతి - ద్యంతి

౫. ప్రకృతికి యత్నరూపములు. ఉపచయ-ప్రసవ-సంవృత్త్యాదులు.

యేతి-దీవ్యతి-నిగూహతి

కేర్యతే-సౌఘ్నాతకిః-స్వాయంభువం

ఆస్త-ఆస్తే-అవృాచత్

ప్రకృతికి ప్రతియత్నరూపములు విశేషాదేశ విధి నిషేధాదులు

ఆహ-అఘసత్-అధ్యగీష్మహి

పిత్ర్యం-గవ్యం-నావ్యం

తితఉః-ప్రఉగం-కోకూయతే

ఇంతవరకు ప్రకృతికి సంబంధించిన భూషణాదుల నిరూపణ మయినది. ఇక ప్రత్యయము నకు సంబంధించిన భూషణాదుల నిరూపింప వలెను.

౧. ప్రత్యయమునకు భూషణరూపములు ఇడసుగీకకాదులు.

సహితా-వరితా-భ్రూణాం

దేవాసః-పారయామసి-భవాతి

తార్తీయీకం-పీత్వాయ-త్వాయకా

౨. సమవాయ రూపములు స్య సి చూ సీ యుడాదులు

కరిష్యతి-అకరిష్యత్-బ్రవీతి

అపాక్షీత్-అపీపచత్-అశిషత్

కృషీష్ట-కుర్యాత్-కుర్వీత

౩. అధ్యాహారరూపములు ప్రత్యయార్థ విశేషణోపసర్గ మత్వర్థాదులు

సుమనాయతే-దుర్మనాయతే-అభిమనాయతే

కృత్రిమం-సాంరావిణం-కౌంజాయన్యః

పచతితరాం_పచమానః_వృక్షాణాం

౪. వైకృతరూపములు ఆదేశ సర్వాదేశ ప్రత్యయాదేశాదులు,

గార్గ్యాయణః_చాంద్రమసాయని,- కౌలేయక,

పవనః-పావకః_వృక్షస్య

వేద_వివేద_విద్వాన్-విద్ధి

౫. యత్నరూపములు లుగ్లుంపన విలుంపనాదులు

పచత్_జుహోతి_పంచాలా;

దదృశే_అద్రాక్షీత్_కామంతలేయ,

అగ్నిచిత్_శుభంయాః_మూలఖా,

౬. ప్రతియత్నరూపములు విశేషాదేశవిధి నిషేధాదులు.

తస్థౌ - వేద - ప్రశాధి

ఉదపాది - ఆగ్నేయః - సైరిణం

సుభ్రూః - సుప్రీయసీ - వ్యతిహాసంతి

ఇప్పటికి యారును ప్రత్యయమునకు సంబంధించిన భూషణాదులు. ఇక ప్రకృతి ప్రత్యయముల కుభయములకు సంబంధించిన భూషణాదుల నిరూపణము ప్రసక్తము.

౧ భూషణరూపములు యుష్మత్ప్రభృతి ప్రయోగాదులు.

త్వం పచసి - యువాం పచథః - యూయం పచథ

వయం పచామః - వాయుర్వాతి - దేవో వర్షతి

భజ్యతే శాఖా స్వయమేవ

అవకిరతే హస్తే స్వయమేవ

భూషయతే కన్యా స్వయమేవ

బ్రూతే కథా స్వయమేవ

౨. సమవాయ రూపములు వికరణాదులు

భవతి - చోరయతి - దీవ్యతి - సునోతి - తుదతి

తనోతి – రుణద్ధి – క్రీణాతి
స్వయం – నమతే – స్వయం దుగ్ధే
తప్యతే తపః – లూయతే కేదారః

3. అధ్యాహారరూపములు ద్విరుక్త్యాదులు
పాయంపాయం – పచతి పచతి
గ్రామో గ్రామో రమణీయః
మూలేమూలే స్థూలాః
అగ్రే అగ్రే సూక్ష్మాః
జ్యేష్ఠం జ్యేష్ఠ ములవేశయ
మాషంమాషం దేహి

౪. వైకృతరూపములు వాం నా వాదులు
గ్రామో వాం – గ్రామో నౌ
గ్రామో వః గ్రామోనః.

౫. యత్నరూపములు అను ప్రయోగాదులు
అగ్నిసా త్సంపద్యతే
భస్మసా ద్భవతి
బ్రాహ్మణాసాత్ స్యాత్

౬. ప్రతియత్నరూపములు విధ్యను ప్రయోగాదులు.
సమూలకాషం కషతి – జీవగ్రాహం గృహ్ణాతి
చూడకనాశం నష్టః – ఓదనపాకం పక్వః
లునీహి లునీహీత్యేవాయం లునాతి
అధీష్వ అధీష్వ ఇత్యేవాయ మధీత్
రాష్ట్రిమట మఠమట దూరమట ఇత్యేవాయ మటతి
సక్తూన్పిబ! ధానాః ఖాద! ఓదనం భుంక్ష్వ!
ఇత్యేవాయమభ్యవహారతి.

ఇప్పటికి ప్రకృతి - ప్రత్యయ - ఉపస్కారముల నిరూపణము సమాప్త మయినది. ఇక నాలవది యగు ఉపపదము నిరూపింప దగి యున్నది.

## ४. ఉ ప ప ద ము

ప్రకృతి సమీపమున నుచ్చారిత మయిన పద ముపపదము. ఈ యుపపద ముపస్కార విశేషమె. ఇది మూడు విధములు.

తిఙుపపదము— కృదుపపదము – సుబుపపదము. ఇందు తిఙుప పదము మూరు విధములు.

క్రియారూపము - కారకరూపము - నామరూపము

అవ్యయరూపము – నిపాతరూపము - ఉపసర్గరూపము

౧. క్రియారూపము.

ఏహి! మన్యే రథేన యాస్యసి

న మర్షయామి యత్రాత్ర భవాన్ వృషలం యాజయేత్

౨. కారకరూపము.

అశ్వేన సంచరతే

దాస్యా సంప్రయచ్ఛతే

౩. నామరూపము.

కాలో యద్భుంజీత భవాన్

సమయో యద్భుంజీత భవాన్

వేలా యద్భుంజీత భవాన్

४. అవ్యయరూపము.

కథం నామ తత్ర భవాన్ వృషలం యాజయేత్

నమతే దండః స్వయమేవ

౫. నిపాత రూపము.

యావద్భుంక్తే

పురా వ్రజతి

౬. ఉపసర్గరూపము.

పరాక్రమతే - పరాజయతే

రెండవది యయిన కృదుపపద మారు విధములు

క్రియారూపము - కారకరూపము

నామరూపము - అవ్యయరూపము

నిపాతరూపము - ఉపసర్గరూపము

౧. క్రియారూపము.

భోక్తుం వ్రజతి - భోజకో వ్రజతి

గోదాయో వ్రజతి - కర్తుమిచ్ఛతి

౨. కారకరూపము.

కుంభకార - ఉత్తావశయః - శయ్యోత్థాయం

౩. నామరూపము.

కాలో భోక్తుం - సమయో భోక్తుం

బ్రహ్మ భూయం - బ్రహ్మోద్యం

౪. అవ్యయరూపము

దివాకరః - దోషాకరః - మృషోద్యం - ఈషత్పానః

౫. నిపాతరూపము.

అలం కృత్వా - ఖలు కృత్వా

యావద్వేదం - అన్యథాకారం

౬. ఉపసర్గరూపము.

ప్రజవీ - ప్రసవీ - వికత్థీ - నిరాకరిష్ణుః

మూడవది యయిన సుబుపపద మారు విధములు.

క్రియారూపము - కారకరూపము - నామరూపము

అవ్యయరూపము - నిపాతరూపము-కర్మప్రవచనీయ రూపము

౧. క్రియారూపము.

స త్వాంతృణాయ మన్యే
సంతాపాయ ప్రభవతి
గోషు దుహ్యమానాసు గతః
క్రోశతః ప్రావ్రాజీత్

౨. కారకరూపము.

కేశేషు ప్రసితః
బ్రాహ్మణేషు భుంజానేషు వృషలా ఆసతే
వృషలేష్వాసీనేషు బ్రాహ్మణా భుంజతే

౩. నామరూపము.

గవాం స్వామీ
అన్నస్య హేతోర్వసతి
పిత్రా సదృశః
శివం ప్రజాభ్యః

౪. అవ్యయరూపము.

సమయా గ్రామం - సహ ఛాత్రేణ - నమో దేవేభ్యః
దక్షిణా హి గ్రామాత్

౫. నిపాతరూపము.

హే! దేవదత్త - హా దేవదత్తం
వినావిష్ణుమిత్రేణ - ఋతే యజ్ఞదత్తాత్

౬. కర్మప్రవచనీయరూపము.

వృక్షమను విద్యోతతే
ఉపార్జునం యోద్ధారః
అధి బ్రహ్మదత్తే పంచాలాః
అధి పంచాలేషు బ్రహ్మదత్తః

ఇప్పటికీ విభాగమున ప్రకృతి - ప్రత్యయము ఉపస్కారము - ఉపపదము అను నాలుగు శబ్దవిశేషములు నిరూపితము లయినవి. అవ్యయములు - నిపాతములు - గతులు - కర్మ ప్రవచనీయములు - ఉపసర్గములు నిరూపితము లయినవి. కేవలము ప్రకృతి కాని కేవలము ప్రత్యయము కాని ప్రయుక్తము కా రాదు. శబ్దార్థములు రెండింటి ననుసరించి యుపస్కార ముందురు. ఉపపదము ద్వయార్థమె ప్రయుక్త మగును.

—.o:—

# శృంగార ప్రకాశము

## ఏకాదశ ప్రకాశము

నిర్దోషము గుణసహితము సాలంకృత మయిన కావ్యశరీరమునకు కామినీ శరీరమునకు వలె సౌభాగ్యాతిశయ నిష్పత్తిలో రసావియోగమె ప్రకృష్ట మయిన యుపాయ మని కీర్తిత మగు చున్నది. వనితకు భూషణము లెన్ని యున్నను ప్రియు నందు ప్రేమార్ద్రి మగు మనసు లేకున్న నేమియు లేనట్లె.

ప్రేమార్ద్రిం ప్రణయిని మనో నాస్తి చేన్నాస్తి కించిత్ ఇందు రసమె ప్రమాణ మందురు. రత్యాది ప్రకర్ష కలుగగా - రతిప్రియుడు, రణప్రియుడు, అమర్షప్రియుడు పరిహాసప్రియు డని ప్రేమ యందే పర్యవసానమున్నది. అహేతుక మగు నభిమానమునకు ప్రతివిధాన మేమియు లేదు అది యొక స్నేహాత్మక మగు సూత్రము అంతర్మర్మముల నది కుట్టి వేయును. ఏవ డెవనికి ప్రియజనుడో యాత డాతని కమేయమగు ద్రవ్యము. ఆత డేమియు నాచరింపకయే సౌఖ్యసంధానములతో దుఃఖముల బోగొట్ట గల డని పరిణత ప్రజ్ఞులనిరి. ఈ యంశమె ప్రథమ ప్రకాశమున నిట్లు నిరూపిత మయినది.

అప్రాతికూలికతయా మనసో ముదాదేః
యత్సంవిదోऽనుభవహేతురిహాభిమానః
జ్ఞేయో రసః స రసనీయతయాత్మశక్తేః
రత్యాదిభూమని పునర్వితథా రసోక్తిః॥

మనసున కప్రతికూలములుగా హర్షాది సంవిద్విశేషముల ననుభవింప జేయు నభిమానమె రసము. ఆత్మశక్తి యచట రసనీయమగును. రస్యమానమె రసము కదా! రత్యాదులు పరిపోషము పొంది రసమగు ననుట వితథోక్తి.

రత్యాది ప్రకర్షములు ప్రేమ యందే పర్యవసించు నని ప్రేమయె రస మని యందుననె రతిప్రియుడు రణప్రియుడు అమర్షప్రియుడు పరిహాసప్రియుడని యిచటనె మొదట నిరూపిత మయినది. ఆ భావమునకు రత్యాది భూమని పునర్వితథా రసోక్తిః'' - యనుటకు విరోధము లేదా? యని శంకింపవచ్చును. కాని యిచట నీ యంశమును గ్రహింపవలెను. రత్యాదికము రసము కాదు. శృంగారమె రసము.

"శృంగారో హి నామ: విశిష్టేష్ట దృష్ట చేష్టాభివ్యంజకానాం ఆత్మగుణ సంపదాం ఉత్కర్షబీజం బుద్ధి సుఖ దుఃఖేచ్ఛా ద్వేష ప్రయత్న సంస్కారాద్యతిశయ హేతుః ఆత్మనః అహంకార గుణవిశేషః సచేతసా రస్యమానః రసః"

విశిష్టము లభీష్టములు సందృష్టములు నైన చేష్టల నభివ్యంజన మొనరించు ఆత్మగుణ సంపదలకు శృంగారము సముత్కర్ష బీజము. బుద్ధి సుఖము దుఃఖము ఇచ్ఛ ద్వేషము ప్రయత్నము సంస్కారము మొదలగు వాని యతిశయమున హేతువు. ఆత్మకు సంబంధించిన యహంకారాత్మక మగు గుణవిశేషము. సచేతసుల కందరకు రస్యమానము. ఇదియె శృంగారరసము. ఈ శృంగారరస మున్నచో రసికు డను వ్యవహారము కలుగును, లే కున్న నీ రస వ్యవహారము కలుగును. శృంగారప్రభవము లగు భావములు శృంగారావిర్భావ హేతువులు. శృంగారప్రభవమె భావము శృంగారము భావప్రభవము

కాదు. తత్ప్రభవము లయిన భావము లేకోన పంచాశత్సంఖ్యాకములు రసగా నున్నవి. వాని నిట్లు గుర్తింప వచ్చును.

రతి - హర్ష - రోమాంచ - ధృతి - గర్వ - హాస - మద -
ఉత్కంఠా-చింతా-స్మృతి-మతి - వితర్క-ఉత్సాహ - క్రోధ
అమర్ష-అసూయా-ఈర్ష్యా-ఉగ్రతా-జుగుప్సా-విస్మయ-నిద్రా
సుప్త-ప్రబోధ - చపలతా - ఆలస్య - భయ - శంకా-త్రాస
వేపథు - వ్రీడా - అవహిత్థ - స్తంభ-గ్లాని - స్వేద - వ్యాధి
ఉన్మాద - శ్రమ - శోక-విషాద - వైవర్ణ్య - దైన్య-స్వరభేద
ఆవేగ-అశ్రుమోక్ష-మోహ - ప్రలయ - జాడ్య-నిర్వేద-శమ

కొందరు 'రతిప్రభవః శృంగారః' అని యందురు. 'వయం తు మన్యామహే' రత్యాదులకు శృంగారమె ప్రభవమని మేము నిశ్చయింతుము. శృంగారి యగు వానికె రత్యాదులు కలుగును. అశృంగారి యగు వానికి కలుగవు. 'శృంగారిణో హి రమంతే స్మయంతే ఉత్సహంతే స్నిహ్యంతి' శృంగారులె రమింతురు గర్వింతురు ఉత్సహింతురు స్నేహింతురు. రతిహర్షాదు లవి భావ్యమానములు కావున భావములె కాని రసములు కావు. సంభవించు నంత వరకు భావనచే భావ్యమానము భావమె యన దగును. 'భావనాపథమతీతస్తు రసః' రసము భావనాపథాతీతము. దుఃఖాదులును మనోనుకూలము లగుచో సుఖానుభవాభిమాన ముండును! అప్పు డది రసమె. రసమె పరంపరగా సుఖహేతు వగును. కావున రత్యాద్యతిశయములందును 'రస' మను వ్యవహార ముపచరితము. 'అతో న రత్యాదీనాం రసత్వం. అపి తు భావనావిషయత్వాద్భావత్వమేవ కావున రత్యాదులకు రసత్వము లేదు. భావనావిషయము లగుటచే భావత్వమె యున్నది. రస్యమానము రసము భావ్యమానము భావము. భావములు రస్యమానములు కావు.

'పరప్రకర్ష గామీ రత్యాదిభావో రసః' 'పరప్రకర్ష సమధిక మయిన సముద్దీపనము పొందిన రత్యాదిభావము రసము' అని యనిరి. అది యసారము. రత్యాదులె పరప్రకర్ష కలవియగుట యేమి? గ్లాన్యాదులును పరప్రకర్ష కలవి కావచ్చును కదా! గ్లాన్యాదులుకూడ శ్రమాదులచే పరప్రకర్ష కలవి యగును. వానిని రసము లన లేదు. వీనిని రసము లని యన నేల? రత్యాదులె స్థాయిభావము లగునుగాని గ్లాన్యాదులు స్థాయిభావములు కా వని యందురా? తీవ్రసంస్కారి ముత్పన్న మగుచో వీనికిని స్థాయిత్వము కలుగ వచ్చును. సంస్కారి ముదయించుట యను నది విషయాతిశయమున గలుగును. నాయక ప్రకృతి వలనను గలుగును. నాయకప్రకృతి మూడు విధములు. సాత్త్వికము, రాజసము, తామసము నని. తత్సంబద్ధ విశేషము వలన నట్టి యనుభవమునకు దగిన భావన యుదయించును. అపుడు గ్లాన్యాదులకును స్థాయిత్వమును వ్యపదేశింప వచ్చును. కాని గ్లాన్యాదులకు స్థాయిత్వమును నిరూపింప లేదు. అవి రసములు కా వనిరి. రత్యాదులు రసవ్యవహార యోగ్యములు కా వని మే మందుము.

నను! ఎనిమిది స్థాయిభావములు. ఎనిమిది సాత్త్వికభావములు ముప్పదిమూడు వ్యభిచారిభావములు కల వని యనుచున్నారు. ఇది యుక్తముగ లేదు. ఏల నన? వీనిలో నన్యతమ మొకదానిచే నిర్వ ర్త్య మాన మగును. దీనిచే నది దానిచేనిది పరస్పరము నిర్వర్త్యమానము లగుట యున్నది. ఒకప్పు డొకటి స్థాయి యగును. అదియె మరియొక ప్పుడు వ్యభిచారియునగును. కావున నవస్థానుసారమున నన్నియు వ్యభిచారి భావము లగును. అన్నియు స్థాయిభావము లేని యగును. సత్త్వభావములు మనః ప్రభవములె కావున సాత్త్వికభావము లగునన్న 'అనుపహతం హి మనస్సత్త్వం' మన స్సనుపహత మగు నేని సత్త్వ మందురు కదా! అంతట అనుపహత మన స్సుండును. కావుతినర.

హర్షాదు లన్నియు సాత్త్వికము లగును. ఒకటి స్థాయి కాగానన్యములు వ్యభిచారిభావములు కావున నన్నియు వ్యభిచారిభావములె యగును. ఎనిమిదియె స్థాయిత్వము పొందుట కాక సర్వభావములు స్థాయిత్వము పొందును గాన నన్నియు స్థాయి భావములె యగును.

'విభావానుభావ వ్యభిచారి సంయోగాత్ స్థాయినో రసత్వం' విభావానుభావ వ్యభిచారి భావముల సంయోగము వలన స్థాయి భావమునకె రసత్వము సిద్ధించు నని యనిరి. అది యుక్తముగ లేదు. హర్షాది భావము లందును విభావానుభావవ్యభిచారి సంయోగ మున్నది. వానికిని రసత్వము కలుగ వలెను. అట్లు వా కొనుట లేదు. కావున నీ రత్యాదు లన్నియు భావములె. శృంగార మొక్కటియె రసము శృంగారమునకు విభావానుభావములచే ప్రకాశమానమగు శృంగారము సనిశేషముగా సమాస్వాద్యమాన మగును.

ఈ విషయమున కొందరీ విధముగ నందురు. శృంగారమను నీ రసము రత్యాదిభావములచే వ్యజ్యమానము కాదు. ఆలంబన విభావమువలన నుత్పన్న మయిన రత్యాదిభావమె యుద్దీపన విభావాదులచే పరప్రకర్ష పొందింప బడినదై రసీభావము పొంది శృంగారాది సంజ్ఞ పొందును.' అని, ఇది యుక్తముగ లేదు. ఇట్లను వారి నిట్లడుగ వలెను. ఈ రత్యాదులు తమ తమ యాలంబనముల వలన నుత్పన్నము లగు నంటిరి. అవి యందరకు నట్లుత్పన్నము లగునా? ఒకానొక విశిష్టవ్యక్తికే యట్లుత్పన్నము లగునా? అందరకు నవి యాహ్లాదయించుట సమ్మత మేని 'సర్వం జగద్రసికం స్యాత్' జగము సర్వము రసికము కా వలెను. కాని 'న చైతదస్తి' సర్వజగము రసిక మగుట లేదు. జగమున నొకడు రసికుడు కాగా వేరొకడు నీరసు డగు చున్నాడు, "న చ దృష్టవిపరీతం శక్యమనుజ్ఞాతుం' ప్రత్యక్షముగా గోచరించు దానికి విపరీతము నంగీకరించుట

యుక్తము కాదు. శక్యము కాదు. అందరకు రత్యాదు లుదయింపవు. ఎవని కేని రత్యాదు లుదయించునేని యందు నిమిత్తమును నిరూపింపవలెను ఆ నిమిత్తము దృష్టమొ యదృష్టమొ కావలెను కదా! ఇందు దృష్ట నిమిత్త మున్న దన రాదు. అట్టి దేదియు నుపలభ్యమానము కాదు కదా! అదృష్ట నిమిత్త ముండు నన్న నది సాధారణమొ యసాధారణమొ కావలెను, అదృష్టనిమిత్తము సాధారణాత్మక మయినచో పూర్వదోషమె వాటిల్లును. 'సర్వం జగద్రసికం స్యాదితి'. అసాధారణ నిమిత్తము ప్రత్యగాత్మగతము లయిన యనాదివాసనానుబంధి ధర్మ కార్యములు లేకున్నచో కలుగనే కలుగదు. 'తం త్వాత్మనోఽహంకారగుణ విశేషం బ్రూమః. అట్టి ప్రత్యగాత్మగతమునె ఆత్మయొక్క యహంకారగుణవిశేష మని మే మందుము. 'స శృంగారః స అభిమానః స రసః' అది శృంగారము. అది యభిమానము. అది రసము ఆ శృంగారము నుండియె యీ రత్యాదులుత్పన్నము లగుచున్నవి. అర్చిశ్చయములచే సప్తార్చివలె ప్రకర్షాతిశయము పొందిన యీ రత్యాదులచేని శృంగారము ప్రకాశమానమగును. శృంగారి జనులకె యదియాస్వాద్య మగును. ఆత్మాభిమానోపాధికముగా గలుగు ఈ రసము మూడు విధముల నుండుట విఖ్యాతము.

ప్రకృష్టరూపము - భావరూపము - ఆభాసరూపము.

౧. ప్రకృష్టశృంగారము, కథా శరీరవ్యాపిగా నుండు ఉత్తమ నాయకుని సంబంధించి యుండును. అట్టి విషయముననె యిది యుదయించును.

౨. భావరూపశృంగారము కథాశరీరమున నున్న మధ్యమ నాయకుని సంబంధించి యుండును సముచితప్రకర్షము పొంద చేరదు. అట్టిది భావరూపము.

3. ఆభాసరూప శృంగారము, తిర్యగ్జాతులకు సంబంధించి యుండు నది శృంగారాభాసము అట్లై ప్రతినాయకుల కుదయించు నదియు శృంగారాభాసము.

ఇట్టి యీ శృంగారయోగము ప్రబంధములందు రెండు విధములు నుండును. వాక్యవిషయము - ప్రబంధవిషయము.

౧. వాక్యవిషయశృంగారము.

'అశ్లీలామంగల ఘృణావదర్థం గ్రామ్యం' మొదలగు దోషములు పరిత్యాగమున సంపాద్యము 'దీప్తరసత్వం కాంతిః' మొదలగు గుణముల నుపాదానమున సంపాద్యము. కైశిక్యాదుల ఘటనమున వైదర్భ్యాదుల యోజనమున నానాలంకార యోగమున సంపన్న మగును. ఈ యంశము ప్రసంగానుసారమున యుక్త్యవలంబనమున నందం దుపవర్ణిత మయినది. అయినను రసానుయోగము గుణాలంకార సన్నివేశవిశేషమున నార్భవించు ననుట యుక్తము. రసప్రకర్ష నానాలంకారముల సంసృష్టిలో నవభాసించును. సామాన్యముగా కావ్యశరీరము లందు కేవలము గుణముల ఘటనము కాని, అనుప్రాస జాతి రూపకాది రూపము లయిన శబ్దార్థోభయాలంకారముల ఘటనము కాని రమ్యమనోహరముగా నుండుట గోచరము కాదు. కావున నానాలంకారసంసృష్టియె ప్రకృష్ట మగు భూషణ మని నిశ్చిత మగు చున్నది. లోకమున కామినీశరీరము లందును కేవల కటక కేయూర కుండలాదులు రమ్యమనోహరములుగా గోచరము లగుట లేదు. అచట గూడ నానాలంకార సంసృష్టియె ప్రకృష్ట మగు భూషణము. ఈ విషయమున లోకము నందలి కొన్ని విశేషములు భావింప దగును.

౨. భోజనము నందు మధురామ్లలవణ పాడబముల సంసృష్టియె విశేషముగ నాస్వాద్యమానమై రసాభియోగ హేతువగును.

౨. వేషము నందు వస్త్రానులేపన మాల్య విభూషణముల సంసృష్టి యాస్వాద్యమాన మగును.

౩. ధూపము నందు చందనాగరు కర్పూర సిద్ధకముల సంసృష్టి రమ్యము.

౪. సంగీతము నందు నృత్త వాద్య పాఠ్యముల సంసృష్టి మనోహరము.

౫. ప్రేమ యందు కోపానునయ ప్రసాద సంగమ సుఖాదుల సంసృష్టి గమ్యమాన మగును.

౬. గార్హస్థ్యము నందు ధర్మార్థ కామ మోక్షసాధనానుష్ఠానముల సంసృష్టియె రమ్యమగును అట్లె,

౭. కావ్యశరీరమునందును రూపకాదుల సంసృష్టియె విశేషతః స్వాదమానమై రసావియోగ హేతు వగును.

కావున నీ విషయము ప్రాచ్య ముపదిష్ట మయినను యత్నతః ప్రపంచిత మగును.

ఈ యలంకార సంతృష్టి రెండు విధములు. ప్రధానాంగభావమున ప్రథమము – సమకక్ష్యావిధానము ద్వితీయము. ఇది యిట్లు నిరూపితము.

అంగాంగిభావావస్థానం సర్వేషాం సమకక్ష్యతా
ఇత్యలంకార సంసృష్టేర్లక్షణీయా ద్వయీ గతిః॥

అలంకారసంసృష్టి రెండు విధముల లక్షణీయము. అలంకారము లంగాగిభావమున నవస్థానము కల వగుట యొకగతి సమకక్ష్యముగా నుండుట రెండవ గతి. ఇట్లలంకారముల సంసృషి కావ్యశరీరమున యోజనీయము. ప్రధానమున కుపకారముకగా నుండునది యంగ మగును. అంగముగా నుండు దానిచే నుపకృత మగునది ప్రధాన మగును. ఉదా;

ఆక్షిపంత్యరవిందాని ముగ్ధే తవ ముఖ శ్రియం
కోశ దండ సమగ్రాణాం కిమేషా మస్తి దుష్కరమ్॥

ఓసి! ముద్దరాలా! అరవిందములు నీ ముఖశోభ నాక్షేపము చేయు చున్నవి. కోశదండ సమగ్రము లయిన వీనికి దుష్కర మేమి కలదు? ఈ శ్లోకమునందు – 'అరవిందాని తవ ముఖశ్రియం ఆక్షిపంతి' అని యుపమ కలదు 'ఆక్షిపంతి' యనునది యుపమావాచక మగుట ప్రసిద్ధము. 'కోశదండసమగ్రాణాం కిమేషామస్తి దుష్కరం' అనుటలో శ్లేష యుపసర్జనముగా గల యర్థాంతరన్యాస మున్నది. అరవిందములు కోశదండ సమగ్రము లగుట యున్నది. అందుచే వాని కేమియు నశక్యము లేదు. కోశదండములు విజయసాధనము లగుట ప్రసిద్ధమె. కావున నిం దర్థాంతరన్యాసమున శ్లేషాలంకారము నకు నుపమాలంకారమున కంగభావము గోచర మగు చున్నది. శ్లేష సాధన భూతార్థ సమర్పకముగా నంగ మయినది. ఉపమాలంకారము ప్రకృతసాధ్య వస్తు విషయ విశేషకముగా నంగ మయినది.

నను! వాక్యదోషముల కదోషత్వము నిరూపించు ప్రస్తావమున శబ్దహీన మొక్కటికచో వివక్షానుసారమున గుణత్వము పొందుట వర్ణిత మయినది.

ఇదం హి శాస్త్రమాహాత్మ్య దర్శనాలసచేతసాం
అపభాషణవద్భాతి న చ సౌభాగ్య ముజ్ఝతి॥

ఇది శాస్త్రజ్ఞానాసక్తుల కపభాషణమ్ము వలె నుండును కాని సౌభాగ్యము విడనాడదు, 'ఆక్షిపంత్యరవిందాని' శ్లోకమున నపభాషణ మేమి కలదు? సౌభాగ్యము విడనాడు వివక్ష యిం దేమి యున్నది? ఉచ్యతే. 'కిమేషాం దుష్కరం' అను స్థలమున నిషిద్ధ మయిన షష్ఠి యున్నది. అది యపభాషణము. ఇందు సౌభాగ్యము విడనాడు వివక్ష యెట్టిది?

ఈ యంశమున కొందఱ రిట్లందురు. 'అనంతః ఖల్వేష శబ్ద సమామ్నాయః' ఈ శబ్ద సమామ్నాయ మనంతము. కొన్ని విశేష విధులు కొన్నిస్థలము లందు వర్తింపవు. ప్రకృతపద్యమున నొక విశేషవచనమున షష్ఠీ ప్రతిషేధము సంభవింపదు. అవిభాగమున మహాకవు లిట్లు ప్రయోగించు చున్నారు.

"అపి వాగధిపస్య దుర్వచం
వచనం తద్విదధీత విస్మయం"

'ఇక్ష్వాకూణాం దురాపేఽర్థే త్వదధీనా హి సిద్ధయః''

ఇచట షష్ఠి యుక్తమె కదా! అనినచో, ఇట్టి కవిప్రయోగో పన్యాసము విషమముగా నున్నది. ప్రకృతమున సంగతముగ లేదు. లక్షణమున ప్రయోగ స్మరణము కలుగును. పిమ్మట శిష్ట ప్రయోగమున లక్షణము ప్రసరింప జేయుదురు. లక్షణము లేని ప్రయోగము చూచి 'యిది శిష్ట ప్రయోగము' అనినచో నది మహా కవిప్రయోగమె యవు గావుత. అది శక్యమా? కావుననె భారవి కాళిదాసుల శ్లోకార్థములకు వ్యాఖ్యాతలు వేరు విధమున వ్యాఖ్యాన మొనరించిరి

ద్రౌపదీ యదవోచత్ దుర్వచం వచః
వాగధిపస్యాపి విస్మయం విదధీత"
"దురాపేఽర్థే ఇక్ష్వాకూణాం
త్వదాయత్తాః సిద్ధయః"

ఇట్టి యర్థమున – 'వాగధిపస్య. ఇక్ష్వాకూణాం అను నవి శేష షష్ఠి' కలవి కావచ్చును.

ఇచటి శేషషష్ఠి యెట్టిది? 'కిం కారకేభ్య, అన్యః? 'ఉత కార కాణాం అవివక్షా' ఇచటి శేషము కారకముల కన్న నితరమా? కారకముల వివక్షింపక బోవుటయా? కారకముల కన్న నితరమన్నచో

వది యుపపన్నము కాదు. 'న నాస్తి సర్వత్ర క్రియాకారక సంబంధస్య భావాత్'' అంటెట క్రియాకారక సంబంధముండును గావున కారకేతర శేషము లేదు 'రాజ్ఞః పురుషః' అనుచోట భరణక్రియా కృతి మయిన సంబంధము. 'పితుః పుత్రః, యను చోట జని క్రియా కృతమయిన సంబంధము 'వృక్షస్య శాఖా, యనుచోట స్థితి క్రియా జనిత మయిన సంబంధము కలదు.

అయినచో కారకావివక్షా రూప మయిన శేషమే యవు గావుత. అది యుక్తము కాదు. ఉన్నదాని కవివక్షి యుండదు. 'న చ సన్నిహితో ఘటః అవివక్షితః సన్ భవతి' ఎనుట నున్న ఘట మవివక్షితముగా నుండదు. పో నిండు. 'యథేచ్ఛసి తథాస్తు' ఎట్లిష్టమో యట్లే యవు గావుత. శేషము కారకముల కన్న నన్య మవు గావుత. సర్వత్ర కారకము లుండును గావున నంతకన్న నన్యముగా నొక 'శేష' ముండదనియంటిరి కదా! 'అస్త్యేవేతి బ్రూమః. కారకాతిరిక్తముగా నొక శేష మున్నదనియే యందుము. కారకాధికరణము లలో క్రియాకారక సంబంధము సంబంధాంతర ముత్పాదించు నపుడు కారకాన్యసంబంధ ముండును. 'రాజ్ఞః పురుషః 'యనుచోట భరణ క్రియా జనిత మయిన సంబంధమున స్వస్వామిభావ రూప మయిన సంబంధము – 'పితుః పుత్రః' అనుచోట జనిక్రియా కృత మయిన సంబంధమున జన్యజనకలక్షణ సంబంధము, వృక్షస్య శాఖా' యను చోట స్థితిక్రియా కృత మయిన సంబంధమున నవయవావయవిలక్షణ సంబంధము కారకాన్యముగా నున్నది. అందు షష్ఠి వచ్చును. ఇట్లే యప్రయుజ్యమాణక్రియాపదములుగా నుండు షష్ఠ్యర్థములు సమున్నేయములు.

ప్రయుజ్యమాణక్రియాపద ములుగా నుండు షష్ఠ్యర్థముల నిట్లు భావించునది 'న మాషాణాం అశ్నీయాత్. యనుచోట మాషసంబంధ మగు అశనప్రతిషేధము గోచరించును.

'న తే సుఖస్య జానంతి యే న వత్స్యంతి నందనే' నందనవనమున వసింపని వారు సుఖము తెలియ లేరు' భావము కల యిట్టి స్థలమున సుఖసంబంధ మయిన జ్ఞానప్రతిషేధ మవధారితమగును.

ఈ చర్చావిషయము ననుసరించి ప్రకృతమును పరిశీలింప వలెను. ఇందు ముఖశ్రీ నాక్షేపించుట దుష్కరము. అయినను సుకర మగుట నిరూపితము. శ్రూయమాణక్రియాపదము లగు షష్ఠ్యంతముల నిచట నభ్యూహింప వలెను. కోశదండములు సమగ్రముగా నుండుటచే నాక్షేపము సుకర మగును. ఈ యంశమును వాక్యార్థముగా బోధించుటకుగా 'అరవిందానాం' అను షష్ఠి సంబంధనిరూపకముగానున్నది. కాన నిచట శేషషష్ఠి విహితము కాదు. ఈ విషయ పరిశీలనమున నిది సూక్త మగును

సంబంధః కారకేభ్యోఽన్యః క్రియా కారక పూర్వకః
శ్రుతాయామశ్రుతాయాం వా క్రియాయాం సోఽభిధీయతే॥

కారకముల కన్న నితర మగు కార్యకారణభావాదిక మయిన సంబంధము క్రియ శ్రూయమాణముగా నున్నను లేక పోయిన నుపపన్న మగును. అచట శేషషష్ఠి సంగత మగును. కొన్ని స్థలములందు నొక క్రియ సంబంధ ముదయింప జేసి వినివృత్త మగును. కొన్ని స్థలము లందు క్రియాశబ్దము శ్రూయమాణ మగునేని సంబంధ ముదయించును. అట్టి స్థలములందు శేషషష్ఠి కలుగును. కావున కారకముల కన్న నన్యముగా శేషషష్ఠి కలుగునన్న దర్శనము ననుసరించి భావింపగా 'కిమేషామస్తి దుష్కరం' అను స్థలమున షష్ఠి యనుపపన్నము కాదు. ఉపపన్నమె యగు నని నిశ్చయింప వచ్చును.

అథవా, పునరస్తు 'కారకాణాం అవివక్షా శేషః' పై షష్ఠీ విభక్తి సమర్థనమునకై దర్శనాంతరము నిరూపిత మగును. కారకముకు యవివక్షయె యిచట శేషము అగును. ఇచట 'ఏషాం అను

షష్ఠి శేషషష్ఠి. ఇచట కారకముల వివక్ష లేనందువలనిది సంగతమయి నది. ఉన్నదాని కవివక్ష యుండవచ్చు ననియంటిమి. ఉన్నదాని కవివక్ష 'సతోఽప్యవివక్షా' ప్రయోగములందు గోచరించుచున్నది

అనుదరా కన్యా - అలోమకా ఏడకా ఈ కన్య యనుదర. ఈ గొఱ్ఱెపిల్ల యలోమిక. ఇచట ఉదర మున్నను వివక్షితము కా నందున ననుదరా వ్యవహారము, లోమము లున్నను వివక్షితములు కానందున నలోమకావ్యవహారము కలిగినది. ఇట్లు 'సతోఽప్య వివక్షా' కాక 'అసతోఽపి వివక్షా' కలదు "సముద్రః కుండికా' అను నది యుదాహరణము. సముద్రమున కుండికాత్వ ముండదు. అయినను వివక్షితము. అట్లె 'కిమేషామస్తి దుష్కరం' అను ప్రకృతమున. ఉన్నను కర్తకు వివక్ష లేనందున శేషషష్ఠి వచ్చినది.

కాగా, ఉపమాశ్లేషార్థాంతరన్యాసముల కుపకార్యోపకారి భావమున ప్రధానగుణభావమున సంసృష్టి యున్నది. అలంకార ముల సంసృష్టి ప్రధాన గుణభావమున నుండుట యిట్లు వివేచిత మయినది. దీనికే యంగాంగి భావావస్థాన మని పేరు.

## సమకక్ష్యత

ప్రధానగుణభావమున సంసృష్టి యుండుట యుక్తముగా నున్నది అలంకారములు సమకక్ష్యతతో నుండుట యుక్తముగ లేదు. వాక్యమున పదార్థములకు సమకక్ష్యత యుండుట యెట్లు? ప్రధా నము లగు వానికి సమకక్ష్యత కలుగునా? అప్రధానములగు వానికి సమకక్ష్యత కలుగునా? ప్రధానములుగానుండు వానికి సమకక్ష్యతతో నునికియుపపన్నము కాదు. ప్రధానముగానుండునవి పరస్పర మనపేక్ష ములు. వానిలో వానికేమియు సంబంధము లేదు. ఏమాత్రము సంబం ధములేనివి సమప్రధానతతో నుండుట యుండదు. ఇట్లె యప్రధాన

ములకును సమప్రధానత్వమున స్థితి యుపపన్నముకాదు. అప్రధానము లగునవి ప్రధానసాపేక్షములై యుండును. అప్రధానము లన్నియు ప్రధానముతో నన్వయించునవి యగును. అపు డప్రధానముల కేమియు పరస్పరాపేక్షయుండదు. అదియు నప్రధానము. ఇదియు నప్రధానము అప్రధానత్వ మంతట సమము కావున వీని కే మాత్రము సంబంధము లేదు. ఇట్టివి సమకక్ష్యతతో నుండుట యేమి? ఈ యంశమునే మీమాంసాసూత్ర మిట్లు చెప్పినది. 'అసంబంధః సమత్వాత్ స్యాత్, అప్రధానములుగా నుండు వానిలో నప్రధానత్వ మవిశేషముగా నన్నిట సమముగా నుండును. కావున నప్రధానము లగు వానికి పరస్పరము సంబంధ ముండదు. కావున అలంకారములకు తుల్యకక్ష్యత యెట్లు కుదురును?

ఈ యంశమున నిట్లు మననము చేయవలయును. ఉత్ప్రేక్ష-ఉపమ మొదలయిన యలంకారములు విభావానుభావవ్యభిచారిభావముల నిర్వర్ణనమున సంగతములై యుండును గావున రసాదుల కంగము లగును. రసాద్యర్థము ప్రధానము కాగా నంగములుగా నుండు నలంకారములు తుల్యకక్ష్యతతో నుండుట యుక్తమె. ఈ యుదాహరణమున నిది వ్యక్తము కా గలదు.

"లింపతీవ తమోఽంగాని వర్షతీవాంజనం నభః
అసత్పురుషసేవేవ దృష్టిర్విఫలతాం గతా"

తమ స్సంగములను పూత పూయుచున్న ట్లున్నది. ఆకాశ మంజనము వర్షించుచున్నట్టు లున్నది. అసత్పురుష సేవ వలె దృష్టి విఫలత్వము పొందినది. దీనిలో 'లింపతీవ తమోఽంగాని.' వర్షతీవాంజనం నభః; అను స్థలములందు రెండుత్ప్రేక్షలు కలవు. 'అసత్పురుషసేవేవ దృష్టిర్విఫలతాం గతా' యను నుత్తరార్థమున నుపమాలంకారము కలదు. ఉద్దీపనవిభావరూప మయిన తమస్సు వర్ణ

నీయము. ఆ తమస్సునకే యలంకారములు సమముగా సాపేక్షత్వా పాదకము లయినవి. తమోవర్ణనాంశమున సంగము లయినవి. అంగభావము పొందిన యలంకారములు సమకక్ష్యతతో సాంకట యిం దున్నది కావున లక్షణానుపపత్తి లేదు.

వను! సాదృశ్యసూచకము లయిన శబ్దము లనేకము లు కలవు. వానిలో 'ఇవ' శబ్దము కూడ కలదు. ఈ శ్లోకపూర్వార్థమున గూడ రెం డుపమాలంకారములుకల వని యన వచ్చు గదా! ఉత్ప్రేక్ష లని యన నేల?

## సాదృశ్యసూచక శబ్దములు.

ఇవ-వత్ - వా - యథా - సమాన - నిభ - సన్నిభ-తుల్య-సంకాశ - నీకాశ - ప్రకాశ - ప్రతిరూప-ప్రతిపక్ష - ప్రతిద్వంద్వి - ప్రత్యనీక విరోధి - సదృక్ - సదృశ - సంవాది - సజాతీయ -అనువాది - ప్రతిబింబ - ప్రతిచ్ఛంద - సరూప-సమ - సప్రభ - సలక్షణ సదృక్ష - ఆభ - సపక్ష - ఉపమితి - ఉపమా - సలోహిత - సనాభి - సపిండ - సబ్రహ్మచారి - సవర్ణ - తులిత - ప్రఖ్య - ప్రతినిధి - కల్ప - దేశీయ - దేశ్య - మొదలగునవి. ౪౩

స్పర్థతే - జయతి - ద్వేష్టి - ద్రుహ్యతి - ప్రతిగర్జతి - ఆక్రోశతి - అవజానాతి - కదర్థయతి - నిందతి - విడంబయతి-సంరుంధే-హసతి - ఈర్ష్యతి - అసూయతి. ౧౪

౧ తస్య ముష్ణాతి సౌభాగ్యం
౨ తస్య కాంతిం విలుంపతి
౩ తేన సార్ధం విగృహ్ణాతి
౪ తులాం తేనాధిరోహతి
౫ తత్పదవ్యాం పదం ధత్తే
౬ తస్య కక్ష్యాం విగాహతే

౭ తమన్వేతి
౮ అనుబధ్నాతి తచ్ఛీలం
౯ తన్నిషేధతి
౧౦ తస్య చానుకరోతి

ఈ పట్టికలో నిచట నలుబది మూడు నామవాచకములు. పదునాలుగు క్రియావాచకములు, పదివాక్య ప్రయోగములు సాదృశ్య సూచకములుగా నిరూపితము లయినవి ఇట్లె న్యూనార్థ వాచక ములు శశాంకవదనాది బహువ్రీహిసమాసము సాదృశ్యసూచకములె యగును. 'ఇవ' శబ్దము సాదృశ్యసూచక మయి నందున పూర్వార్థ మున రెండుపమ లున్న వని యనవలెను గదా! వాక్యాంతరమున ప్రయుక్తము లయిన యుపమానోపమేయములకు సాదృశ్యమును భాసింప జేయుటలో 'ఇవ' శబ్దము నిరూఢశక్తికము కావున నిచటి గూడ నది తదర్థమె కావలెను గదా! సంభావనావాచక మని యంగీక రించి యుత్ప్రేక్ష లున్నవన నేల?

ఇట్లాశంకింప నక్కర లేదు. ఉపమాన శబ్దముచే నుపమేయ శబ్దముచే ప్రతిపన్న మయిన సాదృశ్యమును 'ఇవ' శబ్ద మవభాసింప జేయును. 'లింపతీవ తమోంగాని' శ్లోకమున తమస్సునకు నభస్సు నకు రెండవది యగు నుపమానము కాని యుపమేయము కాని లేదు. ఉన్నచో వాని సాదృశ్యావద్యోతనమునకు 'ఇవ' యుప యోగించెడిది. కాన ఉపమ కాదు. ఉత్ప్రేక్షయె యగును.

అట్లగునచో నిట్లాశంకింతుము. ఇందు 'ఇవ' శ్రుతియున్నది. తత్సామర్థ్యమున తమస్సునకు నభస్సునకు రెండవ యుపమానద్వ యము కల్పింప వచ్చును గదా! 'ప్రవిశ - పిండీం' అను స్థలమున ప్రవేశన క్రియ స్వయోగ్య మగు కర్మను నిరూపించును. పిండీ కర్మయు స్వయోగ్య క్రియ నవసాపింప జేయును. ప్రవిశ గృహం'

'పిండీం'భక్షయ' అని స్వరూపము సిద్ధమగును. అట్లే యిచట కూడ 'ఇవ' పదము ఉపమేయములుగా నున్న తమోనభస్సులకు తగిన యుపమేయముల నుపస్థాపింప చేయ వచ్చును. వానితో నుపమాలంకారమునే నిశ్చయింప వచ్చును కదా! ఉత్ప్రేక్ష యన నేల?

ఈ వాదము తగదు 'న హి తిఙన్తేనోపమానమస్తి' తిఙన్తముతో నుపమానము లేదు. ఇందుపపత్తి యేమి? ఉచ్యతే, ఉపమేయ మున్నప్పుడు ఉపమాన మున్నపుడు వానికి తుల్యధర్మము నున్నపుడు ఉపమానోపమేయభావ ముండును. అవి లేనప్పు డది యుండదు. ఇచట తమోనభస్సులకు సంబంధించియుండు ఉపమానము కాని ఉపమేయము కాని లేదు. ఉన్నచో నుపమానోపమేయభావము కల్పింప వచ్చును.

నను! 'ప్రవిశ పిండీ' న్యాయమున నిచట గూడ 'ఇవ' శ్రుతియె తమస్సునకు నభస్సునకును యోగ్యమగు నుపమానమును నిరూపింపవచ్చునుగదా! అప్పు డుపమయే కావచ్చునే! 'విషమ ఉపన్యాసః', అది యిది సమము కాదు. 'ప్రవిశ' స్థలమున ప్రవేశన క్రియ స్వసిద్ధికై కర్మకారకమున సర్వము నాక్షిప్తము చేయును. అచట ప్రసిద్ధి వలన ప్రత్యాసన్న మయిన గృహమె గమ్యమగును. అట్లిచట 'ఇవ' పదమున కేమియు సామర్థ్యము లేదు. ఉన్నచో స్వార్థసిద్ధికై తమస్సునకుగాని నభస్సునకుగాని ప్రసిద్ధమగు నుపమానమును సముపస్థాపనము చేసెడిది. ఉపమానోపమేయభావము లేకున్నను ఇచట ప్రతియోగము కిన్పడుచునె యున్నది. ఎట్లని ఇచట 'లింపతి తమస్సులకు, 'వర్షతి నభస్సులకు నుపమానోపమేయభావము కలుగు గావుత. కాని యుపమానోపమేయములకు సమానధర్మమేమియు గోచరింపదు. ఉన్నచో నది యుపమానోపమేయభావమునకు సమర్థమయ్యెడిది.

నను! 'రాహోః శిరః' అనుస్థలమున రాహువునకు శిరమునకు భేదము లేక పోయినను అవయవావయవిభావ మున్నది. తన్నిబంధనముగా వ్యతిరేకషష్ఠియు నున్నది, అట్లే ప్రకృతమునను గూడ 'లింపతి'కి లేపనము, 'వర్షతి'కి వర్షణము ధర్మము కావచ్చును. ఇక ధర్మిను లేవనుట యేల? అట్లు కాదు. ఇచట నొక విశేషము కలదు. ఇందు రెండంశము లున్నవి లింప ధాతువు. (లింపతి) వర్ష ధాతువు, (వర్షతి) ధాత్వర్థము లేపనము వర్షణము ఉపమేయము లయిన తమోనభస్సులకు 'లింపతి వర్షతి' ధాతు ప్రధానమగు నేని యుపమేయము నుపమానముతో సాదృశ్యమేమి యున్నది? లోకపదార్థములు సారూప్యము వహింప నట్లు అసారూప్యమును వహింపవు. సారూప్యము వహించునేని 'అస్తిత్వ- అభిధేయత్వ - జ్ఞేయత్వా'దులతో 'నంతట నుపమానోపమేయ భావము ప్రవర్తింపవలెను. కావున 'తమస్సునకు లింపతి కాని 'నభస్సునకు వర్షతి కాని యుపమానము కాదు. అది యుపమానమే యగునేని లింపతీవ తమః, వర్షతీవ నభః అనెడి వాక్యార్థము నొనరించును. కాని – "లింపతీవ" – వర్షతీవ – అనుభావము భాసింపదు. లేపనము – వర్షణమె మిగులును. అది తుల్య ధర్మ మగునా? ఉపమానధర్మ మగునా? అది తుల్యధర్మమయినచో నుపమానధర్మి నన్వేషింప వలెను. అది యుపమాన ధర్మియయినచో తుల్యధర్మము మార్గణీయ మగును. ఉపమానోపమేయ భావము భేద సాదృశ్యప్రతిపత్తినిబంధన మగుట నందున భేదము లేకపోయినచో నుపమానోపమేయభావ ముండదు. భేదము లేకపోయినను "రాహోః శిరః" ఇత్యాదుల యందవయవావయవి భావ ముండ వచ్చును. ఉపమానోపమేయభావ ముండదు. ఇదియు నుండు నన్న నది యున్మత్త వచన మగును. "యస్తం మన్యేత స కథం నోన్మత్తః స్యాత్" అట్లు తలచిన నాత డున్మత్తు డేల కాడు?

'స ఏవ ధర్మో ధర్మీ చేత్యనవస్థైవ న భాసతే' అనగా ధర్మము అదియె ధర్మి అని యనవస్థత్వము బాధింపదు.

'అస్తు తర్హి తిఙ్ వాచ్యః కర్తా ఉపమానం' అయినచో 'తిఙ్' వాచ్య కర్త ఉపమానము గావుత. 'లింపతి' పదము లోని 'తిఙ్' ప్రత్యయముచే నిరూపింపబడు కర్త 'లేపనకర్త' ఇవార్థసాదృశ్యము నన్వయించగా 'లేపనకర్తృనిరూపిత సాదృశ్యాశ్రయం తమః' అని బోధ కలుగును. ఇట్టి బోధలో లేపనకర్తృ ఉపమానముగా నన్వయించును ఇట్లిచట శంకింపవచ్చును. కాని యుక్తము కాదు. లేపనకర్త క్రియాపదమునను యన్వయించును. అచట నది న్యగ్భూతము. ఇవార్థసాదృశ్యమున నన్వయింపదు. క్రియాపదమున నది యెట్లు న్యగ్భూత మయినది? 'క్రియాకాలౌ' వినుము ఆరర్థములు తిఙంతమున గోచరించును. క్రియ-కాలము-ఉపగ్రహము-సాధనము-సంఖ్య-పురుష. వానిలో క్రియాకాలాత్మనేపదనిమిత్తములను ప్రకృతి బోధించును. ప్రత్యయము సాధనమును సంఖ్యను పురుషమును బోధించును. ఇవి యన్నియు క్రియాప్రధానములు క్రియ-ఉపగ్రహము క్రియాప్రధానముగా క్రియావిశేషణములై న్యగ్భూతము లగును. స్వక్రియాసాధనవ్యాగముగా నుండు కర్త ఉపమానముగా గాని ఉపమేయముగా గాని యితరాన్వయము పొందదు. 'నాలమన్యద్వ్యపేక్షితుం' అయినచో నిట్లనవచ్చును. 'అంగలేపన మొనరించువాడు - అంజనవర్షణ మొనరించువాడు' అను నర్థము కలుగగా 'తమస్సు నభస్సును క్రియోపలక్షితకర్తతో తుల్యము' అను నుపమార్థము లభించును గదా! ఇదియు యుక్తము కాదు.

'న హి ప్రతీతిః సుభగా శబ్దన్యాయవిలంఘినీ' 'శబ్దన్యాయము నతిక్రమించు ప్రతీతి సుందరము కాదు' అనున్యాయమున నిచటి శబ్దన్యాయ బలమునని క్రియోపలక్షిత కర్త యుపమానముగా ప్రతీతము

కా గలదు. అధ్యాహారాదులచే నిట్టి ప్రతీతి కలుగ వచ్చును. తుల్య ధర్మసహితముగనె ప్రతీతి యుండును గాన నిచట తుల్యధర్మము నన్వేషింపవలసి యున్నది చంద్రముఖాదిస్థలము లందు వలె నిరూపితము కాని సమానగుణ మవభాసించు ననుట యిచట కుదురదు. 'ఇందురివ తే వక్త్రం' అనుచో కాంతి తుల్యధర్మముగా గోచరించును. 'లింపతి వర్షతి' అనుచో నేమియు తుల్యధర్మము గోచరింపదు కావున తమః కర్తృకము - అంగకర్మకము అయిన తమోవ్యాప్తి వ్యోమకర్తృకము - అంజనకర్మకము అయిన వర్షణము ఉత్ప్రేక్షిత మగు నని భావింప వలెను. 'మన్యే - శంకే - ధ్రువం - ప్రాయః - నూనం' మొదలగు పదము లుత్ప్రేక్షా వాచకములు. "ఇవ శబ్దోపి తాదృశః" ఇవ శబ్దము కూడ ఉత్ప్రేక్షావాచకము ఇట్లే యంగీకార్యము.

ఈ విపులచర్చాఫలముగా నీ యర్థము పర్యసన్న మగును. ఇచట - రెం డుత్ప్రేక్షలు కలవు. ఉపమయు నున్నది. అన్నియు తమో వర్ణన పరములు. ఇవి తుల్య కక్ష్యగా నున్నవి. వీని కిచట సంసృష్టి యున్నది. ఈ సంసృష్టి నానాలంకార సంకర రూపము. 'సంసృష్టి అలంకార సంకరము' అని చెప్ప దగి యున్నను నానాలంకారసంసృష్టి యనుటచే గుణరసాదులు కూడ అలంకార ప్రతిపత్తితో నుండుట గ్రాహ్యము. అవియు కావ్యశోభాకరము లగుటచే నలంకారములె కా గలవు.

కావ్యశోభాకరాన్ధర్మానలంకారాన్ప్రచక్షతే
తే చాద్యాపి వికల్ప్యంతే కస్తాన్ కార్త్స్న్యేన వక్ష్యతి.

కావ్యశోభాకరముల నలంకారము లందురు. అవి యిప్పటికి నిరూపితములె కాగలవు. వాని నెవడు సమగ్రముగా జెప్పును. అని పెద్ద లనిరి, ఇంక ననిరి.

కాశ్చిన్మార్గవిభాగార్థముక్తాః ప్రాగప్యలం క్రియాః
సాధారణమలంకారజాతమన్యత్ప్రపంచ్యతే॥

మార్గవిభాగముకొరకై కొన్ని యలంకారములు సూచితములు. సాధారణాలంకారములను నిరూపింతును. అవి కావ్యశోభాకరములనుటచే శ్లేషోపమాదులవలె గుణ - రస - భావ - తదాభాస - తత్ప్రశమనములు కూడ నిందు గ్రహింపవలెను. అవియు కావ్యశోభాకరములు.

గుణముల కలంకారత్వము చెప్పుటచే శ్లేషాదులు గుణములయినట్లు అలంకారములు నగు నన్న ట్లయినవి శ్లేష-ప్రసాద-సమతా-మాధుర్య-సుకుమారతా-అర్థవ్యక్తి-ఉదారత్వ-ఓజః-కాంతి-సమాధు లను దశగుణములు వైదర్భమార్గమునకు దశప్రాణము లని నామనుడు అనెను. శ్లేషాదులు పదిమాత్రమె మార్గప్రవిభాగకారులనుటచే గుణాంతరములును కావ్యశోభాకరము లగుటచే నలంకారము లగు ననుట సూచితమగు చున్నది. ఇట్లనుట యుక్తమే యగును కాని రసాదుల కలంకారత యుండు ననుట యయుక్తము. రసాదులకు గుణములకు వలె నలంకార వ్యపదేశము లేదుకదా! కాదు అయుక్తము కాదు. రసాదుల కలంకారత యుండు ననుటయు యుక్తమె. ఊర్జస్విరసవత్ప్రేయస్సులు సముచిత యుక్త్యుత్కర్ష యుక్తము లయినచో నలంకారము లగుట యుపదిష్టమేయయినది.

ప్రేయః ప్రియతరాఖ్యానం రసవద్రస పేశలం
ఊర్జస్వి రూఢాలంకారం యుక్తోత్కర్షం చ తత్త్రియం॥

ప్రియతరాఖ్యాన ముండుట ప్రేయస్సు. రసపేశలముగా నున్న రసవత్. రూఢాలంకారముగా నుండ ఊర్జస్వి. ఈ మూడును యుక్తోత్కర్షములతో నుండుట వివక్షితము. ఇందు - ఊర్జస్వి రూఢాలంకారం" అనుటచే ని భావము సిద్ధమగును. ఆత్మయందు

విశిష్టముగా నిశ్చితమై యుండు నది ఉత్కృష్ట మయిన యదృష్టము వలన గలుగునది. అనేకజన్మానుభవ సంస్కారముచే సమాసాదిత మయిన ప్రథిమ గలది. సమగ్రాత్మగుణ సంపత్తి సముదయాతిశయమునకు హేతు వగు నది అను అలంకారవిశేషమును సంగ్రహించి నట్లయినది. అలంకారాభిమానమున శృంగారాదినామభాజన మగు రసము మానమయ మగు వికారరూపముగా నభిమానము కలవారి మనసు లందు ప్రసరించును. అట్టి రసమున కిచట పూర్వకోటి యుపవర్ణితమయినది.

సత్త్వాత్మనామమలధర్మవిశేషజన్మా
జన్మాంతరానుభవ నిర్మిత వాసనోత్థః
సర్వాత్మసంపదుదయాతిశయైక హేతుః
జాగర్తి కోపి హృది మానమయో వికారః

సత్త్వప్రకృతి కల వారల కమలధర్మ విశేషమున గలుగునదియు జన్మాంతరానుభవ సిద్ధములయిన సంస్కారములచే నుదయించునదియు సర్వవిధాత్మసంపదల యుదయాతిశయమున కేక హేతువు నగునట్టి యొకానొక మానమయవికారము హృదయమున నిత్యసిద్ధమై యుండును. అభిమాన సమేతులయిన వారి హృదయమున నుండు మొదటి మానమయ వికార విశేషమె ప్రకృతమున ఊర్జస్వి నిరూపణములో నిరూపితమయినది.

అహో అహో! నమోమహ్యం యదహం వీక్షితోఽనయా
ముగ్ధయా త్రస్తసారంగ తరలాయత నేత్రయా॥

ఆ భీతహరిణీనేత్ర ఆ ముగ్ధ నన్ను చూచినది అహో! హో! నేను ధన్యుడను, నాకు నేను నమస్కార మొనరించుకొందును,

ఇతఁడే కమనీయ కన్యలు లోలాపాంగలై చూచినప్పుడు తరుణహృదయమున గలుగు మానసమునకు స్ఫూర్తియు భావనీయము.

రసప్రదీపకారు లనుటచే శృంగారరసము యొక్క మధ్యమావస్థ సూచితమగును "విభావానుభావ వ్యభిచారి సంయోగాత్ రసనిష్పత్తిః" అని యున్న విధమున రత్యాదిరూపముగా ననేకవిధముల నావిర్భవించుచు నభివర్ధమానమగు ప్రకర్షను పొందు శృంగారము యొక్క మధ్యమావస్థావస్థాపన మవభాసించును. ఈ యంశ మిట్లు పూర్వము నిరూపితమయినది.

రత్యాద యోఽప్యనియత ప్రేక విపత్తితాహి
భావాః పృథగ్విధభావ భువో భవంతి
శృంగారత స్తమిహ తే పరివారయంతః
సప్తార్చిషం ద్యుతిచయా ఇవ వర్ధయంతి॥

రత్యాదిభావము లన్నియు నొకటి తక్కువగా నర్ధశతమున్నది. అవి యన్నియు శృంగారమువలననే జనించును. వేరుగా వివిధభావ భవములునై శృంగారమును పరివేష్టించి యుండును. కాంతు లగ్నిని వృద్ధిపొందించినట్లు శృంగారము నవి వృద్ధి పొందించును.

ఈ యుదాహరణమున నీ మధ్యమావస్థ యవభాసించును.

అత్రాంతరే కిమపి వాగ్విభవాతి వృత్త
వైచిత్ర్య ముల్లసిత విభ్రమ మాయతాక్ష్యాః
తద్భూరి సాత్త్విక వికార మపాస్త ధైర్య
మాచార్యకం విజయి మాన్మథమా విరాసీత్॥

ఇంతలో నా యాయతాక్షికొక మాన్మథవిశేష మావిర్భవించినది. అది సర్వవిజయి. ఉపదేశకము. వాగ్విభవాతిశాయి విచిత్రత కలిగి విభ్రమ సముల్లాస ముదయింపజేసి సాత్త్వికవికృతి

నుల్లసింపజేసి ధైర్యమును త్రోసిపుచ్చి యామాన్మథమానమయ వికారమావిర్భవించినది.

'ప్రేయః ప్రియతరాఖ్యానం' అనుటచే నహంకారము యొక్క యుత్తమకోటి సూచిత మగుచున్నది. రతి సంప్రభావపూర్వాభిషిక్తము. అది యిందు పరప్రకర్ష పొందును. భావనాపథ మతిక్రమింపగా భావరూపతను విడనాడి ప్రేమరూపముగా పరిణమించును. అట్టిదియె యిందుపాత్తము కావున భావాంతరములుకూడ పరప్రకర్ష పొందినచో రసరూపమున పరిణతి కలుగు ననుట నిందు సూచిత మగును. భావనాపథాతీత మగుట యిచట యుత్తమకోటి. ఈయంశమే యిట్లుపపాదిత మయినది.

> అభావనోదయ మనన్యధియా జనేన
> యో భావ్యతేఽనన్యధియా సభావః
> యో భావనాపథ మతీత్య వివర్తమానః
> సాహంకృతౌ హృదిపరం స్వదతేరసోఽసౌ॥

భావుకుడు భావనముదయించినది మొదలుగా ననన్యచిత్తమున దేనిని భావించునో యది భావము. భావనాపథ మతిక్రమించి స్వాహంకారాత్మకమయిన హృదయమున నేది యాస్వాద్యమాన మగునో యది రస మగును.

ఈ యుదాహరణమున నీ పరాకోటి యున్నది.

> అద్వైతం సుఖదుఃఖయో రనుగతం సర్వాస్వవస్థాసు
> యద్విశ్రామో హృదయస్య యత్ర జరసా యస్మిన్నహార్యో రసః
> కాలేనావరణాత్యయా త్పరిణతే యత్స్నేహసారే స్థితం
> భద్రంతస్య సుమానుషస్య కథ మప్యేకం హి తత్ప్రాప్యతే॥

సుఖదుఃఖములం దద్వైతము సర్వావస్థలలో ననుగతము హృదయమునకు విశ్రాంతి, వార్ధకమునకూడ నహార్యరసము, ఆవ

రణ మాత్సర్యము కాలపరిణతిమయిన ప్రేమసారమున నుండు భద్రంకరమగు ప్రేమ యొక్కటియె దాంపత్యమున కెట్లో ప్రార్థనీయముగా నుండును.

ప్రేయస్సు - రసవత్ - ఊర్జస్వి అను మూడును యుక్త్యుత్కర్షములు. కావునవె యలంకారములు. ఇవి యయుక్త్యుత్కర్షము లగునేని యలంకారములు కాజాలవు. ఊర్జస్వి - రసవత్ ప్రేయస్సు లనుత్కర్ష యుక్తముగా కలుగదేని గుణత్వమె కలుగును గాని యలంకారత్వము కలుగదని సూచితెము. ఔర్జిత్యము - భావికత్వము. ప్రేయః పదములచే నీ మూడను గుణములుం దుపదిష్టము లయినవి.

'కుతః పునరేతత్' - ఇది యెట్లు కుదురును? ఊర్జస్వి-రసవత్-ప్రేయస్సులు ఒకప్పు డలంకారము లగుట మరియొకప్పుడు గుణము లగుట కుదురునా? కుదురును. ఇట్లు కుదురుచు. 'ఉచ్యతే'.

భూమనిందా ప్రశంసాసు నిత్యయోగే౽తిశాయనే
సంసర్గే౽స్తి వివక్షాయాం భవంతి మతుబాదయః॥

మతుబాది ప్రత్యయములు, భూమ - నిందా - ప్రశంసా - నిత్యాయోగ - అతిశాయన - సంసర్గరూపార్థములం దస్తివివక్షలో ప్రసరించును. ఇందు క్రమముగా నివి యుదాహరణములు.

౧. భూమ - గోమాన్ దేశః' గోవు లధికముగా నున్న దేశము,

౨. నింద - వాచాలో వటుః - ఈ వటువు వదరుబోతు వాచాలు డనుట నింద.

౩. ప్రశంస-వాగ్మీ విపశ్చిత్ పండితుడు ప్రశంశనీయ వాగ్విశేషము కలవాడు.

౪. నిత్యాయోగ - క్షీరిణో వృక్షాః - ఈ వృక్షములు నిత్యము పాలతో నున్నవి.

౫. అతిశయ – బలవాన్ మల్లః. ఈ మల్లు డధికముగా నతిశయిత బలము కలవాడు.

౬. సంసర్గ – దండిమతీ శాలా. ఆ శాలలో దండముకల యతుల సంసర్గము కలదు.

ప్రకృతమున 'ఊర్జస్వి – రసవత్' అను స్థలములందు అలంకారత్వ వివక్షలో అతిశయ – భూమార్థములందు మతుబర్థీయ ప్రత్యయము వచ్చినది. వానికే గుణత్వ వివక్ష యున్నప్పుడు ప్రశంసా – నిత్యార్థములందు మతుబర్థీయ ప్రత్యయము కలిగినదని గుర్తింపవలెను. 'నిత్యోహి కావ్యే గుణ యోగ ఇవ రసాదియోగః' కావ్యమునందు గుణయోగము వలె రసాదియోగమును నిత్యము. గుణవత్ – రసవత్ అనునది నిశ్చితముగా ప్రశంసాస్పదము. గుణముల యవశ్యోపాదానమున సంసర్గము గుర్తించునది. నింద యనునది దోషముల పరిత్యాగమున బాధిత మగును గావున నిట నవతరింపదు, 'ప్రేయః' అనునది యాతిశయికమయిన భావము సూచించును. 'ప్రేయః ప్రియతరాఖ్యానం' అనుటచే నిది సూచితమయినది.

అలంకారములలో గాని గుణములలో గాని 'ప్రేయః' అనియే యున్నది. అందు రూపభేదము లేదు. కాగా ప్రేయ మలంకారమయినచో నుత్కర్షప్రతీతి యెట్లు కలుగును. అతిశయనికాంతరమునను నా యుత్కర్ష కలుగును: 'యుక్తోత్కర్షం చ తత్త్రియం' అను వాక్యాంతరమున నది సిద్ధము కాగలదు. అతిభూమార్థమునగలుగు ప్రత్యయములు స్వార్థాతిరిక్తము నేమియు జెప్పవు. ప్రకృత్యుపాత్తమయిన ప్రకర్షాదికము నవి యవగమింప జేయగలవు స్వార్థికములందే యపి విహితములు.

'రసవత్' అనుట మత్వర్థీ ప్రత్యయమా? వతి ప్రత్యయమా? ఏమయిన నేమి! అది మత్వర్థీయమె యగునేని మత్వర్థ ముపపన్నము

కానందున నా ప్రత్యయము రాదు. రసములు సుఖదుఃఖావస్థారూపములు కదా! అవి చైతన్యము కల శరీరధారులకే కలుగును గాని కావ్యమునకు గలుగవు. కావ్యము శబ్దార్థరూపము. అచేతనము. భూమనిందా ప్రశంసాదులందు దుష్ట × × రసవత్ అనుట 'వతి ప్రత్యయమె యగునేని వత్యర్థ ముపపన్నము కానందున నది కలుగదు.

"తేన తుల్యం క్రియాచేద్వతిః ఇత్ర తస్యేవ"

అను నది 'వతి'ని గలిగించు నిదానములు 'రసములతో' తుల్యముగా నున్నది కావున రసవత్' అనుట కుదురదు. 'రసము నందు వలె నిందు గలదు' అను భావమున 'రసవత్' అనుట కుదురదు 'రసమునకు వలె కలదు. కావున 'రసవత్' అనుటయు కుదరదు. మత్వర్థీయమును కుదరదు. వతియు కుదరదు. × × × యద్యేవ్యపి తథాస్తు' ఎట్లిట్టిమో యట్లె యగు గావుత. ఇచట మత్వర్థీయ ప్రత్యయమె యగును. మత్వర్థము లేనందున నది యుపపన్నము కాదంటివే! రసవద్రామాదుల వచనము రసమూలము కావున రసవత్తగును. అభేద సామర్థ్యారోపమున కవి యనుకరించు నా యనుకరణమును రసవత్తగును.

'అథవా పునరస్తు వతిః' కాదేని వతి ప్రత్యయ మవు గావుత. వత్యర్థ ముపపన్నము కానందున "వతి" కలుగదని యంటివే! అయిన నిందు ననుపపత్తి లేదు. 'అర్హం' అను వచనమున నిచట వతి కలుగవచ్చును. రసముల ప్రతిపాదించుట కేది యర్హమో యది రసవత్. రసవద్రామాది వచన మనుక్రియమాణమై యభేదసామర్థ్యారోపమున రసముల ప్రతిపాదించుట కర్హమగును గావున రసవత్తగును.

నను! కావ్యములో నుపాదేయములగునవి యన్నియు కావ్యశోభాకారులె కావున నలంకారత్వము కలవియె యగును. ఈ భావమున వ్యవచ్ఛేద్యము లేవియునుండవు. కాగా నలంకారముల సంఖ్య

ష్టినా యభీష్ట మననేల? సంకరము సంసృష్టి రెండు నభిహితము లప్రగాప్రత'నైవం' ఇట్లనుట యుక్తము కాదు. ఇష్టి యయినచో-'విభావానుభావ వ్యభిచారిభావ సంయోగా ద్రసనిష్పత్తిః' అనుచో విభావాది సంకరమునకును సంసృష్టి వ్యవహారము గల్గును. కావ్యశోభాకరము లలంకారములైన యని యలంకారములనే పరిగ్రహించినచో విభావాది సంకరమునకు సంసృష్టిత్వము లుండదు. అట్లయిన కావ్యశోభాకరము లనుట యుక్తముకాదు. విభావాదు లలంకారము లుకాను భావరసతదాభాసముల కలంకారము లకాదు వాని యభినిష్పత్తిలో హేతువులగు నర్థవిశేషము లగును. అట్టి యర్థవిశేషము లయినను విభావాదు లర్థగుణము లయినందున నలంకారిత్వము కలవి యగును. కదా! సత్యమె; ఒక యంశము నిచట భావింపవలెను. అన్యపదములుగా నవి యుపాదేయ మానము లగునేని యవి యందే న్యగ్భూతము లగును. అనవయవ వాక్యార్థ ప్రతీతిలో=అఖండవాక్యార్థ ప్రతీతిలో పదార్థములు వేరుగా భాసింపవు. అచట భావములకు అలంకారములతో గుణములతో భావములతో సంకరము కలుగును. కాని రసతదాభాసములతో సంకరము కలుగదు. భావములు రసతదాభాసాంగములు కదా! రసములకు అలంకారములతో గుణములతో రసాభాసములతో సంకరము కలుగును. రసములకు భావరసాభాసములతో సంకరము కలుగదు. భావములు రసాంగములు. ఆభాసములకు రసవిరోధము కలదు కావున సంకరము సంభవింపదు. ఆభాసములకు అలంకారములతో గుణములతో నాభాసములతో సంకరము కలుగును. రసములతో భావములతో సంకరము కలుగదు. ఆభాసములకు రసముతో విరోధభావ మున్నది. భావములతో నంగభావమున్నది. ఈ నిరూపించిన పథమున పృథక్స్ఫురణము లేనందున భావముల కలంకారతాశంక యుక్తముకాదు.

సరే! అంగాంగిభావమునుండి యున్నవానికి సంకరవ్యవహారము లేకున్నచో పూర్వోదాహరణముగా నేల చెప్పవలెను.

అంగాంగిభావావస్థానం సర్వేషాం సమకక్షతా
ఇత్యలంకారసంసృష్టేః లక్షణీయా ద్వయీ గతిః

అంగాంగిభావమున నుండుట సమకక్ష్యముగా నుండుట యను రెండు విధానములు అలంకారసంసృష్టికి సంబంధించి యున్నవి. అవి ఈ విషయమున సమన్వయము పడిన్నవనుకొని 'ఆక్షిప త్వరవిందాని'- పద్యము నుదాహృత మయినది కదా! ఇట్లు నిరూపించుట యేల? 'ఉచ్యతే' చెప్పెదము. పృథక్సిద్ధములగు నలంకారములకు తమ శక్తి బలమున నుపకార్యోపకారకత్వాదులచే నంగాంగిభావ మవస్థాపితముగా నేని యచట సంసృష్టివ్యవహారము కలుగును. అపృథక్సిద్ధము లయిన యలంకారములకుగాని రసభావములకుగాని యారంభకత్వమున నారభ్యత్వమున నున్నవానికి స్వాభావికమగు నుపశ్లేష ముండునో యచట సంకర వ్యవహారము కలుగదు. పై యుదాహరణము నందే హేత్వర్థాంతరన్యాసములు పృథక్సిద్ధములుగ నున్నవి. హేతువారంభకముగా నున్నది అర్థాంతరన్యాస మారభ్యముగా నున్నది. వానికచట నుపశ్లేషము స్వాభావికమె. అర్థాంతరన్యాసమున కిటు లక్షణము కలదు.

జ్ఞేయః సోఽర్థాంతరన్యాసో వస్తు ప్రస్తుత్య కించన
తత్సాధన సమర్థస్య న్యాసో యోఽన్యస్య వస్తునః,

ఒక వస్తువును జెప్పి తత్సాధన సమర్థమయిన వస్త్వంతరమును జెప్పుట యర్థాంతరన్యాసము. ఈ లక్షణములో 'అర్థాంతరన్యాస' మనుట లక్ష్యనిర్దేశము. 'వస్తు ప్రస్తుత్య అన్యో న్యాసః అన్యస్య వస్తునః' అని యే యనినచో 'ఘటోఽస్తి' అను స్థలమున గూడ అర్థాంతరన్యాస మగును. ఘటపదమున ఘటమును చెప్పి అస్తిత్వ

గును నిరూపించుట యున్నది కదా, కావుననె తన్నివారణమునకు – 'తత్సాధన సమర్థస్య' – అని నిర్దిష్ట మయినది. 'ధూమాదూయ మగ్నేః' అను స్థలమున నరాంతరన్యాస మగునని యూపాదింపరాదు. ఇచట నుత్పాద్యమగు ధూమమునకు సాధనసమర్థముగా నగ్ని యున్నను 'కావ్యశోభాకరాన్ ధర్మానలంకారాన్ప్రచక్షతే' కావ్యశోభాకరము లగు ధర్మముల నలంకారము లందురు' అనినట్లు కావ్యశోభాకరత్వ మిందు లేదు. కావ్యశోభాకరత్వము సర్వాలంకారసాధారణమయిన ధర్మమని యనువర్తింపజేయుట యుక్తము.

కావ్యశోభాకరత్వ మనునది లేదేని యలంకారజాతము లన్నియు 'వక్రోక్తి' పదవాచ్యము లగును.

వక్రత్వమేవ కావ్యానాం పరాభూషేతి భామహః
శ్లేషః పుష్ణాతి సర్వాసు ప్రాయో వక్రోక్తిషు శ్రియం॥

కావ్యములకు వక్రత్వ ముండుట = లోకవిలక్షణత్వము పరాభూష యగునని భామహుడనెను, సామాన్యముగా సర్వవక్రోక్తులందును శ్లేష శోభను కలిగించుట యున్నది.

ఇట్లె యగునచో – 'విభావానుభావ వ్యభిచారి సంయోగాద్రసనిష్పత్తిః' అను విధమున నిరూపిత మలంకారమె కాకపోవలసి వచ్చును గదా! విభావాది ప్రతిపాదమున కావ్యభూషారూపమయిన వక్రోక్తియె యుండును. అలంకారత్వ ముండదు. ఇది కావ్యశోభారూపమె కాని కావ్యశోభాకరముకాదు. ఇట్లుం శంకింపరాదు. అలంకారవర్గము త్రివిధముగా నున్నది వక్రోక్తి – స్వభావోక్తి –రసోక్తి యని ఉపమాద్యలంకారప్రాధాన్యమున్నచో వక్రోక్తి యని, శ్లేషాది గుణప్రాధాన్యమున్నచో స్వభావోక్తి యని విభావానుభావ వ్యభిచారి సంయోగము వలన రసనిష్పత్తి యున్నచో రసోక్తి యని విభాగము గ్రహింపవలెను,

అందు విభావము రెండు విధములు. ఆలంబన విభావ ఉద్దీపన విభావము అని. వీనిలో నిష్టానిష్ట సందర్శనాదికి సాలంబన విభావమగును. దాని నవలంబింపగా సుఖము దుఃఖము కలుగును. కాగా సుఖ దుఃఖ విషయమైన యనుభావము సంస్మరణ హేతువగు సంస్కారము జనించును. ఉద్దీపనవిభావములన్నియు నా సంస్కార ప్రబోధ హేతువులుగా నుండును. ఋతుమాల్య విలేపనాదు లుద్దీపన విభావములని ప్రసిద్ధి. వాని వలనసంస్కారములు సముద్బుద్ధములగు. కాగా స్మరణేచ్ఛా ద్వేష ప్రయత్నములు కలుగును. వానివలన వాగ్బుద్ధి శరీరారంభములగు ననుభావములు కలుగును. అవి రసానుభావ్యమానము లగును గావున ననుభావములు. శృంగార ప్రభవమైన యా రత్యాది స్థాయిభావము ఆయనుభావములచే నభివృద్ధి పొందును. ఈప్సితార్థము సంపాదించును పరిత్యాజ్యమును పరిత్యజింప జేయును హర్ష - ధృతి - స్మృతి - మతి ప్రభృతి సుఖాత్మక వ్యభిచారిభావములతో గూడుకొనినదై యుత్తరోత్తర ప్రకర్షము పొందినదై సంభోగ శృంగారాది రసరూపత్వము నధిగమించును. ఆ రత్యాధి స్థాయిభావమె యీప్సితము లభింపకపోగా జిహాసితా ప్రహాణము వలన పరిత్యాజ్యా పరిత్యాగమున చింత - ఔత్సుక్యము - ఆవేగము - నిర్వేదము మొదలగు దుఃఖాత్మక వ్యభిచారిభావములతో గూడుకొనినదై దుఃఖాత్మక విప్రలంభ శృంగారాది రసరూపము నధిగమించును.

ఉదా: రతి వలన శృంగారము.

మృతేతి ప్రేత్య సంగంతుం యయా మే మరణం మతం
సైషా వంతీ మయా లబ్ధా కథమత్రైవ జన్మని.

అవంతి వాసవదత్త చనిపోయిన దని యామె తో సంబంధము పొందుటకై చనిపోవలెనని భావించితిని. ఆ యావంతి నీ జన్మము

నందే కన్నులు పొందగలిగితివో. సఖీ! నావంటి పాపనదత్త. ఏతద్వా క్యమున నుదయించిన రతి స్థాయిభావమున కాలంబన విభావము. వానిచే రతి యుద్దీప్యమాన మగుచున్నది. హర్ష - ధృతి - స్మృతి - వితర్క ప్రభృతులయిన సుఖాత్మక వ్యభిచారిభావములు ఉదయింపగా రతి స్థాయి సంభోగశృంగార రసత్వము పొందినది. ఇట్టి స్థాయి భావమున వత్సేశ్వరుని 'మృతేతి ప్రేత్య' మొదలగు వివరణ వచనము ఆతని శృంగార రసమున నుదయించిన యనుభావము. ఆ యనుభావ మిచట 'రసవత్' అను వ్యవహారము కలదగుచున్నది.

హాసము వలన హాస్య నిష్పత్తి ఉదా.

ఇదమప్లానమానాయా లగ్నం స్తనతటే తవ
ఛాద్యతా ముత్తరీయేణ నవం నఖపదం సఖి!

సఖీ! ఇంకను కోపముతగ్గని నీ స్తనతటమున లగ్నమయిన నవనఖపదము నుత్తరీయమున నాచ్ఛాదింపుము, ఇందు సఖి నాయిక నిట్లనుచున్నది. ఆనాయిక యింతకు పూర్వము ప్రియునిపై కోపము కలదయినది ఆతడు సన్నిధికి వచ్చి స్తనములందు నవముగా నఖపద ముంచినాడు. ఇట్టి నాయిక యాలంబన విభావముగా నొక సఖియకు హాస స్థాయిభావము కలిగినది. ఆ సఖియు నీ నాయిక నిట్లుపాలంభనము చేయుచున్నది. ఆ నాయికా మాన పరిగ్రహ స్మరణాదు లిందుద్దీపన విభావములు. ఇవి స్థాయి నుద్దీపింపజేయుచున్నవి. కాగా శంక - అవహిత్థ - హర్ష - గద్గదాదులు వ్యభిచారిభావము లుత్పన్నము లయినవి. ఇట్లు వీనివలన పరప్రకర్ష కలుగగా హాసస్థాయి హాస్యరసత్వము పొందినది. ఇట్టి స్థాయిలో నీ యమ్లానమానాది వచనమున హాస్యరస ముద్భూతమై 'రసవత్' అనదగి యున్నది.

ఉత్సాహమున వీరనిష్పత్తి ఉదా,

అజిత్వా సార్ణవాముర్వీమనిష్ట్వా వివిధైర్మఖైః
అదత్వా చార్థమర్థిభ్యో భవేయం పార్థివః కథం?

సాగరపర్యంతమగు భూమిని జయింపక వివిధయాగములు లోనరింపక యాచకులకు కర్థదానముచేయక నేను పార్థివుడ నెట్లగుదును? ఇందు వసుధాదిజయాదులు ఆలంబన విభావములు. వాని వలన నుత్సాహస్థాయిభావ ముత్పన్నమయినది. తేజస్సు - స్థైర్యము - ధైర్యము మొదలగు నుద్దీపనవిభావములు స్థాయి నుద్దీప్త మొనరించినవి. స్మృతి- మతి - వితర్కాది వ్యభిచారిభావములు పరప్రకర్ష సంపాదించినవి. ఉత్సాహస్థాయి వీరరసత్వము పొందినది. ఇట్లు వీరాత్మకుడయినవాని 'అజిత్వా సార్ణవాం' ఇత్యాది వీరరస సముత్పన్నమయిన వచనము 'రసవత్' అయినది.

విస్మయము వలన అద్భుతోత్పత్తి ఉదా;

అంశుకాని ప్రవాలాని పుష్పం హారాది భూషణం
ఫలం మధూని హర్మ్యాణి శాఖా నందనశాఖినాం

స్వర్గ పట్టణములోని నందనవనమునందలి కల్పవృక్షములకు ప్రవాలము లంశుకములు. పుష్పములు హారాదిభూషణములు. ఫలములు మధువులు కొమ్మలు హర్మ్యములు. దీనిలో నిట్లు సమన్వయము భావనీయము. వృక్షములకు ప్రవాల - పుష్ప - ఫల-శాఖా సంపత్తి నిజరూపము. నందనవన వృక్షములకు ప్రవాలాది సామ్యము లంశుక - హార - మధు - మందిరములు కలవు. వీని కిట్లుండుట యాశ్చర్యము. ఈ వృక్షము లాలంబన విభావము. దేవభూమి చేరిన లౌకికునికి విస్మయస్థాయిభావముత్పన్నమయినది, వృక్షావయవ వర్ణనాదు లుద్దీపన విభావములు. వానివలన స్థాయి యుద్దీప్యమాన మగుచున్నది. హర్ష - రోమోద్గమ-స్వేద - గద్గదాదులు వ్యభిచారి భావము లుత్పన్నములు కాగా స్థాయికి పరప్రకర్ష కలిగినది. స్థాయి

యాగ్భా ప్తి పొందినది. కాగా 'అంశుకాని ప్రవాలాని'
ఇత్యాది వా క్య మద్భుతరసోత్పన్న మిచట 'రసవత్'

క్రోధము వలన రౌద్రోత్పత్తి ఉదా;

గృహీత్వా కేశేష్వాకృష్టా కృష్ణా యేన మమాగ్రతః
సోయం దుశ్శాసనః పాపో లబ్ధః కిం జీవతి క్షణం?

ఏ దుశ్శాసనుడు నా యెదుట ద్రౌపదిని జుట్టుపట్టి లాగినాడో
ఆపాపాత్ముడు నాకు చిక్కినాడు. క్షణమయిన జీవింపడు. దుశ్శాసను
డాలంబన విభావము. ఇది భీమసేనునకు పూర్వమె క్రోధస్థాయి భావ
ముత్పన్నమాయినది. దుశ్శాసనుడు చే జిక్కగా తన సమక్షమున
పూర్వము జరిగిన ద్రౌపదీ కేశాకర్షణాదులు స్మర్యమాణములై
యుద్దీపన విభావము లైనవి. వానిచే స్థాయి యుద్దీప్తము. అసూయా
ఆవేగ - వేపథు - ప్రముఖములయిన దుఃఖాత్మక వ్యభిచారి భావ
ములు పరిపుష్టి సంపాదించుచున్నవి. స్థాయి రౌద్రరసత్వము పొంది
నది. కాగా రౌద్రరసజన్యమయిన భీమసేనుని 'గృహీత్వా' మొదలగు
వచనము 'రసవత్' అగుచున్నది.

భయము వలన భయానక నిష్పత్తి, ఉదా:

ఇదం మఘోనః కులిశం ధారా సన్నిహితానలం
స్మరణం యస్య దైత్యస్త్రీ గర్భపాతాయ కల్పతే॥

దేవేంద్రుని యీ వజ్రాయుధము ధారాసన్నిహితానలము.
దీనిస్మరణము దైత్యవనితల గర్భపాతమునకగును. ధారాసన్నిహితా
నలమయిన మహేంద్రకులిశమిందు స్మర్యమాణ మయినను దైత్య
స్త్రీలకు భయస్థాయి భావ ముత్పాదించుటలో నాలంబన విభావ
ముగ నున్నది. ఆ వజ్రాయుధ విదీర్ణులయిన దానవుల మరణస్మర
ణాదు లుద్దీపనవిభావములు. వానిచే-స్థాయియుద్దీప్తమయినది. స్వేద
స్తంభ - వైవర్ణ్య - వేపథు ప్రభృతి వ్యభిచారిభావములు ప్రకర్ష

నాపాదింపగా భయస్థాయి భయానకరసత్వము పొందుచున్నది. గర్భపాతాద్యనుభావములచే నది విభావ్యమాన మగుచున్నది. 'మఘోనః కులిశమిదం' ఇత్యాదివచనము స్వరూప సూచకమై తద్మూలమై యయినందున 'రసవత్' అయినది.

శోకము వలన కరుణ నిష్పత్తి, ఉదా;

యస్యాః కుసుమశయ్యాపి కోమలాంగ్యా రుజాకరీ
సాధిశేతే కథం దేవీ హుతాశనవతీం చితాం॥

కోమల శరీరయయిన యే దేవికి కుసుమశయ్యయు బాధా కరముగ నుండెడిదో యా దేవి హుతాశనవతి చితి న్నెట్లు శయనించి యున్నదో! ఇందు దేవీమరణ మాలంబన విభావము దీనివలన శోక స్థాయిభావ ముత్పన్నమయినది. చితానివేశన - హుతాశన జ్వాలనాద్యుద్దీపన విభావములచే నుద్దీప్త మయినది. నిర్వేద - గ్లాని-చింతాస్తంభా దివ్యభిచారిభావములచే పరప్రకర్షము పొంది కరుణరసముగా నయినది. ఇట్టి కరుణముతో నున్న నాయకుని యీ వచనము తత్కరుణ జన్యానుభావ రూపమై రసవత్ వ్యవహారము కలదయినది

జుగుప్స వలన బీభత్స నిష్పత్తి ఉదా;

పాయంపాయం తవారీణాం శోణితం పాణిసంపుటైః
కౌణపాస్సహ నృత్యంతి కబంధై రాన్త్రభూషణాః

రాజా! నీ శత్రువుల రక్తమును రాక్షసులు దోసిళ్ళతో త్రావి త్రావి ప్రేవులు భూషణములుగా ధరించి కంబంధములతో కూడా నృత్యము చేయుచున్నారు. దీనిలో రాక్షసులు అలంబనవిభావము. రాజవిజయ ప్రశంసయొనర్చు వాని కుదయించిన జుగుప్సా స్థాయి భావములో నిశిద శిరశ్ఛేద - విగలద్రుధిర ధారా పరిప్లుత - ప్రణర్తితకబంధ - ఆన్త్రభూషణ - శోణితపానాదు లుద్దీపన విభావములు.

అవి స్థాయి నుద్దీప్త మొనరించినవి, భయ - ఆవేగ - శంకా-అవహిత్థాది వ్యభిచారభావములు పరప్రకర్ష కలుగ జేయగా స్థాయి పరకోటి నధిరోహించి బీభత్స రసత్వము పొందినది. ఈ బీభత్సరసము వలన గలిగిన 'పాయం పాయం' ఇత్యాదివచనము రసవత్ అయినది.

ఇట్లీ రత్యాది భావము లెనిమిది సాతిశయితములై శృంగార వీరాది వ్యపదేశము పొందుచున్నవి.

౧. భావముల వలన రసము లుదయించును.

౨. రసముల వలన భావము లుదయించును.
ఆవిధముగనే

3. రసముల వలన రసము లుదయించును.
అని యనుట భరతాచార్యున కభిమతము.

౧. శృంగారము వలన హాస్యరస నిష్పత్తి ఉదా:

స ఏష భువనత్రయప్రథిత సంయమశ్శంకరో
బిభర్తి వపుషాధునా విరహకాతరః కామినీం
అనేన కిల నిర్జితా వయమితి ప్రియాయాః కరం
కరేణ పరిఘట్టయన్ జయతి జాతహాసః స్మరః॥

భువనత్రయమున ప్రఖ్యాతమయిన సంయమనము కిలశంకరుడే విరహాకాతరుడై తనదేహమున కామిని ధరించుచున్నాడు. ఈతనిచే మనము పరాజితులమయితి మని ప్రియాకరమును తనకరమున నొక్కుచు నవ్వుమన్మథుడు 'జయతి' సర్వాతిశాయిగా నున్నాడు. ఇందు శివశృంగారము మన్మథునకు హాస ముదయింపజేసినది. ఉమాదేవి కర్ధదేహమిచ్చిన శివు డాలంబనము. మన్మథ రీతిహాస్యము.

౨. వీరమున అద్భుత నిష్పత్తి ఉదా:

సంప్రత్యేవ హి గోగ్రహే యదభవత్తత్తావదాకర్ణ్యతాం
ఏతత్తే హృదయం స్పృశామి యది వా సాక్షీ తవైవాత్మజః

ఏభిః పూర్వముదాయుధైస్స్వబహుభిర్దృష్టస్తతోఽనన్తరం
యావంతో వయ మాహవ వ్యసనిన స్తావ న్త ఏవాద్భుతాః॥

గోగ్రహమున నిప్పుడెయేమి జరిగినదో వినవలెను. నీ చిత్తము పట్టి చెప్పెదను. నీ కుమారుడే యిందునాక్షి. ఆయుధమెత్తిన వీరంద రనేకులు ఒకయర్జునుని చూచిరి. ఆ పిమ్మట మేమెంతవరము సమర వ్యసనము కలవారముంటిమో అర్జునులందరు గోచరించిరి.

౩. రౌద్రము వలన కరుణానిష్పత్తి ఉదా,

సత్త్వభ్రంశవిషాదిభిః కథమపి త్రస్తైః క్షణం వేత్రిభిః
దృష్టో దృష్టినిపాతజిహ్మితముఖైరవ్యాహతప్రక్రమః
రామాన్వేషణతత్పరైః పరిజనైరున్ముక్త హా హా రవం
కన్యాంతఃపుర మేవ హా! ప్రవిశతి । క్రుద్ధో మునిర్భార్గవః॥

పరశురాముడు కోపించినవాడై కన్యాంతఃపురమునె ప్రవేశించుచున్నాడు. ఈ సమయమున వేత్రహస్తులు సత్త్వభ్రంశమున విషాదము కలవారై భయపడుచు తమ్మాతడు చూచునేమో యని ముఖము ముడుచుకొనుచు చూచుచున్నారు. పరశురాముడవ్యాహతక్రమమున రామాన్వేషణ తత్పరులై పరిజనులు హాహారవ మొనర్చుచుండగా నంతఃపురము ప్రవేశించుచున్నాడు. ఇందు సముద్భూత పరశురాముని రౌద్రము పరిజనుల కరుణము భావింపవలెను.

౪. బీభత్సము వలన భయానకోత్పత్తి ఉదా,

అంత్రప్రోత బృహత్కపాల నలక క్రూర క్వణత్కంకణ
ప్రాయప్రేంఖిత భూరిభూషణ రవైరాఘోషయంత్యంబరం
పీతచ్ఛర్దిత రక్త కర్దమ ఘనప్రాగ్భార ఘోరోల్లసత్
వ్యాలోల స్తనభార భైరవ వపుర్బంధోద్ధతం ధావతి॥

ప్రేవులతో కూర్చిపట్టిన పెద్దకపాలపు బొచ్చెలో క్రూరముగా మ్రోగు కంకణపుమ్రోతలు కల భూషణధ్వనులతో నీ శ్మశాన

పిశాచము లాకసమునాఘోషింప జేయుచున్నవి. ఆడ పిశాచమొకటి బురదవలె నున్నరక్తము త్రాగి క్రక్కి ముంగిటి భాగము రోతగా జేసినది. వ్రేలాడు స్తనములతో భైరవ శరీరము కలిగి యుద్ధతముగా ధావన మొనరించుచున్నది.

రసమున రసముదయించునను నీ పట్టున నుదాహృతములందు భోజుడు సమన్వయ వాక్యములు వ్రాయలేదు.

రసము రసాంతరమున నుదయించు ననుటయు యుక్తము. రత్యాదులు పరప్రకర్ష కలవగు నేని భావమువలె యగును గాని రసములుకావు. రసత్వమె కలుగునేని హర్షాదుల కన్నిటికిని రసత్వమె కలుగవలెను.

రత్యాదయో యది రసాఃస్యురతి ప్రకర్షే
హర్షాదిభిః కిమపరాద్ధమతద్వివిభిన్నైః
న స్థాయినస్త ఇతి చేద్భయ హాస శోక
క్రోధాదయో వద కియచ్చిరముల్లసంతి.

ప్రకర్షాతిశయము కలుగగా రత్యాదులు రసములె యగునేని తద్విభిన్నములు కాని హర్షాదు లొనరించిన యపరాధమేమి? ప్రకర్షాతిశయమున నవియు రసములు కావచ్చును. వానిని రసములని యన రేమి? అవి రసములు కావన్నచో నివియు కావు. అవి భావములయిన నివియు భావములె యగును. అవి స్థాయిభావములు కావందురా? భయ హాస శోక క్రోధాదులు మాత్ర మెంతకాల ముండగలవు. అవియు కొంతకాలమె యుండును. ఇవియు కొంతకాలమె యుండును. కొంత కాల ముండునవియు రసములగునేని హర్షాదులు మాత్ర మేల రసములుకావు? కాగా రత్యాదులును భావములె కాని రసములు కావు?

## రససంఖ్య

రసములు ఎనిమిది మాత్రమె అని నియమము. కొందరు శాంతము - ప్రేయస్సు - ఉద్ధతము - ఊర్జస్వి అను నవియు రసము లని యనిరి. తన్మూలముగా నాయకులు నాలుగు విధములు నుందు రని యనిరి. వారు క్రమముగా 'ధీరశాంత - ధీరోద్ధత - ధీరలలిత ధీరోదాత్త వ్యపదేశమున నుందురు. వానిలో;

౧. ధీర ప్రశాంతాశ్రయము.

> సర్వాస్సంపత్తయ స్తస్య సంతుష్టం యస్య మానసం
> ఉపానద్గూఢపాదస్య నను చర్మావృతైవ భూః॥

ఎవనిమానసము సంతుష్టమో వానికి సర్వసంపదలు కలవు. చెప్పులలో కాలుంచినవానికి భూమి చర్మావృతముగనె యుండును కదా!

౨. ధీరలలితా శ్రయము.

> యదేవ రోచతే మహ్యం తదేవ కురుతే ప్రియా
> ఇతి వేత్తి న జానాతి తత్ప్రియం యత్కరోతి సా

నాకిష్టమగుదానినే నా ప్రియయాచరించును ఇది యామెకు తెలియును గాని ఆ ప్రియము నేమిగా తాను చేయునో యామె తెలియదు.

3. ధీరోద్ధతా శ్రయము.

> ధృతాయుధో యావదహం తావదన్యైః కిమాయుధైః
> యద్వా న సిద్ధమస్త్రేణ మమ తత్కేన సేత్స్యతిః

నేనాయుధము పట్టుదునేని యితరములచే నాయుధములచే నేమి ఫలము? కాదో నా యస్త్రముచే సిద్ధము కానిది యెవనిచే సాధ్యము కాగలదు?

౭. ధీరోదాత్తాశ్రయము.

అపకర్తాహమస్మీతి మా తే మనసి భూ ద్భయం
విముఖేషు న మే ఖడ్గః ప్రహర్తుమభివాంఛతి.

అపకార మొనరించితినని మనసులో నేమియు భయము పడ కుము. విముఖులపై నా ఖడ్గము ప్రహార మొనరింపదు. × × వీనిలో కూడ – శమ ప్రకృతి కలవాడు శాంతుడని, స్నేహ ప్రకృతి ప్రేయాన్ అని, గర్వప్రకృతి యుద్ధతుడని, అహంకార ప్రకృతి యగుచో నూర్జస్వి యని శృంగారాదులలో వలె వీనియందును విభావానుభావ వ్యభిచారి సంయోగము పరిశీలించునది.

కొంద రీ విధముగా ననిరి. రత్యాది భావములన్నియు విభా వానుభావవ్యభిచారి సంయోగము వలన నిష్పన్నములై యతిశయము పొందినవై రసీభావము పొందును. అని. రుద్రటుని కావ్యాలంకార మున నిట్లున్నది.

రసనాద్రసత్వమేషాం మధురాదీనామివోక్త మాచార్యైః
నిర్వేదాదిష్వపి తత్ప్రకామమస్తీతి తేఽపి రసాః.

దీనిభావమును తద్వ్యాఖ్యాత యీ విధముగా నిరూపించెను. ఆచార్య భరతాదు లిట్లనిరి. లోకమున మధురాదులాస్వాద్యమాన ములై రసత్వము పొందుచున్నవి. అట్లే స్థాయి భావములు రస్యమాన ములై రసత్వము పొందును స్థాయిభావములకె రసనము కలుగనేల? నిర్వేదాది సర్వభావములకు నా రసనము కలుగును. కావున నవియు రసములు కావచ్చును. పరిపోషము కలుగక పోయినచో నవి భావము లగును. పరిపోషము కలిగినచో నన్నియు రసములగును.

యదుత నాస్తి సా కాపి చిత్తవృత్తిః
యా పరిపోషం గతా న రసీభవతి"

పరిపోషము పొందియు రసీభావము పొందని చిత్తవృత్తి యేదియు నుండదు. కాని భరతుడు సహృదయావర్జకత్వప్రాచుర్య మునకుగాను సంకేతనము ననుసరించి రసములు అష్ట – నవ యనెను.

ఇట్లు సర్వభావములకు రసత్వము తుల్యముగా నుండగా పర ప్రకర్ష గాములయిన రత్యాదులకే శృంగార వీరాది వ్యపదే శము కలుగుననుట ఘటింపదు. అట్లె యయినచో నామమాత్రమె భిన్నమగును.

ఈ యంశమునె యిట్లు నిరూపించితిమి.

వీరాద్భుతాదిషు చ యేహ రసప్రసిద్ధిః
సిద్ధా కుతోపి వటయక్షవదావిభాతి
లోకే గతానుగతికత్వవశాదుపేతా
మేతాం నివర్తయితుమేష పరిశ్రమో నః

వీరాద్భుతాదులు రసములని యొకరప ప్రసిద్ధి యెట్లో వట యక్షము వలె లోకమున సిద్ధమయినది. గతానుగతికముగా కలిగిన యీ లోకము నందలి ప్రతీతిని నివర్తింప జేయుటకే మాయీ పరిశ్ర మము ×× ప్రకర్షగాములయిన రత్యాదులు భావములె యయినచో రసములని యెట్లనిరి? 'భావేభ్యో రసాః, రసేభ్యో భావాః' భావముల వలన రసములు కలుగునని, గసముల వలన భావములు కలుగునని యనుట యెట్లు సంగతమగును? ఎట్లును సంగతముకాదు.

"నహి బహవో రసాః, అపి త్వేక ఏవ శృంగారో రసః"

రసములనేకములు లేవు. శృంగారమొక్కటియె రసము. ఇట్లె నిరూపించితిమి. ఇక ముమ్ముందును విస్తరముగా వివేచింతుము,

'రసేభ్యశ్చ రసాః' అని కొందరనిరి కదా! ఆ యంశము నిట్లు సమీక్షింప వలెను. ఇందు ద్విధావికల్ప మొనరింప వచ్చును.

౧. ఆలంబన విభావ రూపములయిన రసముల వలన రసము లుదయించును.

౨. ప్రకృతి రూపములయిన రసముల వలన రసము లుదయించును.

ఈ రెండు మతములలో మొదటి మతమును పరిశీలింతుము.

శృంగారాత్తు భవేద్ధాస్యో రౌద్రాత్తు కరుణో రసః
వీరాచ్చైవాద్భుతో నామ బీభత్సాత్తు భయానకః

శృంగారము వలన హాస్యము కలుగును. రౌద్రము వలన కరుణము కలుగును. వీరము వలన నద్భుతము కలుగును. బీభత్సము వలన భయానకము కలుగును. ఇట్టి యీ నియమ మేమియు ఘటింపదు.

శృంగారము కన్న నితరమగు రసము వలన గూడ హాస్యముత్పన్నమగుచున్నట్లు ఉదాహరణము లందు గోచరించుచునే యున్నది.

హస్తాలంబితపద్మసూత్రవలయం కర్ణావతంసీకృతం
స్రస్తం భ్రూయుగమున్నమయ్య రచితం యజ్ఞోపవీతేన చ
సన్నద్ధా జఘనే చ వల్కలపటీ పాణిశ్చ ధత్తే ధనుః
దృష్టం భోః జనకస్య యోగిన ఇదం శాంతాద్విరక్తం మనః

యోగియయిన జనకుని మనస్సు శాంతమునుండి విరక్తముగ నున్నది. హస్తాలంబితమయిన జపమాల కర్ణావతంసమయినది. దిగ జారిన భ్రూయుగము పైకి నెత్తబడియున్నది. మొలపై నార వస్త్రము యజ్ఞోపవీతమున సన్నద్ధమయినది. హస్తము ధనువు ధరించినది. ఈ సర్వమూ తని మనస్సు శాంతమునుండి విరక్తమయినది గా గోచరించుచున్నది. అంతటి జనకు డీ విధముగా మారుట హాస్యము కలిగించును. ఈ హాస్యము శృంగారజన్యము కాదు.

శృంగారజన్యము కాకుండుటయు గలదు. ఉదా

చింతానీతదయితసమాగమే కృతమన్యుకాని స్మృత్వా
హాస్యం కలహాయమానా సఖీభిరుదితా న వాహసితా॥

ఒక విరహిణీ వనిత నిరంతర చింతనమున దయితుని సమాగమము సిద్ధముచేసికొనినది కాని పూర్వము మన్యువికారములను భావించి హాస్యముగా కలహించునది కాగా సకియలు వచ్చి యేడ్పించినే కాని నవ్వింపలేదు. ఇందు శృంగారజన్యముగా హాస్యముదయింపలేదు.

రౌద్రాన్యమున గూడ కరుణోదయమున్నది. కేవలము రౌద్రము వలననె కరుణముదయించుట లేదు.

ఆర్ద్రాం నాగాజినమవయవగ్రంథిమద్బిభ్రదంసే
రూపం ప్రావృట్ఘనరుచి మహాభైరవం దర్శయిత్వా
పశ్యన్ గౌరీం భయవకిత కరాలంబితస్కంధహస్తాం
మన్యే ప్రీత్యా ద్రుత ఇవ భగవాన్ వజ్రదేహోఽపిజాతః

అవయవగ్రంథులు కల పచ్చి నాగాజినము నంసమున ధరించి ప్రావృణ్మేఘ కాంతికల మహాభైరవ రూపమునుచూపి, భయకంపితుడయిన కుమారుని చేతపట్టిన గౌరీదేవిని చూచుచు భగవాన్ శివుడు ప్రేమచే కరిగినవాడు వలె నన్పించెను. ఇందలి విశేషము రౌద్రాన్య జన్యమె.

రౌద్రమునను కరుణము జనించుటకన్పడదు. ఉదా:

నిరీక్ష్య సంరంభ నిరస్త ధైర్యం, రాధేయమారాధిత జామదగ్న్యం
అసంస్తుతేషు ప్రసభం భయేషు, జాయేత మృత్యోరపి పక్షపాతః

పరశురాము నారాధించిన రాధేయుని ధైర్యము తొలగునట్లు చూడగా మృత్యువునకు నపరిచితములయిన భయము లందభిమానము కలుగును. పూర్వవైభవ విలోప కృతమయిన మృత్యుగత కరుణ మిందు రౌద్రకృతము కాదు .

వీరేతరమునగూడ నద్భుతము కలుగుట కన్పడుచున్నది. వీరమువలన నద్భుతము గోచరింపకపోవుటయు కలదు. ఉదా:

నైతచ్చిత్రం యదయముదధిశ్యామసీమాం ధరిత్రీం
ఏకః కృత్స్నాం నగరపరిఘప్రాంశుబాహుర్భునక్తి
ఆశంసంతే సురయువతయః సక్త వైరా హి దైత్యైః
అస్యాధిజ్యే ధనుషి విజయం పౌరుహూతే చ వజ్రే॥

ఈ మహాబాహువగు దుష్యంతుడొక్కడే సముద్ర పర్యంత యగు నీ భూమినంతటి ననుభవించుచున్నాడనుట చిత్రము కాదు. దైత్యులతో వైరము రాగా దేవవనిత లీతని యెక్కిడిన ధనువు నందును దేవేంద్రుని ధనువునందును విజయము నాశంస చేయు చున్నారు.

బీభత్సము కన్ననితరమున గూడ భయానకము గోచరించు చున్నది ఉదా:

యస్మిన్ననైశ్వర్యగతి వ్యలీకః, పరాభవం ప్రాప్త ఇవాంతకోఽపి
ధుర్వన్ధనుః కస్య రణే న కుర్యా, న్మనో భయైకప్రవణం స భీష్మః,

ఏ భీష్మునందు సామర్థ్యము చాలని యంతకుడును పరాభవము పొందినవాడుగ నుండెనో ఆ భీష్ముడు యుద్ధమున ధనుర్ధూనన మొనరించుచు నెవనిమనమును భయప్రవణ మొనరింపడు. ఇందలి భయానకము బీభత్సేతర కృతము.

బీభత్సము వలన గూడ భయానకము గోచరించుటలేదు ఉదా:

తత్క్రూరదంత కరపత్ర నికృత్త సత్త్వ
సంఘాత నిస్సర దసృక్స్నుత కూర్చపుంజం
వక్త్రం వపుశ్చ వికృతాకృతి దీర్ఘబాహో
రార్యేణ రాక్షసకుతూహలినా న దృష్టం.

ఆ దీర్ఘబాహువయిన కబంధుని వక్త్రము దేహమును వికృతాకృతి నుండుటను రాక్షస కుతూహలముచే నార్యుడు చూడనే లేదు. ఆతని జంపము వంటి క్రూర దంతము లరణ్య మృగసంఘాతము కోతకోసి కొఱికినవి. ఆ మృగముల దేహములనుండి వెలువడిన రక్తస్రుతి యాతని కూర్చము తడిపినది. ఇట్లాతని వక్త్రము శరీరము వికృతాకృతి యయినది. ఇందు బీభత్సముచ్చనది. భయానకము లేదు.

ప్రకృతిరూపము లయిన రసముల వలన రసము లుదయించు నను రెండవమతము పరిశీలింతుము. శృంగారాదులు ప్రకృతులుగా నుండగా హాస్యాదులు జన్మించుననుట నిట్లు వికల్పింపదగును.

౧. శృంగారము వలన హాస్యము కలుగునా?

౨. శృంగారమె హాస్యముగా నగునా?

ఇట్లు వికల్పించుట యేల? శృంగారమువలన హాస్యము కలుగు నందురేని యది మాకు సమ్మతమె. అశృంగారి యగు వానికి ప్రకర్ష గామి - అప్రకర్ష గామి యగు భావమేదియు జనింపదు. శృంగారి యగు నాతడే 'రమతే - హసతి - విస్మయతే - జుగుప్సతే-శోచతి- బిభేతి - శామ్యతి - స్నిహ్యతి - గర్వాయతే - అభిమన్యతే' రమించు నుత్సహించును హసించును విస్మయపడును జుగుప్సపడును శోకించును భయపడును శమించును స్నేహపడును గర్వించును అభిమానించును. శృంగారియె సర్వభావములు పొందగలడు.

రతి ప్రకృతి యగు శృంగారమె హాస్యరసమగునను రెండవ పక్షము ఘటింపదు. శృంగారమునకు హాస్యవ్యపదేశము లేనే లేదు. ఇట్లందురా?

'శృంగారానుకృతిర్యాహ స హాస్యో రస ఇష్యతే'

శృంగారానుకారముండుట హాస్యరసమగును అని అయినచో వీరానుకారముండుటయు హాస్యరసమగునని. యంగీకరింపవలసియుండును.

‘వీరస్యానుకృతిర్యాహా సోపి హాస్య ఇతీష్యతాం’

కాన పైపక్షవాదముపపన్నముకాదు. ఇట్లనుటచే ‘రౌద్రాత్తు కరుణో రసః’ అనుటయు ప్రత్యుక్తమయినది. రౌద్రము వలన కరుణము కలుగదు. రౌద్రమె కరుణము కాదు.

‘అథ రౌద్రస్య యత్కర్మ కరుణస్సనిగద్యతే’

రౌద్రకర్మ కరుణమగునని తలంతురు. అయినను; కరుణము రౌద్రకర్మ కాదు. కరుణమున కది కారణమును కాదు. అట్లే అద్భుతము వీరకర్మకాదు. అద్భుతోత్పత్తిలో వీరమునకు హేతుత్వమును నివారితము. బీభత్స దర్శనమున గలుగు భయానకమున్నది. ఆ బీభత్స దర్శన మనునది యాలంబనకారణమయిన విభావమున కన్న భిన్నము కాదు కావున నీ వాదములన్నియు వాదము లన దగినవి కావు. ‘యత్కించి చేతత్’ భావముల వలన రసము లుదయించుననుట కాని రసముల వలన భావము లుదయించుననుట కాని, రసముల వలన రసము లుదయించుననుట కాని యుపపన్నములగు వాదములు కావు. అయినచో ‘కింపునరిహన్యాయం? ఇచట న్యాయమగునదేమి? మేము పూర్వము నిరూపించినదే న్యాయపక్షము. అది యిట్లుపవర్ణితము.

అప్రాతికూలికతయా మనసో ముదాచేః
యః సంవిదోనుభవహేతురిహాభిమానః
జ్ఞేయో రసః స రసనీయతయాత్మశక్తేః
రత్యాదిభూమని పునర్వితథా రసోక్తిః

మనసున కప్రతికూలముగా హర్షాది సంవిద్విశేషముల ననుభవింపజేయుటలో నభిమానము హేతువుగానుండును. ఆత్మశక్తియచట రసనీయమగును. కావున నా యభిమానమురసము. రత్యాది విశేషములు రసములనుట వితథోక్తి. భావపథమున పర్యవసన్నములగునని

భావములకే కాని రసములు కావు. భావనాపథ మతిక్రమించి రస్యమానమగు నదియె రసము.

ఇప్పటికీ ప్రతిపాదన సారముగా రసమునకు సంబంధించిన మూడంశములు విశదములయినవి.

౧. రసమునకు పూర్వకోటి
౨. రసముయొక్క మధ్యమావస్థ
౩. రసముయొక్క పరమకాష్ఠ

రూఢాహంకారరతి రసమునకు పూర్వకోటి నలుబదితొమ్మిది సంఖ్యకల రత్యాది భావములకు విభావానుభావవ్యభిచారి సంయోగము కలుగగా రసవ్యపదేశార్హతను సంపాదించు పరప్రకర్ష రసమునకు కలుగును. ఇట్లు పరప్రకర్ష కలుగుటయే మధ్యమావస్థ. 'ప్రేయః ప్రియతరాఖ్యానం' అనుట యుపలక్షణము. రతి ప్రేమరూపమున పరిణమించిన విధమున భావాంతరములును పరమ పరిపాకము కలిగిన ప్రమాణ రూపమున పరిణమించును. అట్టి పరిణతిలో రసైకాయనమని రసమునకు పరమ కాష్ఠ ప్రతిష్ఠిత మగును. తథాహి. ఈ యంశ మిట్లుపపాదింప దగును. ఊర్జస్విలో రూఢమయిన యహంకారము గోచరించును.

౧. 'అపకర్తాహమస్మి' అను ధీరోదాత్తాశ్రయమయిన యూర్జస్విలో 'నేనపకారినని నీ మనమున భయముకలిగిన నాఖడ్గమెప్పుడును పరాఙ్ముఖులందు ప్రసరించుట కుత్సహింపదని రూఢాహంకారమున్నది.

౨. 'మృతేతి ప్రేత్య' రతివలన శృంగారోత్పత్తికై ప్రదర్శించిన లక్ష్యములో నా యావంతి నీ జన్మయందే నేను పొందగల్గితినని యహంకారము ప్రతీత మగుచున్నది.

3. శృంగారము వలనను హాస్యము కానరాదను 'చింతా నీతదయిత' గాథార్థములో కోపపరిగ్రహమున నీ ప్రతిజ్ఞ వ్యర్థము. నీ కోపము నీ ప్రతిజ్ఞ యుక్తముగ లేదు. 'ధిక్త్' – అనుటలో నహంకారమున్నది.

౪. 'అజిత్వా సార్ణవాం' అను నుత్సాహము వలన వీరనిష్పత్తి కుదాహరించిన లక్ష్యములో ఉర్వీవిజయాదిక మొనరింపక నేనెట్లు పార్థివుడ నయ్యెదననుటలో నహంకార భావమున్నది.

౫ విస్మయమున నద్భుతమున కుదహరించిన 'అంశుకాని ప్రవాలాని యను దానిలో 'నేనిట్టి చెట్లనెచ్చటను చూడలే' దని యహంకారమున్నది.

౬. క్రోధమున రౌద్రనిష్పత్తి కుదాహరించిన 'నిగృహ్యకేశేషు' స్థలమున నాద్రౌపదిని వీడు జుట్టుపట్లిలాగినాడ'ని యహంకారమున్నది.

౭. భయమున భయానకోత్పత్తి కుదాహరించిన 'ఇదం మఘోనః 'శ్లోకములో' ఇట్టియాయుధమున్నందున నింద్రుడు ధన్యుడను నహంకారము కలదు.

౮. శోకమున కరుణనిష్పత్తి లక్ష్యమయిన 'యస్యాః కుసుమశయ్యాపి' లక్ష్యములో ఆ నా దేవి చితిపై నున్నది' అను నహంకారమున్నది.

౯. బీభత్సమున భయానకోత్పత్తి లక్ష్యమయిన 'అంత్ర ప్రోత" పద్యమున 'క్షీ కౌణపులాంత్ర భూషణులై రక్తము త్రావుచున్నారు అనుచో నహంకారమున్నది.

౧౦. శృంగారమున హాస్యనిష్పత్తికల 'సప్తభువనత్రయ' పద్యమున "నామనసున కిపుడు సంతోషమున్న"దని యహంకారమున్నది.

౧౧. ధీరలలితాశ్రయమయిన ప్రేయస్సున కుదాహరించిన 'యదేవరోచతేమహ్యం' అను పద్యములో ఈమె నాకు ప్రియ, అట్లై యామెకు నేను ప్రియుడను. నా కనుకూలముగ నామెయాచరించును అని యహంకారమున్నది.

౧౨. ధీరోద్ధతాశ్రయోద్ధతోదాహరణములో 'ధృతాయుధోయావదహం' అనుచోట 'నేనాయుధము ధరింప నితరాయుధము లేల?' అని యహంకారమున్నది.

ఇట్లంతట నహంకారమె మూలము. ఈ లక్ష్యములన్నిటిలో నంతరానుగతముగా నాత్మాభిమానమున్నది. ఆత్మీయత యున్నది. అది యహంప్రకృతి.

'విభావానుభావవ్యభిచారి సంయోగాద్రస నిష్పత్తిః' అని యనిరికదా! ఆ రసనిష్పత్తి యెట్లు కలుగును? ఉచ్యతే. చెప్పెదము ఈ పంక్తుల భావింపుడు.

౧. యథా, ఇందుసన్నిధేః చంద్రకాంతః స్యందతే

౨. యథా, అర్కసన్నిధేః సూర్యకాంతః జ్వలతి

౩. యథా, కర్పూరసన్నిధేః స్ఫటికో విలీయతే

చంద్రసన్నిధిలో చంద్రకాంతము స్యందించునట్లు, సూర్యసన్నిధిలో సూర్యకాంతము జ్వలించునట్లు కర్పూరసన్నిధిలో స్ఫటికము లీనమగునట్లు, ఆ యాయాలంబన విభావముల వలన బుద్ధీంద్రియములు తదాకార పరిణతములు కాగా నట్టిబుద్ధీంద్రియోపాధి యోగమున నున్న అభిమానికమనస్సు వలన ఆయా రతిక్రోధశోకాది భావములు సముత్పన్నము లగును.

## రత్యాదులు

ఆశ్చర్యముత్పలదృశో వదనామలేందు
సాన్నిధ్యతో మమ ముహుర్జడిమానమేత్య

జాత్యేవ చంద్రమణినేవ మహీధరస్య
సంధార్యతే ద్రవమయోమనసా వికారః.

ఈ యుత్పలాక్షీ ముఖచంద్రసాన్నిధ్యమున ముహుర్ముహుః జడిమను పొంది నా మనస్సు పర్వతము యొక్క జాత్య చంద్రమణి వలె ద్రవమయ వికారము ధరించుచున్నది. దీనిలో చంద్రసన్నిధిలో చంద్రకాంతము స్యందించుట వలె మనసు ద్రవించుట స్పష్టము.

క్రోధాదులు

తేనాథ నాథ దురుదాహరణాతపేన
సౌమ్యాపి నామ పరుషత్వమభిప్రపన్నా
జజ్వాల తీక్ష్ణవిశదాః సహసోద్గిరంతీ
వాగర్చిష స్తపనకాంతశిలేవ సీతా.

నాథా! అనంతర మా దురుదాహరణా తపమున సౌమ్య స్వభావయయినను పరుషత్వము పొందిన సీత సూర్యకాంతశిలవలె తీక్ష్ణవిశదములయిన వాచాజ్వాలలను సహసా వెలువరించి జ్వలించెను. దీనిలో అర్కసన్నిధిలో సూర్యకాంతము జ్వలించు విధము ఆతపేన - తపనకాంతశిలా - అర్చిషః - ఉద్గిరంతీ - జజ్వాల - పదములచే స్పష్టమయినది.

శోకాదులు

అథేదం రక్షోభిః కనకహరిణ చ్ఛద్మ విధినా
తథా వృత్తం సాపైః వ్యథయతి యథా క్షాలితమపి
జనస్థానే శూన్యే వికలకరణై రార్యచరితైః
అపి గ్రావా రోదిత్యపి దలతి వజ్రస్య హృదయం.

బంగారు లేడి మిషగా నాపాపులయిన రాక్షసులు వర్తించిన విధము క్షాలిత మయినను వ్యథకలుగ జేయుచున్నది. శూన్యజనస్థానమున వికలేంద్రియుడయిన రాముని యాచరితములు రాతిబండ

నయిన నేడ్పించును. వజ్రహృదయ మయినను ద్రవించును. కవిలో కర్పూర సదృశము లగు నవరాచరితములు పాషాణముల కరిగించుట యను విశేషము సంగతముగా నున్నది.

ఈ పంక్తుల సంభావింపుము.

౧. చంద్రోదయమున సముద్రము క్షుబ్ధమగును.
౨. అపథ్యసేవనమున వ్యాధి వృద్ధి పొందును.
౩. అనాథుచనార్య సన్నిధివల్ల సుఖోదయా సుఃఖప్రాప్తియు

ఆస్తే సాదృశ్యా యుక్తిసవ విధానముల వలన తత్త్వానుభవ సంస్కారము కల మనస్సునకు తత్త్వజ్ఞానాదివృత్తికై యోగ్యతా విశేషము ఉపజాతము లగును.

౪. క్షోభమున, ఉదా:

విలలాప స బాష్పగద్గదం, సహజామప్యపహాయ ధీరతాం
అభితప్తమయోపి మార్దవం, భజతే కైవ కథా శరీరిషు.

సహజమయిన ధీరతను విడనాడి బాష్పమున గద్గదముగా రతివిలపించినది. అగ్ని తప్తమయిన యినుము కూడ మార్దవము పొందును. దేహధారుల విషయమిక చెప్పనేల? కామదహనమున విలపించు రతిదేవి మనస్సంక్షోభ మొందుచున్నది. తస్మా యోన్మత్తాంతమున విస్పష్టమయినది.

౨. తదభివ్యక్తి. ఉదా:

తముదీక్ష్య రురోద సా భృశం, స్తనసంబాధమురో జఘాన చ
స్వజనస్య హి దుఃఖమగ్రతో, వివృతద్వారమివోపజాయతే.

రతిదేవి వసంతుని చూచి యధికముగా విలపించినది. స్తనసంబాధము కలుగునట్లుగా ఱొమ్ము బాదుకొనినది. తన జనమెదుట దుఃఖము ద్వారము తెఱచిన విధమున నగును గదా! అపథ్యసేవన

మున వ్యాధి యభివృద్ధి పొందినట్లు స్వజన సమీపమున మాఖ్యాతి వృద్ధి పొందినది. ఉదాహరణమున స్పష్టము

3 అత్యాతిశయాల్యము ఉదా.

> ఇదమసులభ వస్తు ప్రార్థనా దుర్నివారం
> ప్రథమమపి మనో మే పంచబాణః క్షిణోతి
> కిముత మలయవాతోన్మూలితాపాండుపత్రై
> రుపవన సహకారైర్దర్శితేష్వంకురేషు

సులభము కానిదాని ప్రార్థించి నివారింపశక్యము కాని నా మనస్సును మొదటనే మన్మథుడు బాధించుచున్నాడు. మలయపవనము లచే పండుటాకులు రాలిపోగా నుపవన సహకారవృక్షము లంకురములను ప్రదర్శింపగా నిక నా మనోవేదనా విశేషమేమి చెప్ప వలెను? దీనిలో నపథ్యసేవనమున వ్యాధి ముదిరినట్లు సహకారాంకుర దర్శనమున మనోవేదన నాతిశయముగుట యున్నది ఉదాహరణమున నది యభివ్యక్తమయినది.

ఇట్లాలంబన విభావముల వలన ఉద్దీపన విభావముల వలన గలుగు విశేష మాసూత్రితముదాహృతము - ఇక అనుభావవ్యభిచారుల వలన గలుగు విశేష మాసూత్రిత ముదాహృతము కావలెను వీనిని భావింపుడు.

౧. యథా ఏకస్యాపి భూరుహాదేః కాండ - స్కంధ - శాఖా - విటపాదయః ప్రకారాః పల్లవ-పత్ర - పుష్ప-ఫలసంపదాదయో వికారాః;

౨. ఏకస్యాప్యంభసః ప్రవాహ - ఆవర్త - బుద్బుద - తరంగాదయో వివర్తాః ముక్తాఫల - ఫేన - లవణ - కరకాదయో విపరిణామాః;

3. ఏకస్యాపి ధ్వనేః తార-మధ్య-మంద్ర-క్రుష్టాదయో భేదాః వర్ణ-పద-వాక్య-మాజితాదయః అవచ్ఛేదాః.

౮. ఏకస్యాపి వాయోః ప్రవహ - ఆవహ-పరివహాదయః స్కంధాః. ప్రాణ - అపాన - వ్యానాదయః అనుబంధాః

ఒక వృక్షమునకు కాండము స్కంధము శాఖ విటపము మొదలగు ప్రకారములున్నవి. పల్లవము పత్రము పుష్పము ఫల సంపద మొదలగు వికారములున్నవి. జలమునకు ప్రవాహము ఆవర్తము బుద్బుదము తరంగము మొదలగు వివర్తములు ముత్యములు హిమము లవణము కరకలు మొదలగు విపరిణామములున్నవి. ఒకే ధ్వనికి తార-మంద్ర-మధ్య - హ్రస్వాది భేదములున్నవి వర్ణపద వాక్య కూజితార్థానుస్వనములున్నవి. ఒకే వాయువునకు ప్రవహ - ఆవహ-పరివహ ప్రభృతిస్కంధములున్నవి. ప్రాణ - అపాన-వ్యానాద్యనుబంధము లున్నవి. ఇవియన్నియు నానాయుపాధుల వలన గలుగుచున్నవి. అట్లే రతి క్రోధ శోకాదులకు ఆయా యుపాధులవలన నానాయనుభావము లానావ్యభిచారులు గలుగును. ఇవి బాహ్యములు నాభ్యంతరములునై వ్యవస్థానుసారమున సంభవానుసారమున గలుగుచుండును. పొంగుచు పొంగుచుండును. అందు వ్యభిచారిభావములలో చింత - ఔత్సుక్యము - ఆవేగము - వితర్కము మొదలగునవి యాభ్యంతరములు. స్వేద-రోమాంచ-అశ్రు-వైవర్ణ్యాదు లనుభావములందు బాహ్యములు. స్మరణేచ్ఛాద్వేష ప్రయత్నములు అభ్యంతరములు. మనోవాగ్బుద్ధి శరీరారంభములయిన చేష్టలు బాహ్యములు. ఈ బాహ్యాభ్యంతర భావములు అనుక్రియమాణములై సాత్త్వికాభినయములని ఆంగికాభినయములని, వాచికాభినయములని. చిత్రాభినయములని, సామాన్యాభినయములని వ్యపదేశము పొందుచున్నవి.

రతిప్రభవోదాహరణము.

వివృణ్వతీ శైలసుతాపి భావమంగైః స్ఫురద్బాలకదంబకల్పైః
సాచీకృతా చారుతరేణ తస్థౌ, ముఖేన పర్యస్తవిలోచనేన॥

పార్వతీ దేవియు బాలకదంబకల్పములయిన యవయవములచే తన రతిరాగభావము సూచించునదై లోచనముల ద్రిప్పుచు రమ్యమయిన ముఖము నడ్డముగా మలచి నిలచెను.

## క్రో ధ ప్ర భ వ ము

ప్రత్యగ్రారికృతాభిమన్యునిధన ప్రోద్భూత తీవ్రక్రుధః
కీర్ణా బాష్పకణైః పతత్రిధనుషి వ్రీడాజడా దృష్టయః
పార్థస్యాకృతశాత్రవ ప్రతికృతేర న్తఃశుచా ముహ్యతః
హా వత్సేతి గిరః స్ఫురంతి న పునర్నిర్యాంతి కంఠాద్బహిః.

శత్రువు లభిమన్యువధ మాచరింపగా తీవ్రకోపము కలిగిన యర్జునుని దృష్టులు బాష్పాకీర్ణములై వ్రీడాజడములై గాండీవమున ప్రసరించినవి. శత్రువులకు ప్రతీకార మొనర్ప లేదని దుఃఖమున వ్యాముగ్ధుడయిన యాతని కంఠమున "హా! వత్స!" యను మాటలు స్ఫురించునె కాని కంఠమునుండి వెలికి వచ్చుట లేదు.

## శో క ప్ర భ వ ము

మాతర్మాతర్దలతి హృదయం ధ్వంసతే దేహబంధః
శూన్యం మన్యే జగదవిరతజ్వాలమ న్తర్జ్వలామి
సేదన్నధే తమసి విధురో మజ్జతీవాంతరాత్మా
విష్వఙ్మోహః స్థగయతి కథం మందభాగ్యః కరోమి.

అమ్మా! హృదయము పగులుచున్నది. దేహబంధము ధ్వంసమగుచున్నది. జగము శూన్యముగానున్నది. నిరంతరజ్వాలగా లోమండి పోవుచున్నాను. చిమ్మచీకటిలో వ్యథపడుచున్నాను. అంతరాత్మ వివశమై తమస్సులో మునిగిపోవుచున్నది. మోహమంతట కప్పుచున్నది. మందభాగ్యుడను. ఏమి చేయుదునమ్మా! ఈ మూడు లక్ష్యములలో ననుభావ వ్యభిచారిభావముల సంబంధము వలన నాయా

విశేష సంపత్తి యథ్యాహ్యము. ఇందు బాహ్యాభ్యంతరభావ సంప త్తిని కూడ యథాసంభవముగా గ్రహించునది.

వేరువేరుగా విభావాదుల సంపద్వివేకము సూచితమయినది. తమతమ విభావానుభావ వ్యభిచారిభావముల సంయోగము కల రతి క్రోధశోకాదుల వలన రసములు నిష్పన్నములగుట సూచితమగును. ఇందీవిశేషములను భావించుట సముచితము.

"యథా ఇక్షుభ్యో రసః - సర్షపేభ్య స్తైలం - ధాతుభ్యో హిరణ్యం
అశ్మభ్యో లోహం - దధ్నో నవనీతం - కాష్ఠతోఽగ్నిః"

చెఱుకు గడల నుండి రసము, తిలముల నుండి తైలము, ధాతువులనుండి బంగారము, పాషాణముల నుండి లోహము, పెరుగునుండి నవనీతము కాష్ఠమునుండి యగ్ని నిష్పన్నమగుచున్నది. వీనిలో రసతైలములు యంత్రసంయోగమున, హిరణ్యలోహములు అగ్ని పుటము) (సంయోగము) వలన, నవనీతాగ్నులు మథనసంయోగము వలన నిష్పన్నమగును. ఈ విధానము లోకప్రసిద్ధములు. అట్లే తమ తమ విభావానుభావవ్యభిచారి సంయోగములు సముచితముగా కలుగగా రతి క్రోధ శోకాదుల వలన నానా రసములు నిష్పన్నము లగును.

రాహోశ్చంద్రకలామివాననచరీం దైవాత్సమాస్వాద్య మే
దస్యోరస్య కృపాణపాతవిషయాదాచ్ఛిత్య ప్రేయసీం
ఆతంకాద్వికలం ద్రుతం కరుణయా విక్షోభితం విస్మయాత్
క్రోధేన జ్వలితం ముదా వికసితం చేతః కథం వర్తతే

నా ప్రేయసి నీ దస్యుకృపాణ పాతము నుండి, రాహుముఖ సన్నిధి నున్న చంద్రకళ వలె విడదీసితిని. నామనస్సిట్లో యయినది ఆతంకమునవికలము. కరుణచే విద్రుతము, విస్మయమున వికస్వర

క్రోధమున జ్వలితము, సంతసమున వికసితమునై యొప్పియుండునది. దీనిలో విభావాది సంయోగమున రతి రసీభవించుట సంభావ్యము.

లవణరసాదులు స్వసంయుక్తము లయిన మృద్వీకాదులకు నాత్మరూపమిచ్చి యుపచితములగునట్లు రత్యాది సంజాతములయిన రసములు రత్యాదులకు వలె విభావాదులకు నాత్మరూపమిచ్చి యుపచితములగును. సర్పిర్జతుమధూచ్ఛిష్టాది పార్థివ పదార్థములు, ఘన తుహిన కరకాదులగు జలీయపదార్థములు త్రపుసీసరజతాది తైజస పదార్థములు వహ్నిసంయోగమువలన ద్రవత్వము పొంది యుదక సమానత్వము పొందునవి యగును. అట్లె విభావానుభావవ్యభిచారి భావములు రససంయోగమున రసతి కలనై రసముతో సమానత్వము వహించునవియగును.

విలపన్నితి కోసలాధిపః, కరుణార్థ గ్రథితం ప్రియాం ప్రతి
అకరోత్పృథివీరుహానపి, స్రుత శాఖా రస బాష్ప దుర్దినాన్

కోసలాధిపుడగు నజమహారాజు ప్రియురాలిందుమతి నుద్దేశించి కరుణార్థ గ్రథితముగా విలపించుచు వృక్షములనుగూడ ద్రవించు శాఖారసబాష్పములచే దుర్దినముంగ నొనరించెను. ఇందు విభావాత్మకములయిన వనీవృక్షములును అజకరుణ సంబంధమున రసములయినవి.

ఇక్షురసముల వలన మధునిష్పత్తి యగునట్లు, మధురాధుల వలన పాడబోత్పత్తి యగునట్లు గుడాదుల వలన నాసవోత్పత్తియగునట్లు నాయూరస సామాన్యములవలన రసవిశేషాభి నిర్వృతి యున్నది. అగ్నియొకటి యయినను భౌమాగ్ని-దివ్యాగ్ని ఔదర్యాగ్ని యని జాతిభేదము కలదగును. దాహాలోక పాకాద్యర్థక్రియలు కలదగును, ధూమార్చిరంగారాద్యవస్థలు కలదగును. అట్లె రసమొకటి యయినను భావరసతదాభాసాది జాతిభేదములు ఉత్కంఠ-అభిషంగ-

నిర్వృత్త్యాద్యర్థ క్రియలు, ఉత్పాద - అభివృద్ధి - స్థైర్యాద్యవస్థలు కలదగుటు భావగోచరమగుచునే యున్నది.

౧. భావజాతి ఉదా:

హరస్తు కించిత్పరివృత్త ధైర్య
శ్చంద్రోదయారంభ ఇవాంబురాశిః
ఉమాముఖే బింబఫలాధరోష్ఠే
వ్యాపారయామాస విలోచనాని.

చంద్రోదయారంభమున సాగరమువలె హరదేవుడొకింత పరివృత్తధైర్యుడై బింబఫలాధరోష్ఠము కల యుమాముఖమునందు లోచనములు ప్రసరింపజేసెను. దీనిలో శివునకు చుంబనేచ్ఛాత్మకమయిన భావమభివర్తితమయినది. అది యిచట రసమునకు సంబంధించిన భావాఖ్య జాతిభేదము.

### రసజాతి

తం వీక్ష్య వేపథుమతీ సరసాంగయష్టిః
నిక్షేపణాయ పదముద్ధృతముద్వహంతీ
మార్గాచలవ్యతికరాకులితేవ సింధుః
శైలాధిరాజతనయా న యయౌ న తస్థౌ.

ఆ శివుని జూచి కంపము కలదై సరసదేహయై గమించుటకై నెత్తిన పదమునెత్తిపట్టి, మార్గమున పర్వత సంబంధమున వ్యాకులపడిన నదివలె శైలాధిరాజతనయ పార్వతి వెడలలేదు. ఉండనులేదు. దీనిలో పార్వతి రసవివశయై నిష్టబ్ధయయిన రీతి రసజాతి లక్ష్యము మగును.

### ఉత్కంఠార్థక్రియ

పశుపతిరపి తాన్యహాని కృచ్ఛ్రా
దగమయదద్రిసుతాసమాగమోత్కః

నము సంవాదించునవియె. నా కీలోకమున లోచనచంద్రిక యీయామె నయనములకు గోచరించుట నాయీ జన్మలో నిదియె మహోత్స వము. ఇందు నిర్వృతి రూపమయిన యాత్మ సుఖసంపత్తి యర్థ క్రియగా నిరూపిపిమి.

ఉ త్పా దా ర్థ క్రి య

ఉత్పత్తిర్దేవయజనాద్బ్రహ్మవాదీ నృపః పితా
సుప్రసన్నోజ్జ్వలా మూర్తిరస్యాః స్నేహం కరోతి మే

ఈ సీత దేవయజనసముత్పన్న ఈమె తండ్రి జనకనృపాలుడు బ్రహ్మవాది. సుప్రసన్నముజ్జ్వలమయిన యీయామెమూర్తి నాకను రాగముకలిగించుచున్నది. దీనిలో రసమయిన రాగోత్పాదనమున్నది

అ భి వృ ద్ధి క్రి య

కాంతే తల్పముపాగతే విగలితా నీవీ స్వయం బంధనాత్
తద్వాసః శ్లథమేఖలాగుణధృతం కించిన్నితంబే స్థితం
ఏతావత్సఖి వేద్మి సాంప్రతమహం తస్యాంగసంగే పునః
కోఽసౌ కాస్మి రతం చ కిం కథమితి స్వల్పాపి మే న స్మృతిః.

కాంతుడు శయ్యకు రాగా కోకముడి ముడివిడి తానే యూడి నది. జారిన మొలనూలుబట్టి వస్త్రమొకింత నితంబమున నున్నది. సఖి! నాకింతమాత్రమె తెలియును. ఆతని యంగసంగము కలుగగా ఆతడెవడో నేనెవతెనో! రమించెనో! ఎట్లురమించెనో! ఏమో! ఏమో! స్వల్పముగ నయిన నా కేమియు స్మృతిలేదు. దీనిలో నాయి కానురాగలీల యుత్తరోత్తర మభివృద్ధి పొందినరీతి మున్నది.

స్థై ర్యా ర్థ క్రి య

అద్వైతం సుఖదుఃఖయోరనుగతం సర్వాస్వవస్థాసు య
ద్విశ్రామో హృదయస్య యత్ర జరసా యస్మిన్నహార్యో రసః

కాలేనావరణాత్యయాత్పరిణతే యత్స్నేహసారే స్థితం
భద్రం తస్య సుమానుషస్య కథమప్యేకం హి తత్ప్రాప్యతే,

దీనిలో రాగస్థైర్యము సర్వవిశేషములందనుగతమైయున్నది. ఇట్లే యీ ప్రఘట్టమున భావవిశేష – రసవిశేష – ఆభాసవిశేషములను భావింపవచ్చును. ఇట్లు గుణరస తదాభాసభాసముల కలంకారత్వమవస్థాపితము కాగా నీ యలంకార సంకరము షట్ప్రకార మగుచున్నది.

గుణసంకరము – రససంకరము

అలంకారసంకరము – గుణరస సంకరము.

గుణాలంకార సంకరము – రసాలంకార సంకరము.

గుణములకు సంకర వ్యవహారముపన్నమగునా? గుణము లెన్నియున్నను "గుణవత్" అను వ్యపదేశమెయున్నదికదా? ఈ శంక తగదు. గుణములు మూడువిధములు.

శబ్దగుణములు–అర్థగుణములు–దోషగుణములు. ఈ మూడును ప్రత్యేకముగా మూడువిధములు సోల్లేఖములు–నిరుల్లేఖములు అందు శబ్దగుణములలో సమాధి – మాధుర్య – ఔదార్య – గాంభీర్యాదులు సోల్లేఖములు, శ్లేష – ప్రసాద – సౌకుమార్యాదులు నిరుల్లేఖములు. అర్థగుణములలో శ్లేష – ప్రసాద – రీతి – కాంత్యాదులు సోల్లేఖములు. అర్థవ్యక్తి – సౌక్ష్మ్య–గాంభీర్య – సమ్మితత్వాదులు నిరుల్లేఖములు. దోషగుణములలో గ్రామ్య – పునరుక్త – అపార్థ – వ్యర్థాదులుసోల్లేఖములు. శబ్దహీన – సంశయ – అపక్రమ – విసంధ్యాదులు నిరుల్లేఖములు. అందుసజాతీయములగు సోల్లేఖములకువలె విజాతీయములగు నిరుల్లేఖములకును సంకరవ్యవహారము ప్రవర్తించును.

నవపల్లవేషు లోలతి మూర్ఛతే । విటపేషు వలతే శిఖరేషు
స్థగతి స్తబకేషు చ తథా । వసంతలక్ష్మీరశోకస్య.

అశోకము యొక్క వసంతలక్ష్మి పల్లవములందు కదలుచున్నది. విటపములలో ఘూర్ణితమయినది శిఖరములందు వలనము పొందినది గుత్తులలోదాగినది. దీనిలో శబ్దగుణములందు సజాతీయములయిన సమాధ్యాది గుణములకు సంకరమున్నది. అన్యధర్మముల నన్యస్థలముల నారోపించుట యను యొసమాధి పృథక్పదతా రూపమయిన మాధుర్యము, బంధవికటతారూపమగు ఉదారత, ధ్వనిమత్తారూపమైన గాంభీర్యము అను సజాతీయగుణములు సంకీర్ణములయినవి. "వసంతలక్ష్మీః అశోకస్య" అనుపదములందు శబ్దధ్వనియు పరిస్ఫూర్తమగును. ఒకానొక వీతశోకుడయిన కాముకుని యంగములందు ప్రియాంగన సవిలాసముగ చేష్టించుట వలెనిందు నశోకమునకు లక్ష్మియున్నది.

జనః పుణ్యైర్యాయాజ్జలధిజలభావం జలముచ
స్తథావస్థం చైనం విదధతు శుభైః శుక్తివదనే
తతస్తాం శ్రేయోభిః పరిణతిమసౌ విన్దతు యయా
రుచిం తన్వన్ పీనస్తని హృది తవాయం విలురతి.

జనుడు తన పుణ్యవిశేషములచే జలధిజలభావము పొందుగావుత. జలభావముననున్నవానిని శుభాచరితములను బట్టి శుక్తివదనమున జలముక్కలు మేఘములు కూర్చుగావుత. ఆపిమ్మట శ్రేయోవిశేషములచే నాతడా పరిణతిని బొందుగావుత. అట్టి పరిణతివిశేషమున కాంతిని విస్తరింపజేసికొని ఓసి పీనస్తనీ! నీ హృదయమున దొరలుచున్నాడు కదా! దీనిలో సంవిధానక సూత్రతారూపమయిన శ్లేషగుణము. అర్థప్రకటతారూపమయిన ప్రసాదము, ఉత్పత్త్యాది క్రియాక్రమాత్మకమయిన రీతి. గుప్తగుణతా రూపమయిన కాంతి యను సజాతీయములయిన యర్థగుణములు సాంకర్యము పొంది యున్నవి.

### గ్రామ్యాది దోషగుణ సంకరము.

హన్యతే సా వరారోహా స్మరేణాకాండవైరిణా
హన్యతే చారుసర్వాంగీ హన్యతే మంజుభాషిణీ

ఆ వరారోహ యకాండవైరియయిన మన్మథునిచే చంపబడు చున్నది. సర్వాంగసుందరయయిన యామె చంపబడుచున్నది. మంజుభాషిణి చంపబడుచున్నది. దీనిలో 'హన్యతే' యనునసుంగ లార్థము, 'వరారోహ' యను నశ్లీలార్థము, హన్యతే హన్యతే హన్యతే అను పునరుక్తి 'చారుసర్వాంగీ' అనిచెప్పియు 'వరారోహ' యనుట వలని వ్యర్థము అను సజాతీయములయిన నాలుగు దోష గుణములు సంకీర్యమాణములై యొక యున్మత్తభాషి యనుకంపా ద్యతిశయ వివక్ష నాపాదించియున్నవి. ఈ యంశమిట్లు నిరుక్త మయినది.

అనుకంపాద్యతిశయో యది కశ్చిద్వివక్ష్యతే
న దోషః పునరుక్తాదౌ ప్రత్యుతేయమలంక్రియా,

ఒక యనుకంపాద్యతిశయము వివక్షితమయినచో నది పున రుక్తాదులలో దోషముకాదు. ప్రత్యుత యది యలంకారమె యగును.

అసజాతీయశబ్దార్థగుణసాంకర్యము

కో నామ నోదయతి నాస్తముపైతి కో వా
లోకోత్తరః పునరయం సవితా జగత్సు
యత్రోదయాస్తమయభాజి రుచాం నిధానే
ద్వేధా భవత్యహరితి క్షణదేతి కాలః.

ఎవడుదయింపడు? ఎవడస్తమింపడు? కాని జగములంగీ సూర్యుడు లోకోత్తరుడు తేజోనిధానమయిన యీతడుదయాస్త మయములు పొందగా పగలని రాత్రియని కాలము రెండువిధములు విభక్తమగుచున్నది. దీనిలో యావదర్థ పదతారూపమయిన సమిశ్ర

లత్వము, బంధవికటతయయిన యుదారత, శ్లాఘ్యవిశేషణ యోగ రూపమయిన యుదాత్తత అను శబ్దగుణములు, ఉత్కర్షనిర్వాహ రూపమయిన ప్రౌఢి అర్థప్రకటతారూపమయిన ప్రసాదము, రూఢాహంకారితారూపమయిన యూర్జిత్యము అను నర్థగుణములు సంకీర్ణము లయినవి.

## శబ్దగుణదోషగుణ సాంకర్యము.

ఏహ్యేహి వత్స రఘునందన పూర్ణచంద్ర
చుంబామి మూర్ధని చిరాయ పరిష్వజే త్వాం
ఆరోప్య వా హృది దివానిశముద్వహామి
వందేఽథవా చరణపుష్కరకద్వయం తే.

వత్సా! రఘునందనా! పూర్ణచంద్రా! రా! రా! నీతలపై చుంబింతును చిరకాలమునకు నిన్ను కౌగిలింతును దివానిశము నిన్ను గుండెలపై మోపుకొని వహింతును. నీపాదపద్మద్వయము నమస్కరింతును. ఇందులో భావకవాక్యనివృత్తి రూపమయిన భావికత్వము, ససిద్ధార్థపదతా రూపమైన ప్రసాదము, ప్రియార్థ పదాఖ్యానమైన ప్రేయస్సు అను శబ్దగుణములు, ఏహి ఏహి అను పునరుక్తము, 'వత్స' అనిపలికి నీపాదాబ్జద్వయము నమస్కరింతునను విరుద్ధము "మూర్ధ్ని చుంబామి. హృదివహామి, పాదౌవందే అను క్రియలలో నుపయోగింపనందున పూర్ణచంద్ర అనువ్యర్థము అనుదోషగుణములు పరస్పరము సంకీర్ణము లయినవి. రసావేశాదులలో పునరుక్తాదులు దోషములు కావు.

## అర్థగుణ దోషగుణ సాంకర్యము.

కిం ద్వారి దైవహతికే సహకారకేణ
సంవర్ధితేన విషపాదప ఏష పాపః

అస్మిన్నవాగపి వికాసవికారభాజి
భీమా భవంతి మదనజ్వరసన్నిపాతాః

ఓసీ! దైవహతికా: ద్వారమున నీసహాకారము పెంచు టేల? ఈ విషపాదపము పాపరూపము. ఇది స్వల్పముగనైన వికాసవికారము పొందునేని మదనజ్వర సన్నిపాతములు భయంకరములగును. దీనిలో దీప్తరసతారూపమైన కాంతి అర్థప్రాకట్యరూపమైన ప్రసాదము ఉక్తార్థనిర్వాహణరూపమైన ప్రౌఢియను నర్థగుణములున్నవి. 'దైవహతికే విషపాదపోయం పాప ఇత్యాద్యమంగలార్థము గ్రామ్యము 'కిమనేన సంవర్ధితేన అనుచోట కర్తవ్యప్రయోజన మధ్యాహార్యము. మదనజ్వర సన్నిపాత స్థలమున విరహి ద్రష్టృజనాధ్యాహారమావశ్యకము. అందువలన అసంపూర్ణవాక్యత కలుగును. కావున అర్థవ్యక్తి విపర్యయమున్నది.'వికాసవికారభాజి' యనుచో పుష్పవిషయమైన వికాసశబ్దమును వృక్షమున ప్రయోగించుట తగదు. కావున అసమర్థము దోషము. ఇట్లు దోషగుణములు మిథస్సంకీర్ణములైనవి. రసాక్షేపమున్నందున నిచట నమంగలాదులు దోషములుకావు.

౧. పరిహాస లోకోక్తులలో నమంగలము దోషముకాదు.

౨. ప్రసిద్ధిలో నధ్యాహారము దోషముకాదు.

3. దరీవదతి - మంచాఃక్రోశంతి అను ప్రయోగము లున్నందున ఆధారాధేయములకభేదోపచారముండవచ్చును.

౪. విరుద్ధలక్షణావిధానమున ప్రయోగించుట దోషముకాదు. ఇట్లు దోషములు దోషగుణములగును. ఇవియు నర్థగుణములిందు సంకీర్ణములైయున్నవి.

గుణములు శబ్దార్థదోషగుణ భేదమున త్రివిధములైనందున సోల్లేఖ నిరుల్లేఖతా విధానమున సంకరవ్యవహార ముండుగావుత

రసములకు సంకరవ్యవహారమెట్లు కుదురును. సంకరమనేక సాధ్యము శృంగారమొక్కటియే రసముకదా ! హాస్యాద్భుతాదిరసములకు సాంకర్యమెట్లు ప్రవృత్తమగును ?

ఉచ్యతే, శృంగారమొక్కటియె రసము. అయినను తత్పరిభవము లైనరత్యాదు లుద్దీపనవిభావములచే నుద్దీప్యమానములై తదనుప్రవేశమునను సంచారులకనుభావములకు నిమిత్తములై రసవ్యపదేశము పొందగలవు. ఇది భావింపుడు. అభిమానము రత్యాదులకు నిమిత్తము. చేతోధర్మమున రహస్యమానమై రసమగును, అట్లే రత్యాదులును, అభిమానాను ప్రవేశమున హర్షధృతి చింతౌత్సుక్యాదులకు మనోవాక్కాయ బుద్ధిశరీరారంభము లయిన చేష్టలకు (అనుభావములకు) నిమిత్తములై చేతోధర్మమున రస్యమానములై 'రసము' లని వ్యవహారము పొందగలవు. అన్నియు యుగపద్భావమున నుండుటచే సంకర వ్యవహారమును అభిజ్ఞులు కల్పించుచున్నారు. రత్యాదు లుత్పత్తిలో భావములు ప్రకర్షమున. రసములు విపర్యయమున రసాభాసములు, ప్రవిలయమున ప్రశమములు. ఇట్లివి భిన్నములై సంకీర్ణము లగును,

తత్సంకర మారు విధములనుండును.

భావసంకరము – రససంకరము – భావాభాససంకరము
రసాభాససంకరము – భావప్రశమసంకరము – రసప్రశమసంకరము

### భా వ స ం క ర ము

న్యక్కారో హ్యయి వజ్రకీల ఇవ మే తీవ్రః పరిస్పందతే
ఘోరాంధే తమసీవ మజ్జతి మనః సమ్మీలితం లజ్జయా
శోకస్తాత్యవిపత్తితో దహతి మాం నాస్త్యేవ యస్మిన్ క్రియా
మర్మాణ్యేవ పునశ్ఛినత్తి కరుణా సీతాం వరాకీం ప్రతి.

నా హృదయమున నీ తిరస్కారము వజ్రకీలము వలె తీవ్రముగా నున్నది. లజ్జా మీలితమై మనస్సు ఘోరాంధకారమున

మునిగిపోవుచున్నది. జటాయువు విపత్తి వలన గలిగిన శోకము నన్ను దహించుచున్నది. చేయునది లేదు సీతావిషయమున కర్ణ మర్మములనే ఛేదించుచున్నది. దీనిలో అమర్ష-లజ్జ - శోకము-ప్రీతి అనునవి సమకక్ష్యముగా నుండి తిలతండులవిధానమున పరస్పరము సంకీర్యమాణములై విరహియయిన రాముని వాగారంభాను భావోక్తి పరములై ప్రతీయమానము లగుచున్నవి.

రససంకరము

క్షిప్తో హస్తావలగ్నః ప్రసభమభిహతోఽప్యాదదానోంశుకాంతం
గృహ్ణన్ కేశేష్వపాస్తశ్చరణనిపతితో నేక్షితః సంభ్రమేణ
ఆలింగన్యోవధూతస్త్రిపుర యువతిభిః సాశ్రునేత్రోత్పలాభిః
కామివార్ద్రాపరాధః స దహతు దురితం శాంభవో వః శరాగ్నిః

త్రిపురదాహ సమయమున శాంభవశరాగ్ని రక్షోవనితాంతః పురముల ప్రవేశించి క్షిప్త మయ్యు హస్తావలగ్నమై అభిహతమయ్యు నంశుకాంతము పట్టినదై కేశగ్రహణ మొనర్చియు నపాస్తమై చరణనిపతితమయినను నీక్షితమై యాలింగన మొనర్చునది యయిన నవధూతమై యార్ద్రాపరాధ మొనరించిన కామి వలె సజలనయన లయిన త్రిపురయువతులచే జూడబడ లేదు. ఆ శాంభవాగ్ని మీ దురితము దహించుగావుత. ఇందు హరప్రభావ వర్ణనమున నున్న శృంగారము కరుణములు మత్స్యండమున పాంసూదకము వలె (బురదనీరు) ప్రధానాంగభావమున సంకీర్ణము లయినవి త్రిపుర రిపుప్రభావాతిశయమంగి. శృంగాకరుణము లంగములు. ఈ రెండునందు సంకీర్ణములు.

భావాభాససంకరము

అః సీతే, పతిగర్వవిభ్రమ భర భ్రాంతభ్రమద్బాంధవ
ప్రధ్వంస స్మిత కాంతిమత్తవ తదాజాతం యదేతన్ముఖం
సంప్రత్యేవ హఠాత్తదేవ కురుతే కేశోచ్చయాకర్షణ
త్రాసోత్తానిత లోలలోచన పతద్బాష్పప్లుతం రావణః.

ఓసీ సీతా! నీ ముఖ మిప్పుడు పతిగర్వభ్రమచే తిరిగి బాంధవ వినాశమున స్మితకాంతి కల దయినది కదా! ఈ రావణు డిప్పుడే హాసమున నీ జుట్టు పట్టి లాగి చెదర గొట్టి మిడిగ్రుడ్లుచేసి స్రవించు కన్నీటితో జడిపట్టు నట్లు చేయును సుమీ! ఇందలి క్రోధాభాసము మునందు ఛాయాదర్శన్యాయములు రత్యాభాసములు సంకీర్యమాణ ములై యున్నవి.

### ర సా భా స స ం క ర ము

ఏకేనార్కం ప్రవితతరుషా పాటలేనాస్తసంస్థం
పశ్యత్యక్ష్ణా సజలతరలేనాపరేణాత్మకాంతం
అహ్నశ్ఛేదే దయితవిరహాశంకినీ చక్రవాకీ
ద్వౌ సంకీర్ణౌ రచయతి రసౌ నర్తకీవ ప్రగల్భా

సాయంసమయమున ప్రియవిరహము కలుగు నని శంకించు చక్రవాకి ప్రగల్భ యయిన నర్తకి వలె సంకీర్ణము లయిన రెండు రసములను రచించుచున్నది. అధికకోపము కల యెఱ్ఱని యొక కంటితో నస్తమించు సూర్యుని జూచు చున్నది. సజలతరల మయిన వేరొక కంటితో తన ప్రియుని జూచు చున్నది. దీనిలో నరసింహ జాతిలో సింహ నరభాగములు సంకీర్ణము లయినట్లు చక్రవాకిలో రోష శోక ప్రకర్షములు గోచరించుచు సంకీర్ణము లయినవి.

### భా వ ప్ర శ మ స ం క ర ము

దృష్టే లోచనవన్మనా ముకులితం పార్శ్వస్థితే చక్రవ
న్న్యగ్భూతం బహిరసితం పులకవత్ స్పర్శం సమాతన్వతి
నీవీబంధవదాగతం శిథిలతామాభాషమాణే తతో
మానేనాపగతం హ్రియేవ సుతనోరంఘ్రిస్పృశి ప్రేయసి.

సఖీవిఖ్యాత మయిన మానసంవిధానము కల యొకానొక మానవతి కోపచేష్ట యిందు వర్ణితము. ప్రియుడు వచ్చి చూడగా

సుతను వనిత మానము లోచనమార్గమున ముకులిత మయినది. ప్రియుడు పార్శ్వమున నుండగా చక్రమువలె వెను దిరిగినది. ప్రియుడు స్పృశింపగా పులకము వలె వెలువడినది. ప్రియుడు సంభాషించుచుండగా నీవీబంధము వలె శిథిలమయినది. ప్రియుడు పాదము పట్టగా శిగ్గువలె జారిపోయినది. దీనిలో మానవతీ హర్ష భావము ప్రియ దర్శన మను నాలంబనవిభావమున నుత్పన్న మయినది. ఈ హర్షము ప్రకృష్ట రతి ప్రభవము. ప్రియుని పార్శ్వోపసర్పణాదు లిం దుద్దీపన విభావములు. వానిచే హర్ష ముద్దీప్త మయినది. పులకాదు లుత్పన్నములు కాగా సుఖాత్మకము లయిన వ్యభిచారిభావములు కలుగగా నయననిమీలనము – అధోముఖత్వము – నీవీస్రంసనము మొదలగు ననుభావములు హర్షభావమునకు పరప్రకర్ష మాపాదించినవి. అప్పుడది యానందరసత్వము పొందినది. ప్రబలవిరోధి భావాంతరోదయము వలన నీ కారణముల వలననే లజ్జారోషములు ప్రతిక్షణము హ్రాసము పొందినవై సమకక్ష్యతారూపమున నుండి ప్రశమస్వభావము పొందుచున్నది. ఇట్టి యీ లజ్జారోషములు క్షీరనీరముల వలె సంకీర్యమాణములై యిందు ప్రతీతములయినవి.

## రస ప్రశమ సంకరము

విరోధో విశ్రాంతః ప్రసరతి రసో నిర్వృతిఘనః
తదౌద్ధత్యం క్వాపి వ్రజతి వినయః ప్రహ్వయతి మాం
ఝడిత్యస్మిన్ దృష్టే కిమితి పరవానస్మి యది వా
మహార్ఘస్తీర్థానామివ హి మహతాం కోప్యతిశయః.

ఆ విరోధము విశ్రాంత మయినది నిర్వృతిఘన మగు రసము ప్రసరించు చున్నది. ఆ యౌద్ధత్య మెటకో పోయినది. వినయము నన్ను ప్రహ్వునిచేసినది. నేనీతని (శ్రీరాముని) చూడగానే యిట్లు పరాధీనుడ

నయితిసేమి? తీర్థములకు వలె మహాత్ముల యొక్క యతిశయము మహార్థము కదా! దీనిలో హాసము ఔద్ధత్యరసము స్వాతంత్ర్య రసములు మూడును ఆనందరస ప్రశమరస పారవశ్యరసములచే తిరస్కృతము లగుచున్నవి. వస్త్రమున సితాదివర్ణములు నీలాదివర్ణములచే తిరస్కృతములగును గదా! లవకుని రామదర్శన ప్రభావము వలన సముత్పన్న మైన విస్మయాతిశయమున వాగారంభానుభావము చిత్ర వర్ణము వంటివలె సంకీర్యమాణమై యున్నది

## అలంకారసంకరము

వ్యక్త మని యవ్యక్త మని యుభయాత్మక మని యలంకార సంకరము తిలతండులకాది భేదములతో ప్రధానాంగభావమున సమ కక్ష్యతారూపమున నుండుట పూర్వప్రకాశములందు నిరూపితమె. అయినను అది గుణాదిసంకర సాధారణమె యయి నందున ప్రస్తుతి మసాధారణ ప్రకారము నిరూపించుట యుక్తము. అలంకారసంకర మారువిధములు.

శబ్దాలంకారసంకరము – అర్థాలంకార సంకరము
ఉభయాలంకారసంకరము – శబ్దార్థాలంకార సంకరము
శబ్దోభయాలంకారసంకరము – అర్థోభయాలంకార సంకరము,

వీనిలో శబ్దార్థాలంకారసంకర మీ విధమున నుండును.

సర్వాశారుధి దగ్ధవీరుధి సదాసారంగబద్ధక్రుధి
క్షామక్ష్మారుహి మన్దమున్మధులిహి స్వచ్ఛందకందద్రుహి
శుష్యత్స్రోతసి తప్తభూరిరజసి జ్వాలాయమానాంభసి
జ్యేష్ఠే మాసి ఖరార్కతేజసి కథం పాంథః వ్రజన్ జీవసి

పాంథా! ఈ జ్యేష్ఠమాసములో ప్రయాణ మొనరించుచు నీ వెట్లు జీవింతువు? ఈ మాసము సర్వాశల నడ్డుపరచినది. లతలను తగులబెట్టినది. సారంగములపై సదా కోపమునను్నది. వృక్షము

లెండిపోయినవి తుమ్మెదల సంతసము తగ్గినది, స్వాచ్ఛంద్యము పోయినది. నదులెండినవి. పరాగము వేడెక్కినది. నీరు వేడెక్కినది. సూర్యతేజము ప్రఖరముగానున్నది. దీనిలో నావంతీరీతి, పదముద్ర వాక్యముద్ర అనుప్రాసముఅను శబ్దాలంకారములున్నవి. జాతి కారకజ్ఞాపక హేతువు చిత్రహేతువు అను అర్థాలంకారము లున్నవి. ఇవి ఇందు సంకీర్ణము లయినవి. ఇతరములగు నుదాహారణములు సర్వత్ర సులభములు.

## గు ణ ర స సం క ర ము

గుణములకు రసముల కలంకారములకు సంకరముండవచ్చునా గుణరస సంకర మెట్లుపపన్నము కాగలదు? దోషహానము వలె గుణోపాదానమును నియముగా సంపాద్యము. అలంకారయోగము వలె రసావియోగము నవశ్యవిధేయము. ఒకప్పు డలంకార యోగము వ్యజ్యమాన మగును. రసావియోగము గుణయోగమట్లుకాదు. వ్యభిచరిత సంబంధములు కల పదార్థములు పరార్థాంతరములతో తిల తండుల విధమున క్షీరనీరముల భంగి సంసృజ్యమానము లగుచో సంకరబుద్ధి నుత్పాదించుట యున్నది. అవయవావయవివిధానము వలె జాతి వ్యక్తిరీతి వలె నవ్యభిచరిత సంబంధము కలవి యట్లు సంకీర్యమాణములు కావు. కావున గుణరస సంకరమెట్లు సిద్ధ మగునని శంక కలుగును.

“అత్రాపి బ్రూమః” ఇందు నిట్లు చెప్పెదము. అపృథగ్యత్న నిర్వర్త్యమానము లగు గుణరసములకు వాక్యమునం దవయవావయవి న్యాయమున సన్నివేశ ముండు స్థలమున సంకరవ్యవహారము ప్రవర్తింపదు.

మధురం రసవద్వాచి వస్తున్యపి రసస్థితిః
కామం సర్వోప్యలంకారో రసమర్థే నిషించతి

శృంగార ఏవ మధురః పరం ప్రహ్లాదనో రసః
తన్మయం కావ్యమాశ్రిత్య మాధుర్యం ప్రతిష్ఠతి
శృంగారే విప్రలంభాఖ్యే కరుణే చ ప్రకర్షవత్
మాధుర్యమార్ద్రతాం యాతి యతస్తత్రాధికం మనః
రౌద్రాదయో రసా దీప్త్యా లక్ష్యంతే కావ్యవర్తినః
తద్వ్యక్తిహేతూ శబ్దార్థావోజోధిష్ఠాయ తిష్ఠతి
సమర్పకత్వం వాక్యస్య యత్తు సర్వరసాన్ప్రతి
స ప్రసాదో గుణో జ్ఞేయః సర్వసాధారణక్రియః

ఈ కారికల భావ మిట్లు గ్రాహ్యము. శృంగారాదిరసాపేత మగు వాక్యము మధురము – మాధుర్య మను గుణము కలది. వాక్య రచనాహేతు వగు నా యా వర్ణము నందును రస ముండును. వాక్య ప్రతిపాద్య మగు వస్తువు నందును రసస్థితి కలదు. మధువుచే మధు వ్రతముల వలె రసముచే సహృదయు లానందింతురు. సర్వాలంకార ములు రసము నర్థము నందు కూర్చి పోషించును. శృంగారము పర ప్రహ్లాదన మయిన రసము. శృంగారము మధురము. శృంగారమయ మైన కావ్యము నాశ్రయించి మాధుర్యమను గుణము ప్రతిష్ఠితమగు చున్నది సంయోగశృంగార మందు కంటె కన్న విప్రలంభ శృంగా రమునందంత కన్నను కరుణమునందును మాధుర్యగుణము సాతిశయ ముగ నుండును. వానిలో మనస్సధికముగా నార్ద్రత పొందును కావ్యములందు రౌద్రాదిరసములు దీప్తిపదముచే లక్షితములగును. కావుననె వానిని దీప్తియనియు వ్యవహరించుట గలదు. అట్టిదీప్తి వ్యక్తిహేతువు లయిన శబ్దార్థముల నాశ్రయించి ఓజోగుణముం డును. సర్వరసముల నుద్దేశించి వాక్యమునకే సమర్పకత్వ ముండునేని యది ప్రసాదమగు.గుణ ప్రసాదగుణము సర్వరససాధారణము సర్వ రచనా సాధారణమునగును. ఇట్లా యాగుణములకు వ్యవస్థసంపన్నమై యున్నది.

మాధుర్యము ఓజస్సు ప్రసాదము అను గుణముల వ్యవస్థ యిట్లుండగా గుణములు రసారంభకము లయినచో సంకర ప్రసిద్ధి యుండదని రసములు గుణారంభకము లయినను సంకర ప్రసిద్ధి యుండ దని గ్రహింప వలెను. ఎచట తిలతండులముల వలె క్షీరనీరములవలె ఛాయాదర్శములవలె తుల్యకక్ష్యతగా వాక్యమున నపృథగ్యత్న నిర్వర్త్యము లగు గుణరసముల వినివేశ ముండునో యచట సంకర వ్యవహారము సంగతమగును ఇట్టి గుణరస సంకరమారువిధముల నుండును.

గుణప్రధానము – రసప్రధానము – ఉభయప్రధానము
ఉభయాప్రధానము – గుణాధికము – రసాధికము.

గుణప్రధాన సంకరము

అత్రాంతరే లలిత హారలతా నితంబ
సంవాహనస్ఖలిత వేగతరంగితాంగీ
దేవీ వ్యపాస్య శయనం ధృతమానతంతు
రంతంపురం గతవతీ సహ సౌవిదల్లైః

ఈ సమయమున లలితహారముకల నితంబము వహించుటచే తొట్రుపడిన వేగమున మెలికలు తిరిగిన యంగములుకలదై దేవి శయనము విడనాడి కోపమువహించి పరివారముతో నంతఃపురమునకు బోయినది. దీనిలో నర్థప్రాకట్య మను నర్థగుణము ఔదార్యమను శబ్దగుణము రెండును ప్రాధాన్యము కలిగియున్నవి రతి క్రోధములకు ప్రాధాన్యము లేదు. కాననిది గుణప్రధానమయిన సంకరము.

రసప్రధాన సంకరము

అస్మిన్నగృహ్యత పినాకభృతా సలీల
మారబ్ధవేపధురధీరవిలోచనాయాః
విన్యస్తమంగలమహౌషధిరీశ్వరాయాః
స్రస్తోరగప్రతిసరేణ కరేణ పాణిః.

కల్యాణ సమయమున పినాకియగు శివుడు అధీరలోచన యగు పార్వతియొక్క వేపథువృకల మంగలమహౌషధికల హస్తమును సర్వకంకణము విడదీసి గ్రహించెను. దీనిలో శ్లాఘ్యవిశేషణయోగ రూపమయిన యుదాత్తత్వము బంధవికటతారూపమయిన యుదారత అర్థప్రకటతా రూపమగు ప్రసాదము, దీప్తరసతారూపమగు కాంతి యనుగుణములు కలవు. అవిసాధ్వ సవిలా సానురాగ సంగమ రసములతో నతిశయము కలవయినవి. గుణములకన్న రసస్థితియె ప్రధానమయినది.

ఉ భ య ప్ర ధా న సం క ర ము.

ఆపాతమాత్రరసికేః సరసీరుహస్య
కిం బీజమర్పయితుమిచ్ఛసి వాపికాయాం
కాలః కలిః జగదిదం న కృతజ్ఞమజ్ఞే!
స్థిత్వా హరిష్యతి తవైవ ముఖస్య శోభాం.

ఆపాతమాత్రరసికా! పద్మబీజమును వాపికలో నర్పింపదలచితి వేమి? ఇది కలికాలము అజ్ఞురాలా! ఈ జగము కృతజ్ఞముకాదు. ఉండియుండి నీ ముఖశోభనది హరింపగలదు. ఇందు భణితివిశేష మగు ఉక్తి, సంవిధానమున సుసూత్రతారూపమగు శ్లేష అనుశబ్ద గుణములకును లావణ్య విలాస వర్ణనీయరసములకును తుల్యకక్ష్యతా రూపమున నిర్దేశమున్నది. కావున నుభయప్రధానము.

ఉ భ యా ప్ర ధా న సం క ర ము

అభినవవధూరోషస్వాదుః కరీషతనూనపాత్
అసరలజనాశ్లేషక్రూరస్తుషార సమీరణః
గలితవిభవస్యాజ్ఞేవాద్య ద్యుతిర్మసృణా రవేః
విరహివనితావక్త్రక్లైబ్యం బిభర్తి నిశాకరః

పిపాక విష్ణు నవఘనాఘోషస్వానము. మంచుగాలి యసరలజనాలింగనమువలె క్రూరము. సూర్యుని మసృణకాంతి సంపదపోయిన వానిపొజ్ఞనానున్నది. చంద్రుడు విరహిణీ ముఖక్లైబ్యము వహించుచున్నాడు. ఇందున్నాడు-క్రూర - మసృణ - క్లైబ్యము లన్యధర్మములు అన్యత్రారోపితము లైనవి. కావునసమాధిగుణము. అభినవ ఘనాఘోషాదులకు లక్షణాలక్షితములయిన స్వాదుప్రభృతులకు ప్రాకట్య మున్నందున ప్రసాదము ''అభినవఘనాఘోషస్వాదుః - కరీషతనూనపాత్'' అని విశేషణ విశేష్యముల నుప్రక్రమమున నిర్వహించుట రీతి. నాలుగుపాదములందు నాలుగర్థములను సమానముగా నివేశింపజేయుట సమ్మితత్వము. ఇట్లు నాలుగు గుణము లున్నవి. గతి - అమర్ష - విషాద-జుగుప్సా రూపములయిన నాలుగు రసములు కాలావస్థావిశేషపరములై ప్రతీతము లగుచున్నవి. గుణములకు గాని రసములకుగాని ప్రాధాన్యము లేదు. కావునిది యుభయాప్రధాన సంకరము.

## గు ణా ధి క స ం క ర ము

అజననిరస్తు విభూతేరపూరణిర్భవతు సర్వకామానాం
మా యాచిషి మా సేవిషి మా సహిషి పరాభవం ధనినః.

ఐశ్వర్యముకలుగకపోనీ! సర్వకామములకు పూరణము లేకపోనీ! యాచింపను. సేవింపను. ధనికపరాభవముసహింపను. దీనిలో సుప్తిఙ్ వ్యుత్పత్తి రూపమయిన సౌశబ్ద్యము వాక్యములకు పరిపూర్ణతారూప మయిన యర్థవ్యక్తి అర్థప్రకటతారూప మయిన ప్రసాదము. ఐశ్వర్యము కలుగకున్న కోరికలునిండవు. అపరిపూర్ణ కాముడు యాచించును. యాచించువాడు కోరిక పొందలేక ధనికుల సేవించును. సేవించువాడు ధనికులచే పరిభూతుడగును ఇట్లుత్పత్త్యాదిక్రియాక్రమమున్నందున రీతి. ఇట్లు నాలుగు గుణములు కలవు. నిర్వేద మొక్కటియె రసము కావున గుణాధికము ఇకనిందు యాచిషి-సేవిషి-సహిషి'' పదముల రమ్యతభావనీయము.

రసాధిక సంకరము

కమలమనంభసి కమలేచకువలయేతాని కనకలతికాయాం
సా చ సుకుమారసుభగా ఇత్యుత్పాతపరంపరాకేయం?

నీరు లేనిచోటకమలము. కమలమునందు కువలయములు ఆకమలకువలయములు కనకలతికయందున్నవి. ఆమె కుసుమార సుభగ. ఈ యుత్పాతపరంపర యేమి? ఒకచోనుండదగిన వానిని వేరొకచో వర్ణించుటవలని సమాధి, సుకుమార సుభగ - ఉత్పాతపరంపర అనుటచే అశ్లీలామంగలార్థములయిన దోష గుణములు నున్నవి. శ్లాఘ్యవిశేషణయోగమున నుదాత్తత వికటబంధత్వమున నుదారత, ఉపక్రమాభేదమున రీతి, అర్థప్రాకట్యమున ప్రసాదము అనిష్ఠురత్వమున సౌకుమార్యము అభీప్సితమత్వమున ప్రేయస్సు దీప్తరసత్వమున కాంతియని పదిగుణములిందు భావనీయములు. రత్యుత్కర్షము - హర్షము - ధృతి - ఉత్కంఠ - ఆవేగ - విస్మయ - మతి - వితర్క - చింత - చపలత - హాస - ఉత్సాహ - స్తంభ - గద్గద - ఉన్మాద-వ్రీడ - అవహిత్థ - భయ - శంక అనునవి వాగారంభాను భావమున నున్నవి. ప్రియచాటుకారియగు నొక శృంగారికి సంబంధించిన విధమున నివి ప్రతీయమానములగును. కాన నిది రసాధిక సంకరము.

గుణాలంకారసంకరమునను ఆరువిధములనున్న సమాధిగుణమునకు ప్రాధాన్యము నిరూపిత మగును. ఈ విషయమిట్లు నిరూపితమయినది.

తదేతత్కావ్యసర్వస్వం సమాధిర్నామ యో గుణః
కవిసార్థః సమగ్రోపి తమేనమనుధావతి

సమాధిగుణ మనునది కావ్యసర్వస్వముగా సంభావనార్హము. కవు లందరు సమాధి ననుసరింతురు, ఈ సమాధి మూడువిధములు.

౧. ఏకధర్మాధ్యాససమాధి
౨. అనేకధర్మాధ్యాససమాధి
3. అధర్మాధ్యాససమాధి

వీనిలో ననేక ధర్మాధ్యాసమున సమాధి యుభయాలంకార మగుట సమ్మతము. ఏకధర్మాధ్యాసమున సమాధి రెండువిధములు శబ్దగుణరూపము – దోషగుణరూపము.

"కుముదాని నిమీలంతి కమలాన్యున్మిషంతి" అని నపుడు నేత్రక్రియాధ్యాసయున్నది. నిమీలన మున్మేషము నేత్రక్రియలు కుముదకమలము లందా రోపితము లయినవి. ఇది శబ్దగుణరూపమైన ఏకధర్మాధ్యాసమున సమాధిగుణము. దోషగుణములలో నిష్ఠ్యూత – ఉద్గీర్ణ – వాంత ప్రభృతిపదములు గౌణవృత్తి వ్యాప్రాశయమున నతిసుందరములయినను గౌణధర్మము లేనపుడు గ్రామ్యకక్ష్యననుస రించిన వగును.

"పద్మములు సూర్యకిరణ నిష్ఠ్యూతములయిన వహ్నికణము లను పానమొనర్చి యుద్గీర్ణారుణరేణువులు కల ముఖములచే మరల వమనమొనరించుచున్న" వనియనుట హృద్యముగ నుండును గాని "నిష్ఠీవతి వధూః" అనుట హృద్యము కాదు. అనేకధర్మముల నొకే పర్యాయము సమారోపమున నిరూపించుట యలంకృతి యగును.

గురుగర్భభరాక్లాంతాః స్తనంత్యో మేఘపంక్తయః
అచలాధిత్యకోత్సంగమిమాః సమధిశేరతే.

ఈ మేఘపంక్తులు గురుగర్భ భరక్లాంతములై శబ్దించుచు ప్రాంతపర్వతముల యుత్సంగమున శయనించియున్నవనుటలో ననేక ధర్మాధ్యాస మున్నది. గర్భిణీధర్మములిచట చాలగలవు.

ధర్మాధ్యాసము గుణాలంకారసంకరమున ప్రధానమగును. "గుణవత్యేవ వాక్యేఽలంకారయోగః గుణసహిత వాక్యమున నలం

కావి యోగి ముచితము. అయిన నొకప్పుడు గుణమునకు ప్రాధాన్యము కలుగును. ఒకచో నలంకారమునకు ప్రాధాన్యముండును. కాగా ప్రధానాంగభావమున గుణాలంకారములకు సంకరవ్యవహారము ప్రవర్తించును. అది యాఱువిధములు.

శబ్దగుణప్రధానము - అర్థగుణప్రధానము
ఏోషగుణప్రధానము - శబ్దాలంకార ప్రధానము
అర్థాలంకారప్రధానము-ఉభయాలంకారప్రధానము.

వానిలో శబ్దగుణప్రధానము ఉదా

ప్రాప్తశ్రీరేష కస్మాత్పునరపి మయి తం మన్థఖేదం విదధ్యాత్
నిద్రామప్యస్య పూర్వామనలసమనసో నైవ సంభావయామి
సేతుం బధ్నాతి భూయః కిమితి చ సకలద్వీపనాథానుయాతః
త్వయ్యాయాతే వితర్కానితి దధత ఇవాభాతి కంపః పయోధేః.

ఈతడు శ్రీ కలవాడు కదా మరల నాకు మథనఖేద మేల కలిగించును. అనలసమనస్కుడు కదా! పూర్వపునిద్రను భావింపను. సకల ద్వీపనాథానుగతుడు కదా! మరల సేతువు నేల బంధించును? నీవు రాగా నిట్టివితర్కముల వహించి నట్లు పయోధికికంపము కలిగి నది. ఇందు హేతూత్ప్రేక్షను జెప్పుటలో విష్ణువు స్వరూపాధ్యాస ముచే తద్భావాపత్తి కలుగగా సమాధిగుణమునకు ప్రాధాన్యము గోచరించును ఇందు అవిష్ణువునందు విష్ణువ్యపదేశమున శబ్దశక్తి కాధిక్యము కలదు. కావున, అర్థప్రాకట్యమున ప్రసాదమను నర్థ గుణము కలదని శంకింపరాదు.

ననుః దీనిలో "త్వయి - ఏషః - అస్య" అని యుష్మదేత దిదం శబ్దము లున్నవి. వానిలోనేదియు విష్ణువాచికాదు. అది వర్ణనీయానుగతమై యా యా యర్థము నెట్లు నిరూపింపగలదు? "ఉచ్యతే" అవి సర్వనామములు కావున సర్వవాచకములు కాగ

లవు. సర్వనామములు సర్వాభిధాయకము లయినను ప్రకరణాధిగమ్య మయిన విశేషమునే నిరూపింపగలవు? "ప్రాప్తశ్రీ" మొదలగు పదములచే నభివ్యక్తమె ఏనివలన నవభాసించును.

అర్థగుణప్రధానము

లక్ష్మీవశీకరణచూర్ణమనోహరాణి
త్వత్పాదపంకజరజాంసి చిరం జయంతి
యాని ప్రణామమిలితాని నృణాం లలాటే
లుంపంతి దైవలిఖితాని దురక్షరాణి.

మానవుల లలాటమునందు ప్రణామసమయమున మిలితములైన నీ పాదపద్మపరాగములు దైవము లిఖించిన దురక్షరములను లోపింప జేయగలవు. అవిలక్ష్మీవశీకరణ చూర్ణమనోహరములై చిరంజయంతి దీనిలో హేతుసామ్యమున నుభయాలంకార ప్రతిపాదన మున్నను అర్థగుణములచే నర్థప్రాకట్యము ప్రధానముగ ప్రతీత మగుచున్నది.

దోషగుణప్రధానము

యేనాపవిద్ధసలిలస్ఫుటనాగసద్మా
దేవాసురై రమృతమంబునిధిర్మమంధే
వ్యావర్తనైర హిపతేరయమాహితాంకః
ఖం వ్యాలిఖన్నివ విభాతి స మందరాద్రిః

ఏ మందరపర్వతమును బట్టి దేవాసురులు సలిల మెంగురగా పాతాలము వ్యక్తమగునట్లు సముద్రము నమృతమునకై మథించిరో యామందర పర్వతము సర్పరాజువ్యావర్తనములచే నంకితమై యాకాశము నొరిపిడిచేయుచున్నట్లుగానవభాసించు చున్నది. ఇందు "వ్యావర్తనైరహిపతేః" అను స్థలమున జ్ఞాపక హేత్వలంకారము, ఖంవ్యాలిఖన్నివ" అనుటచే నుత్ప్రేక్షాలంకార మున్నది. "దేవాసురైః" అనుచో బహువచనము నిత్యవైరవివక్షలో సంగతము. ఇది యొక

దోషగుణము. 'అమృతమంబునిధర్మమంథే' యనుట ద్వికర్మక ప్రయోగము దోషగుణము. 'మథిప్రభృతీనాముపసంఖ్యానం' అను వ్యాకరణనియమమున నమృతశబ్దమున ద్వితీయ సంగతము ఈ దోషగుణములను వైజ్ఞాపకహేతువు. ఉత్ప్రౌఢిప్రధానముగా గోచరింపజేయుచున్నవి.

ననుః ఇందర్థమునకు ప్రాధాన్యమెట్లుగలుగును? తద్విషయము జ్ఞాపకహేతువుచే నపహృతముకదా! ఆ యర్థము నర్థాలంకారము. గుణాలంకారములు తుల్యకక్ష్యతగా నున్నపు డలంకారము ప్రధానమగును. గుణము ప్రధానము కాదు.

"గుణాలంకారయోశ్చ తుల్యకక్ష్యతాయాం అలంకారః ప్రధానం భవతి
న గుణః గుణైః గుణభూతైరేవా లంకారాః ప్రాయ ఆరభ్యంతే"

గుణములు గుణభూతములై యుండగా నలంకారములు సామాన్యముగా స్వరూపారంభమాకలవి యగును. ఇట్లభిజ్ఞ లభిప్రాయమావిష్కరించిరి.

వైదర్భీరీతి దోషలేశములతో నయిన నుండదు. సమగ్రగుణగుంభితమై యుండును. విపంచీస్వర సౌభాగ్యమున నుండును. గౌడీయరీతి సమస్తపదములతో నుద్భట పదములతో నోజఃకాంతి గుణములతో నుండును. పాంచాలీరీతి శ్లథభావమున నుండును. పురాణచ్ఛాయతో నుండును. సుకుమారముగా నుండును. లాటీయరీతి యావంతీరీతులలో మాధుర్యము వాంఛింతురు. ప్రసాదమభిలషింతురు. సమస్తపదముల నధికముగ నుపయోగింపరు. మాగధీరీతిలో మాత్రము కొందరొక్కొకచో నోజోగుణముండుటను సమస్తపదము లధికముగా నుండుట నాదరింతురు. అంతట నిట్లు గుణసంపత్తి యుండగా నర్థప్రాధాన్యమున సంభావితములగు దోషగుణముల ప్రధానత సంగతము కాగలదా?

అలంకారముల సమక్షమ్ముగా నర్థమునకు ప్రాధాన్యము లేక పోయినను నైపుణ్యవిశేషణ యోగరూఢాదిత్వాది శబ్దగుణముల కేల ప్రాధాన్యముండునగదా. శేష గుణములత్యంతము సముల్లేఖము కలవగుటచే వింటప్రాధాన్యము కలదగదా. ఇట్లర్థ ప్రాధాన్యమున్నందున నైపధ్యమున శేషగుణప్రధానతను నిశ్చయింపవచ్చును. ఇట్టివానిలో శేషములగు గుణభావ మత్యంతము ప్రకాశించును. శబ్దాలంకార ప్రధానత కిక్కాలంకార ప్రధానతకు లక్ష్యములు భావింపదగును.

## ఉ భ యా లం కా ర ప్ర ధా న ము

అప్ఫోటితా వసుమతీ దలితం రిపూరః
క్షిప్రక్రమం కవలితా బలిరాజలక్ష్మీ,
అత్రైకజన్మని కృతం యదనేన యూనా
జన్మత్రయే యదకరోత్పురుషః పురాణః.

వసుమతి నుద్ధరించెను. శత్రువక్షము దలితము చేసెను. వేగముగా బలిరాజసంపదను కబలించెను. పురాణపురుషుడు జగత్త్రియమున నాచరించినదాని నీ యువకుడొక జన్మయందె యాచరించెను. దీనిలో నుక్తి పరిపాకమయిన ప్రౌఢి, బంధవికటత్వరూపమగు నుదారత, ఆశయోత్కర్షరూపమయిన యుదాత్తత, అర్థప్రాకట్యరూపమయిన ప్రసాదము మొదలగు గుణములకన్న ఉభయాలంకారమగు విశేషోక్తి ప్రధానముగా ప్రతీతమగుచున్నది.

## ర సా లం కా ర సం క ర ము

రసవంతి హి వస్తూని సాలంకారాణి కాని చిత్
ఏకేనైవ ప్రయత్నేన నిర్వర్త్యంతే మహాకవేః
రసభావాదివిషయ వివక్షావిరహే సతి
అలంకారనిబంధో యః స కవిభ్యో న రోచతే

రసాక్షిప్తతయా యస్య బంధః శక్యక్రియో భవేత్
అపృథగ్యత్ననిర్వర్త్యః సోఽలంకారః ప్రకీర్త్యతే
శృంగారీ చేత్కవిః కావ్యే జాతం రసమయం జగత్
స ఏవ వీతరాగశ్చేన్నీరసం సర్వమేవ తత్
యయా కయాచిచ్ఛ్రుత్యా యత్సమానమనుభూయతే
తద్రూపాదిపదాసక్తిః సానుప్రాసా రసావహా
నవోఽర్థః సూక్తిరగ్రామ్యా శ్రవ్యో బంధః స్ఫుటా శ్రుతిః
అలౌకికార్థయుక్తిశ్చ రసమాహర్తుమీశతే

సాలంకారములయిన రసవద్వస్తువులను కొన్నిటిని మహాకవి యొక యత్నముననె నిరూపింపగలడు. రసభావాది విషయమున వివక్ష లేకుండగనె యలంకారమును నిబంధించుట కవులకు రుచితము కాదు. కవి రసాక్షిప్త హృదయుడై యలంకారబంధమును శక్యక్రియగా జేయునేని అపృథగ్యత్ననిర్వర్త్య మగునదియె యలంకారము ప్రకర్షకలయలంకారము. కావ్యమున కవి శృంగారియగునేని శృంగారాభివ్యక్తి సమర్థములగు విభావాదుల ప్రతిపాదనమున సావధానుడగునేని జగమంతయు రసమయమగును. అతడే వీతరాగుడగునేని సర్వజగము నీరసమగును ఒకదాని శ్రుతిననుసరించి మఱియొకటి సమానమయినదిగా ననుభవము కలుగునేని తద్రూపాది పదాసక్తి యనుప్రాస సహితమై రసావహమగును. నవీనమగు నర్థము అగ్రామ్యమగు సూక్తి శ్రవ్యమయినబంధము, స్ఫుటమగు శ్రుతి, అలౌకికార్థము కల యుక్తి అను నయిదును రసమాహరింపగలవు.

రసాలంకార సంకర మూరు విధముల నుండును.

| | |
|---|---|
| ౧. శబ్దాలంకారప్రధానము | ౪. భావప్రధానము |
| ౨. అర్థాలంకారప్రధానము | ౫. ఆభాసప్రధానము |
| ౩. ఉభయాలంకారప్రధానము | ౬. రసప్రధానము |

కిమిల మిలి ఏమిన మిమ్మిలకలికాతిలిలోల ముత్పలాశంకాం తే
కుసుచే స్మ చిపిలికులకలికాతరిలోలమిమ్మలాశంకాంతే,

దీనిలో రతిరస ప్రభవ మయిన వాగారంభము నభిభవించి యమకానుప్రాస శబ్దాలంకారములు ప్రధానముగా నున్నవి.

## ౨. అర్థాలంకార ప్రధానము

పులకం జనయంతి దశకంధరస్య రాఘవశరాః శరీరే
జనకసుతా స్పర్శమహార్ఘా ఇవ కరతలాకృష్ట విముక్తాః

కరతలాకృష్టి విముక్తములయిన రామబాణములు సీతాస్పర్శ మహార్ఘములయినవన్నట్లు దశకంధరునకు రావణునకు శరీరమున పులక లుత్పాదించుచున్నవి. దీనిలో రతిరసాభాస మభిభవించి హేతువర్థా లంకార ప్రాధాన్యమున నవభాసించుచున్నది.

## ౩. ఉభయాలంకార ప్రధానము

కిం గురుజఘనమథ స్తనభర ఇతి భాగకరతలాగ్రతులితాయాః
విధేః ఖాతాంగులిమార్గవిభమం వహత్యస్యాస్త్రివలీ.

జఘనము బరువా యుగము బరువా గుర్తింప వలెనని విధి కరతలమున తూచగా నిమె త్రివళి వ్రేళుల యొత్తిడి వలని విలాస మును వహించుచున్నది. దీనిలో రతిరసప్రభమయిన విస్మయా దుల నభిభవించి పర్యాయ-సంశయ - హేతు - ఉత్ప్రేక్ష - ఉపమ లుభయాలంకారములు ప్రధానముగా ప్రతీతిలో గోచరించుచున్నవి.

## ౪. భావ ప్రధానము

తస్యా దర్శనసుభగే ప్రణయస్ఖలన జనితో ముఖే మనోహరే
రోషాపి హరతి హృదయం మదపంక ఇవ మృగలాంఛనే నిషణ్ణః

దర్శనసుభగ మయిన మనోహరమైన ఆమె ముఖమున ప్రణ యస్ఖలన జనితమయిన రోషము కూడ చంద్రునందున్న మదపంకము వలె హృదయము హరించుచున్నది. కృష్ణుడు రుక్మిణి కిచ్చిన పారి

జాతమును చూచి కోపము కలసి కాగా రౌద్రరసమయుడయిన కృష్ణుని వాగారంభరూపమయిన వచన మిం దున్నది. సత్యభామా రోష భావరామణీయకము హేతూపమాతిరస్కారమున ప్రధానముగా నిందు ప్రతీత మగుచున్నది.

### ౫. ఆ భా స ప్ర ధా న ము

కధం మా క్షీయతాం మధ్య పేతస్యా నీలోత్పలదలసప్రకాశాభ్యాం
అక్షిభ్యాం యో న దృశ్యతే ఘనస్తన భరరుద్ధప్రసరాభ్యాం

నీలోత్పల సమానము లయిన స్తనభరమున సుప్తప్రసరములైన యీమె నేత్రములకు గోచరము కాకపోగా మధ్యము క్షీణము కాకుండునేమి? దీనిలో హేతు - ఉపమ - ఉత్ప్రేక్ష - సమాధుల తిరస్కారమున రసాభాస వాగారంభము ప్రధానముగ గోచరించు చున్నది. ఇందు నాయకుడు ప్రియా ప్రత్యభియోగరతి సుఖముపొందని వాడు. సుభగమాని ప్రత్యూహము ప్రతినాయకాపాల వలన వ్యథ పడువాడు. అట్టివాని వాగారంభ మిం దున్నది.

### ౬. ర స ప్ర ధా న ము

మాగర్వముద్వహ కపోలతలే చకాస్తి
కాంతస్వహస్తలిఖితా మమ మంజరీతి
అన్యాపి కిం న సఖి! భాజన మీదృశానాం
వైరీ న చేద్భవతి వేపథు రంతరాయః.

సఖి! ప్రియుడు తన చేతులతో కపోలములందు మంజరి లిఖించి నాడని గర్వపడకువే! కరకంపమంతరాయమై వైరి కాదేని వేరొకతె కూడ నిట్టివానికి భాజనము కాదేమి? దీనిలో ఆక్షేప - హేతు - పర్యాయోక్తముల కన్న ప్రకృష్టరతి రసప్రభవమయిన వాగారం భము ప్రధానముగ భాసించుచున్నది. ప్రియుడు ప్రేమాభిమానము లతో నున్నాడని గర్వించు నొక చెలియ దగ్గర యొకతె తన

కాంతుని ప్రేమనివేదన పరముగా నున్న వేపథువును సూచించుచు రతిరస ప్రభవమయిన వాగారంభము కలదియినది,

ఈ విధముగా సంసృష్టి యనేక ప్రకారములనున్నది. గుణాలంకార సంకర ప్రభవముగా భాసించుచున్నది. అందును ప్రధానాంగి భావమున సమకక్ష్యతారూపమున వ్యక్తముగా నవ్యక్తముగా నుభయరూపముగా తిలతండులన్యాయమున క్షీరజలన్యాయమున గలుగు భేదములను యథాసంభవముగా దెలియదగును.

ఆ భేదములను చెప్పవలెనా? చెప్పనక్కరలేదు. చెప్పకున్న నవియెట్లు గోచరించును? చెప్పినవానియందే యవియంతర్భవించును. ఈ సంకరములు రెండింటికే కలుగునా? అనేకములకును గలుగునా? రెండింటికే సంకరము కలుగుననియందుము. అనేకములకును సంకరముగలుగునని యిప్పుడేయంటిరి గదా! అంటిమి. సత్యమె 'ద్వయోః ద్వయోః' రెండింటికి రెండింటికి సంకరము. ఈరీతి సర్వప్రకారముల నుదాహృతమైనది. వాక్యమునందును గుణరసయోగము నిత్యము. కాన సముల్లేఖము కల సంకరములె సంగృహీతము లగును గాని యనుల్లేఖములకు గ్రహణములేదు. ఉదా.

ఉద్ఘాతః ప్రణవో యాసాం న్యాయైస్త్రిభిరుదీరణం
కర్మ యజ్ఞః ఫలం స్వర్గః తాసాం త్వం ప్రభవో గిరాం

ఏ వేదములకు ప్రణవమాదిమమో, ఉదాత్తాదిస్వరములచే నుచ్చారణమో, కర్మయజ్ఞమో ఫలము స్వర్గముగా కలదో ఆ వేదములకు నీవు హేతువు. దీనిలో శ్లాఘ్య విశేషణ యోగరూపమయిన యుదాత్తత్వముకలదు. అందు అర్థ ప్రాకట్యరూపమైన ప్రసాదము విశేషముగా నుపాత్తము కానందున నసంపూర్ణవాక్యతారూప మగు నేయత్వమను దోషగుణ మున్నది. కాని యవి సోల్లేఖము' కాకున విభావితమగునేని యవి ప్రతీతములగును. జ్ఞాపకహేత్వాలంకారము.

'తాసాం త్వం ప్రభవో గిరాం' - అని కారక హేతూత్ప్రేక్షాలంకారము నుల్లిఖితముకాదు. విభావ్యమానమగునేని శోభించును. ప్రేయో రసమున విస్మయప్రకర్షము హర్షోత్కర్షము నుల్లిఖితములుకావు విభావ్యమానములై భాసింపగలవు. ఇట్లే యీ లక్ష్యములందును భావింప దగును.

> కిం యేన సృజసి వ్యక్తముత యేన బిభర్షి తం
> అథ యస్తస్య సంహర్తా భాగః కతమ ఏషతే
> శింజానమంజుమంజీర కాంచీ సంచార చారవః
> రమయంతి మనః కాంతా నితాంతం యోగినామపి
> పయోధరతటోత్సంగ లగ్న సంధ్యాతపాంశుకా
> కస్య కామాతురం చేతో వారుణీ న కరిష్యతి

ఏ భాగమున సృజింతువు? ఏ భాగమున సృష్టమును భరింతువు? ఏ భాగము సంహరించును ఇందు వితర్కాలంకారమున కారక హేతువు క్రమరచన సోల్లేఖములు కావు. ప్రసాదార్థగుణమున సౌశబ్ద్యము బంధవైశద్యము సోల్లేఖములు కావు. మతిప్రకర్షమున ప్రీత్యుత్కర్ష ముల్లిఖితముకాదు. విభావ్యమానములగునేనియన్నియు ప్రతీతములగును.

మంజు మంజీర కాంచీశింజానములతో సంచరించుచు నందముగా నున్న కాంతలు నితాంతము యోగుల మనస్సులను గూడ రమింపజేయుదురు. ఇందలి సౌకుమార్యశబ్దగుణములో సమాసభూయస్త్వమను నోజోగుణము శ్లాఘ్యవిశేషణయోగమను నుదాత్తత్వ ముల్లిఖితములు కావు. అనుప్రాస శబ్దాలంకారమున హేతువు జాతి యుల్లిఖితములు కావు విస్మయభావమున రతి మతి యుల్లిఖితములు కావు అవియన్నియు విభావ్యమానములై భాసింపగలవు.

పయోధరములందు సంధ్యారుణాంశుకము ధరించిన యీ వారుణి యెవని మనము కామాతుర మొనరింపదు? కుచములం దరుణ

వస్త్రము ధరించిన యీ వారుణి చిత్తమున కామము కలుగ జేయు నని మేఘములందు సంధ్యారుణకిరణములవహించిన యీ పశ్చిమ దిశచేతము కామాతుర మొనర్చునని యిందర్థద్వయము భావింప నగును. ఇందు హేతుసమాధ్యలంకారములలో శ్లేషరూపకాలంకార ములు కాంత్యుదాత్తత్వగుణములలో నోజఃప్రసాదగుణములు ఆలం బనోద్దీపనవిభావములలో మతివితర్కము లుల్లిఖితములుకావు. అవి విభావ్యమానములై ప్రతీతములగును.

హస్తే లీలాకమలమలకే బాలకుందానువిద్ధం
నీతా లోధ్రప్రసవరజసా పాండుతామాననే శ్రీః
చూడాపాశే నవకురవకం చారు కర్ణే శిరీషం
సీమంతే చ త్వదుపగమజం యత్ర నీపం వధూనాం

మేఘా! అలకాపట్టణము నందు వనితల కీ విధముగా నలంకా రము లున్నవి. హస్తమునందు లీలాకమలము అలకలందు బాలకుంద ములు ముఖములందు లొద్దుగ పూ॥ ధవలిమ, చూడాపాశమున కురవకము, కర్ణమునందు శిరీషము, పాపటలో నీ రాక వలని నీపము నుండును. ఇందు జ్ఞాపకహేత్వలంకారమున అర్థాలంకారములు శబ్దా లంకారము లుభయాలంకారము లుల్లిఖితములు కావు. ఉదాత్తత్వ మను శబ్దగుణమున శబ్దగుణమర్థగుణము దోషగుణము లుల్లిఖితములు కావు.యక్షనినివాసవర్ణనోత్కర్షములో నివాసిజనవైచక్షణ్యము వర్ణించు టయను విభావము, ప్రియతమాస్థాన ప్రేమోరసములో సర్వోపకరణ ప్రాగుణ్యాస్మృతి విలాసాద్యభినందనమును ననుభావము ప్రియసు హృదుడయిన మేఘుని ప్రరోచనోత్సాహములో స్మృతి యుత్కంఠ యను వ్యభిచారిభావము సముల్లిఖితములు కావు. అయినను విభావ్య మానములై ప్రతీతములగును.

శిఖండే ఖండేందుః శశిదినకరౌ కర్ణయుగలే
గలే తారాస్తారాతరలముడుచక్రం చ కుచయోః

తటిత్కాంచీ, సంధ్యా సిచయ రుచయః కాలి: తదియం
తివాకల్పః కల్పవ్యుపరమవిధేయో విజయతే.

హే! కాళీదేవీ! నీ శిఖండమున ఖండేందువు కర్ణయుగల మున శశిదివాకరులు కంఠమున తారలు, కుచములందు తారాంతరల మయిన యుడుచక్రము, తటిత్తుకాంచి, సంధ్యయువసనంబనము. నీయీ యలంకారము కల్పాంతవిధేయమై యొప్పుచున్నది ఇందు గతి యుదాత్తత్వమను శబ్దగుణములలో బంధశైథిల్యాది శబ్దగుణము లుల్లిఖితములు కావు. కాంతి ప్రసాదమను నర్థగుణములందోజత్వా ద్యర్థగుణములు వివక్షితములు కావు. కాలాదివిరోధము అప్రకృతరసత్వ మను దోషగుణము లందు వినిష్క్రియత్వాది దోషగుణము లుల్లిఖి తములు కావు. వాక్యముద్రానుప్రాస శబ్దాలంకారములలో క్రమరచ నాది శబ్దాలంకారము లుల్లిఖితములు కావు. జాతి విరోధార్థాలంకా రములలో జ్ఞాపకహేత్వాద్యర్థాలంకారము లుల్లిఖితములు కావు. సమాసోక్తి రూపకోభయాలంకారములలో సముచ్చయోభయా లంకారము లుల్లిఖితములు కావు ప్రేయశ్శాంతరసములలో శయాన కాదిరసములు రౌద్రశృంగారాభాసములందు విరాభాసాదులు మతి స్మృతి భావములలో హర్షాది భావము లుల్లిఖితములు కావు. విభావ్య మానమ్మైన యన్నియు భాసించును.

ఇప్పటికి నీవిధముగా వాక్యవిషయమయిన రసావియోగము నిరూపిత మయినది ప్రబంధవిషయముగా రసావియోగము నిరూ పింతుము.

## ప్రబంధవిషయ రసావియోగము.

ఇదియు దోషహానమున గుణోపాదానమున నలంకారసంకర మున ప్రకాశమానము కాగలదు. మనీషులకు మనఃప్రకర్ష హేతు వగును. అందు దోషహానమనౌచిత్యాది పరిహారమున గలుగును.

## దోషహేతుము

౧. మహావీరచరితము నందిట్లున్నది. శ్రీరాముడు మాయా కైకేయీ దశరథులచే ప్రవాసితుడు. కాని మాతాపితరులచే గాదు. దశరథుడు నిర్దోషుడు. వాలియే రామునితో యుద్ధమునకు సంసిద్ధుడై నిహతుడయ్యెను. సుగ్రీవునితో యుద్ధసిద్ధుడు కాలేదు.

౨ వేణీసంహారమున నిట్లున్నది. రుధిరప్రియరాక్షసుడు దుశ్శాసనుని రుధిరము త్రావెను. భీమసేనుడు కాడు.

3. హరివంశమున నిట్లున్నది. మాయావతి గుర్వంగన కాదు. అనంగావతారుడయిన ప్రద్యుమ్నుని జన్మాంతరపత్ని యగు రతి.

౪. శాకుంతలమున నిట్లున్నది దుర్వాస శ్శాపమువలన దుష్యంతుడు శకుంతలాస్వీకారము విస్మరించెను. కాని యనవస్థితానురాగము కలవాడగుటచే గాదు.

౫ ఛలితరామమున నిట్లున్నది. లవణాసురప్రయుక్తులయిన రాక్షసులా మాయావిధమున జెప్పగా సీత పరిత్యక్తయయినది. కైకేయీ మంథరల కిందేమియు ప్రసక్తి లేదు.

౬. తాపసవత్సరాజమున నిట్లున్నది. వాసవదత్త యగ్నిదగ్ధ కాగా వైరప్రతిచికీర్షతో పద్మావతిని వివాహమాడితిని. వాసవదత్త లేక నేను క్షణమయిన జీవింపలేను” అని వాసవదత్తాసన్నిధి దెలియని వత్సరా జగ్నిప్రవేశాధ్యవసాయము కలవాడయ్యెను. ఇట్లు ప్రియాహృదయము నుండి వ్యలీకశల్యముత్ఖాతమయినది.

౭. విక్రాంతశూద్రకమున నిట్లున్నది. నిశ్శంకముగా స్వామికార్యము సాధింతునని ప్రభుభక్తికల శివగణుడు నిరపరాధ యయిన ప్రేయసిని దహించెను.

“స్వామికార్యాపేక్షతో నేనింతకాలము జీవించితిని. స్వామికార్యము సాధించితిని గాన ఇక నా ప్రేయసి ననుసరింతును” అని

శివగణుడు కోహాదిక విచిత్రితమయిన మాయామయచితాగ్నిని ప్రియాసమక్షమునకనె ప్రవేశించెను. ఆమెయు నాతని ప్రేమాపదానము చూచి ప్రియవ్యలీకము పోగా నాతని వియోగము సహింపనిదై ఆయగ్నియందే తనను పడవేసికొనినది ....ఇట్లే దోషహానవిధానముల నుదాహరింపదగును.

## గుణోపాదానము

నానావిధప్రబంధములకు సమ్యగ్లక్షణయోగమున గుణోపాదానము సంగతమగును. అట్లు లక్షణయోగము సంవిధానకసుసూత్రత. ఆ ప్రబంధభేదము లందే నగరార్ణవవర్ణనాదుల సన్నివేశప్రాశస్త్యముండును. అపు డలంకారసంకరము భావితము కాగలదు.

> ఔచిత్యం వచసాం ప్రకృత్యనుగతం, సర్వత్ర పాత్రోచితా
> పుష్టిః స్వావసరే రసస్య చ కథామార్గే న చాతిక్రమః
> శుద్ధిః ప్రస్తుతసంవిధానకవిధౌ ప్రౌఢిశ్చ శబ్దార్థయోః
> విద్వద్భిః పరిభావ్యతామవహితైరేతావదేవాస్తు నః

ప్రకృత్యనుగతమయిన వచసౌచిత్యము, సర్వత్రపాత్రోచితమయిన పరిపాటి స్వావసరమున రసపోషణము, కథామార్గమున నతిక్రమము లేకపోవుట, ప్రస్తుత సంవిధానక విధానమున శుద్ధి శబ్దార్థముల ప్రౌఢి అను వీనిని విద్వాంసులు సావధానముగ పరిశీలింపదగును. ఏతావన్మాత్రము మాకు చాలును. అని నిరూపితాంశ సంవాదముగా తద్విదులు పల్కిరి.

ప్రబంధరూపము నిట్లు రూపింపదగును. ఇష్టార్థవ్యవచ్ఛిన్నమయిన పదపంక్తి కాని వాక్యపద్ధతి కాని ప్రకరణావలి కాని ప్రబంధమగును. సుబంతములు తిఙంతములు నయిన పదములు సర్వార్థసాధారణములు కావున స్వరూపనిబంధకమయిన విశేషమంతగానుండదు.

వాక్యములును సర్వవ్యవహారసాధారణములయి సంహితవలన పరస్పరా వచ్ఛేదహేతువగు భేదము సంభవింపదు. శైల - ఋతు - నగర - అర్ణవ వర్ణనాది రూపములగు ప్రకరణములు సకలకావ్యశరీరాంగము లగును గావున తన్నిమిత్తమగు వ్యతిరేకము నుపపన్నము కాదు. మహా వాక్యైకదేశమునవానిచే సంపన్నమగు నియామరూపమే యనేక వాక్య ప్రకరణాది సముదాయరూపమగు మహాకావ్యముల కవచ్ఛేదహేతు వగును. అదియె యుపస్థానము అట్టి యుపస్థానమున వ్యవచ్ఛిన్నము విశే షమున నవచ్ఛిన్నము అగు పదపంక్తి - వాక్యపఙ్క్తి ప్రకరణావళి ప్రబంధమగునని భావము ఉదా జానకీహరణము, కుమారసంభవము ప్రబంధపదవ్యవహార్యములు.

ననుః "జానక్యాహరణం అస్మిన్" "కుమారస్య సంభవః అస్మిన్" అను బహువ్రీహిసమాసము నాశ్రయించిన అన్యపదార్థ ప్రాధాన్యము కలుగును గావున "జానకీహరణము కుమారసంభవము" అను నంశము లెట్లుపపన్నములగును? ఎందుజానకిహరణముకలదో యది జానకీహరణము. ఎందు కుమారునిసంభవము కలదో యది కుమారసంభవము. ఇట్టి యర్థమున, కావ్యప్రబంధమున జానకీహరణ మెట్లుండును? కుమారసంభవ మెట్లుండును?

అట్లయినచో నిచట బహువ్రీహిసమాసమువలదు. తత్పురుష సమాస మవుగావుత "జానక్యా హరణం జానకీహరణం, కుమారస్య సంభవః కుమారసంభవః" అభిధేయమున నభిధాయకమును గూడ కవులు వ్యవదేశింతురు. "అభిజ్ఞానశాకుంతలము నాటకము హర్ష చరితము ఆఖ్యాయిక" అని లోకమున వ్యవహారము కలదు.

ప్రబంధము ద్వివిధము. ప్రేక్ష్యము శ్రవ్యమునని. అందభినే యము ప్రేక్ష్యము. అది నాటకాది భేదమున ౨౮ భేదములు కల దగును.

| | | |
|---|---|---|
| ౧. నాటకము | ౯. ప్రహసనము | ౧౭. భాణికము |
| ౨. ప్రకరణము | ౧౦. వీధి | ౧౮ భాణిక |
| ౩ వ్యాయోగము | ౧౧ నాటిక | ౧౯ గోష్ఠి |
| ౪. ఈహామృగము | ౧౨. సట్టకము | ౨౦. హల్లీసకము |
| ౫. సమవకారము | ౧౩ శ్రీగదితము | ౨౧ నర్తనకము |
| ౬. డిమము | ౧౪. దుర్మల్లిక | ౨౨ ప్రేక్షణకము |
| ౭. ఉత్సృష్టికాంకము | ౧౫. ప్రస్థానము | ౨౩ నాట్యము |
| ౮ భాణము | ౧౬. కావ్యము | ౨౪ః రాసకము |

అనభినేయము శ్రవ్యము. అగియు ఆఖ్యాయికాది భేదమున 24 భేదములు కలదగును.

| | | |
|---|---|---|
| 1 ఆఖ్యాయిక | 9. పరికథ | 17. ఆశ్వాసబంధము |
| 2. ఉపాఖ్యానము | 10. ఖండకథ | 18. సంధిబంధము |
| 3. ఆఖ్యానము | 11 ఉపకథ | 19. అవస్కంధబంధము |
| 4 నిదర్శనము | 12 బృహత్కథ | 20. కావ్యశాస్త్రము |
| 5. ప్రవహ్లిక | 13 చంపువు | 21. శాస్త్రకావ్యము |
| 6. మంథుల్లిక | 14. పర్యాయబంధము | 22. కోశము |
| 7. మణికుల్య | 15 కాండబంధము | 23. సంఘాతము |
| 8 కథ | 16 సర్గబంధము | 24. సంహిత—సాహిత్యప్రకాశము |

## ౧. నాటకము

అభినేయములందు నాటకముయొక్క లక్షణ మీ విధముగా నున్నది.

ప్రఖ్యాతవస్తువిషయం ప్రఖ్యాతోదాత్తనాయకం చైవ
రాజర్షిచరిత వంశానుచరిత దివ్యాశ్రయోపేతం
సర్వాభిర్భాషాభిస్సమన్వితం గద్యపద్యమిశ్రాభిః
సర్వైశ్చాలంకారైర్లక్షణషట్త్రింశతా చ సంయుక్తం

నానావిభూతిసంయుతమృద్ధివిలాసాదిభిర్గుణైర్యుక్తం
అంకప్రవేశకాఢ్యం రూపకమిహ నాటకం నామ
నృపతీనాం తచ్చరితం నానారసభావ సమ్మిశ్రితం బహుధా
సుఖదుఃఖోత్పత్తికృతం వాచ్యం తన్నాటకే భవతి

నాటకమున ప్రఖ్యాతవస్తువు ప్రఖ్యాతుడయిన నాయకుడు డుదాత్తుడు. రాజర్షిచరితము వంశానుచరితము దివ్యాశ్రయసముపేతము గా నుండును. గద్యపద్యమిశ్రములయిన సర్వభాషలట నుండును. సర్వాలంకారములుండును. ముప్పదియారు కావ్యలక్షణములతో నుండును. నానావిభైశ్వర్యసముపేతము, సమృద్ధవిలాసముతో గూడియుండునది అంకములతో ప్రవేశకాదులతో గూడియుండు రూపకము నాటకమగును. రాజులచరితము నానారసభావములతో గూడియుండును సుఖదుఃఖోత్పత్తికృతమయిన విశేషమిందు నిరూపణీయము.

బిందువిస్తరము ననుసరించి నాటకీయ ఫలమనదగుకార్యము నానావిధములగు నవస్థలతో గూడియుండునట్లు సమీక్షింపవలెను సమ్యగ్గుణాన్వితముగా నాటకము నిర్మింపవలెను. నాటకమున నుండదగు నంకమునకొక విశిష్టరూపమున్నది. అంకమున నర్థసమాప్తి యుండును. బీజోపసంహారముండును. బిందువొకింత యవలగ్నమై యుండును. అట్టిది యంకము. అంకమున నాయకుల చరితాదికము ప్రత్యక్షముగ నుండుట ప్రయోజనానుగతమయిన రససంపత్తి నానావస్థాంతరితముగా నుండుట యంకలక్షణ సంపత్తి. నాయక – దేవి – పరిజన – పురోహిత – అమాత్య – సార్థవాహులకు సంబంధించిన నానారసములతో తదంతరములతో నంకము విహితము కావలెను. శోకప్రసాదములు విద్రవములు శాపోత్సర్గములు క్రోధప్రసాదనములు ఉద్వాహ మద్భుతదర్శనము అంకమున ప్రత్యక్షములుగా నుండదగును. యుద్ధము – రాజ్యభ్రంశము మరణము – నగరోప

రోషము-అంకమున ప్రత్యక్షగా నుండదగవు. వానిని ప్రవేశాదికము లచే సూచింపదగును. భావములు రసములు నంకమున నంకమున వలె నారోహము కలవగును. అంకము నానావిధాన యుక్తము ప్రబంధమానకు లక్ష్యము. ఏకదిన ప్రయోజ్యమగు కార్యవిశేషము ప్రబంధమున నుండును. ఆవశ్యక కార్యముల కవిరుద్ధముగా బీజార్థముల ననుబంధించి యంకముండును. బహుకార్యముల నంకమున గూర్ప వలెను. ఆవశ్యకావిరుద్ధముగ కార్యములన్నియు కార్యములు కావ లెను. ఒకయామమునకుంగాక్త లక్షణసముపేతమయిన దివసావస్థను గుర్తించి వేరువేరుగా నంగములందు సర్వకార్యమును విభజించి సంగ తము చేయవలెను. బీజార్థయుక్తియుక్తముగా కార్యమును యథార్థ రసముగా నిబంధించి యంకాంతమున రంగప్రవిష్టుల కందరికి నిష్క్ర మణము విధింపవలెను. దివసావసానకార్యమంతయు నంకమున నుప పన్నము కాదేని యంకచ్ఛేద మొనరించి ప్రవేశకములతో దాని విధిం పవలెను. నాటకమున గాని ప్రకరణమున గాని యంకమును సన్నిహిత నాయకముగా నిబంధింపవలెను. అచట ప్రవేశకమును పరిజనకథాను బంధమున గూర్పజనును అంకచ్ఛేద మొనరించి మాసకృతము కాని వర్ష సంచితముకాని సర్వము నిరూపింపవచ్చును. సంవత్సరాధికముగా నెప్పుడుకూర్పరాదు. కార్యవశమున పురుషుడు దూరమేగునేని యంక చ్ఛేద మొనరించుట యుక్తము నాటకమునగాని ప్రకరణమునగాని బిందురూపార్థముల సంక్షేపార్థము ననుసరించి యంకాంతరార్థము ననుసరించునట్లుగా ప్రవేశకమును గూర్పవలెను. ఆ ప్రవేశకముత్తమ మధ్యమ పురుషాచరితముగ నుండరాదు. ఉదాత్తవచనకృతముకా రాదు. ప్రయోగానుసారమున ప్రాకృతభాషాచారమున నుండవలెను. కాలోత్థానగతి రసవ్యత్యాసారంభము కామవిషయము అనువానికి సంబంధించిన విధముగా నర్థాభిధాయకమై యనేకార్థప్రదమై ప్రవేశ ముండునట్లు సమీక్షింపవలెను. బహ్వాశ్రయమయిన యర్థమునయి

నను ప్రబంధములందు ప్రవేశకములచే సంక్షిప్తముగ నిబంధింపవలెను. ప్రబంధములందు ప్రవేశములచే, సూక్షిప్తముగ నిబంధింపవలెను. ప్రవేశక నిరూపణీయార్థమును అంకమునందు ప్రయోగించినచో ప్రయోగ భేదము కలుగును. ప్రయోగ బాహుల్యమున్నందున నంకము నందర్థసమాప్తి కలుగనేని యల్పార్థక ప్రవేశములతో నాయర్థమును నిరూపింపవలెను ప్రవేశకనిరూపణమున సావధానత యభీష్టము. శుద్ధముసంకీర్ణమునని విష్కంభకము రెండు విధములు మధ్యమ పాత్ర ప్రయుక్తము సంకీర్ణము శుద్ధము. మధ్యనీచప్రయుక్తము. అంకాస్యమున కంకముఖమనిపేరు. అది గర్భాంకముగా నిరూపింపదగును. చూలికయు నిందుండును. ఇతివృత్తములకు విచ్ఛేదము తగదు. విస్తరమును యుక్తముకాదు. స్త్రీ వాక్యమునగాని పురుషవాక్యమునగాని విశ్లిష్టార్థముపశ్లిష్టమగున నంకముఖమున నిరూపితమగుటను తదభిజ్ఞులు వ్యపదేశింతురు. ప్రయోగానుసారమున బీజార్థయుక్తియుక్తముగ నంకాంతరమున పరాంకము ప్రసరించునేని యది గర్భాంకమను సంజ్ఞకలది యగును. అంతర్యవనికాగతులయిన మాగధ సూతాదులనేకవిధముల నర్థోపక్షేప మొనరింతురేని యది చూలిక యగును. ఇప్పటికిది సంక్షిప్తముగా నాటక లక్షణము. దీనిస్వరూపతాత్పర్యములు నా నాట్యవేదమున భావనీయములు.

## ౨. ప్రకరణము

ఇటుపై లక్షణయోగమున ప్రకరణము చెప్పుట యుచితము.

యత్ర కవిరాత్మబుద్ధ్యా వస్తు శరీరం చ నాయకం చైవ
ఔత్పత్తికం ప్రకురుతే తద్జ్ఞేయం ప్రకరణం నామ
యదనార్షమప్రయుక్తం పరేణ యత్స్యాదభూతగుణబంధం
ప్రకరణమితి తద్విద్యాదౌద్భిజ్జబీజార్థసంయుక్తం
యన్నాటకే మయోక్తం వస్తు శరీరం రసాశ్రయోపేతం
తత్ప్రకరణేపి కార్యం కేవలముత్పాద్యవస్త్విహ తత్

విప్రవణిక్సచివానాం పురోహితామాత్య సార్థవాహానాం
చరితం యన్నైకవిధం తజ్జ్ఞేయం ప్రకరణం కృతిభిః
నోదాత్తనృపోపేతం న దివ్యచరితం న రాజసంభోగం
బాహ్యజనసంప్రయుక్తం తజ్జ్ఞేయం ప్రకరణం కృతిభిః
దాసవిటశ్రేష్ఠియుతం వేశస్త్ర్యుపచారకారణోపేతం
మందకులస్త్రీచరితం కావ్యం కార్యం ప్రకరణే తు
సచివశ్రేష్ఠిబ్రాహ్మణపురోహితామాత్యసార్థవాహానాం
గృహవార్తా యత్ర భవేన్న తత్ర వేశ్యాంగనా కార్యా
యది వేశయువతియుక్తం న కులస్త్రీసంగమర్హతి కదాచిత్
అథ కులజనప్రయుక్తం న వేశయువతిర్భవేత్తత్ర
యది వా ప్రకరణయుక్త్యా వేశకులస్త్రీసమాగమోపిస్యాత్
అవికృతభాషాచారం తత్ర తు పాఠ్యం ప్రయోక్తవ్యం

కవి స్వబుద్ధ్యనుసారమున వస్తుశరీరమును నాయకుని నౌత్పత్తికముగా కల్పితాత్మకముగా నిర్మించునేని యది ప్రకరణమగును. ఋషిప్రోక్తము కాని పరప్రయుక్తముకాని నిర్మించి యభూతగుణబంధముగా నిరూపించునేని యది ప్రకరణమగును. బీజార్థసముద్భేదముతో నది ప్రకాశించును. నాటకమున నిరూపించిన రసాశ్రయోపేతమగు వస్తు శరీరమంతయు ప్రకరణమునందు నుండును. ఉత్పాద్య వస్తువుండుటయే యిందు విశేషము. విప్రులు-వణిక్కులు-సచివులు-పురోహితులు - అమాత్యులు - సార్థవాహులు స్వచరితసంబంధమున నిందుందురు. కావున ప్రకరణము నానావిధశోభతో నుండును. ఇది యుదాత్తనృపోపేతము కాదు. దివ్యచరితమిందుండదు రాజుల సమ్యగ్భోగములిందుండవు. లోకసిద్ధులయిన బాహ్యజనుల సంప్రయోగముననిది యుండును. దాస - విట - శ్రేష్ఠియుతము వేశవనితల యుపచార సముపేతము మందకులస్త్రీచరితము నిరూపింపదగును. సచివ-శ్రేష్ఠి - బ్రాహ్మణ - పురోహిత - అమాత్య - సార్థవాహుల గృహవార్త యుండునేని 'వేశ్యాంగనను నిరూపింపరాదు వేశవనితాయుక్త

ముగానేని కులస్త్రీ నొంగను వెంపును కూర్పరాదు ప్రకరణము కులవధూ ప్రముఖ్యముగానేని వేశయువతి యుండదగదు. ఒకానొక కారణయోగ మున నేని కులస్త్రీ సమాగమము నుండవచ్చును. అవికృతభాషాచార ముగా వాక్యమిందు ప్రయోగింపవలెను.

ప్రకరణమున విష్కంభకము మధ్యమ పురుష ప్రయోజ్యము. సంస్కృతవచనానుగతము ప్రవేశకమువలె సంక్షేపార్థముగనుండును. అంతరాలమున ప్రవేశకమును విధింపవలెను. అం దర్థక్రియాభిసేకణ మావశ్యకము. సంక్షేపముగా సంధులను కూర్చుట తదర్థములను సంధించుట యావశ్యకము. అంకమునగాని ప్రవేశకమునగాని నాటక ప్రకరణములందు నాయకుడుగా ప్రఖ్యాతుడగువాని వధము నిబంధింప రాదు. అట్టివాని వధోద్యమము నుండియపసరింపజేయవలెను. ఆతని గ్రహణమేని కూర్పవలెను. సంధినయిన నిబంధింపవలెను. నానావిధ ములగు కావ్యశ్లేషవిధానములతో దీనిని రసోచితముగ కూర్పవలెను. నాటకప్రకరణములలో నయిదంకములకు పైగా పదియంకములకు లోపుగా నంకనిబంధన ముండవలెను. అంకాంతరసంధులో నంకగణ నమున ప్రవేశకము లుండదగును. నాటక ప్రకరణములందు మహాజన పరివారము తగదు. రంగమున కార్యపురుషులు నలుగురో యయిదు గురో యుండదగుదురు. మహాజనపరివారమున్నచో భావకులకు భావ నాక్లేశము కలుగును.

## 3. వ్యాయోగము

వ్యాయోగము – ఈహామృగము – సమవకారము – డిమము అనువానియందు క్రమముగా పది – పండ్రెండు – పదునారుగురు నాయకులుందురు. వ్యాయోగము ప్రఖ్యాతనాయకశరీరము. అల్పస్త్రీ జనయుక్తము ఏకాహప్రయోజ్యము నగును. వ్యాయోగమునందు కథాశరీరవశమున బహుపురుషులు "వ్యాయచ్ఛంతే వ్యాకీర్ణులై

యుండును. ఒకయంకమే వ్యాయోగమునందుండును. అంకప్రమాణ నియమము లేదు. ఖ్యాతరాజర్షినాయక నిబంధముగనే యుండవలెను. దివ్యనాయకకృతము కారాదు. యుద్ధము - నియుద్ధము - ఆధర్షణము - సంఘర్షములతో నిదియుండగా వ్యాయోగము దీప్తరసమయోవి.

### ౮. ఈహామృగము

ఈహామృగమను రూపకము దివ్యపురుషాశ్రయమున నుండును. దివ్యవనిత కారణముగా దివ్యపురుషులకు యుద్ధముండును. వస్తు నిబంధము సువిహితమై యుండును. విప్రత్యయ మొసగించునది యగును. ఉద్ధత పురుషప్రాయముగా నుండును. ఈ కావ్యబంధమంతయు స్త్రీరోషప్రథితమై యుండును. సంక్షోభము విద్రవము-సంఫేటము లుండును. ఇందు వధోద్యుక్తులగు పురుషులకు వధము దగ్రముగా నుండరాదు. ఏదేని వ్యాజమున వారి యుద్ధమును శమింపజేయవలెను. ఇందలి శృంగారవస్తువు స్త్రీభేదన - అపహరణ - ఉపమర్దనములతో నుండును. ఇందు నాల్గంకములు - వ్యాయోగమునందు వలె నిందును కార్యము పురుషులు వృత్తులు రసములుండ దగును. ఇందు స్త్రీ యోగము మాత్రము విశేషము

### ౯. సమవకారము

సమవకారరూపకము దేవాసురబీజకృతము ప్రఖ్యాతోదాత్త నాయకము త్ర్యంకము త్రికపటము త్రివిద్రవము త్రిశృంగారముగా నుండును. పన్నెండుమంది నాయకులుందురు. అష్టాదశనాడికాప్రమాణముగా నుండును. ఇందలి ప్రథమాంకము సుప్రసన్నము సవిద్రవము సకపటము సవీథీకమునై ద్వాదశనాడీయుక్తముగా నుండవలెను. రెండవయంకమున నాలుగు నాడికలు. తృతీయాంకము వస్తుసమాపనమునకున్నదై ద్వినాడికముగా నుండును. ముహూర్తార్థరూపమయిన కాలమానమునకు నాడికయని పేరు. కావ్యబంధానుసారమున సంక

మున సంబంధ మనుసరింపవలెను. సమవకారములందలి యర్థము ప్రతి సంబంధమున నుండుటసమ్మతము. ఇందలి త్రివిధకపటము సుఖదుఃఖోత్పత్తికృతము. వస్తుగతక్రమవిహితము దైవకృతము పరప్రయుక్తము నని కపటము త్రివిధము. ఇందలి విద్రవము యుద్ధజలసంభ్రమరూపము, వాయ్వగ్ని గజ సంభ్రమకృతము నగరోపరోధజన్యము నని మూడు విధముల నుండవలెను. వేరువేరుగా కావ్యబంధ విహితార్థమయిన శృంగారము ధర్మశృంగార మర్థశృంగారము కామశృంగారమని త్రివిధము. ధర్మశృంగారమునందు ధర్మప్రాపక మాత్మహితమయిన సాధనము బహుధాయుండును. వ్రతనియమతపోరీతులావశ్యకములు. అర్థశృంగారమున నర్థప్రాప్తియుండును. స్త్రీసంప్రయోగవిషయమున గూఢ అర్థార్జనమభిరతి యుండును. కామశృంగారము కన్యావిలోభన కృతమై నిభృతముగ సావేగముగ నుండును. స్త్రీ పురుషులప్రాప్తి రతి కృతమె యగును. బంధకుటిలము లయిన వృత్తములు నిందుపయోగింప వలెను. ఇట్లు సమవకారమును నానారససంశ్రయము కాగలదు.

## ౬. డి మ ము

డిమ మను రూపకము నందు శృంగారహాస్యము లుండరాదు. తదన్యరసములతో నుండవలెను. దీప్తరసకావ్యము లిం దావశ్యకము ౪ ఇందు నాల్గంకములు. డిమము ప్రఖ్యాత వస్తువిషయము ప్రఖ్యాతోదాత్తనాయకము. రౌద్ర-భయానక - బీభత్స - వీర - కరుణ - అద్భుతోపేతము మాయేంద్రజాలబహులము. నానాపురుషుల యుద్ధానముతో నుండును. దేవ - భుజగ - రాక్షస - యక్ష - పిశాచావకీర్ణముగా నుండును. నిర్ఘాతోల్కాపాతములు చంద్రసూర్యోపరాగములు యుద్ధనియుద్ధములు సంస్ఫోటములు నుండును. సాత్వతీ భారతీవృత్తు లిందావశ్యకములు. నానాశ్రయవిశేషము షోడశ నాయక బహులము డిమము.

యగును. అవి కృతభాషాచారముగా నుండియు విశేషభాషోపహాస ముల పదములతో నుండును. ఇట్టిదిది శుద్ధప్రహసనము. సంకీర్ణమగు మిశ్రప్రహసనము ఉద్ఘాత్యకాది వీథ్యంగములతో నుండును.

౧౦. వీ థి

వీథిరూపకములో అంక మొకటియె యుండును. "ద్వాపాత్ర భార్యా, ఏకభార్యావా" సర్వలక్షణసంపూర్ణమయిన వీథి త్రయో దశాంగములతో నుండును. మూడు విధములయిన ప్రథ మోత్తమ మధ్యమపరికృతు లిందుండురు. ఇట్లు దశరూపకము భరతాచా ర్యానుసారముగా నిరూపితమయినది.

నా టి క

ప్రకరణనాటకభేదో రూపకమిహ నాటికా భవతి
స్త్రీప్రాయా చతురంకా లలితాభినయాత్మికా సువిహితాంగీ
బహుగీతనృత్తవాద్యా రతిసంభోగాత్మికా చైవ
రాజోపచారయుక్తా శృంగారాభినయభావసంయుక్తా
నాయకదేవీపరిజనసమన్వితా నాటక ప్రకృతిః
ప్రకరణసముద్భవా పునరుత్పాద్యం వస్తునాయకం నృపతిం
అంతఃపురసంగీతక కన్యామధికృత్య కర్తవ్యా.

నాటిక అనునది ప్రకరణ నాటక భేదము. నాటిక స్త్రీప్రా యము చతురంకము. లలితాభినయములతో నుండును. బహునృత్త గీతవాద్యములతో నుండును. రతిసంభోగములతో నుండును. రాజో పచారములతో నుండును. శృంగారాభినయ భావ సంయుక్తి ముగా నుండును. నాయక - దేవి-పరిజన సమన్వితముగా నుండును, నాటికకు నాటకము ప్రకృతి ప్రకరణ సముత్పత్తియు నున్నది. నృపతి నాయకు నుద్దేశించిన యుత్పాద్యవస్తు విందుండును. అంతః పుర సంగీతక కన్య నాధారముగా జేసికొని నాటికను నిబంధింప వలెను.

## సట్టకము

సట్టకము విష్కంభక ప్రవేశక రహితము. ఏకభాషాయుక్తము అప్రాకృతి సంస్కృత మిందుండును. ఇది నాటికా ప్రతిమము. లలితాభినయములు గీతనృత్తములు రస సంభోగములు శృంగారాభినయ భావములు నాటికలో వలె గ్రాహ్యములు.

కావ్యం గోపుచ్ఛాగ్రం కర్తవ్యం నాటికాదిషు ప్రాజ్ఞైః
యే తూదాత్తా భావాస్తే సర్వే పృష్ఠతః కార్యాః
సర్వేషాం భావానాం నానారసభావయుక్తియుక్తానాం
నిర్వహణే కర్తవ్యో నిత్యం హి రసోఽద్భుత స్తజ్ఞైః

నాటికాదులలో కావ్యము గోపుచ్ఛాగ్ర రూపముగా నిర్మింపవలెను. అన్నియు పరస్పర సంసక్తములై సుశ్లిష్టములై సుస్నిగ్ధములై సమాకృతి శోభతో నుండునట్లు పరిశీలింపవలెను. ఉదాత్తములగు భావములను వెనుకవెనుక అనుసరించి యుండునట్లుగా కూర్పవలెను. నానారసభావ యుక్తియుక్తములగు సర్వకావ్యములం దీ విధాన మావశ్యకము. బీజార్థ నిర్వహణము నం దద్భుత రసమును నిరూపింప వలెను అది యసంగతములకు సంగతి కూర్చును. ఫల సంభావనము సంపాదించును.

యద్దివ్యనాయకకృతం సంగ్రామబంధవధయుక్తం
తద్భారతేఽత్ర వర్షే కర్తవ్యం కావ్యబంధేషు
తస్మాద్భారతమిష్టం వర్షేష్వన్యేషు నిత్యకాలం హి
హృద్యాః సర్వాభూమిః శుభగంధా హేమరత్నమయీ
ఉపవనగమన క్రీడావిహార నారీరతిప్రమోదాఃస్యుః
తేషు హి వర్షేషు సదా న తత్ర దుఃఖం న వా శోకః
యే చైషామధివాసాః పురాణవాదేషు పర్వతాః కథితాః
సంభోగస్తేషు భవేత్కర్మారంభ స్తథైవ తస్మిన్
వాక్యార్థాభినయోయం ప్రకీర్తితో నాటకాదిభేదేన.

దివ్యనాయకు లాచరించు సంగ్రామవధ బంధాదులను భారత వర్షము నందలి కావ్యబంధములందే కూర్పవలెను. ఇతరవర్షము లున్నను సర్వకాలము భారతవర్షమె యభీష్టము. ఇచటి భూమి హృద్యము శుభగంధము హేమరత్నమయము. ఇందే యుపవనగ మనములు క్రీడావిహారములు నారీ రతిప్రమోదములు కలవు. ఇతర వర్షములందు దుఃఖము శోక ముండదు. ఇతరములు నిత్య సుఖ భూములు. నిత్య సుఖము నిత్య దుఃఖము కలవారలకు సుఖదుఃఖ విమిశ్రణమున నుండు నాట్యమాస్వాద్యము కాదు. పురాణవాదము లలో నిరూపితములయిన పర్వత పరిసరములందు సంభోగ మనుచితము. కర్మారంభ మనుచితము. నాటకాదిభేదముల నిట్లు వాక్యార్థాభినయము నిరూపిత మయినది. ఇక ద్వాదశవిధ పదార్థాభినయమును యథా స్థితముగ నిరూపింపవలసి యున్నది.

## శ్రీ గ ది త ము

యత్ర శ్రీరివ దానవశత్రోర్యస్మిన్కులాంగనాపత్యుః
వర్ణయతి శౌర్యధైర్యప్రభృతిగుణానగ్రతః సఖ్యాః
పత్యా చ విప్రలబ్ధా గాతవ్యేతాః క్రమాదుపాలభంతే
శ్రీగదితమితి మనీషిభిరుదాహృతోసౌ పదాభినయః.

శ్రీవిష్ణువు శ్రీదేవి వలె కులాంగన, సఖిసమక్షమున భర్త యొక్క శౌర్య ధైర్య ప్రభృతి గుణగణములను వర్ణించుట శ్రీగది తమున నుండును. నాయిక పతి విప్రలబ్ధయై యుపాలంభము నొందును. శ్రీగదితము పదాభినయాత్మకమని యనిరి దుమ్మిల్లిక, దుర్మిలికా, దుర్లల్లిక యనదగిన రూపకమున చౌర్యరతి ప్రభేదన ముండును. యువానురాగ వర్ణన ముండును. నాతిక గ్రామ్య కథలతో రహ స్యముగా నిట్టి విశేషములు పలుకును. పతితజాతి యగుటచే ధన మిమ్మని యాచించును. ధనమందుకొనియు మరల ధనమందుకొన

దలచును. ఇట్టిది మిశ్రితము. ప్రస్థానము, ప్రథమమున రాగమాన ప్రవాహ సంశ్రయముగా నుండును. ప్రావృడ్వసంతవర్ణన పరముగా నుండును. ఉత్కంఠాకృతముగా వస్త్వవర్ణనము నుండును. తుదిలో వీరరససాధ్యము లయిన నాలుగు సనారభటులతో ఇది నిబద్ధమగును. ఈ విమర్శలు నిరూపింపబడిన, కావ్యము - భాణకము - భాణిక - గోష్ఠి హల్లీసము - నర్తనకము - ప్రేక్షణకము - నాట్యము - రాసకము అనునవి నృత్తశిల్పి ప్రధానములుగా నుండును. గేయగాన ముఖ్యలుగా నుండును. చిత్రమైన వివిధరాగములుండును. హరిహర భానుభవానీస్కంద ప్రమథాధిప స్తుతి నిబంధనముండును. ఉద్ధతములు కరణములు (ఆంగికాభినయవిశేషములు) అధికముగా నుండును. స్త్రీలుండరు. వర్ణన యుండును గాథారంభములతో స్తుతి నిబంధముండును. గాయన సహోక్తులు స్వభాషా నిబంధన ముండవచ్చును. "ప్రయోగాహరిచరిత ముండును. ఇంక నుద్భటముగా లలితముగా నుండు విశేషములు కలవు. "సుకుమారతః ప్రయోగాదస్యాశ్చి హభాణికా భవతి" సుకుమార ప్రయోగమున భాణము భాణిక యగును. దివ్యచారీ విధానము లుండవు. లలితకరణము లుండును.

వివిధవచోవిన్యాసైః సభ్యజనోత్సాహసంపత్తి;
గోష్ఠే యత్ర విహారశ్చేష్టితమిహ కైటభద్విషః కించిత్

ఇది గోష్ఠిరూపక లక్షణము. వివిధ వచోవిన్యాసములతో నుండునది. సభ్యజనుల యుత్సాహ సంపత్తితో నుండునది గోష్ఠమున సంచరించు శ్రీకృష్ణుని చేష్టిత ముండును గావున నిది గోష్ఠి యయినది. స్త్రీల మండల నృత్తమున్నచో హల్లీసక మగును. గోపస్త్రీలకు మురారి యొకడే నాయకుడయినట్లు ఇందు నాయకుడొకడే యుండును. నర్తనకములో నర్తకి లలిత లయ విధానమున పదార్థాభినయ మొనర్చును. ఇట్టి నర్తన విధానము రథ్యా - సమాజ చత్వర - సురాలయము లందనేకులు ప్రవర్తింప చేయుదురు. పాత్ర

విశేషములతో లలితాభినయ ముండునేని ప్రేక్షణకమని పేరు. కాను దహానాము లిట్టివి.

షోడశ ద్వాదశ అష్టౌ వా యస్మిన్ నృత్యంతి నాయికాః
పిండీబంధాదివిన్యాసైః రాసకం తదుదాహృతం

పదునారుగురు కాని పన్నెండుగురు కాని యెనిమిదిమంది కాని నాయికలు పిండీబంధాది విన్యాసములతో నభినయింతురేని యది నాట్య రాసకమగును. "పిండనాత్తు భవేత్పిండీ" పిండనమున అన్నిటి నొకచోట చేర్చికూర్చినందున పిండియగును. ఇట్టివన్నియు క్రియావిధులలో నృత్తరూపమున విధావింపదగియున్నవి. సుకుమారోద్ధతాంగవిన్యాసములతో గాయికలు విలక్షణముగా దీనిని ప్రయోగింప వలెను. పిండీ బంధాదులు వాక్యవిధులు. ఇవి పదములచే నభినయింప దగినవి కావు

కామినీభిః భువో భర్తుశ్చేష్టితం యత్తు నృత్యతే
రాగాద్వసంతమాసాద్య స జ్ఞేయో నాట్య రాసకః

కామినీమణులు రాగమున వసంతసమయము ననుసరించి భూభర్తృచేష్టితము ననుకరించి నర్తింతురేని యది నాట్య రాసకమగును. కామినీయుగ్మము రంగమున ప్రవేశించి సమచారీ విధాన శిక్షితము ననుసరించి వామదక్షిణ సంచార క్రమమున పరిష్కృతి సంచార మొనర్ప వలసి యుండును. అన్యోన్యాంగిక సంచారములు వివిధకృతములయిన హస్తతాలములు ఏకతాలపరిక్రమణములు సమకాల నిష్క్రమణములు పుష్పాంజలి ప్రయోగము ఉభయపార్శ్వము లందును వెనుకగా పాత్రప్రవేశము తగిన సమయమున శుష్కగీత ప్రయోగము, గాయనీగానము, నానావృత్తములతో వనములతో గూడిన పాత్రల సంబంధ సముచితమయిన పిండీబంధ మిందుండును. శుభార్థవచన క్రమము రాసకమున నావశ్యకము.

లబ్ధ్వా దుగ్ధమహోదధౌ సురగణైః పీత్వామృతం యత్తదా
పిండీశృంఖలికావిశేషవిహితో యుక్తో లతాభేద్యకైః

చిత్రాతోద్యపదక్రమైర్లయయుతో భేదద్వయాలంకృత
శ్చారీఖండసమండలైరనుగతస్సోయం మతో రాసకః

క్షీరసాగరమున దేవత లమృతము పొంది త్రాపి పింఛశృంఖ లికా విశేషములతో లతాభేద్యకములతో చిత్రాతోద్య పదక్రమము లతో లయయుతముగా చారీఖండలములతో ననుగతమగునట్లు నాట్య మొనరించిరి. అది రాసక మనుట యాశ్చర్యము. ఇప్పటికి బ్లభినయ యోగ్యములు నిరూపితము లయినవి ఇక అనభినేయములు.

అ న భి నే య భే ద ము లు.

౧. ఆఖ్యాయిక యను ననభినేయ కావ్యభేదమున కన్యాప హారము – సంగరము – సమాగమము – అభ్యుదయము కలనాయక చరితముండును. వక్త్రము – పరివక్త్రము అను పేరులు కలవృత్త ముల ఘటనముండును. ఉచ్ఛ్వాసవిభాగ ముండును. సంస్కృత భాషా గద్య యుండును. మాధవిక – హర్షచరిత మనునవి యాఖ్యా యికలు.

౨. ఉపాఖ్యానము. ప్రబంధాంతర్గతముగా నన్య ప్రబోధనము నకై నలకథ – సావిత్రీకథ – షోడశరాజకథ మొదలగునవి యాఖ్యా తములగు నేని యది యుపాఖ్యాన మగును.

౩. ఆఖ్యానకము. సావధానముగా నున్న సదస్సులో గ్రంథి కుడొకడు అభినయించుచు పఠించుచు గాన మొనరించుచు కథన మొనరించు నేని యది యాఖ్యానకము.

౪. నిదర్శనము. తిర్యక్చేష్టల ననుసరించికాని యతిర్యక్చే ష్టల ననుసరించికాని కార్యమకార్యము నిశ్చితమగునేని యది నిదర్శన మగును. పంచతంత్రాదు లిట్టివి. ధూర్తులు విటులు కుట్టనీమతము మయూరమార్జారి కాదులు, లోకమున కార్యాకార్య నిరూపణ పరముగా నున్న నదియు నిదర్శన మగును.

౫. ప్రవహ్లిక. సభాసమయమున నిస్తరి వివాద ప్రధానమైన కథావస్తువు నాధారముగా జేసికొని ప్రవర్తించునది, సార్ధప్రాకృత రచితమగునది ప్రవహ్లిక యగును.

౬. మంథుల్లిక. మహారాష్ట్రి భాషా నిబంధనముతో నుండు క్షుద్రకథ మంథుల్లి ప్రరోచన కలుగునట్లుగా కవులు దీనిని బంధింప వలెను. పురోహితామాత్య తాపసుల యుపహాస ముండుటయు ప్రారబ్ధనిర్వాహము సరిగా లేకున్నచో నదియు మంథుల్లిక యగును.

౭. మణికుల్యా ఈ మణికుల్యాలో జలమువలె మొదట వస్తువు గోచరము కాదు. పిమ్మట ప్రకాశిత మగును. మత్స్యహసితము మొదలగునవి మణికుల్యగా చెప్పదగినవి.

౮. కథ. నియమిత మైన గతికలది. అట్టి బాషకలది. ఇందలి యితివృత్తము దివ్యము అదివ్యము దివ్యాదివ్యము నగును. కాదంబరి లీలావతి మొదలగునవి కథా వ్యవహార్యములు.

౯. పరికథ. దీనిలో ప్రతియోగి రూపమున సన్నివేశము లధిక ముగా నుండును. జిగీషువులు సమస్థలిందు వర్తింతురు. ఇట్టిది పరికథ.

౧౦. ఖండకథ. గ్రంథాంతర ప్రసిద్ధమైన యితివృత్తము నందలి మధ్యభాగము నుండిగాని యుపాంతభాగము నుండి గాని కథాభాగ మును స్వీకరించి రచన యొనర్చిన నది ఖండకథ యగును. ఇందుమతి యిట్టిది.

౧౧. ఉపకథ కథాంతరము నాశ్రయించి యతి ప్రసిద్ధమగు చరితమును కవులు నిబంధించిన నది యుపకథ యగును. కథాంతర నిబంధనమున ప్రసిద్ధ ప్రస్తుత చరితము విచిత్రమగును. చిత్రలేఖాదిక ముపకథారూపము.

౧౨. బృహత్కథ. అద్భుతార్థములు కలది. లంబము లనుపేరు కల లంభము పేరులతో విభాగము కలది. పిశాచ భాషామయము, మహా విషయముగా నుండునది బృహత్కథ యగును. నరవాహన దత్తాదుల చరితమునకు బృహత్కథ నామము సంగతము.

౧౩. చంపువు నాంకము సోచ్ఛ్వాసము దివ్యపద్యగద్యమయ మునగు నాఖ్యాయికయే చంపువగును. దమయంతి వాసవదత్త మొద లగునవి చంపువులు

## ౧౪. పర్వబంధము

యస్మిన్నితిహాసార్థాశ్ఛందోభిస్సంస్కృతేన బధ్యంతే
బహవస్స పర్వబంధో భవతి మహాభారత ప్రభృతిః

ఇతిహాసార్థము లన్నియు సంస్కృత భాషారూపములై ఛందో బద్ధములై పర్వవిభాగమున విభక్తములై యుండునేని యది పర్వబంధ మగును. మహాభారతాదులు పర్వబంధముగా ప్రసిద్ధములు.

## ౧౫. కాండబంధము

యత్రేతిహాసమఖిలం యథాస్థితం నైకమేవ భాషంతే
ఋషయస్స కాండబంధో రామాయణసన్నిభో భవతి

కాండబంధమునం దితిహాసము సర్వము నున్నదున్నట్లుగా నొక విధముగనె యుండునటుల ఋషులు భాషించిరి కాండములన్న విభాగముతో నుండును గావున నిది కాండబంధము. ఇట్టిది రామాయణ సన్నిభముగా నుండును.

## ౧౬ సర్గబంధము

యస్మిన్నితిహాసార్థాన పేశలాన్పేశలాన్కవిః కుర్వన్
స హయగ్రీవవధాదిప్రబంధ ఇవ సర్గబంధః స్యాత్

అపేశలముగా నున్న యితిహాసార్థముల నన్నిటిని పేశలముగా నొనర్చు కవి సర్గములన్న విభాగములతో కూర్చునేని యది సర్గబంధమను పేరు కల కావ్యమగును.

౧౭. ఆశ్వాసకబంధము. ఇది సర్గము సర్గబంధ తుల్యముగ నుండును. శుద్ధప్రాకృతమున నిబద్ధమగును. ఆశ్వాసములన్న విభాగములతో నుండును సేతుబంధాది ప్రాకృత భాషా నిబద్ధ కావ్యము లాశ్వాసక బంధములని ప్రసిద్ధి.

౧౮. సంధిబంధము. ఇది యపభ్రంశభాషా నిబద్ధముగా నుండును. మాత్రాచ్ఛందములతో నుండును. అల్పధీజనుల కిది యభిమతము. బ్రహ్మ నిరూపించిన సముద్ర మథనాదులు అబ్ధి మథనాదులు సంధిబంధములు.

౧౯. అవస్కంధబంధము. భీమకాయాది గ్రంథము లవస్కంధ బంధములు. దీనిలో గ్రామ్యము కాని విధానము ద్విపదికా గీతము లుండును. గళితార్ధములతో నిది యుండును.

## ౨౦. కావ్యశాస్త్రము

యత్రార్థశాస్త్రాణాం కావ్యే వినివేశ్యతే కవిభిః
తద్భట్టికావ్యముద్రారాక్షసవత్కావ్యశాస్త్రం స్యాత్

కావ్యమున కవు లర్థశాస్త్రము వ్యాకరణశాస్త్రము మొదలగు వానిని నిబంధింతు రేని యది కావ్యశాస్త్రమగును. భట్టికావ్యమున వ్యాకరణశాస్త్ర విషయమున్నది. ముద్రారాక్షసనాటకమున నర్థశాస్త్ర విషయమున్నది. అట్టివి కావ్యశాస్త్రములని ప్రసిద్ధి. పర్వబంధరూపమయిన మహాభారతము నానందవర్ధనుడు శాస్త్రచ్ఛాయాన్వయము కల కావ్యమని వ్యవహరించెను.

౨౧. శాస్త్రకావ్యము. కవిరహస్యమగు శాస్త్రమునన ల్పబుద్ధి ప్రతిభులగు కవులు కావ్యము లందు నిబంధింతురు. అట్టిది శాస్త్రకావ్యము. రతివిలాసమునందు కామశాస్త్ర విషయము కామందకీయమునందు నీతిశాస్త్రవిషయము కలదు. అట్టివి శాస్త్రకావ్యమన్న వ్యపదేశము పొందదగి యున్నవి.

౨౨. కోశము. ఇది సుభాషితరత్న సమూహాత్మకము. మహాకావ్య నాగరముల నుండి సముద్ధృతములయిన శ్లోకములు కలిగి కోశసదృశముగా నుండును గావున నిది కోశ మన వగియున్నది. గాథా సప్తశతి మొదలగునవి కోశవ్యవహార్యములు.

౨౩. సంఘాతము. ఒకప్రఘట్టమున నొకఁడే నిర్మించిన సూక్తి సముదాయమున్నచో నది సంఘాత పదవాచ్యము. బృందావనము మొదలగునవి సంఘాత రూపములు.

౨౪. సంహిత. విప్రకీర్ణములుగా నుండు వృత్తాంతములను మనీషులగు వారొకచో కూర్చినచో విప్రకీర్ణవృత్తాంతములుగా నుండు వానినొకచో కూర్చినచో చక్కని సంధానమున కూర్చినచో నది సంహిత యగును. యదువంశము దిలీపవంశము మొదలగునవి సంహితలు.

## సాహిత్య ప్రకాశము.

అశేష విద్యాస్థానములతో నుండునది విద్యాప్రయోజనములు కలది విద్యావిభూతులు కలది సర్వవిశేషములతో ప్రకాశించునది, సర్వకావ్యోప సంహారములతో నుండునది సాహిత్య ప్రకాశమను నామమున వ్యవహరింపదగి యుండును. ఇట్టిదీని లక్షణ మిట్లున్నది.

యస్మిన్నశేషవిద్యాస్థానార్థవిభూతయః ప్రకాశంతే
సంపూర్ణత్వేన స సాహిత్యప్రకాశ ఏతాదృశో భవతి

అశేష విద్యాస్థానార్థ విభూతి విశేషములు ప్రకాశితములగునేని యది సాహిత్య ప్రకాశము. ఈ శృంగారప్రకాశము సాహిత్య ప్రకాశము. దీనిలో నన్నియుగలవు. ఏతాదృశమే సాహిత్య ప్రకాశమగును.

ఈ శృంగారప్రకాశము నందు అశేష శాస్త్రార్థ సంప్రదాయముల సన్నివేశము సుప్రకాశముగా నున్నది. అఖిల కలా కావ్యో

చిత్య కల్పనా రహస్యముల సన్నివేశము సుప్రకాశముగా నున్నది సర్వశాస్త్ర కలా కావ్యోపనిష త్సన్నివేశ ప్రకాశము ఈ శృంగార ప్రకాశము. ఈ సాహిత్య ప్రకాశము. ఈ యుభయవిధములగు ప్రబంధ స్కంధ క్షేపముల కద్వైశేషికము వైశేషికమునగు గుణాలంకార లక్షణయోగము రసావియోగ హేతువగును.

అందు గుణము ద్వివిధము శబ్దగుణ మర్థగుణ మని. అలంకారమును ద్వివిధము. శబ్దాలంకార మర్థాలంకార మని. ఇట్లు నిరూపించుటచే నుభయగుణాలంకారస్వరూపము వ్యాఖ్యాతమయినది. గుణాలంకారము లీ ప్రకారమున నున్నవి. ఇట్లు విశేషముగాలక్షణము త్రివిధముగా నున్నను గుణాలంకారములు సవిశేషముగా వాఖ్యాతములు కావలసి యున్నది. మహా కావ్యాదులలో యథాసంభవముగా నీ గుణాలంకారములను నిరూపింపవలెను.

శబ్దగుణములు

౧. అసంక్షిప్త గ్రంథత్వము
౨. అవిషమ బంధత్వము
౩. శ్రవ్య వృత్తిత్వము
౪. అనతివిస్తీర్ణ సర్గాదిత్వము
౫. సుశ్లిష్ట సంధిత్వము

అర్థగుణములు

౧. చతుర్వర్గ ఫలాయత్తత్వము
౨. చతురోదాత్త నాయకత్వము
౩. రసభావ నిరంతరత్వము
౪. విధినిషేధ వ్యుత్పాదకత్వము
౫. సుసూత్ర సంవిధానకత్వము

ఈవి నిబంధనమున గలుగు విశేషముల నెల్ల గుర్తింప వలెను. మహాకావ్యములందు గూర్పదగిన శబ్దగుణముల భావవిశేష మీ విషయమున నుండును.

౧. అసంక్షిప్త గ్రంథత్వమునుబట్టే ఇది సూచిత మగును. గ్రంథము సంక్షిప్తముగా నుండకుండుట, సవిస్తరముగా ప్రతిపాద్యముల నన్నిటిని ప్రతిపాదించుట యపేక్షితము. గ్రంథ మసంక్షిప్తమగుటచే గ్రంథగౌరవము సూచిత మగును. ప్రతిపాద్య ప్రతిపాదనమున గ్రంథము పెద్దది కావచ్చును. క్లిప్తముగా సంగ్రహముగా నున్నచో కథకు రసభావ సంపత్తికి విచ్ఛేదము కలుగునని కొందరాశంకింతురు. అట్లాశంకించు వారి మనసుల నావర్జింప జేయుటకీ సూక్తి సమర్థమగును.

౨. అవిషమబంధత్వము రెండవది. బంధమున విషమత్వము లేకుండుట శబ్ద సందర్భవిదులగు వారు విషమబంధ మభినందింపరు. వారలకీ రీతి మనోముద మాపాదింప గలదు.

౩. శ్రవ్యవృత్తత్వము. ఛందోమయములయిన వృత్తము లన్నియు శ్రవ్యములుగా నుండవలెను, మహాకావ్యాదులు నానావిధ పద్యభేదములతో నుండవచ్చును. అయినను పద్యము లన్నియు చతుష్పాదములతో నుండుట యుక్తము. శ్రవ్యవృత్తత్వనియమమున సర్వాదిచతుష్పది సమాకృష్టమగును. చతుష్పదీవ్యవహారమునగూడ శ్రుతిసుఖము సంపాదింపగల వృత్తములనే నిబంధింపవలెనని సూచిత మగును. దీనిచే శ్రోతృజన ప్రోత్సాహము సిద్ధమగును.

౪. అనతివిస్తీర్ణసర్గాదిత్వము. కావ్యమున సర్గములత్యంతము విస్తీర్ణములై యుండరాదు. వర్ణనము లతిదీర్ఘములై యుండరాదు. అట్లుండుట యుద్వేగమిచ్చును. పాఠకులు కొందరు గ్రంథవిస్తర భీరువులు. అట్టివారలకు దీనివలన చిత్తాకర్షము కలుగును.

౫. సుశ్లిష్ట సంధిత్వము వస్తువిభాగములకు వర్ణనాంశములకు సర్గములకు సముచితమయిన సంబంధము యుక్తముగ నుండవలెను. అదియె సుశ్లిష్టత. దీనివలన సర్గముల కన్నిటికి పరస్పర మేకవాక్యత కల్గును. మహావాక్యాత్మకమయిన ప్రబంధమున కుపకారిత్వము సూచితమగును.

౬. చతుర్వర్గ ఫలాయత్తత్వము. ఇది యర్థగుణములందు మొదటిది. చతుర్వర్గము లనదగిన ధర్మార్థ కామ మోక్షముల ఫలాంశమున కావ్యమాయత్తమై యుండుట యావశ్యకము. ముక్తకాద్యల్ప శరీరకావ్యము లందు చతుర్వర్గ ఫలసంపత్తి యుండు నన లేము. మహాకావ్యములందు ధర్మార్థ కామ మోక్షములు వ్యస్తముగగాని సమస్తముగగాని యుండును గావున తత్ఫలమును ఫలనాభిప్రాయమును మహాకావ్యము సంబంధించి యుండునని స్పష్టమగును. కావున ముక్తకాదుల కన్న మహాకావ్యమునకు విశిష్టభేదము కలదని సూచితమగును.

౭. చతురోదాత్త నాయకత్వము. ఇది యర్థగుణములలో రెండవది. ప్రబంధనాయకుడు చతురు డుదాత్తుడు నగు నాయకుడుండవలెనని భావము. కథాశరీరమున వ్యాపించి యుండు నాయకునకు ధర్మార్థ కామ మోక్షములందు వైచక్షణ్యమును సూచింపవలెనని యతని యాశయ విభూతులకు సముత్కర్ష నిరూపింపవలెనని దీని వలన సూచితమగును,

౮. రసభావ నిరంతరత్వము మూడవది. ఇందు రసగ్రహణమున తత్కారణములయిన భావములను పరిగ్రహించి వస్తుగును వేరుగా భావమును గ్రహించుటచే రసభావములకు పరస్పరము కార్యకారణ భావము సూచితమగును. కావున – "రసేభ్యోభావాః, భావేభ్యోరసాః, రసేభ్యశ్చ రసాః"–అనుపక్షత్రయము ననుసరించిన అభిప్రాయములు స్వీకృతము లగును. అందువలనవాని నైరంతర్యము

రసభావ బాహుళ్యము సూచిత మగుచున్నది. ఏకరసమయిన భోజనము రుచిరము కాదు. వైరస్యమిచ్చును. అట్లే యేకరసమగు ప్రబంధము వైరస్యమాపాదించు నని సూచించునది.

౯. విఖ్యాత నేతృ ఖ్యాత్యాపాదకత్వము నాల్గవది. దీనిచే గుణవంతు డయిన నాయకున కుత్కర్ష వర్ణితము కావలెనని సూచిత మగును. దోషములు కలవారి యుచ్ఛేదము ప్రదర్శిత మగును జిగీషువు గుణ యుక్తుడు కావలెను గాని దోషయుతుడు కారా దని ఖ్యాత్యాపాదిత మగును.

౧౦. సుసూత్ర సంవిధానకత్వ మనునది యయిదవది. ఇది కవి శిక్షాకీలిని ప్రదర్శించును. ప్రబంధము నందలి సంవిధానము లన్నియు సముచిత సూత్రానుసంధానమున నుండునవి కావలెను నిరూపిత లక్షణములు కల పదార్థములు కాని వక్ష్యమాణ లక్షణములు కల పదార్థములు కాని ప్రబంధమున శోభానుసంధానమునకు కావలెననుట కవిశిక్ష.

౧౧. రసానురూప సందర్భత్వము. అనునిది యుభయగుణములలో మొదటిది. ప్రబంధమున నుండు సందర్భములు రసాను రూపములుగ నుండవలెను. ప్రబంధమున రతి ప్రకర్ష నిరూపితమగు నేని కోమల శబ్ద సందర్భ మావశ్యకము ఉత్సాహ ప్రకర్ష ముండు నేని ప్రౌఢ శబ్ద సందర్భ మావశ్యకము క్రోధ ప్రకర్ష యుండునేని కఠోర శబ్ద సందర్భమపేక్షితము. శోక ప్రకర్షముండుచో మృదు శబ్ద సందర్భ ముండవలెను విస్మయ ప్రకర్ష మున్నస్ఫుట శబ్ద సందర్భ ముండవలెను. ప్రబంధమున నిట్టి విరచన మావశ్యకమని కవికిది యుప దేశము "నైకమోజః ప్రసాదో వా రసభావ విదః కవేః" రసభావ విదుడగు వానికి ఒక యోజోగుణము, కాని యొక ప్రసాదగుణము కాని యుక్తముకాదు. రసభావ నియతముగా వాని వాని నియతి యుండునని ప్రఖ్యాపితమగును

౧౨. పాత్రానురూప భాషత్వము. ఉభయగుణము లందిది రెండవది. ఉత్తమ పాత్రలు సంస్కృతమునను ఉత్తమ స్త్రీలు ప్రాకృతమునను, మధ్యములు శౌరసేనీ వ్యవహారమునను, జఘన్యు లపభ్రంశమునను, అంతఃపురములు మాగధికా భాషా వ్యవహారమునను భాషింతు రనుట సూచిత మగును. ఇట్టి సూచనమున అస్పష్టముగా భాషించు వారలలో భాషా చిత్రోక్తుల కవకాశము సూచిత మగును. అట్టివారిలో చిత్రోక్తి యుండదగును.

౧౩. అర్థానురూప చ్ఛందస్త్వము అర్థమున కనురూపము లయిన ఛందస్సుల నుపయోగించుట యనునది మూడవది. శృంగారమున ద్రుత విలంబితాది వృత్తములను, వీరమున వసంత తిలకాదులను కరుణమున వైతాలీయాదులను, రౌద్రమున స్రగ్ధరాదులను సర్వత్ర శార్దూల విక్రీడితాదులను నిబంధింపదగునని దీని వలన నుపదిష్ట మగును.

౧౪. సమస్త లోక రంజకత్వమనునది నాలవది. ప్రబంధమున నలౌకిక సన్నివేశములను పరిహరింప వలెను. కీర్తి ప్రీతి నిబంధనమైన ప్రబంధమునకు లోకమున ప్రతిష్ఠ కలుగునేని కవి ప్రయాసము సఫల మగును. అతడు ప్రయాసవైయర్థ్యము భావింపడు.

౧౫. సదలంకార వాక్యత్వ మయిదవది. తత్తదుపాత్త లక్షణములు కల శబ్దార్థోభయ గుణములు స్వరూప సౌందర్యమున నె కావ్యశోభాకరములు కాగలవు. పయిన నలంకారములుండుటచే, యీ భారమును వహింపగలవు. కావ్యశోభాసంపాదనమున నలంకారవత్తయే సమర్థమని యుపర్యుపరి దేశమున నుపపాదిత మగును.

ఇట్టి శబ్దగుణార్థగుణోభయ గుణములు మహాకావ్యములందు రసావిరోధ హేతువులు కాగలవు. అట్లే శబ్దాలంకారార్థాలంకారోభయాలంకారములు రసావిరోధ హేతువు లగును.

౧౬. నమస్కారా ద్యుపక్రమత్వమనునది శబ్దాలంకారము లలో మొదటిది. నమస్కారము - స్తుతి - ఆశీః - వస్తునిర్దేశము - వస్తూపక్షేపము - అనునవి యుపలక్షితము లగును.

౧. హర్ష చరితమున నమస్కార మున్నది
౨. రఘువంశమున స్తుతికలదు
౩. హారవిలాసమున ఆశీస్సు కలదు
౪. హయగ్రీవ వధములో వస్తు నిర్దేశ మున్నది
౫. మారీచవధములో వస్తూపక్షేపము కలదు,

౧౭. సంబంధాది మదాది వాక్యత్వము శబ్దాలంకారములలో రెండవది. స్వవంశాదికీర్తనము-వక్తృవ్యాఖ్యా ప్రతిష్ఠానము-తత్ప్రయోజనోపన్యాసము - కవి ప్రశంస - దుర్జన సుజన స్వరూపము-మొదలగునవి సంగృహీతము లగును.

౧. కాదంబరిలో స్వవంశాదికీర్తనము.
౨ సేతుబంధమున వక్తృవ్యాఖ్య ప్రతిష్ఠానము.
౩ సేతుబంధమున ప్రయోజనోపన్యాసము.
౪. రావణవిజయమున కవిప్రశంస

౫. కాదంబరిలో దుర్జన సుజన స్వరూపము. ప్రబన్ధ ప్రారంభములం దీ విధముగా సంబంధ సూచకములయిన సన్నివేశము లుండుట యావశ్యకము.

౧౮. దుష్కర సమ సంస్కృతాది వాక్యత్వము. శబ్దాలంకారము లందిది మూడవది. దుష్కర సమమనుటచే గోమూత్రికా బంధము - మురజబంధము ఏకాక్షరపాదము - యమకము - భాషా చిత్రము మొదలగునవి సూచితము లగును.

౧. కిరాతార్జునీయమున గోమూత్రికా బంధము.

౨. శిశుపాలవధమున మురజ బంధము.

౩. ,, ఏకాక్షరపాదము

౪. ,, యమకము

౫. మాలతీమాధవమున భాషాచిత్రము

౧౯ భిన్నవృత్తసర్గాంతత్వము నాలవది, దీనిచే భిన్నసర్గాంతత్వము - భిన్నకాండాంతత్వము - భిన్నపర్వాంతత్వము - భిన్నాశ్వాసాంతత్వము - భిన్నసంధ్యంతత్వము మొదలగునవి సంగృహీతము లగును. "సర్గ" పదము "ఛత్రిణో గచ్ఛంతి" స్థలమున వలె సహచరితోపలక్షణము "వృత్త" పదగ్రహణ ముపలక్షణముగా గణచ్ఛందములె కాక మాత్రాక్షరచ్ఛందములును గ్రాహ్యములు కాగలవు.

ఆశ్వాసక బంధములుగా నున్న కొన్ని ప్రబంధములలో సమాప్తిలో కూడ ఛందో భేదము గోచరించుట లేదు. రావణ విజయము హరివిజయము సేతుబంధములలో మొదటి నుండి తుదివరకు ఒక ఛందమె యున్నది. కొన్ని గలితకము లచ్చ లచ్చట "వ్యాసకప్రవత్" కలవు. విదగ్ధమానులు కొందరు వాని నచ్చట ప్రక్షిప్తముల నొనరించిరని తద్విదు లనుచున్నారు. ఇట్లాశంక కలిగినచో దీనిని బాపింపవలెను. మాత్రాచ్ఛందస్సు లయిన స్కంధ కాదులు ఛందో విచితులలో ననేకవిధములుగనున్నవి వానిలోనొక్క టియు ననంతభేదములు పొందును కొందరు "భిన్నవృత్తాస్సర్గాంతాః పర్వకాండసర్గా ఏతేషు" అని యీపదమున కర్థము వ్యాఖ్యానించు చున్నారు. కావున నీయర్థము సంపన్నమగును "పర్వాణిపర్వాణి కాండే సర్గేకాండే, సర్గే అన్యదన్యచ్ఛందః" ప్రతిపర్వమును ప్రతికాండము నను ప్రతిసర్గమునను వేరువేరు ఛందమును ప్రయోగింపవలెను. ఆశ్వాసక సంధిబంధములలో నంతట నొక ఛందమె యుండును. అని

ఈ భావమాయుక్తము గలేదు. ఆశ్వాసాంతమున పుష్పితాగ్ర వృత్తము నుపయోగించుచునే యున్నారు. సంస్కృతబంధములలో నారాచకము తోటకము మొదలగు విచిత్రములగు ఛందస్సులుండుట గోచరించుచునే యున్నది. కావుననే రఘువంశము లోని సర్గములు రామాయణమునందలి కాండసర్గలు అనుష్టుప్ జాత్యాది ఛందస్సులతో గూడినవై గోచరించుచున్నవి. కావున నిట్లు వ్యాఖ్యానించుట శ్రేయము. ఉపక్రమించిన వృత్తము యొక్క వ్యత్యాసమున సర్గములలో వృత్తాంతరములతో నుపసంహార మొనరింపబడెను. కుమార సంభవములో నిట్లు కలదు.

అథ స లలితయోషిద్భ్రూలతాచారుశృంగం
రతివలయపదాంకే చాపమాసజ్య కంఠే
సహచరమధుహస్తన్యస్తమాతాంకురాస్త్రః
శతముఖముపతస్థే ప్రాంజలిః పుష్పధన్వా

సౌందర్యము కల సుందరాంగనల భ్రూలతలవలె సుందరమయిన శృంగములు కల ధనువును రతివలయపదాంకమగు కంఠమున లగింపజేసికొని సహచరుడయిన వసంతుని హస్తమున చూతాంకురాస్త్రము నుంచి ప్రాంజలియై మన్మథుడు దేవేంద్రుని సమీపించెను. ఈ భావము కల యీ శ్లోకము సర్గాంతమున నున్నది ఇట్లుండుట యుక్తము.

౨౦. కవి భావాంకిత సమాప్తి వాక్యత్వము. అను నది యాయిదవది. ఇట్లనుటచే స్వాభిప్రాయాంకత - స్వనామాంకత - ఇష్టనామాంకత - మంగలాంకత - ఆశంసాంకత సంగృహీతములగును.

౧. అభిప్రాయాంకత-ఆద్యరాజునకు ధైర్యము, సర్వసేనునకు ఉత్సాహము, ప్రవరసేనునకు అనురాగము.

౨. స్వనామాంకత - స్వప్రబంధములలో గోవింద చతుష్కాది నామాంకత యుండుట. రాజశేఖరుని హరవిలాసము సంకీ నామాంకతను భావింపవచ్చును.

3. ఇష్టనామాంకత భారవి కవి కిరాతార్జునీయమున లక్ష్మ్యంకత యున్నది. మాఘకవి శిశుపాలవధమున శ్ర్యంకత యున్నది. ... ర్ముఖ - గోవింద - చంద్రశేఖర - ఇష్టదేవతా నామాంకత ... కవుల యాయా కావ్యములందు గలదు.

౪. మంగళాంకత. కృష్ణచరితమున అభ్యుదయము, ... హారణమున జయము, పంచశిఖరహరికి కథలో ఆనందము, శ్రీహర్ష నైషధమున ఆనందము.

౫. ఆశంసనాంకత. ధర్మార్థకామమోక్ష విషయముగా నాశంసించుచుండును. 'శ్రద్ధా బ్రహ్మవిదః కవేః పరిణత ప్రజ్ఞస్య వాణీ మిమాం' అను భవభూతి యుత్తరరామచరితములో ధర్మాశంస యున్నది. 'మమాపి చ క్షపయతు నీలలోహితః పునర్భవం పరిగతశక్తి రాత్మభూః' అను కాళిదాసు శాకుంతలములో మోక్షవిషయాశంస యున్నది. ఇట్లే యితరము లభ్యూహ్యములు. ఇట్టి యాశంసా నిరూపణగావ సిసరములును వ్యాఖ్యాతములు కాగలవు.

యావర్త్రివాపతినామసణమిసరణలిఙ్కంకిణీర్వాణకూజ
త్కాంచీవామోపసద్యః స్మృఘజఘనతటీః పంచబాణోధిదేతే

౨౧ నగరాశ్రమ శైలసైన్యావాసార్ణవ వర్ణనము. అనునది యర్థాలంకారములందు మొదటిది. ఈ చెప్పుట అర్థాలంకారము లందు ప్రాదేశ ప్రశంస యుపదిష్టమగుచున్నది. సేతుబంధ - హరివిజయ - శిశుపాలవధ - కుమారసంభవాదులలో నగరవర్ణనము కలదు. రఘువంశ - కిరాతార్జునీయ - కాదంబరీ - శాకుంతలాదులలో నాశ్రమ వర్ణనమున్నది. కిరాతార్జునీయ - శిశుపాలవధ - సేతుబంధ - హరి

విజయాదులలో శైలవర్ణనమున్నది. ఇట్లే సైన్యావాససాగర వర్ణ నాదులను ప్రబంధము లందు భావింపవచ్చును.

౨౨ ఋతురాత్రిందివార్కాస్తమయ చంద్రోదయాది వర్ణనము. అర్థాలంకారములందు రెండవది. దీనిచే కాలావస్థోపవర్ణనము లక్షిత మగును. అందు ఋతువర్ణనమున శరత్ - వసంత - గ్రీష్మ-వర్షాది వర్ణనము లభ్యావ్యములు. సేతుబంధ హరివిజయ రఘువంశ హరివంశాదులలో ఋతువర్ణన మనుగతముగా నున్నది. కిరాతార్జునీయ - కుమారసంభవ-శిశుపాలవధ-హయగ్రీవవధాదులలో రాత్రి వర్ణనము కలదు. దివసవర్ణనమున ప్రభాత-పూర్వాహ్ణ - అపరాహ్ణ మధ్యాహ్న వర్ణనము లభ్యావ్యములు. కుమారసంభవ - కిరాతార్జునీయ-శిశుపాలవధ-సేతుబంధాదులలో చంద్రోదయ వర్ణనమున్నది.

౨౩. నాయకనాయికా కుమారసహాయ వాహనాది వర్ణనము. ఇది యర్థాలంకారములందు మూడవది. దీనిచే పాత్రవిశేషాభినందనము సూచితమగును.

౧ నాయక వర్ణనము హరివిజయ - హరవిజయ జానకీహరణ రఘువంశాదులలో

౨. నాయికావర్ణనము కువలయాశ్వచరిత కుమారసంభవ సుభద్రా హరణాదులలో

3. కుమారవర్ణనము రఘువంశో త్తరచరిత కాదంబరీ హర్షచరితాదులలో

౪. సహాయవర్ణనము రామాయణ మహాభారత బృహత్కథా మాలతీ మాధవాదులలో

౫. వాహనవర్ణనము హర్షచరిత కాదంబరీ హరివిజయ రావణవిజయాదులలో నున్నది. దీనిచే హస్తి - అశ్వ-గరుత్మత్-పుష్పకాది వర్ణన మభ్యూహ్యము.

౨౮. మంత్రద్యూత ప్రయాణ సంగ్రామాభ్యుదయముల వర్ణనము. ఇది నాల్గవది. ఈ యంశము లక్ష్య ప్రధానాంశముగ సముచితచేష్టల నుపదేశింపగలవు. కావ్యాదికము చతుర్వర్గఫలప్రాప్తిగ న్నను సమధికముగా నక్షేపదేశ మొనరించునది కావలయునని సూచితమగును.

౧ అందు మంత్రమునకు విషయములు.

౧ కర్మల యారంభోపాయము.

౨. పురుష ద్రవ్య సంపత్తి.

౩ దేశకాల విభాగము.

౪. వినిపాత ప్రతీకారము.

౫. కార్యసిద్ధి.

ఇట్టి మంత్రము కిరాతార్జునీయ – శిశుపాలవధ – హయగ్రీవ వధ – భట్టికావ్యాదులలో నున్నది.

౨ దూత మూడువిధములనుండును. నిసృష్టార్థుడు పరిమితార్థుడు, శాసనహారుడు.

౧ నిసృష్టార్థుడు. ఉద్యోగపర్వమున వాసుదేవుడు. హరి విజయమున సత్యకుడు

౨. పరిమితార్థుడు, రామాయణమున అంగదుడు.

౩. శాసనహారుడు కాదంబరిలో కేయూరకుడు.

౩. ప్రయాణము త్రివిధము.

౧ స్వశక్త్యుపచయమున ప్రయాణము

౨. పరవ్యసనమున ప్రయాణము.

౩. అభిమతార్థసిద్ధికై ప్రయాణము.

౧ (ఇందు స్వశక్త్యుపచయమున ప్రయాణ మొనరించుట కుదాహరణము క్షిలిత మయినది.)

౨. ప్రయాణము శిశుపాలవధములో శిశుపాలోచ్ఛేదనమునకై వాసుదేవుని యాత్ర.

౩ అభిమతార్థసిద్ధి హరివిజయమున పారిజాతాపహరణమునకై కృష్ణుని ప్రయాణము కిరాతార్జునీయమునందు దివ్యాస్త్రలాభమునకై యర్జునుని ప్రయాణము

౪. సంగ్రామము త్రివిధము సమము, విషమము, సమవిషమము అని,

౧ సమము. ఇది ద్వంద్వయుద్ధమునందును చతురంగయుద్ధమున నుండును. రామరావణులకు ద్వంద్వయుద్ధము. కురుపాండవులకు చతురంగ యుద్ధము.

౨. విషమము రామునకు ఖరదూషణ త్రిశిరులతో జరిగిన సంగ్రామము. పదునాలుగువేలపదునలుగురు రాక్షసులు కంచురథముల నెక్కి యుద్ధమునకు రాగా పదాతియగు రాముడొకడు వారినందరను హతమార్చెను.

౩. సమవిషమము కిరాతార్జునీయమున మహేశ్వరార్జునులకు రఘువంశమున రఘుదేవేంద్రులకు జరిగిన యుద్ధము సమవిషమము.

౫. అభ్యుదయము మూడువిధములు అరివిజయము. స్త్రీలాభము - పుత్రోత్పత్తి. ఇందరివిజయము ద్వివిధము శత్రువులను వినాశము చేయుట మొదటిది. శత్రుప్రపత్తుడగుట రెండవది. రావణవధాది కావ్యములందు శత్రూచ్ఛేదము హరివిజయాదులందు శత్రూపరతి యున్నది. ఇందుమతీ స్వయంవరమున స్త్రీలాభము కలదు. రఘువంశమున దిలీపునకు పుత్రలాభము కలదు ఇట్లభ్యుదయ నిరూపణము ప్రబంధ ప్రకర్ష.

౬. వనవిహార జలక్రీడా మధుపాన మానాపగమ రతోత్సవాది వర్ణనము. ఈ వర్ణనమున రసోద్దీపన విభావము సూచితమగును.

సంభోగ శృంగార ముపదిష్ట మగును. మంత్రిద్యూత ప్రయాణ సంగ్రామాభ్యుదయాదుల వలన నాయకు ఫలములను పొంది యాయా విలాస విశేషములచే కామసేవనమున తదుపయోగము సంపాదింప వలెనని యివి శిక్షణ ముపదిష్ట మగుచున్నది.

౧. వనవిహారము. మృగయాదులచే వనవిహార మొనర్చుట రఘువంశమున దశరథుని విహారము. పుష్పాపచయాదులచే వనవిహారము చేయుట శిశుపాలవధమున యదువుల విహారము, కిరాతార్జునీయమున అప్సరసల విహారము

౨. జలక్రీడ రెండువిధములు ఒక పురుషుడు తన బహువనితలతో జలవిహార మొనర్చుట, బహుపురుషులు బహువనితలతో జలవిహార మొనర్చుట కార్తవీర్యుని నర్మదానదీజలవిహారము, కుశుని సరయూనదీ జల విహారము మొదటిరీతి. సిద్ధ సింధువు నందప్సరసల విహారము, రైవతక హ్రదమున యదువుల విహారము రెండవరీతి

౩. మధుపానము. గోష్ఠీగృహపానము, వాసభవనపానము నని యిట్లు ద్వివిధము హరివిజయ శిశుపాలవధములందు గోష్ఠీగృహ మధుపాన మున్నది కుమార సంభవకిరాతార్జునీయము లందు వాస భవనమధు పానమున్నది.

౪. మానాపగమము సేతుబంధకావ్యము నందు రామాతంకము వలన నిశాచరవనితలకు మానాపగమము వర్ణితమయినది. మహాప్రబంధములలో మలయమారుతేందూదయాదులవలన మానాపగము వర్ణితి ప్రసిద్ధమై యున్నది.

౫. రతోత్సవము. ద్వివిధము. సామాన్యము విశేషమునని. కిరాతార్జునీయములో శిశుపాలవధములో సామాన్యతో రతోత్సవము కుమారసంభవములో జానకీహరణములో విశేషతో రతోత్సవము కలదు.

౨౯. సంక్షిప్త పతాకాప్రకరీ కార్యకల్పనము. ఉభయాలంకారము లందు దీని మొదటిది అర్థప్రకృతులు బీజబిన్ద్వాదులు అవస్థలారంభ యత్నాదులు. అర్థప్రకృతుల కవస్థలకు సంగతమగు సంబంధమున వస్తువునకు విస్తృతియు రమ్యతయు కలుగును ఫలసంపాదనానుకూలమగు బీజార్థ నిరూపణము. ప్రయోజనములకు విచ్ఛేదము కలుగునప్పుడు విచ్ఛేద కారణముగా సమాప్తిపర్యంతము సంబంధమగునట్లుగా బిందురూపార్థము నిబంధించుట, పరార్థమై ప్రధానోపకారకముగా నున్న సానుబంధ ఫలము కలిగి యుండునట్లు పతాకాకీర్తనము, పరార్థమునకే యగు ఫలసంపత్తితో నిరనుబంధముగా ప్రకరీనిర్దేశము, సర్వవిధాధికారికి వస్తుఫలరూపముగా కార్యకీర్తనము ఈ ప్రథమాలంకారమున ప్రతిపాదితమగును.

౩౦. గర్భాంక చూలికాంకావతార విష్కంభ ప్రవేశక విధానము. ఇది రెండవది. అంకములం దొక యంకము ప్రయుక్తమగుట గర్భాంకము. ఈ యంకము బీజార్థ యోగమున నుండును. ఇట్టిది బాలరామాయణమున నున్నది

శ్రవణైః శ్రవ్యమనేకైర్దృశ్యం దీర్ఘైశ్చ లోచనైర్బహుభిః
భవదర్థమిహ నిబద్ధమివ నిబద్ధనాట్యం సీతాస్వయంవరణం

అంతర్యవనికాగతులయిన సూతాదులచే కథార్థోపక్షేపణమొనరించుట ఇది వేణీసంహార నేపథ్యమున నున్నది. స్త్రీ కాని పురుషుడు కాని యంకముయొక్క విశిష్ట ముఖము నుపక్షిప్త మొనరించిన నది యంకముఖము. మాలతీమాధవమున నున్నది. హీనపాత్రలు శౌరసేన్యాది భాషావ్యవహారమున నంకారంభమున ప్రయోగించు దానిని ప్రవేశకమందురు, ఇవి సూచ్యవస్తువునకు సూచకములు.

... ... విషయమున నుండగా వేరొకటి యన్యవిష యమున నుండుట.

౧ వాక్యము రెండర్థముల నుండుట మాలతీమాధవమున నున్నది. "సుశ్లిష్టగుణతయా రమణీయ ఏషసన్నివేశః కుతూహలినీ చనో భర్తృదారికా. ఏతత్తేచ తస్యామభినవో విచిత్రః కుసుమేషు వ్యాపారః తద్భవతు కృతార్థతా వైదగ్ధ్యస్య ఫలతు నిర్మాణస్య రమణీయతా. సమాసాదయతు సరసఏవ భర్తృదారికాయాః కర్ణావలంబన మహార్ఘతాం" ఇందలి వాక్యార్థ ముభయానుకూలముగా నున్నది.

౨. రెండవది శిశుపాలవధమున "స్ఫుటభిన్నార్థము దాహ రద్వచః" అనునది ప్రకరణార్థానుసంధానముననున్నది.

౩. మూడవది దండి ధనంజయ ద్విసంధాన ప్రబంధములు రామాయణ మహాభారతార్థముల ననుబంధించి యుండుటగ్రాహ్యము.

౪. నాల్గవది కుమారసంభవమున నున్నది చతుర్ముఖుడు నాల్గుదిశల నున్న దివౌకసుల నుద్దేశించి చెప్పుటలో సంబద్ధమై యున్నది.

౫. అయిదవది కీచకవధలో నున్నది. ద్రౌపది విరాట సభలో విరాటునుద్దేశించి పలుకునదై యీ వాక్యము ననే యుధిష్ఠిరాదుల నభిభాషించును.

౩౦. మార్గద్వయానువర్తనము. రెండుమార్గముల ననుసరిం చుట. దీనిచే మహాకవుల సమయ ముపలక్షితమగును ఆ మార్గము లీ విధముననున్నవి.

గుణతః ప్రాగుపన్యస్య నాయకం తేనవిద్విషాం
నిరాకరణమిత్యేషమార్గః ప్రకృతిసుందరః

వంశవీర్యశ్రుతాదీని వర్ణయిత్వారిపోరపి
తజ్జయాన్నాయకోత్కర్షకథనంచమనోతిపః.

నాయకునకు సంబంధించిన గుణములను మొదటనే విశదముగా నిరూపించి యనంతరము శత్రువుల నిరాకరణము సూచించుట ప్రకృతి సుందరమయిన ప్రథమమార్గము ద్వితీయ మార్గ మీశ్లోకమున నున్నది శత్రువునకు సంబంధించిన వంశవీర్యశ్రుతాదులను గూడ వర్ణించి తజ్జయమున నాయకోత్కర్షము నిరూపించుటయు మనఃప్రీణనము సంపాదించుననుట ద్వితీయము

ఇచట నాయకుడు శత్రూచ్ఛేదము చేయుటను మీమాంసింపవలెను. నాయకుడు దోషయుతుడయిన శత్రువు నుచ్ఛేదించునా? గుణయుతుడయిన శత్రువు నుచ్ఛేదించునా? 'కించాతః' ఎట్లయిన నేమి? దోషయుతుడయిన శత్రువు నుచ్ఛేదించుట యను పక్ష మభీష్టమేని యట్టివాని సముచ్ఛేదమునకు నాయకుడు యత్నింపవలసిన యావశ్యకత యేమియున్నది. దోషములున్నందుననె యా శత్రువుచ్ఛేదము పొందునుగదా! విరిగిపడిపోవు నదీతటమున నుపవిష్టుడై యున్నవాని ప్రక్షేపణ మొనర్చుటవలన పురుషకారము సాఫల్యమనుభవింపదు. "నహి శీర్యమాణ నదీతటోపవిష్ట ప్రక్షేపణే పురుషకారః సాఫల్య మనుభవతి" పురుగు తొలిచిన కొయ్య తానే పుల్లిపోవునట్లు అంతశ్శత్రులుకల రాజకులము తానే భగ్నమైపోవును. మరి యొకడా పని చేయనక్కర లేదు. అట్లే దోషయుతుడు తన యంతట తానే యుచ్ఛేదముపొందును. నాయకుడు వానిని సముచ్ఛేదింప నవసరము లేదు.

గుణయుతుడగు వాని యుచ్ఛేదమిష్టమన్న ద్వితీయపక్ష మభిమతమేని, యది యుక్తము కాదు. గుణయుతుడగువాడు శత్రువయినను సముచ్ఛేద్యుడు కాడు. గుణవతి వనిత పరిత్యాజ్య కాదు. గుణ

ముతె యున్నచో వారు పరస్పర విశేషము లేదు. కావున గుణవద్రి పూర్వోక్త పక్షమును యుక్తము కాదు.

ఇట్టి యూహ యిచట యుక్తము కాదు. విధినిషేధవ్యుత్పత్తి కలుగు టయినందున రెండు పక్షములకును ప్రాధాన్యమున్నది రామాయణాది కావ్యములలో గుణయుతుడయిన నాయకున కుత్కర్ష నొసంగుచున్నందున దోష మేమి యున్నది. గుణార్జనమె ప్రతీత మగును. రామాయణ రావణున కుత్కర్ష కలదు. దోషము లేదు గుణార్జన మున్నది. రామాయణ రామునకు నుత్కర్ష యున్నది. దోషము లేదు. గుణార్జన మున్నది. గుణయుతుడగు వాని యుచ్ఛేద మునపాదించుట యుక్తమా? రామ రావణులందు గుణవత్త్వము సమానమై యుండగా, ఒకనికి జయము కలుగుట, మరియొకనికి పరాజయము కలుగుట యను వానిలో నియమ నిమిత్త మేదేని నిరూపింప వలసి యున్నది అచట దైవమె నియమనిమిత్తము కావలెను. కాని దైవము వినావేరొకటి నియామకనిమిత్తమగుట కర్హము కాదు. సిద్ధి దైవ సంపాదితమై యుండగా పురుషకార శూన్యుడయిన నాయకునకు గాని వనితకు గాని విశేష మేమియు నుండదు. "రామవద్వర్తితవ్యం నరావణవత్" రాముని వలె వర్తింప వలెను గాని రావణుని వలె వర్తింప రాదనుట యిందలి బోధ. తండ్రిని యాజ్ఞను పరిపాలించు రాముడు వనవాసి యయినను జయము పొందినాడని త్రిలోక్యవిజయము సంపాదించిన వాడయినను పరదారాభిలాషకల రావణునకుచ్ఛేదము కలిగినదని ఇతరునకు నిశ్శ్రేయగునని విధినిషేధవ్యుత్పత్తి కలుగును. ఇట్టి కర్తవ్యాకర్తవ్యబోధ విధానమున మహాకావ్యాది ప్రబంధముల విరచనయు ప్రసరించినది.

దోషయుతుని సముచ్ఛేదము వర్ణితమయినచో స్వయముగనే నశించువాడు కావున నట్టి వాని వలన నాయకున కేమి యుత్కర్ష

మాత ప్రయాణాది నాయకాభ్యుదయాదు లిట్టివి. శైలఋతూ ద్యాన గమన జలక్రీడా చంద్రోదయ మధుపాన రతోత్సవాదులు ప్రధానకథా శరీరమున నుండకపోయిన కథాంతరాద్యనుషంజనమున నయిన వానివర్ణన మొనరించుట యావశ్యకమని తద్విదులందురు. ఇట్లు ద్వివిధముగ నిబధ్యమానమగుని శబ్దలక్షణ సర్గ-లక్షణమునని తెలియవలయును. మహాకావ్యమునం దిట్టి సంపత్తి భాగ్యమును కావ్యార్థ తత్త్వజ్ఞులు నిరూపించిరి.

## మ హా కా వ్య ము

మహాకావ్యము సర్గబంధము. మహాకావ్యారంభమాశీర్న మస్క్రియావస్తు నిర్దేశములం దొక విశేషముతో నుండును. ఇతి హాసకథా సముద్భూతముగాగాని యితర విధమునగాని కావ్య ముండును

చతుర్వర్గఫలాయత్తం చతురోదాత్తనాయకం
నగరార్ణవశైలర్తు చంద్రార్కోదయవర్ణనైః
ఉద్యానసలిలక్రీడా మధుపానరతోత్సవైః
విప్రలంభైర్వివాహైశ్చ కుమారోదయవర్ణనైః
మంత్రద్యూత ప్రయాణాజి నాయకాభ్యుదయైరపి
అలంకృతమసంక్షిప్తం రసభావనిరంతరం
సర్గైరనతివిస్తీర్ణైః శ్రవ్యవృత్తైః సుసంధిభిః
సర్వత్ర భిన్నసర్గాంతైరుపేతం లోకరంజకం
కావ్యం కల్పాంతరస్థాయి జాయతే సదలంకృతి
న్యూనమప్యత్ర యైః కైశ్చిదంగైః కావ్యం న దుష్యతి
యద్యుపాత్తేషు సమ్పత్తిరారాధయతి తద్విదః
తన్మహాకావ్యమిత్యాహుః మహతాం చ మహచ్చ యత్
విరుక్తమవగంతవ్యమిత్థమేవాపరేష్వపి
చతుర్వర్గఫలత్వేపి భూయసార్థోపదేశకృత్
మహాకావ్యం భవేత్కామప్రధానం తు కథాదయః.

మహాకావ్యలక్షణమిట్లభిధానించిరి. చతుర్వర్గ ఫలాయత్తము చతురోదాత్తనాయకము నయిన మహాకావ్యమున నగరార్ణవాదివర్ణనములుండవలెను. నాయకాభ్యుదయ పర్యంతమివి యష్టాదశయున్నవి. వీనిచే నలంకృతమై యసంక్షిప్తమై రసభావనిరంతరమై మహాకావ్యముండును. ఇందలి సర్గములనతివిస్తీర్ణములు శ్రవ్యవృత్తములు సుసంధులుగా నుండవలెను. అంతేల భిన్నసర్గాంతములతో నుండవలెను. లోకరంజకమై సదలంకృతిగా నుండు కావ్యము కల్పాంతరస్థాయిగా నుండగలదు. పై యష్టాదశ వర్ణనములలో కొన్ని తగ్గినను తగ్గవచ్చును. ఉదాత్త వర్ణనములందలి సంపత్తి తద్విదుల నారాధించునది యగునేని కొన్ని వర్ణనములు చాలును. ఇట్టిదిది మహాకావ్యము. "మహతాం కావ్యం, మహత్ కావ్యం" మహానీయుల కావ్యము. మహత్తు అయిన కావ్యము. ఇట్టి యీ నిరుక్త లక్షణ సంపత్తినే యితరములందును తెలియవలయును. మహాకావ్యము చతుర్వర్గ ఫల ప్రదమయినను బహుళముగా "అర్థోపదేశయుక్" ఉపదేశ యోగమున నుండునది యగుటయే తద్విదుల కభీష్టము. కథాదులు కామ ప్రధానములు. మహాకావ్యము మహార్థోపదేశకము.

వాక్యప్రబంధానుగతో యముక్తో
మయా సమాసేన రసాదియోగః
అథేహ యేఽర్థా న వివేచితాః పృథక్
విభజ్య తే కేచిదుదాహ్రియంతే

ఈ రసాదియోగ ప్రకాశమున వాక్య ప్రబంధానుగత మయిన రసాదియోగము సంగ్రహముగా నిరూపిత మయినది. ఈ భాగమున నేయేవిశేషములు వేరువేరుగా వివేచితములు కాలేదో వానిని విడివిడిగా విభజించి కొన్నిటిని నిరూపింప వలసియున్నది. ప్రబంధాంగములను పృథగ్రూపమున వివేచింప వలెను. శృంగారమె

రసమయినందున రతి ప్రకాశన మొనర్పవలసి యున్నది. మనోనుకూలమగు స్వాత్మసుఖానుభవము రతి. తద్భేదములను విశదము చేయవలెను. రతి ప్రభవములయిన హార్దాదులస్వరూప వివేకము నావశ్యకము. వాని జన్మానుబంధ ప్రకర్ష సంపృక్తానువృత్తి విధానములను నిరూపింపవలెను. రతి సంబద్ధములయిన విభావాదులను, పురుషార్థానుబంధి శృంగారముల స్వరూపమును నిరూపించుటయు నావశ్యకము. అనురాగ సాపన మొనరించుట యపేక్షితము. ఇట్లు రసస్వరూప వివేచనము సహృదయుల కాత్మానుభూతి సంపాదింపగలదు.

రసానియోగ ప్రకాశము.

# శృంగార ప్రకాశము

## ద్వాదశ ప్రకాశము

### ప్రబంధాంగచతుష్షష్టి చతుష్టయ ప్రకాశము.



పూర్వము నిరూపించిన రసావియోగ ప్రకాశ మను ఏకాదశ ప్రకాశములో చివరి భాగమున నాటక లక్షణ స్వరూపము నిరూపిత మయినది. అందీ భావములు సూచితములు. నాటకము ఇతిహాసకథను సదాశ్రయమితరకథ నవలంబించి యుండును. చతుర్వర్గ ఫలోపేతము చతురోదాత్తనాయకము పంచావస్థాభినిష్పన్నము పంచసంధియుతము వృత్తివృత్త్యంశసంపన్నము పంచార్థప్రకృతిక్షమము మహారస మహాభోగము ఉదాత్తవచనాన్వితము మహాపురుషసంచారము నాధ్వాచారజనప్రియము సుశ్లిష్టసంధి సంయోగము సుప్రయోగము సుఖాశ్రయము మృదుశబ్దాభిధానము గుణాలంకార భూషితము ఏకవింశతి సంధ్యంతరోపేతము చతుష్షష్ట్యంగ సంయుతము చతుష్షష్టి లక్షణ సముపేతము నయిన నాటకము రచించుటను భరతాదులు సూచించిరి.

కావ్యాదికమయిన ప్రబంధమునకు శరీరములుగా నాలుగు విధము లయిన చతుష్షష్టులను ప్రాక్తన కావ్యవిదులు నిరూపించిరి. వాని నీ ప్రకాశమున స్పష్ట మొనరింతుము. వాని వివేకము కవి కావ్య వివేకమున కుపకరించును.

౧ ప్రథమ చతుష్షష్టి ౬౪

| | | | |
|---|---|---|---|
| ౧ ప్రబంధశరీరములు | ౫ | ౬. సమవస్థలు | ౫ |
| ౨ ఆరంభవిధులు | ౫ | ౭. సంధులు | ౫ |
| ౩. అర్థప్రకృతులు | ౫ | ౮. వృత్తులు | ౫ |
| ౪. అవస్థలు | ౫ | ౯. ప్రవృత్తిహేతువులు | ౨౪ |
| ౫. సంస్థలు | ౫ | | |

౨. ద్వితీయ చతుష్షష్టి ౬౪.

| | |
|---|---|
| లాస్యాంగములు | ౧౦ |
| వీథ్యంగములు | ౧౩ |
| నృత్త్యంగములు | ౧౬ |
| సంధ్యంతరములు | ౨౧ |
| పతాకాస్థానములు | ౪ |

౩. తృతీయచతుష్షష్టి సంధ్యంగములు ౬౪.

| | | |
|---|---|---|
| ముఖసంధ్యంగములు | | ౧౨ |
| ప్రతిముఖ | ,, | ౧౩ |
| గర్భసంధి | ,, | ౧౩ |
| విమర్శ | ,, | ౧౩ |
| నిర్వహణ | ,, | ౧౪ |

౪. తురీయచతుష్షష్టి కావ్యలక్షణములు ౬౪.

వీనిని క్రమముగా స్పష్టమొనరింతుము

౧. ప్రథమచతుష్షష్టి

౧. ప్రబంధ శరీరములు ౫.

౧. ఇతిహాసాశ్రయ శరీరము
౨. కథాశ్రయము
౩. ఉత్పాద్యేతి వృత్తము
౪. అనుత్పాద్యేతి వృత్తము
౫. ప్రతిసంస్కార్యేతి వృత్తము

౧. ఇతిహాసాశ్రయమనుటచే నిదివరలో జరిగిన మహాదేవాదుల చరితము ననుసరించి కావ్యముండుట సూచితము. కుమారసంభవము హయగ్రీవ వధము మొదలగు కావ్యములు మహాదేవాదుల నైతిహాసిక చరితమును సూచించుచున్నవి.

౨. రెండవది కథాశ్రయము. మహాకావ్యాది ప్రబంధములు బృహత్కథ మొదలగు గ్రంథములందు ప్రతిపన్నము లయిన ప్రఖ్యాతులు ఉదాత్తులు నగు నాయకుల చరిత్రము విషయముగా నుండ వచ్చునని సూచిత మగును. ఉదయనోదయము కావ్యము నందలి వత్సేశ్వర చరితము బృహత్కథా ప్రతిపన్నమగుట లోకప్రసిద్ధము.

౩. ఉత్పాద్యేతివృత్త మనునది మూడవది. చతుర్వర్గావబోధ హేతువగు కవికల్పనా ప్రకల్పితమగు దివ్యమర్త్యాది నాయక సంబంధము సూచితమగును. కాదంబరిలో చంద్రాపీడ పుండరీకాదుల చరిత వర్ణన మిట్టిదే.

౪. అనుత్పాద్యేతివృత్తము నాల్గవది. యథావగతమయిన వర్తమానాతీత మహారాజుల యితివృత్త వర్ణనము విషయముగా నుండవలెనని చెప్పిన ట్లగును. హర్షచరితమునందు హర్షవర్ధన రాజ్యవర్ధనాదుల వర్ణన మిట్టిదే.

౫. ప్రతిసంస్కృతేతివృత్త మయిదవది. దీనివలన నిది సూచితమగును. ఇతిహాసము లందలి యథాస్థితమయిన వృత్తోపనిబంధనమున కావ్యాననుకూలములగు కొన్ని విశేషములు సంభవించును. న్యాయప్రవృత్తుడగు నాయకునకును ఫలసిద్ధి లేకపోవుటయు అనిష్టప్రాప్తి కలుగుటయు గోచరించుచున్నది. అన్యథా ప్రవృత్తి కలవానికిని ఫలయోగము కన్పడుచున్నది. కావున నచట ప్రతిసంస్కారము కావలసియున్నది. న్యాయప్రవృత్తుడగు వానికె ఫలయోగ ముండునని ఇష్టావాప్తి యుండునని నిరూపింపవలెను. అన్యథాప్రవృత్తునకు విఫలత్వమును అనిష్టప్రాప్తి కలుగుట నిరూపింపవలెను. ఇట్టి వృత్తోపాదన పంచమ విషయమున నిరూపితమగుచున్నది. కథాసంబద్ధులగు వారనేకవిధముల నుండుదురు. ధర్మశృంగార అర్థశృంగార - కామశృంగార - మోక్షశృంగారముల కధికారులు

నానావిధముల నున్నారు. ధీరోదాత్త – ధీరలలిత – ధీరోద్ధత – ధీర శాంతులు, సాత్త్వికి – రాజస – తామసులు, ఉత్తమ – మధ్యమ – కనిష్ఠులు. అనుకూల – దక్షిణ – శఠ–ధృష్టులు మొదలగు భేదభిన్ను లయిన నాయకి – అను నాయకి–ఉప నాయక – ప్రతినాయక ప్రభృతులు ననేకవిధముల గలరు. వీరలను కథాసంబంధమున ఫలాఫల ప్రాప్తి విశేషములను యథోచితముగా నిబంధింప వలసియున్నదని యీ విశేషమున సూచితమగును.

ఆ ర ం భ వి ధు లు ౫.

ప్రమాణము – ప్రమేయము – విమర్శ–నిర్ణయము – ప్రవృత్తి అనునవి పంచారంభవిధులు. ఇవి యొక్కొక్కటి యయిదు విధములు కాగా నారంభవిధు లిరువది యయిదు విధము లగును.

౧. ప్రమాణము అయిదు విధములు.

యుక్తి – ఉక్తి – దృష్టము – నిదర్శనము – ఆరాపత్తి.

౨. ప్రమేయము అయిదు విధములు.

ధర్మము – అర్థము – కామము – లోకము – లోకయాత్ర.

3. విమర్శ మయిదు విధములు.

౧. కర్మణా మారంభోపాయము
౨. పురుష ద్రవ్య సంపత్
3. దేశకాల విభాగము
౪ వినిపాత ప్రతీకారము
౫. కార్యసిద్ధి

౪ నిర్ణయము, అయిదు విధములు

౧. అనుపలబ్ధ జ్ఞానము
౨. ఉపలబ్ధ నిశ్చయ బలాధానము
3. అద్వైధమునకు సంశయోచ్ఛేదము
౪. ఏక దేశదృష్టమున విశేషోపలబ్ధి
౫. విపర్యయ చికిత్స

౫. ప్రవృత్తి అయిదు విధములు.

౧. అలబ్ధ లాభార్థ ప్రవృత్తి
౨. లబ్ధ పరిరక్షార్థ ,,
౩. రక్షితాభివృద్ధ్యర్థ ,,
౪. వర్ధితోప యోగార్థ ప్రవృత్తి
౫. ఉపయోగ పర్యాప్త్యర్థ,,

ప్రమాణానుసారమున ప్రమేయము గుర్తించి విమర్శించి నిశ్చయించి యుపేక్షోపేక్షాపరిశీలన పూర్వకముగా కార్యాచరణ మొనరించువాని కభీష్టకర్మలు ప్రారబ్ధములై ఫలసంపాదకములగును. ఇట్టి వీనినిరువదియయిదు ఆరంభ విధులని వ్యవహరింతురు

అర్థ ప్రకృతులు ౫.

ఈ నిరూపించిన విధానములలో కథాశరీరమున కుపాదాన కారణభూతము లయిన యర్థ ప్రకృతులు అయిదు సంభవించును. వీనిలో నాలు గర్థ ప్రకృతులంగు తత్త్వము పరిసమాప్త మగును. కర్త - కర్మ - కరణము - క్రియ యని నాలు తత్త్వవిధానములు. అవియే ప్రకృతి పంచకోప లక్షణమున ప్రతిపాదితము లగును అర్థ ప్రకృతులు కథాదేహమున హేతువులు.

బీజము - బిందువు - పతాక - ప్రకరి - కార్యము అని అర్థ ప్రకృతుల నామములు. వాని పరిగణన మిట్లున్నది.

బీజం బిందుః పతాకా చ ప్రకరీ కార్యమేవ చ
అర్థప్రకృతయః పంచ కథాదేహస్య హేతవః.

కథాశరీరమున నాయకుడు వ్యాపించి యుండగా కర్తృత్వ కర్మ విధాన మనుగతముగా నవస్థితమయి యుండగా నాతని కార్యారంభము "బీజము" అనదగి యున్నది. రామచరితము శిశుపాలవధము లక్ష్యముగా జెప్పదగి యున్నవి. ఇట్లు నాయక విధానము చెప్పుటచే

ప్రవేశకాదులతో నొకప్పుడు సంబంధించి యుండును ఒకప్పుడు సంబంధింపదు. ఈ యంశ మిట్లు నిరూపిత మయినది

ప్రయోజనానాం విచ్ఛేదే యదవిచ్ఛేదకారణం
యావత్సమాప్తి యద్బంధః స బిందురితి కీర్తితః

కథాశరీర సాధ్యములగు ప్రయోజనములకు అవాంతర కారణముల సంబంధము వలన విచ్ఛేదము కలుగునపు డవిచ్ఛేద కారణముగా నుండునదిబిందువగును. బిందుబంధము సమాప్తి పర్యంతే ముండును. 'బిందు రివ బిందుః' బిందువు వలె నుండునది కావున బిందు వనబడి యున్నది. ఘటము నుండి ప్రసరించు పయోబిందుప్రపయోభిన్యంద స్వరూపమగు క్రియకు అవిచ్ఛేద హేతువగును. ఘృతబిందువు ప్రసరించున పై యగ్నిజ్వాలక లక్షణ క్రియ కవిచ్ఛేద హేతు వగును. అట్లే విచ్ఛిన్నావిచ్ఛిన్నములై యుండు కథా శరీరములం దనుసంధాన మాపాదించునది బిందు వననగి యున్నది.

## 3. పతాక

కథా శరీరమున వ్యాపించియుండు సాహాయ్య విశేషమున సాధక తమముగా నుండునదిపతాక "సాధక తమం కరణం' కరణభూతముగా నుండు నారంభ విశేషమునకు 'పతాక' యని పేరు. నాయకునకు కథా శరీర వ్యాపకముగా నుండగా పతాకా వస్తువు ప్రధానముగా నుపకారముగా నుండును. స్వీయఫలమును గూడ సంపన్నము చేసికొనును స్వేన ఫలేన చ ఫలవత్ తనఫలమునది యలయునిదియగును. పతాకావృత్తమునకు ప్రధాన ఫలాభి సంబంధముండదు. తనఫలమును నది ఫలవత్. అట్టిది పతాక.

యస్యా వృత్తం పరార్థం స్యాత్ప్రధానస్యోపకారకం
తత్సంబంధాచ్చ ఫలవత్సా పతాకేతి కీర్తితా

పతాకావృత్తము పరార్థము. ప్రధానమున కుపకారకము. ప్రధానవస్తు సంబంధమున ఫలవత్తగునది పతాకగాకీర్తిత మైనది. పతాక యనునది యొకని చిహ్న రూపముగా ప్రకర్ష శోభకగును. ఇట్లు కథాశరీరములందుపనాయకాదుల చరితము ప్రధానకథాశరీర మున కుపకరించును. తనకును శోభాప్రకర్షమునకగునదై పతాక యనదగి యున్నది.

౪. ప్ర క రి

కథాశరీరమున వ్యాపించియుండు ప్రధాననాయకుని విషయ మున సహాయవిశేషరూపముగా నుండు కథాభాగమునకు ప్రకరి యని పేరు. ఇది కరణాభాసరూపముగాని కరణరూపము కాదు. కరణము సాధక తమము. ఇది యట్టిది కాదు. ప్రకరి సాధకము కాదు. అందు నసె కరణాభాసరూపముగా నుండును. ఇట్టి యారంభమునకు ప్రకరి యని పేరు పతాకైవ ఫలవతీ అనుబంధవిహీనాచ ప్రకరీ' పతా కయే ఫలరహితము అనుబంధ విహీనము నయినచో ప్రకరి యగును. ఇట్లే పూర్వతనులు సూచించిరి.

ఫలం ప్రకల్పతే యస్యాః పరార్థాయైవ కేవలం
అనుబంధవిహీనాం తాం ప్రకరీతి వినిర్దిశేత్

ప్రకరీ వృత్తమునకు సంబంధించిన ఫలము ప్రకరీవృత్తమునకు గాదు. అది పరార్థమునకె యగును. ప్రకరీవృత్తాంతము ననుబంధ విహీనముగా నిర్దేశింపవలెను. 'ప్రకరీ చ ప్రకరీ, లఘూర్మిప్రకారః ప్రకరీ'' అల్పముగా నుండు ప్రకారమునకు ప్రకరి యనిపేరు. అట్టి ప్రకరీధర్మము పుష్పాదులకు వలె నగును. పుష్పప్రకరము పరా ర్థమే యగును అపవరకాదులకు శయనస్థానమునకు నన్యమునకు శోభా సంపాదకమగును. అట్లె మహాప్రబంధమునకు ఋతువర్ణనాది కము ప్రకరి యగును. అట్టిదేయగు నితర మేవ్యాపార మయినను

ప్రసిద్ధి యనవనగియున్నది. విపత్తి తాత్పర్యమునకు శోభాసంపాదకముగా నౌచిత్యఘటిత మగునది వనవిహారము - జలక్రీడ - విరహావినోదనము - దోలావిహారము మొదలగునవి ప్రకరీశబ్దవాచ్యము లగును.

## ౫. కార్యము

నాయక సహాయాదిక్రియ కథాశరీరమున వ్యాపించియుండగా నప్పుడు ఫలభోక్తృమానమగు ప్రధాన సంబంధియైన ప్రారంభ ఫలవిశేషము 'కార్యము' అనదగియున్నది. ధర్మార్థ కామ ములలో నన్యతమము సంబంధించి యుండుట పురుషార్థ కార్యము అని వ్యవహరింతురు.

యదాధికారికం వస్తు సమ్యక్ప్రాజ్ఞైః ప్రయుజ్యతే
యదర్థశ్చ సమారంభ స్తత్కార్యమితి స్మృతం

ప్రాజ్ఞులయిన వారు ప్రబంధ నిర్మాణమున నాధికారికమగు వస్తువును సుసంగతముగా - సమ్యక్ ప్రయోగింతురు. విశిష్టఫలసిద్ధికై యారంభము కావింతురు. ఆధికారిక వస్తువునకు సమారంభమునకు సముచితముగా నుండు ఫలము 'కార్యము' అనదగి యున్నది. ఈ కార్యసిద్ధికైన ప్రాధాన్యమును పౌరుష ప్రాధాన్యమును ప్రబంధకారు లనుసరింతురు ఆ యనుసరణమున తదనుకూలమగు ఫలము కలుగును. కార్య వినిశ్చయ మీ విధమున నున్నది.

ఆయా కార్యవిశేషమునకు దైవ పౌరుషాభయప్రాధాన్య ముండును. గావున అవస్థలు - సంధులు - సమవస్థలు నని మూడు విధముల వ్యపదేశములు కలుగును. అవస్థాదులకు మూడింటికిని ఆరంభ ప్రసవాదులయిన పంచపంచ పర్వములు కలుగును

## అవస్థలు ౫.

అందు దైవప్రాధాన్యము కలుగగా అవస్థ లుదయించును. ఈ యవస్థలకు ఆరంభాదు లయిదు పర్వములు కలుగును.

ఆరంభము - ప్రసవము - ఉద్భేదము కించిచ్ఛేషము— సమాప్తి

అని యారంభ పర్వముల నామములు. ప్రబంధపండితులు వీనిని నిర్ణయించిరి. వీని లక్షణము చెప్పెదము.

ప్రయత్నః ఫలయోగస్య స ఖల్వారంభ ఇష్యతే
అపశ్యతః ఫలప్రాప్తిం యో వ్యాపారః ఫలం ప్రతి
పరం చౌత్సుక్యగమనం ప్రసవః స ఉదాహృతః
ఈషత్ప్రాప్తిః యదా కాచిత్ఫలస్య పరికల్ప్యతే
భావమాత్రేణ తం ప్రాహుః ఉద్భేదమిహ సూరయః
నియతాం తు ఫలప్రాప్తిం యదా భావేన పశ్యతి
కించిచ్ఛేషాం సమాప్తిం తామాక్షిపంతః ప్రచక్షతే
అభిప్రేతం సమగ్రం చ ప్రతిరూపం నిగద్యతే.

ఫలయోగమునకు సంబంధించిన ప్రయత్నమునకు ఆరంభమని పేరు. ఫలప్రాప్తి గోచరింపకపోగా ఫలోద్దేశమున నుండు వ్యాపారమునకు ప్రసవ మని పేరు. దీనివలన నధికమగు నౌత్సుక్య ప్రాప్తి యుండును. ఫలములకు సంబంధించిన యీ షత్ప్రాప్తిభావమాత్రమున పరికల్పితమై యుండునేని దానిని ఉద్భేదమని సూరులు-పండితులు పలికిరి. భావమున నియతమగు ఫలప్రాప్తిని దర్శించునేని యది కించిచ్ఛేషమగును. అభిప్రేతమయిన సమగ్రఫల సంపత్తి యుండుచో నది సమాప్తి యగును.

సంస్థలు ౫.

పౌరుషమునకు ప్రాధాన్యమున్నచో సంస్థావ్యవహారము కలుగును. సంస్థలకు ప్రారంభాది పంచపర్వములు నుండును.

ప్రారంభము - ప్రయత్నము — ప్రాప్తిసంభవము నియతఫలప్రాప్తి-ఫలయోగము

అని సంస్థాపర్వముల నామములు. వీనిలో నంతట 'ప్ర' ఉపసర్గయోగమున పౌరుషప్రకర్ష మవభాసించును. పురుషవ్యాపారమున బలాత్ కార్యసిద్ధి కలుగును. కలుగుటయె కాదు. కార్యసిద్ధి సంస్థాపితమగును. వీనిని సంస్థలు అందురు. పూర్వనిరూపితములకే ప్రయోజనము కలదో వీనికి నా ప్రయోజనము కలదు.

సమవస్థలు ౫.

దైవపౌరుషోభయ ప్రాధాన్యమున్నచో సమవస్థావ్యవహారము కలుగును. సమవస్థలకు ప్రారంభాదు లయిన పర్వములు కలవు.

ప్రార్థన – లాభము – సంయోగము నాశము – సంప్రాప్తి

అని సమవస్థాపర్వముల నామములు. వీనిలో లాభ – నాశములందు దైవప్రాధాన్యము, ప్రార్థనా సంయోగములందు పౌరుష ప్రాధాన్యము, సంప్రాప్తిలో దైవపౌరుష ప్రాధాన్యము నుండును. కావున నంతట ప్రకర్షద్యోతనము లేదు. ప్రోపసర్గ యోగమున ప్రకర్ష యుండును.

ఉదాహరణము మొదలగువానిలో నారంభ ప్రసవాద్యవస్థలు చతుర్దారికాలాభాది ప్రబంధములలో ప్రారంభ ప్రసవాదులయిన సంస్థలు కలవు.

సంధులు ౫.

ఏతదుపాధికములుగా నున్న కథా శరీర భాగములకు ముఖాది సంధులను నయిదు వ్యపదేశములు కలవు.

ముఖము – ప్రతిముఖము – గర్భము విమర్శము – నిర్వహణము.

అని వాని నామములు. ముఖాదులకు సంధు లని పేరు. అర్థప్రకృతులయిన బీజబిందువ్వాదుల సంధాన ముండును గావున సంధులను

వ్యాస దేశము కలిగినది. ముఖ - ప్రతిముఖ - గర్భ - విమర్శ - నిర్వాహ ణములను సంధులు నాటకమున నుండవలయునని పూర్వులు చెప్పిరి. ఈ ప్రకారముగ నాయకుని నిరూపించినచో రససంపత్తి యుండును.

> కథా శరీ రాముగతం తమ్ముఖం పరికీర్తితం.

కథాశరీరమును ననుగతముగా నుండునది ముఖసంధి యనబడును.

లార్థముగ ప్రవృత్తి నిరూపణము ప్రవృత్తి స్కంధమున నున్నచో నది ప్రతిముఖ మగును.

> బీజస్యోద్ఘాటనం యత్ర దృష్టనష్టమివ క్వచిత్
> ముఖే న్యస్తస్య దృశ్యేత తద్వై ప్రతిముఖం స్మృతం

ముఖసంధి విన్యస్తమయిన బీజార్థము దృష్టనష్టప్రాయముగా నున్నప్పుడు సముచితముగా సముద్ఘాటనము కూడి యుండునేని యది ప్రతిముఖ సంధి యగును.

క్రియాఫలమునకు సంబంధించిన ఉద్భేద - లాభ - నాశ - అన్వేషణాదు లుత్పన్నములై గోచరించునేని గర్భసంధి యగును.

> ఉద్భేదః కార్యబీజస్య ప్రాప్తిరప్రాప్తి రేవ వా
> అన్విష్యతే తు యస్తత్ర స వై గర్భ ఇతీరితః

ఫలసంపాదక బీజమునకు సంబంధించిన ఉద్భేదము ప్రాప్తి అప్రాప్తి అన్వేషింపబడునవై గోచరించునేని యది గర్భసంధి యగును.

క్రియాఫలప్రాప్తికై విచారనిర్ణయము విమర్శసంధి యగును. తల్లక్షణము.

> గర్భనిర్భిన్నబీజార్థః క్రోధవ్యసనజోపి వా
> విప్రలంభకృతో వాపి విమర్శ ఇతి సంజ్ఞితః.

గర్భసంధిలో నిర్భిన్నమై–స్ఫుటముగా నున్న బీజార్థము విమర్శ సంధిలో ప్రస్ఫుటత్వము వహించును. క్రోధజన్యము వ్యసనజన్యము

విప్రలంభకృతి మయిన బీజార్థము ప్రస్ఫుటమగుట విమర్శసంధి.
క్రియాఫలమున సమ్యగ్యోగముండుట నిర్వహణసంధి.

యత్రానదుసమర్థానాం ముఖాద్యానాం మహౌజసాం
ఫలోపబృంహితానాం స్యాత్ జ్ఞేయం నిర్వహణం హితత్

ముఖాది సంధులలో నిరూపితములయిన మహౌజసములయిన ఫలోపబృంహితములగు నానాప్రయోజనముల నన్నిటినొకచో సమాన యన మొనర్చుట నిర్వహణ సంధ యగును.

ఈ సంధులు ఉపక్షేప పరికరాదులయిన యరువదినాలు గంగములతో నుండును. రత్నావల్యాదులలో నివి సంగతములై యున్నవి. ఈ యుపక్షేపాది చతుష్షష్ట్యంగములు ప్రబంధములం దాధికారికములుగా గాని ఆనుషంగికములుగా గాని ప్రాసంగికములుగా గాని ప్రయోగింపదగి యున్నవి. సందర్భశోభా సంపాదనము నకై అను సంధ్యాదుల సమావేశమును యుక్తమనుట వ్యాఖ్యాత ప్రాయము.

వీనిలో ఆధికారిక మేమి? ఆనుషంగిక మేమి? ప్రాసంగిక మేమి?

యత్కార్యం హి ఫలప్రాప్తౌ సమర్థం పరికల్ప్యతే
తదాధికారికం జ్ఞేయం అన్యత్స్యాదానుషంగికం
కారణాత్ఫలయోగస్య వృత్తం స్యాదాధికారికం
తస్యోదాహరణార్థం చ ప్రాసంగికమిహోచ్యతే.

ఫలప్రాప్తిలో సమర్థముగా ప్రకల్పిమయిన కార్యమాధికారిక మగును. ఫలసంపాదకమగు కార్యసంపత్తి యిందుండును. అధికారిక వస్తువునకు ఆనుషంగికముగా అనుషంగ విశేషమున సిద్ధమగు కథా వస్తువు ఆనుషంగిక మగును. ఫలయోగమున కారణముగా నున్నం దున వస్తువాధికారికము కాగా తదుదాహరణమునకునై ప్రసంగవశ మున సిద్ధమగునది ప్రాసంగిక కథా వస్తువగును. ఇట్లే పంచసంధులు పరిపూర్ణ ప్రబంధమున సంబంధము కలవయి సంభవించును ప్రయో

క్తులు పేరిని నాటకములందు నిరూపింపవలెను. ఇక్షే ప్రకరణము లందు నిరూపింపవలెను. కథలలో నాఖ్యాయికలలో మహాకావ్యము లందు చంపువులందు ఆఖ్యానకములందును నిరూపింపవలెను.

క్రియంతే యత్ర నైతేతునద్వేతేస్వృద్ధిమాదయః

ఎచట నివి నిరూపితములు కావో యవి ఊనములగును. ఈ యయిదు సంధులలో నొక సంధిని లోపింప జేయవలసి యుండు నేని చతుర్థసంధిని - విమర్శసంధిని లోపింప జేయవలెను. సందిద్వయము లోపింప జేయవలయునేని గర్భసంధిని విమర్శసంధిని లోపింప జేయవచ్చును. త్రిలోపమావశ్యక మగునేని ద్వి త్రి చతుర్థ సంధులను లోపింప జేయునది. ఏకలోప ద్విలోప త్రిలోపముల ననుసరింప వలసియుండునో నెప్పుడును ముఖసంధిని నిర్వహణసంధిని లోపింప జేయరాదు. ఈ భావము నీ సూత్రశ్లోకమున గుర్తించునది.

ఏకలోపే చతుర్థస్య ద్విలోపే త్రిచతుర్థయోః
ద్వితృతీయచతుర్థానాం త్రిలోపే లోప ఇష్యతే

బీజార్థ నిరూపకమయిన ముఖసంధి ఫలప్రతిపాదకమయిన నిర్వహణసంధి యావశ్యకము.

వృత్తులు ౫.

ముఖాది సంధులలో వ్యాపించినవై నాయకోపనాయకాదులకు మనోవాక్కాయకర్మ నిబంధనములై యయిదు వృత్తులు కలవు

భారతి - ఆరభటి - కైశికి సాత్వతి - మిశ్ర

యని వాని పేరులు. వాని లక్షణ వివేక మీ విధమున నున్నది.

యా వాక్ప్రధానా నృవర ప్రయోజ్యా
స్త్రీవర్జితా సంస్కృత పాఠ్యయుక్తా
స్వనామధేయైర్భరతైః ప్రయోజ్యా
సా భారతీ నామ భవేత్తు వృత్తిః

ప్రస్తావపాతప్లుతలంఘనాని
ఛేద్యాని మాయాకృతమింద్రజాలం
చిత్రాణి యుద్ధాని చ యత్ర వృత్తిం
తాం తాదృశీమారభటీం వదంతి

యా శ్లక్ష్ణనేపథ్యవిశేషచిత్రా
స్త్రీసంయుతా యా బహునృత్తగీతా
కామోపభోగప్రభవోపచారా
తాం కైశికీం వృత్తిముదాహరంతి

యా సాత్త్వతేనేహ గుణేన యుక్తా
త్యాగేన వృత్తేన సమన్వితా చ
హర్షోత్కటా సంహితశోకభావా
సా సాత్త్వతీ నామ భవేత్తు వృత్తిః

యత్రారభట్యాదిగుణాః సమస్తాః
మిశ్రత్వమాశ్రిత్య మిథః ప్రథంతే
మిశ్రేతి తాం వృత్తిముశంతి ధీరాః
సాధారణీమర్థచతుష్టయస్య.

౧. భారతి: వాక్ప్రధానము. ఉత్తమ మానవులు ప్రయోగింతురు. స్త్రీలుండరు. ఇది సంస్కృతపాఠ్యమున నుండును. భరతపుత్రులు భరతులు నటులు తమతమ నామధేయమునకు సామాన్యముగా భరతనామమున ప్రయోగింతురు. ఇట్టిదిది 'భారతి' యను వృత్తియగును.

౨. ఆరభటి:- అవపాతములు ప్లుతములు లంఘనములు ఛేద్యములు చిత్రములగు యుద్ధములు దీనియందుండును. మాయాకృతమగు నింద్రజాలముండును. ఇట్టిదిది యారభటీవృత్తి యగునని.

౩. కైశికీవృత్తి - రమ్యసుందరములగు నేపథ్యవిశేషచిత్రము లతో నుండును. స్త్రీసహితముగానుండును. బహు నృత్తగీతము లతో నుండును. కామోపభోగ ప్రభవోపచారములతో నుండును. ఇది కైశికీవృత్తి.

౪. సాత్త్వతీవృత్తి - సాత్త్వతగుణమున నుండును. త్యాగ వృత్తి సమన్వితమై యుండును. హర్షోత్కటముగా నుండును. సము చిత శోకభావములతో నుండును. ఇట్టి దీనిని సాత్త్వతీవృత్తి యందురు.

౫. మిశ్రవృత్తి - దీనిలో నారభటీవృత్తి ప్రభృతుల గుణము లన్నియు మిశ్రణము పొంది యుండును. పరస్పరమన్నియు వ్యామిశ్ర ములై యుండును. ఇది యర్థచతుష్టయమునకు సాధారణముగు యుండును. ఇట్టి దీనిని మిశ్రవృత్తియని వ్యవహరించిరి.

ఇట్లయిదు విధములుగా నున్నదియు చేష్టావిశేష విన్యాస క్రమము కలదై "వృత్తి" పదమున వ్యవహరింపజగి యున్నది. వేషవిన్యాస క్రమము ప్రవృత్తి. చతుష్షష్టి సంఖ్యాపూరణమునకు అయిదు ప్రవృత్తులను జెప్పవలసియున్నది. కాని భోజుడు నాల్గు ప్రవృత్తులనె సూచించెను. ప్రవృత్తి చతుర్విధము.

పౌరస్త్య - మాగధి, దాక్షిణాత్య - అవంత్య

వీని లక్షణములను చెప్పెదము. కొందరు ప్రవృత్తిని అన్యథా వ్యాఖ్యానింతురు. పుణ్యప్రవృత్తి పది విధములు. పాపప్రవృత్తి పదివిధ ములు. ఇట్టి ప్రవృత్తి స్వరూపము విశదము కాగలదు. కొందరీ ప్రవృత్తిని గూడ వేరు విధమున వ్యాఖ్యానించిరి. పంచబుద్ధీంద్రియ ములు. పంచ కర్మేంద్రియములు. ఇట్లు వేరువేరుగా ప్రవృత్తిదశ ప్రకార యగును.

"అథ అన్యన్మతం" ప్రవృత్తివిషయమున వేరొకమతమును గలదు. ప్రవృత్తి యనునది వాగ్బుద్ధి శరీరారంభమున నుండును.

౧. వాగారంభములు ద్వాదశవిధములు. అవి ఆలాప ప్రలాపాదులు.

౨. బుద్ధ్యారంభములు పంద్రెండును భావహావాదులు.
3. శరీరారంభములు విలాసాదులు పంద్రెండు.
ఈ ముప్పదియాఱును ప్రదర్శితములు కాగలవు,

"అన్యత్తు దర్శనం" ఇందు మఱియొక మతము కలదు. వేషవిన్యాసక్రమమును ప్రవృత్తి యందురు. వేషవిశేష ప్రవృత్తి హేతువులు పౌరస్త్య - ఔడ్ర - మాగధి మొదలగు దేశోపలక్షణమున నున్నవి.

ప్రవృత్తిహేతువులు ౨౪

| | | |
|---|---|---|
| ౧ దేశము | ౯ వ్యత్యాస | ౧౭ ఛద్మ |
| ౨ కాలము | ౧౦ విపరిణామ | ౧౮ ఆశ్రమ |
| ౩ పాత్రము | ౧౧ నిమిత్త | ౧౯ జాతి |
| ౪ వయః | ౧౨ అభిగమ | ౨౦ వ్యక్తి |
| ౫ అవస్థ | ౧౩ సంగ్రామ | ౨౧ విభావ |
| ౬ శక్తి | ౧౪ విహార | ౨౨ ప్రకీర్ణ |
| ౭ సాధన | ౧౫ ఉపహార | ౨౩ సంకీర్ణ |
| ౮ అభిప్రాయ | ౧౬ ఛల | ౨౪ విప్రకీర్ణ |

ఇట్లిది మొదటి చతుష్షష్టి.

ద్వితీయ చతుష్షష్టి ౬౪.

లాస్యాంగములు - ౧౦
వీధ్యంగములు - ౧౩
వృత్త్యంగములు - ౧౬

సంధ్యంతరములు— ౨౧
పతాకాస్థానకములు - ౪

౯. లాస్యాంగములు - ౧౦

గేయపదము - స్థితపాఠ్యము
ఆసీనము - పుష్పగంధిక
ప్రచ్ఛేదకము - త్రిమూఢకము
సైంధవము - ద్విమూఢకము
ఉత్తమోత్తమము - ఉక్తప్రత్యుక్తము

వీని లక్షణము లీ విధముగా నున్నవి.

ఆసనేషూపవిష్టైర్యద్భాండవాద్యోపబృంహితం
గాయనైర్గీయతే శుష్కం తద్గేయపదముచ్యతే
ప్రతిపక్షనియుక్తేతు పఠేదాసనసంస్థితా
మదనానలతప్తాంగీ స్థితపాఠ్యం తదుచ్యతే
ఆసీనమాస్యతే యత్ర సర్వాతోద్యవివర్జితం
అప్రసారితగాత్రం చ చింతాశోకసమన్వితం
వృత్తాని వివిధాని స్యుర్గేయం చాతోద్యసంశ్రితం
చేష్టా వివిధా పుంసాం యత్ర సా పుష్పగండికా
ప్రచ్ఛేదకస్య విజ్ఞేయో యత్ర చంద్రాతపాహతాః
స్త్రియః ప్రియేషు సజ్జంతే అపి విప్రియకారిషు
అనిష్ఠురశ్లక్ష్ణపదం సమవృత్తైరలంకృతం
నాట్యం పురుషభావాఢ్యం త్రిమూఢకముదాహృతం
రూపాదివాద్యసంయుక్తం పాఠ్యేన చ వివర్జితం
నాట్యం హి తత్తు విజ్ఞేయం సైంధవం నాట్యకోవిదైః
ముఖప్రతిముఖే మూఢే ఘటితే తు పదక్రమం
స్పష్టభావరసోపేతం చిత్రార్థం చేద్విమూఢకం

ఉత్తమోత్తమకం విద్యావనేకరస సంశ్రయం
విచిత్రశ్లోకబంధైశ్చ హేలాహావవిభూషితం
కోపప్రసాదజనితమధిక్షేపసమాశ్రయం
ఉక్తప్రత్యుక్తమేవం స్యాల్లాస్యాంగం దశమం త్విహ

### ౧. గే య ప ద ము

గాయనీమణులు ఆసనములందుపవిష్టలై భాండవాద్యసముపబృంహిత మయిన విధమున శుష్కముగా గాన మొనరింతురేని యది గేయపదమగును. నాగానందము ప్రథమాంకము నందు వీణావాదన మొనరించుచు మలయవతి గానము చేయును. గౌరీ దేవి! నీ యనుగ్రహమున నా యభివాంఛితము సిద్ధించుగావుత! అను భావమున నామె గానమున్నది.

### ౨. స్థి త పా ఠ్య ము

మదనానలతప్తాంగియై తన యాసనమున నుపవిష్టయై యుండి వియుక్తయయినందున తన వేదన వెలిబుచ్చుచు నిలబడి యుండియు నుపవిష్టయై నటులపాఠ్యపఠన మొనరించునేని స్థితపాఠ్యమగును రత్నావళి నాటికకు ద్వితీయాంకమున నిది యున్నది. సాగరిక నిట్టూర్చిదుర్లభజన ప్రార్థనమున పరితాపము పొంది వత్సరాజు నాలేఖ్యమున చిత్రించి దర్శించుటకు యత్నించునప్పటి పాఠ్యమున స్థితపాఠ్యము కలదు.

### ౩. ఆ సీ న ము

సర్వవిధాతోద్యములను విడనాడి అప్రసారిత గాత్రముగా నెట్టి యభినయము లేని విధమున చింతాశోక సమన్వితముగ నాసనము నందుండియే రంగమున నవతరించుట ఆసీనమగును. రత్నావలి తృతీయాంకమున వత్సరాజాసనగతుడై ప్రవేశించును. సాగరికా చింతనమున సంతాపము పొంది యామెను పొందలేనందున చింతావ్యాకులుడై కుపితవాసవదత్త గుర్తించినందున సాగరికనే స్మరించుచు నుండుట ఆసీనము.

## ౪. పుష్పగండిక

వివిధ వృత్తములుండును గేయమాతోద్యసంమిశ్రితమయి యుండును. చేష్టలు వివిధముగా నుండును. ఇట్లున్న పురుషుల ప్రవృత్తి పుష్పగండికి రత్నావలి రెండవ యంకములో విదూషకుడు వత్సరాజునకు సాగరికా పుష్పశయ్యను చూపింపగా రాజుపలికించును. అది పుష్పగండిక

## ౫. ప్రచ్ఛేదకము

చంద్రాతపాహతలగు స్త్రీలు విప్రియమొనరించినను ప్రియుల విషయమున నాసక్తలై యుక్తభావలగుదురేని యది ప్రచ్ఛేదకమగును. రాసకాంకి మను రూపకమునందు రాధ విదూషకుని వలననె ప్రకృతిభేదముగుర్తించి యపరాధ మొనరించినను చంద్రాతపాహత యయినందున ప్రియునభిసరించుట కలదు. అట్టిది ప్రచ్ఛేదకము.

## ౬. త్రిమూఢకము

సమవృత్తాలంకృతము అనిష్ఠురశ్లక్ష్ణపదము పురుషభావాఢ్యము నయిన నాట్యము త్రిమూఢక మగును. రత్నావలీ ద్వితీయాంకమున వత్సరాజు సాగరికను జూచి యనుటలో త్రిమూఢక మున్నది చతుర్ముఖుడీ జగత్ప్రియలలామను సృష్టించి నాలుగు ముఖములతో సాధువాదములు పలికినాడు. భామినీ! కోపముతో దృష్టిచూతువు. దృష్టిస్నిగ్ధవె. రూక్షభావము లేదు. నెమ్మదిగా నడుపుము. నీ నితంబము ఖేదము పొందునేమో?

## ౭. సైంధవము

పాత్రరహితము రూపవాద్యాది సంయుక్త మయిన నాట్యము సైంధవక మని నాట్యకోవిదు లనిరి. రూపక పాత్రలు ప్రాకృత వచనములతో నుందురు కావున సంకేతము భ్రంశము పొందును. అయినను వీణాది వాద్యములతో నానాకరణములతో నుండును. గావున

రంగన్యక్తి నిదానమగును. రత్నావలీ ద్వితీయాంకములో నిది యున్నది. విదూషకుడు; వయస్యా! మనమే జయించితి మని చేతులు చాచి నర్తింపగా బాహువు సంధినుండి చిత్రఫలకము జారును అది చూచి రాజువిషణ్ణుడగును. విదూషకుని త్రేలితో తాడించును. ఇది సైంధవమునకు చక్కని లక్ష్యము.

## ౮. ద్విమూఢకము

ముఖప్రతిముఖ సంధులకు సంబంధించిన బీజబిందువులు మూఢ ప్రాయములుగా ఘటితములు కాగా స్పష్టభావరసోపేతము చిత్రార్థము నయిన పదవిన్యాసక్రమము ద్విమూఢక మగును నాయికకు నాయకునకు వ్యామోహము వర్ణితమయిననదియు ద్విమూఢకము. రత్నావలి ద్వితీయాంకములో వత్సరాజు చిత్రగతసాగరికను చూచి యనురాగము కలవాడగుట సుసంగతవచ్చుట యిది యంతయు క్రీడామాత్రమని రాజనుట ద్విమూఢ ము.

## ౯ ఉత్తమోత్తకము

విచిత్ర శ్లోకబంధములతో నున్నదై యనేక రస సంశ్రయ ముగా నుండి హేలాహావ విభూషితముగా నుండునది యుత్తమోత్త మకము. రత్నావలి తృతీయాంకములో వత్సరాజు సాగరిక యను భావమున వాసవదత్తతోననుట. "ప్రియా సాగరికా! నీ ముఖము చంద్రుడు. నీ కన్నులు పద్మములు నీ యూరువులు రంభలు బాహు వులు మృణాలములు నన్ను కౌగిలింపుము. నా తాపము శమింప జేయుము అనుట యుత్తమోత్తకము.

## ౧౦ ఉక్త ప్రత్యుక్తము.

కోప ప్రసాదజనితము అధిక్షేప సమాశ్రయము నగు ఉక్త ప్రత్యుక్తరీతి — సంభాషా ప్రతిసంభాషా రీతిఉక్తప్రత్యుక్త మగును. రత్నావలి తృతీయాంకములో నిదియున్నది. సాగరిక యని యను

కొన్న వాసవదత్త వాసవదత్తయని తెలియగా "ప్రియా! వాసవదత్తా!" యనగా వాసవదత్త-"ఆర్యపుత్ర! యిట్లనవలదు ఈ మాట విస్రుకు దాటిపోయినవి" - అనగా రాజు పాదములపై బడుటయు వాసవదత్త యువధీరణమున పోవుటయు మరల నాఒరమున కాంచనమాలతో పలుకుటయు నుక్తప్రత్యుక్తమున కుదాహరణము; ఇది పదియవలాస్యాంగము.

వీథ్యంగములు ౧౩.

ద్వితీయ చతుష్షష్ట్యనుగతములగు వీథ్యంగములు పదమూడు కలవు. వాని పేరులీ విధమున నున్నవి.

ఉద్ఘాత్యకము - అవలగితము - అవస్యందితము
అసంపలాపము - నాలిక - వాక్కేలి
అధిబలము - ఛలము - వ్యాహారము
త్రిగతము-గండము - మృదవము-ప్రపంచము.

వీని సంగ్రహ స్వరూప మీవిధమున నుండును.

పదాని త్వగతార్థాని యే నరాః పునరాదరాత్
యోజయంతి పదైరన్యై స్తదుద్ఘాత్యకముచ్యతే
యత్రాస్మిన్స్మిన్సమావేశ్య కార్యమన్యత్ప్రసాధ్యతే
తచ్చావలగితం నామ విజ్ఞేయం నాట్యయోక్తృభిః
ఆక్షిప్తేఽర్థే తు కస్మింశ్చిత్ శుభాశుభసముత్థితే
కౌశలాదుచ్యతేఽన్యోఽర్థ స్తదవస్యందితం భవేత్
మూర్ఖజనసన్నికర్షే హితమపి యత్ర ప్రభాషతే విద్వాన్
న చ గృహ్యతేస్య వచనం విజ్ఞేయోఽసంప్రలాపోఽసౌ
యత్రాత్మనః పరస్య చ వచనం స్యాదుత్తరోత్తరప్రభవం
అన్యోన్యార్థవిశేషకం అధిబలమితి తద్బుధైర్జ్ఞేయం
అన్యార్థమేవ వాక్యం ఛలం అభిసంధానహాస్యరోషకరం

శ్రుతిసారూప్యాద్యస్మిన్ బహవోర్థా యుక్తిభిన్నరూప్యంతే
యత్రాస్యమహాస్యం వా తత్త్రిగతం నామ విజ్ఞేయం
యత్రానుదాత్తవచనం త్రిధా విభక్తం భవేత్ప్రయోగే తు
హాస్యరససంప్రయుక్తం తత్త్రిగతం నామ విజ్ఞేయం
సంరంభసంభ్రమయుతం వివాదయుక్తం తథాపవాదకృతం
బహువచనాక్షేపకృతం గండమితి వదంతి తత్త్వజ్ఞాః
హాస్యేనోపగతార్థా ప్రహేలికా నాలికేతి విజ్ఞేయా
యత్కారణాద్గుణానాం దోషీకరణం భవేద్వివాదకృతం
దోషగుణీకరణం వా తన్మృదవం నామ విజ్ఞేయం.

ఈ నిరూపించిన లక్షణ శ్లోకములందు క్రమముగా ఉద్ఘాత్యకము-అవలగితము - అవస్యందితము-అసంప్రలాపము - అధిబలము - ఛలము - త్రిగతము - గండము - నాలిక-మృదవము - అను వాని లక్షణ మున్నది. వాక్కేలి - వ్యాహారము - ప్రపంచము అను మూడు వీథ్యంగముల లక్షణములు నిరూపితములు కాలేదు. ఉన్న వాని తాత్పర్యసంగతి నిట్లు తెలియదగును.

౧. ఉద్ఘాత్యకము

అగతార్థము లయిన పదముల నాదరమున నన్యపదములతో యోజన మొనరించిన నది యుద్ఘాత్యక్య మగును. వేణీసంహార నాటకము ప్రథమాంకమున సూత్రధారాదుల సంభాషణ రూపమయిన ప్రస్తావనమున నిది కలదు. సూత్రధారుడు పలికిన వచనమున సంభ్రాంతుడయిన పారిపార్శ్వకుడు సూత్రధారవచనముల కన్యార్థము భావించుటలోనే యుద్ఘాత్యకార్థ మున్నది. శరత్సమయ వర్ణనమయిన నమంగలాశంసచే నిద్ఘాత్యక మయినది.

౨ అవలగితము

కార్యమొకచో సమావేశింపజేసి వేరొకచో ప్రసాధితమగుట యుండునేని యది యవలగితమగును. రత్నావలి ద్వితీయాంకములో-

"నీవెవరికై వచ్చితివో వారిచటనే యున్నారు - నేనెవరికై వచ్చితిని? అన్యశంక యేల? చిత్రఫలకమునకు వచ్చితివి" - అనుటలో ఛాయాంతరమున రాజార్థమును ప్రతిపాదితము. ఇట్టిదిది యవలగితము

౩. అవస్యందితము

శుభాశుభసముత్థితమయిన యొక యర్థమాక్షిప్తము కాగా నన్యార్థమునచట కౌశలమున కూర్చినచో నది యవలగితమగును. వేణీసంహార ప్రథమాంకారంభములో సూత్రధార వచనమును సహింపక క్రోధయుక్తుడయిన భీమసేనుడు ఓరి! నటాధమ! వృథా మంగలపాఠక! నేను జీవించి యుండగనే ధార్తరాష్ట్రులు స్వస్థులయ్యెదరా? - అనగా సహదేవు డన్యార్థము నిరూపించుట అవస్యందితము.

౪. అసంప్రలాపము

విద్వాంసుడు హితము పలికినను మూర్ఖజన సన్నికర్షమున నది గృహీతము కాదు. అపుడా వచన మసంప్రలాప రూపమగును రామాభ్యుదయ నాటకము ద్వితీయాంకమున నిది యున్నది. "భార్యా సమీపమున నుండగా తాపసుడుగా నుండుట యుక్తముకాదు భార్యనపహరింపవలెను. తాపసునకస్సై చెప్పుము. భార్యాపహారమె పురుషునకు పరిభవము" - అని రావణుడని మారీచుని సహాయార్థము రమ్మనెను. "స్వామీ! రామునకు పరిభవమనుట చాలు. తాపసుడని యవజ్ఞచూప వలదు. అదివేరు" 'ఆః అది వేరువిషయమా!' అనుచు రావణుడు కోపించి పలుకుటలో నసంప్రలాపమున్నది. ఈ అసంప్రలాపమును అసత్ప్రలాప మనియు నందురు.

౫. అధిబలము

తనకు పరునకు జరుగు వచన ముత్తరోత్తర ప్రభావమున నుండి అన్యోన్యార్థ విశేషములతో నుండునేని యది యధిబల మని

ఋషిసల భాష. కృత్యారావణనాటకమున—'లక్ష్మణా!' రక్షింపుము! రక్షింపుము' అని దూరమున వినబడుట శూర్పణఖ సీతారూపమున గన్పడుట పిమ్మట లక్ష్మణుడు పలుకుట అను ఘట్టమున నధిబల మున్నది.

౬. ఛ ల ము

అభిసంధానము — వంచనము రోషము హాస్యముగలుగు జేయు అన్యార్థ వచనము ఛలము అగును. రత్నావలి నాటికలో నిదియున్నది. వాసవదత్త చిత్రఫలకమున రాజును సాగరికను చూచి — "ఇది యెవరి తెలివి? ' — అనగా, — "వేరుగా భావింపకుము నేనే యూహించి లిఖించితిని ఇది దృష్టపూర్వ కాదు' అని రాజనుట, విదూషకు డపుడు 'సత్యము' ఒట్టు గాయత్రి తోడు. ఎప్పుడు మే మీామెను చూడలేదు.' అనుట సర్వము ఛలము.

౭. త్రి గ త ము

త్రిగతమునకు రెండు లక్షణము లున్నవి. అందు మొదటిది యిట్లున్నది. శ్రుతిసామ్యమున నేకార్థములు యుక్తనిరూపితములగు నేని యది త్రిగతము! త్రిగతము హాస్యమహాస్యముగ గూడ నుండును. ఇందు లేఖయను వీధిలో నిది యున్నది. 'ఇది కలహంస నాదమా. మధుర వాక్కుల మధుర స్వనమా? గృహ దేవతాచరణ నూపుర ధ్వనియా?' తత్తత్సామ్యము వలన ననేకార్థముండుట త్రిగతమైనది

రూపక ప్రయోగము నందలి యనుదాత్త వచనమును హాస్య రస సంప్రయుక్తముగా త్రిధావిభాగ మొనరించి భావింతు రేని యది త్రిగత మగును. ఫుల్లసకరూపకమున నిది యున్నది.

౮. గ ం డ ము

సంరంభము సంభ్రమములతో గూడి యుండునది వివాద యుక్త మగునది యపవాద కృతమగునది బహువచనాక్షేపకృత మగును.

గండమగునని తత్త్వజ్ఞు లనిరి. వేణీసంహారము ద్వితీయాంకములో దుర్యోధనుడు భానుమతి నుద్దేశించి పలుకునపుడు 'నీ జఘన స్థలము నకు తగిన, నా తొడలు, దేవా! విరిగె. ఏమి? విరిగె భీమ. ఏమిరా! ప్రలాపము?' ఇత్యాది రీతి గండము

నను! ఈ గండమునకు పతాకాస్థానమునకును భేదమేమి? నాటకమున నిరూపింప దలచిన యశుభ వార్తాప్రతిపాదనమునకై బహువచనాక్షేప కృతమగు గండము ద్దిష్టమయినది. పతాకాస్థానక మును ఆగామివస్తు సూచనాత్మకము కాగా నీరెండింటికి భేద మేమి? ఇట్లు భేదముకలదు. పతాకాస్థానకము నాటక శరీర భూతమైన ధర్మాది సాధ్యవస్తు సాధన భూతార్థముల నుపక్షిప్త మొనర్చును. సాధ్య వస్తువునకు విఘ్నభూతములయిన యర్థములను గండము ప్రతిపాదిం చును. 'గండఇవ గండః' గండము గండరూపమై ప్రథమ ముద్భి ద్యమానమయ్యనంతర ముపశమించును. గావున గండమగును. నానావచనముల యనంతరము మొదట నిరూపించిన యర్థమభివ్యక్త మగును. ఈ యంశమునిట్లు సూచించిరి.

బహువచనసంబంధానామంతే యత్పదం చాసంబద్ధం
సంబద్ధమివాభాతి చ తద్గండం నామ వీథ్యాం స్యాత్

నానా విధములయిన వచనముల సంబంధము సంగతమయిన పిమ్మట అంతమున నసంబద్ధమయిగా నుండునది సంబద్ధముగ నవభాసిం చిన గండమగును. ఇట్టి గండమును వీథిలో నిరూపింపదగును.

## ౯. నాలిక

హాస్యోప గతార్థమునకు నాలిక యనిపేరు. ప్రహేలిక వలె నిది యుండును. ఉక్తి ప్రత్యుక్తిరీతులలో చిత్రార్థ సంబంధముండుట ప్రహేలిక కాగలదు. దీని యుదాహరణమిట్లు పరిగ్రాహ్యము.

కోయంద్వారి, హరిః, ప్రయాహ్యుపవనంశాఖామృగస్యాత్రకిం?,
కృష్ణోహందయితే బిభేమిసుతరాంకృష్ణాదహంవానరాత్

రాధేహంమధుసూదనో, వ్రజలతాంతామేవపుష్పాన్వితాం,
ఇత్థంనిర్వచనీకృతోదయితయాహ్రీణోహరిః పాతువః.

దీనిలో రాధాకృష్ణుల సంభాషణము వక్రోక్తి సుందరముగా నున్నది. ద్వారమున నెవరు? హరి. శాఖామృగమున కిచట నేమి పని కలదు. ఉపవనమునకు పొమ్ము. దయితా! నేను కృష్ణుడ. నల్లకోతి యనిన నాకు మిక్కిలిభయము. రాధా! నేను మధుసూదనుడ. అయిన పుష్పము కల లతను వెదికికొమ్ము. పొమ్ము. ఇట్లు ప్రియురాలిచే నిర్వచనీకృతుడయిన లజ్జితుడైన కృష్ణుడు మిమ్ము రక్షించుగావుత ఉక్తి ప్రత్యుక్తి చాతుర్య నిబంధనమున నిది ప్రహేళిక, వక్రోక్తి సుందరమయిన నాళిక.

మృచ్ఛకటిలో వసంతసేనః– ఏమి నన్ను పరిజన మని భావించెనో (ఉత్తరీయ మాఘ్రాణించి) ఈతని యౌవనముదాసీనముకాదు'' ''రదనికా! రోహసేనుని లోనికి దీసికొనిపొమ్ము'' మందభాగ్యను. మీ యభ్యంతరము తెలియదె'' ''రదనికా! ప్రతివచనము కూడ లేదా? భాగ్యము పోగా నందరు దూరమగుదురా? ఇందును నాలిక యున్నది

## ౧౦. మృ ద వ ము

వివాదవశమున దోషములకు గుణీకరణముకాని గుణములకు దోషీకరణముకాని కుదురుకొన్నచో నది మృదవమగును. శాకుంతలమునవలె మృగయాదోషములను గుణములుగా చెప్పుటలో మృదవమున్నది. గుణముల దోషీకరణము మాలతీమాధవమున మృచ్ఛకటికమున నున్నది. మృచ్ఛకటికములో చారుదత్తుడు వసంతసేనా భవనమునకు విదూషకుడు వెళ్ళి రత్నావళినిచ్చి వచ్చినపుడు – 'వయస్యా రమ్ము ఆ పనియేమయినది. సర్వము నష్టమయినది. ఏమి? ఆమె రత్నావళిని తీసికొనలేదా? మనకంతభాగ్యమా? తలపై చేతులు జోడించి తీసికొనినది.

## వృత్త్యంగములు ౧౬

౧. భారతీ వృత్త్యంగములు – ౪

ప్రరోచన – వీధి – ప్రస్తావన – ప్రహసనము.

౨. ఆరభటీ వృత్త్యంగములు ౪

సంక్షిప్తిక – అవపాతము – వస్తూత్థాపనము-సంస్ఫోటము.

3. కైశిక్యంగములు – ౪

నర్మ – నర్మస్ఫింజ – నర్మస్ఫోట – నర్మగర్భములు.

౪. సాత్వత్యంగములు – ౪

ఉత్థాపక – పరివర్తక. సంలాపక – సంఘాత్యకములు ఇచట విమిశ్రనామము కల పంచమ వృత్తి లేదు. ఈ షోడశాంగముల లక్షణ మీ విధమున నున్నది.

౧. ప్రరోచన

వక్తవ్యార్థ ప్రశంసాపరమయిన వచనమునకు ప్రరోచన మని పేరు.

౨. ప్రస్తావన

ప్రస్తుతమగు వస్తూపపాదనావసరమును సూచించు వచనమునకు ప్రస్తావన యని పేరు.

3. వీధి.

ఉద్ఘాత్యకము మొదలగు అంగముల ప్రవృత్తియుండుటకు వీధి యని పేరు. ఉద్ఘాత్యకము – కథోద్ఘాతము-ప్రయోగాతిశయము ప్రవర్తకము – అవలగితము – అనునవి వీథ్యంగములు.

౪. ప్రహసనము.

స్వధర్మము నుండి ప్రచలితు లయిన తాపసాదుల యుపహాసపర మయిన వచనమునకు ప్రహసనమని పేరు. మాంస భక్షణము నిషిద్ధమని శ్రమణు డధరము దశింపననుట.

౫. సంక్షిప్తిక

ఆరభట్యంగములలో మొదటిది. మాహేంద్రజాల నేపథ్యాదులతో వస్తు సంక్షేప మొనర్చుట సంక్షిప్తిక.

౬. అవపాతము.

భయాదులచే విద్రవము మొదలగు కర్మానుప్రవేశ నిర్గమనమున కవపాత మని పేరు.

౭. వస్తూత్థాపనము.

అవిద్రవముగాగాని సవిద్రవముగా గాని సర్వరసభావముల సమాహారముండుట వస్తూత్థాపనము.

౮ సంఫోటము.

నానాస్త్రయుద్ధ నియుద్ధాదులచే సంరంభ సహితమయిన సంప్రహారముండుటకు సంఫోట మని వ్యవహారము.

౯. నర్మ

కైశిక్యంగములలో మొదటిది. సుస్థాపితమయిన శృంగారము నుద్దేశించిన పరిహాసయుతమయిన వచనము కాని విచేష్టితము కాని నర్మ యగును.

౧౦. నర్మస్ఫింజము.

ప్రథమ సంభోగమున నవావస్థానముగా నున్నదియు సంభోగాశ్రయమయిన వాక్యాది రూపముగా నుండు కర్మ నర్మస్ఫింజము.

౧౧. నర్మస్ఫోటము

ఆవిర్భవించిన యభిలాషానుభావములలో నకాండ సంభోగ భంగము నర్మస్ఫోటము.

౧౨ నర్మగర్భము.

కార్యహేతువు యొక్క స్వరూప విజ్ఞానాదులను ప్రచ్ఛాదన మొనరించుట నర్మగర్భము

౧౩ ఉత్థాపకము.

సాత్వత్యంగములలో నిది మొదటిది. పరస్పరము సంబంధించి యుండు నర్థముల నుత్థాపనము చేయుట యుత్థాపకము.

౧౪ పరివర్తకము

ప్రస్తుతార్థ త్యాగమున నన్యార్థభజనము పరివర్తకము.

౧౫. సంలాపకము.

తగినవారున్న సమావేశమున నానావాక్యములతో నన్యోన్యమధిక్షేపము కావించుటకు సంలాపక మనిపేరు.

౧౬. సంఘాత్యకము

కార్యమంత్రానుభావ దైవాదులచే సంఘాత భేదము కలుగుట సంఘాత్యకము – ఇట్లు వృత్త్యంగములు పదునారు నిరూపితములు.

సంధ్యంతరములు – ౨౧

సామ – భేద – దండ – ప్రదాన – వధ–ప్రత్యుత్పన్నమతిత్వ గోత్రస్ఖలిత – సాహస – భయ – హ్రీ – మాయా – క్రోధ ఓజః – సంవరణ – భ్రాంతి – హేత్వవధారణ – దూత – లేఖ – స్వప్న – చిత్ర – మదములు.

౧. సామ

పార్థ విజయము నందు భగవాన్ వాసుదేవుడు దౌత్యమున కౌరవ సభకు వెళ్ళి దుర్యోధనునితో; క్షీరసాగరము వలన చంద్రుడు, చంద్రుని వలన రాజవంశము, పిమ్మట భరతవంశము – శ్లాఘ్యము శ్లాఘ్యగుణము నయిన నట్టివారి వంశము – అని యనుట సామము.

౨ భేదము.

ముద్రారాక్షసమున, రాక్షస ముద్రాలాంఛిత మయిన లేఖాలంకారాదులను చాణక్యుడు ప్రదర్శించి మలయ కేతువునుండి రాక్షసుని భేదింపజేయుట భేదము

౩ దండము

ముద్రారాక్షసమున రాక్షస సంగ్రహార్థమై రాక్షస మిత్రుడయిన చందనదాసు శ్లేషి యందు వధబంధాదికమును చాణక్యుడు ప్రయోగించుట దండము

౪. ప్రదానము.

మృచ్ఛకటికములో శకారుడు వసంతసేనను చంపుటకు విటునితో నిట్లనును. బావా! బావ! బర్రెలు వ్రేలాడుతున్న పందదారాలతో కూడుకొన్న ఉత్తరీయము నీకిష్టమయితే, మాంసం తినాలని సంతోషం పొందాలని చుర్చుకుచుహూ, చుచ్చుచుహూ అంటూ చప్పరించాలని ఉందా? ఉంటే, నాయిష్టం చెయ్యి! బాగాచేస్తాను అకార్యంతప్ప. అకార్యంవాసన అయినా లేదు. రాక్షసీలేదు అయితేచెప్పు. వసంతసేనను చంపు. నీకు గొప్పపిల్లనిస్తాను. రహస్యంగా ఉద్యానంలో చంపితే నిన్ను ఎవరు చూస్తారు చేటా! నీవుచంపు. ఇదిగో కంకణం.

౫ వధ.

శ్రీ రామాయణానుసారి నాటకములలో తాటక - విరాధ - వాలి - జటాయు ప్రభృతుల వధ యున్నది భారతానుసారి నాటకములలో బక - హిడింబ-కీచక - అభిమన్యు ప్రభృతుల వధయున్నది.

౬. ప్రత్యుత్పన్న మతిత్వము.

తాపస వత్సరాజములో వసంతకునకు రాజు భౌతిక నైష్ఠిక విశేషములను జెప్పి - నీవు నైష్ఠికమునునుసరించితివా? - అనెను. విదూషకుడు - నాకు భౌతికము తెలియదు. నైష్ఠికము తెలియదు. నివు పరివ్రాజకుడవయితే నేనూ అవుతాను. ఈ పరివ్రాజభాండం నా భుజం దిగదు. దీన్ని వాసవదత్త దగ్గరకు తీసికొని వెళ్ళి ఆమె స్వయంగా ఇచ్చిన మోదకం తింటూ మొదటికన్న సంతోషిస్తాను.

రాజు - వయస్యా! ఏమిటీ మాట? - విదూ వాసవదత్త తెగలబడి పోయిందిగా! ఇప్పుడు బ్రతికిఉన్నట్లు అన్నానే! ఏంచేయను? ఇట్లా అంటాను. "ఓయి వయస్యా! సిద్ధుడు చెప్పింది గుర్తులేదా? వాసవదత్తాదేవి సదృశఅయిన కన్యక పాణిగ్రహణం అయితే నీకు దేవీ సమాగమం కలుగుతుంది అన్నాడుగా" ఇది విదూషకుని ప్రత్యుత్పన్న మతిత్వము.

౭. గోత్రస్ఖలితము. విక్రమోర్వశీయములో, దేవేంద్ర సభలో ప్రేక్షణీయకము ప్రవృత్తముకాగా ఊర్వశి "పురుషోత్తమునందను రాగముకల"దని చెప్పవలసియుండగా 'పురూరవునందనురాగము కల'దని పలికినది. ఇది గోత్రస్ఖలితము. ఈ యంశము ప్రవేశక సూచితము.

౮. సాహసము.

చంద్రగుప్త నాటకమున గలదు చంద్రగుప్తుడు స్త్రీవేష నిహ్నుతుడై శత్రుస్కంధావారము ప్రవేశించెను శకపతి వధార్థమట్లు చేసెను శకపతిని వధించెను. ఇట్లిచట సాహస వృత్తము సూచితమయినది.

౯. భయము.

వేణీసంహారము నేపథ్యములో నిట్లు సూచితమయినది. ఓహో! నరపతులారా! భీముడు దుశ్శాసనుని గుండెలు చీల్చి రక్తము పూసికొని బీభత్సరూపమున రాగా నాయుధములు విడనాడి మన బలములన్నియు పరుగెత్తుచున్నవి. నిలబెట్టుడు.' అనుటలో భయమున్నది. ఇట్లే మూర్ఛిత దుర్యోధనుని యుద్ధరంగమునుండి తొలగించుకొని పోవుసూతుడు - అయ్యో! ఈ దురాత్ముడు రానే వచ్చినాడే. మహారాజున కింకను సంజ్ఞ తెలివి రాలేదు. రథము నింకనూ దూరము తీసికొని పోదును. అనుటలో భయమున్నది.

౧౦ హ్రీ

తాపస వత్సరాజములో నిట్లున్నది వత్సరాజు నిరాకరించినా డని దుఃఖపడి పద్మావతి చనిపోవలెనన్న భావముతో యత్నించు నప్పుడు వత్సరాజు వచ్చి నివారించెను. పద్మావతి హ్రీ పరీతయయి నది. అప్పుడు విదూషకుడు పలుకగా పద్మావతి లజ్జావనతముఖి యగుట హ్రీ రూపము

పురుషునకును హ్రీ వర్ణనమున్నది పార్థవిజయనాటకములో నిదియున్నది దుర్యోధనుని పరాభూతునొనరించి గంధర్వులు హరిం చిరి అర్జునుడు విక్రమించి విడిపించెను దుర్యోధను నిట్లనెను. పాండ వులు విడిపించి నాడని మనసులో ననుకొనవలదు. మహారాజును ధర్మజాభిన్నముగ భావించుచున్నాను విశేషముగ నీ సమయమున నీ యభియోగమున పరుల వలన అభిభవము కలుగగా మనము 'పంచోత్తరం శతం.' అనగా నప్పుట దుర్యోధనుడు వైలక్ష్యమున నిట్లను కొనును. 'హృదయమా!' సమాధానము బోధింపుము. నే నెట్లెతని పలుకుదును:

> భ్రాతాహమిత్య సదృశం మమ దుష్కృతైస్తైః
> ద్వేష్టా భవాసతి తదత్ర దశావిరుద్ధం
> యద్వచ్మ్యహిమి వచనం లఘు తత్తు తత్ర
> కామం భవేచ్ఛరణమప్రతిపత్తిరేవ

ఈతడు సోదరుడనుట నాయా దుష్కృతముల వలన తగదు. నీవు శత్రువువనుట యిప్పటి దశావిరుద్ధము. ఇప్పుడు నేనేమేమి పలికిన నది చులకన. కావున నిప్పుట మాటలాడకుండుటయె శరణము

౧౧, మాయ.

దేవీచంద్రగుప్తములో కృతకోన్మాదము మానుషిమాయ కృత్యారావణాదినాటకములలో కనకమృగాది రచన అమానుష మాయ.

౧౨. క్రోధము.

శ్రీ విశాఖదేవకృతమగు నభిసారికా వంచితమను రూపకము నందు పుత్రవధ సంభావనా నిమిత్తముగా పద్మావతిపై కోపించి మొసళ్ళుకలనదిలో దిగితిని. విషశాఖ చేరితిని. విషజ్వాలలు కల నాగకన్య ననుసరించితిని—అనుట క్రోధము. ఈ క్రోధము పురుషార్థ సిద్ధి హేతువగు క్రోధస్థాయి భావమొకటి కాదు. పురుషార్థ సిద్ధి హేతువగు స్థాయి భావము సంధ్యంతరము కాదు.

౧౩. ఓజస్సు

దేవీచంద్రగుప్తములో విదూషకుడు శకపతి శిబిరమునకు బయలుదేరి నాయకుననును. 'రాజా! చాలామందిలో నీవొంటరిగా నెట్లు సంచరింతువు? ఓయీ! సత్త్వము వీడి సంఖ్యలో నీకు సమాదరమా? వీరునకు సంఖ్యతో నేమియున్నది.' రాజిట్లనుటలో నోజస్సు కలదు.

౧౪. సంవరణము.

తాపస వత్సరాజమున పద్మావతి వత్సరాజ చిత్రము చూచి సంవరణమున నున్నది. పద్మావతీ రాగము గుర్తించి వాసవదత్త యనిన మాటలలో వాసవదత్త యాకారము గోపనము కలదని సాంకృత్యాయని యనినది.

౧౫. భ్రాంతి

రత్నావలి నాటికలో రాత్రిసమయమున నుద్యాన సంకేత స్థానమున నున్నరాజు వేషసాదృశ్యమున భ్రాంతిపడి వాసవదత్తను 'సాగరిక' యని తలచి సంభాషించును. సాగరికను వాసవదత్తగా వ్యవహరించును.

౧౬. హేత్వవధారణము.

ముద్రారాక్షసములో నేపథ్యమున వైతాలికులు శరద్గుణ ప్రఖ్యాపకమయిన ఆశీర్వచనము పఠించిన పిమ్మట రెండు శ్లోకములు

పఠించుటలో నిదియున్నది సత్త్వాతిశయమునకు నిధులుగా కొందరుండురు. గజము లొనరించు దంష్ట్రాభంగమును మృగరాజు సహించుట లేదు. రాజా! నీవంటి సార్వభౌములాజ్ఞాభంగము సహింపరు. భూషణాదులు ధరించినంత మాత్రమున ప్రభువు ప్రభువు కాడు. ఇతరులాజ్ఞాభంగ మొనర్పని నీ వంటివాడే ప్రభువు. ఇది వినిన చాణక్యుడు - చంద్రగుప్తుడు కౌముదీమహోత్సవ మాదేశించుటను తాను నిషేధించుట గుర్తుతెచ్చుకొని 'ఇది చంద్రగుప్త సముత్తేజన పరము' అని నిశ్చయించెను 'ఇది రాక్షసుని ప్రయోగము. రాక్షసా! రాక్షసా! కనపడితివి. 'జాగర్తిఖలు కౌటిల్యః' అని భావించి రాక్షసప్రయుక్తమున హేత్వవధారణము చేసెను.

౧౩. దూత.

పార్థవిజయమున శ్రీకృష్ణుడు దుర్యోధనునకు దూతగా వెడలుట.

౧౪. లేఖము

ప్రద్యోతుడు వాసవదత్తకు పంపిన లేఖ. 'వత్సా! స్వజనుల యాశీస్సులకందని భద్రమును భర్తృప్రసాదములచే పొందితివని విని నేను సుఖితుడనైతిని ఈ లేఖార్థము ఇందు సంగతమైయున్నది.

౧౫ స్వప్నము.

స్వప్నవాసవదత్తములో నిట్లున్నది. పద్మావతి యస్వస్థముగా నున్నదని వత్సరాజు సముద్రగృహకము ప్రవేశించెను అచట పద్మావతి లేదని యామె శయ్యయందు జేరెను. స్వప్నవదస్వప్నమున వాసవదత్తను చూచెను. స్వప్నాయమానుడై వాసవదత్తతో భాషించెను. స్వప్నమనుట స్వాపము స్వప్నదర్శనము స్వప్నాయితము వివక్షితమగును ఇది స్వప్నములోని స్వప్నమువలె నాట్యము నందలి నాట్యము వలె రమ్యముగా నుండును.

౨౦. చి త్ర ము

రత్నావలిలో చిత్రగత యయిన సాగరికను జూచి వత్సరాజు రాగి యయ్యెను.

౨౧. మ ద ము

కవులు నాటకము లందు రావణుని మదము నిబంధించినారు. కృత్యారావణమున విమానస్థుడగు రావణుడు మదమున పలుకుట కలదు. మాలవికాగ్నిమిత్రములో పానకృత మయిన మదమున్నది. ఇరావతిపానకృత మదమున పలుకుట భావనీయము.

పతాకా స్థానకములు ౪

యత్రార్థే చింతితేఽన్యస్మిన్ తల్లింగోఽన్యః ప్రయుజ్యతే
ఆగంతుకేనంభావేన పతాకాస్థానకంతు తత్
సహసైవార్థసంపత్తిర్గుణవత్యుపకారతః
పతాకాస్థానకమిదం ప్రథమం పరికీర్తితం
వచః సాతిశయశ్లిష్టం కావ్యబంధసమాశ్రయం
పతాకాస్థానకమిదం ద్వితీయం పరికల్పితం
అర్థక్షేపణం యత్ర హీనం సలినయం భవేత్
శ్లిష్టప్రత్యుత్తరోపేతం తృతీయమిదముచ్యతే
ద్వ్యర్థే వచనవిన్యాసః సుశ్లిష్టః కార్యయోజితః
ఉపన్యాససుయుక్తత్వం తచ్చతుర్థ ముదాహృతం.

ఒక యర్థమును పరికృతమున చింతిత మొనర్పగా నాగంతుక భావమున వేరొక యర్థము తత్సమానముగ ప్రయుక్త మయినచో నిది "పతాకాస్థానకము" అని సామాన్యరూపము ఇది నాలుగు విధములు.

౧. ఇతరుల యుపకారమున వెంటనే గుణయుతముగా నర్థసంపత్తి యున్నచో ప్రథమపతాకాస్థానము. రంగము నుండి వెడలి

పోవుట సేపాయ మాలోచించునప్పుడు శ్రీవేషమున పోవుటకు సౌకర్యము కలుగుట సహసార్థసంపత్తి.

౨. కావ్యరచనము నాశ్రయించిన సాతిశయశ్లిష్టవచనము ద్వితీయము. "దేవి' అధికము చెప్ప నేల? జలధి కావల నున్నను రాము డచిర కాలమునన నిన్నోదార్ప గలడు. అను సుగ్రీవసందేశములో సీత లంకలోనున్న దని తెలియక పోయినను ఓదార్పునకై చెప్పిన మాట భావ్యర్థమును స్ఫురింప జేయ మొనరించినది.

3 హీనమగు నర్థ పక్షేపణము సవినయముగా శ్లిష్ట ప్రత్యుత్తరముతో నున్నచో మూడవ పతాకాస్థానము. ముద్రారాక్షసమున, చాణక్యుడు తన ప్రయత్నమున రాక్షస గ్రహణము కాగలదునా? యని తలచు నపుడు సిద్ధార్థక వచనమున నిశ్చయము సూచితమయినది, 'ఆ రాక్షసుడు గ్రహింపబడునా' గ్రహింపబడె - ఏమి - మీ సందేశము' ఈ సంభాషణములో నిది వ్యక్తమయినది.

౪ శ్లిష్ట మయిన వచనవిన్యాసము కార్యయోజిత మయినచో చతుర్థపతాకాస్థానక మగును. రత్నావళిలో వత్సరాజు నవమాలికావిషయమున పలికిన వర్ణనము భావి సాగరికావిషయకార్థమున లగ్న మయినది ఇచటి వచనవిన్యాసము సుశ్లిష్టమై ఉపక్షేపణార్థముతో సంగతమైనది.

## తృతీయ చతుషష్టి

తృతీయచతుష్షష్టిని సంధ్యంగచతుష్షష్టి యనుచున్నారు. పంచ సంధులకు సంబంధించిన వస్తుఖండలకములను సంపదుపేతము లగునట్లుగా నిరూపింప వలెను.

> ఇష్టస్యార్థస్య రచనా వృత్తాంతస్యానుపక్షయః
> అనురాగప్రయోగశ్చ గుహ్యానాం చ నిగూహనం
> ఆశ్చర్యవదభిఖ్యానం ప్రకాశ్యానాం ప్రకాశనం
> అంగానాం షడ్విధం హ్యేతద్దృష్టం శాస్త్రే ప్రయోజనం,

అంగనిబంధనమున నారు విధములగు ప్రయోజనములు కలవని గుర్తించునది ఇది శాస్త్రదృష్ట మగు ప్రయోజనము. ఇష్టార్థ రచన - వృత్తాంతానుపక్షయము - అనురాగ ప్రయోగము - గుహ్యార్థ గూహనము - ఆశ్చర్యవదభిఖ్యానము - ప్రకాశ్యార్థ ప్రకాశన మనునవి షడ్విధ ప్రయోజనములు అంగహీనుడగు నరుడారంభ సమర్థుడు కాడు అంగహీనకార్యము ప్రయోగక్షమము కాదు కావ్య మంగసమన్వితి మయిన శోభాసుందర మగును. అంగవర్జిత మయిన కార్యముదాత్తమయినను ప్రయోగహీన మగును రసికుల మనసును రంజింప జేయ జాలదు. కావున సంధిప్రయోగవిషయమున కావ్యానుకూలముగా రసానుకూలముగా నంగములను కూర్పవలెను ఆయంగ ప్రవిభాగ మీ విధమున నున్నది.

౧ ముఖసంధి ౧౨ అంగములు ఉపక్షేప-పరికర-పరిన్యాస-విలోభన - యుక్తి - ప్రాప్తి - సమాధాన - విధాన - పరిభావన - ఉద్భేద - భేద - కరణములు.

౨. ప్రతిముఖసంధి. ౧౨ అంగములు. విలాస - పరిసర్ప - విధూత - తాపన - నర్మ - నర్మగర్భ - నర్మస్ఫోట - నర్మద్యుతి - పర్యుపాసన - పుష్ప - వజ్ర - వర్ణసంహారములు.

3. గర్భసంధి. ౧౩ అంగములు అభూతాహరణ - మార్గ - రూప - ఉదాహరణ - క్రమ - సంగ్రహ - అనుమాన - ప్రార్థన - ఆక్షిప్తి - తోటక - అధిబల - ఉద్వేగములు,

౪ విమర్శసంధిలో ౧౩ అంగములు. విద్రవ - అపవాద - సంస్ఫోట - శక్తి - వ్యవసాయ - ప్రసంగ - కాంతి - ఖేద - ప్రతిషేధ - విరోధన - ఆదాన - సాధన - ప్రరోచనములు.

౫. నిర్వహణ సంధిలో ౧౪ అంగములు. సంధి-నిరోధన - గ్రథన నిర్ణయ - పరిభాషణ - ద్యుతి - ప్రసాద - ఆనంద - సమయ - ఉపగూహాల - భాషణ పూర్వవాక్య - కావ్యసంహార - ప్రశస్తిరూపములు.

ఇది సంధ్యంగచతుష్షష్టి - నాటకాదులలో మహాకావ్యము లందును ప్రాశ్న సందికములయినప్పుడు నిబంధింప వలెను. ఆ యా సంధులలో పఠితము లైన యంశములను ఆ క్రమముననె నిబంధింప వలె ననునది ప్రచురప్రయోగము కాని సంవిధానవశమున న్యూనాధిక భావము వ్యుత్క్రమమును ప్రయోగము సముచితమని గుర్తింప వచ్చును.

తురీయ చతుష్షష్టి

చతుర్థచతుష్షష్టి. లక్షణచతుష్షష్టి. కావ్యలక్షణము లని ఏని పేరు. నాటకాదుల నుండి వీనిని గ్రహించుటయు నుచితము. కావ్యములలో నీ లక్షణచతుష్షష్టి కూర్పదగును. ఇవి ఇట్లు కలవు.

భూషణము - అక్షరసంఘాతము - శోభ - ఉదాహరణము - హేతు - సంశయ - దృష్టాంత - ప్రాప్తి-ఆశయ - నిదర్శన - నిరుక్త సంజ్ఞ - విశేషణ - గుణాతిపాత - అతిశయ - తుల్యతర్క - పదోచ్చయ - దిష్ట - ఉపదిష్ట - విచార - విపర్యయ-భ్రంశ - అనునీతి - మాలా - దాక్షిణ్యం - గర్హణా - అర్థాపత్తి - ప్రసిద్ధి - పృచ్ఛా - సారూప్య - మనోరథ - లేశ - యాచ్ఞా - ప్రోత్సాహన - స్పృహా - పశ్చాత్తాప - అనువృత్తి - యుక్తి - నిర్భాపన - క్షమా - గుణానువాద - ఆక్రంద - కపట - పరివాదన - ఉపపత్తి - కార్య-ప్రతిషేధ- మృషోద్యమ - ఛలోక్తి - కాకు - ఉన్మాద - పరిహాస - వికత్థన - యదృచ్ఛా - యోగ - నైపుణ్య - ప్రతిజ్ఞాత - ప్రవృత్తి - ఆశీః - ఉక్తి - సిద్ధి - ప్రియం - వచనం -

కావ్యభూషణ విషయమున దెలియ వలసిన విశేషాంశములను నా రచిత నాట్యవేదము లక్షణాలంకార భాగములనుండి గ్రహింప దగును. కావ్య విభూషణము లని కావ్యలక్షణము లని ఏని వ్యవహారము కలదు.

ఏతాని కావ్యస్య విభూషణాని ప్రాయశ్చతుష్షష్టిరుదాహృతాని
ప్రబంధశోభాకరణాయ తజ్జ్ఞైః సమ్యక్ప్రయోజ్యాని యథారసాని

ఉదాహృతా నాటకనాటికానాం
ఇయంచతుష్షష్టిచతుష్టయీ యా
రసావిరోధేన నిబంధనీయా
కథాసు కావ్యేషు చ సా మహద్భిః

సామాన్యముగా నివి కావ్యభూషణము లరువదినాలుగు కీర్తితము లయినవి. ప్రబంధ శోభా సంపాదనముకొఱకై తద్విదులు రసోచితముగా వీనిని ప్రయోగింపదగును. ఈ చతుష్షష్టి చతుష్టయి నాటికా నాటకరీతుల ననుసరించిని రూపితమయినది. మహనీయులు కథలలో కావ్యములలో రసావిరోధమున వీనిని నిబంధింప దగును. వీని వలన ప్రబంధమహత్త్వ సిద్ధ మగును.

భక్తీర్ద్వాదశ తాః పృథక్పృథగిమాః సంచిత్య శబ్దార్థయోః
సాహిత్యస్య చ శబ్దశాసనవిదా కార్యః ప్రబంధే శ్రమః
కీర్తిర్యావదనశ్వరీ హి విదుషాం రోదోగృహం గాహతే
బ్రాహ్మం లోకలలామధామ తదమీ తావత్కిలాధ్యాసతే

శబ్దార్థములయు సాహిత్యమునకు సంబంధించినదియు నయిన ద్వాదశ భక్తివిధానమును వేరు వేరుగా గుర్తించి శబ్దశాసనవిదుడు ప్రబంధమున పరిశ్రమ మొనరింపదగును. అట్టి విద్వాంసుల కీర్తి నాశరహితమై రోదోగృహ మవగాహించును. వారును బ్రాహ్మమయ లోకలలామ ధామ మధిష్ఠింతురు.

ప్రబంధాంగ చతుష్షష్టి
చతుష్టయ ప్రకాశము.

---

శ్రీ

# శృంగార ప్రకాశము

## త్రయోదశ ప్రకాశము

### రతి ప్రకాశన ప్రకాశము

తత్త్వజ్ఞానమున నిశ్శ్రేయసము పొందుట మోక్షము. మోక్షమభిలషించు వానికి గార్హస్థ్యము నందును తదధిగమ యోగ్యతాభిమానము మోక్షశృంగారము.

| | వృత్తి | రీతి | ప్రవృత్తి | నాయిక | నాయకుడు |
|---|---|---|---|---|---|
| ౧ ధర్మశృంగారము నందు | భారతి | వైదర్భి | పౌరస్త్య | స్వకీయ | ధీరోదాత్తుడు |
| ౨ అర్థశృంగారము నందు | అరభటి | గౌడీయ | ఓఢ్రమాగధి | సర్వ | ధీరోద్ధతుడు |
| ౩ కామశృంగారము నందు | కైశికి | | దాక్షిణాత్య | సర్వ | ధీరలలిత |
| ౪ మోక్షశృంగారము నందు | సాత్వతి | లాటీయ | ఆవంతి | స్వకీయ | ధీరశాంత |

ఈ నాలుగు శృంగారములకు సంబంధించిన యీ నలుగురు నాయకులు నాలుగు వర్ణములకు సంబంధించిన నాయికలు ఉత్తమ మధ్య మాద భేదములు కలవారు కాగా యథాయోగముగా వీరికి సంబంధించు విభావానుభావవ్యభిచారిభావముల సంయోగమున రతి యభివ్యక్తి మగును. రత్యాదిభావముల కన్నిటికి నాలంబన విభావము లుద్దీపన విభావము లనుభావములు వ్యభిచారిభావములు కలవు. వాని నీ రతిప్రకాశన ప్రకాశమున నిరూపించుట యుక్తము.

౧. రతి – అభీష్టజన – ఉపవన – వరమందిరాదు లుద్దీపన విభావములు – ఋతు మాల్య విలేపనాదులు నట్టివి. సంభోగాత్మకరతిలో హర్ష ధృతి స్మృతి మతిస్వేద రోమాంచ గద్గద హాసాదులు వ్యభిచారులు. విప్రలంభ రతిలో గ్లాని–చింతఔత్సుక్య–ఆవేగ విస్మయ దైన్య – అసూయాదులు వ్యభిచారులు.

౨. ప్రీతి:– అభీష్ట రూప రస గంధ శబ్ద స్పర్శాదులు పుత్ర మిత్రాదులు ఆలంబనములు. తదుపభోగ సమాగమ సుఖస్పర్శాదు లుద్దీపనములు. రోమాంచ స్వేదస్వర భేదాదులు వ్యభిచారులు.

౩. హర్షము:- మనోరథలాభ - ఇష్టజన సమాగమ - దేవ-గురు-భర్తృ-రాజప్రసాదాదు లాలంబనములు. భోజనాచ్ఛాదనాదు లుద్దీపనములు నయన వదన ప్రసాద ప్రియభాష ణాలింగన లలిత తాడనాదు లనుభావములు. హాస ధృతి స్మృతి మతి గర్వోత్సుక్యా వేగ చపలతోత్సాహ జడతాదులు వ్యభిచారులు.

౪. రోమాంచము:- స్పర్శ - భయ - శీత - హర్ష - క్రోధ - రోగాదు లాలంబనములు ప్రియాలింగన-దర్శన-అభిషేక-గుణకీర్తన-ఉపకారస్మరణాదులుద్దీపనములు ప్రియాగాత్ర స్పర్శన విలోకనాదులను భావములు. హాస-త్రాస-విస్మయ-వితర్కా-వేగ - శంకా-అవహిత్థ-వ్రీడావష్టంభ - స్వేద - వేపథు - స్వరభేదాదులు - వ్యభిచారులు.

౫. ధృతి - అష్టైశ్వర్య - కుల - రూప - యౌవన - విద్యా-బలాదులు ఆలంబనములు - శ్రుత - విజ్ఞాన - శౌచ - ఆచార - దేవ-గురు భక్త్యాదు లుద్దీపనములు - ప్రాప్తవిషయోప భోగ-అప్రాప్తానుశోచాదు లనుభావములు. తృప్తి - హర్షాదులు వ్యభిచారులు.

౬ స్వేదము.- ఐశ్వర్య కులరూప యౌవనధనవిద్యాబలాదు లాలంబనములు భర్తృ సంభావనోత్తమాదగ అనురూప నారీ ప్రార్థన గుణప్రశంసాదు లుద్దీపనములు. ప్రకోష్ఠోత్తరాదాప భావ గోపనస మకాపౌరుష్య ధర్షణాధిక్షేప వ్యతిక్రమాదు లనుభావములు. హాసోత్సాహ క్రోధ చపల తామర్షణాదులు వ్యభిచారులు.

౭. హాసము - ప్రీతిజా - విసంప్రలాప-సౌఖ్య-ధార్ష్ట్య-కుహక-పరచేష్టానుకరణ - పౌరోభాగ్యాదులు ఆలంబనములు. నాయకసాన్నిధ్యాదులుద్దీపనవిభావములు. భజన - దర్శన - సందర్శన-ఆస్యరాగ-పార్శ్వగ్రహణాదు లనుభావములు. స్మిత-హసిత-విహసిత-ఉపహసిత అపహసితాదు లనుభావవిశేషములు. ప్రేమాశ్రుచపలతాదులు వ్యభిచారులు.

౮. మదము - మద్యోపభోగాదు లాలంబనములు. మనోరథావాప్తి - ఇష్టదర్శన - గీతవాద్యనృత్తవృత్తవర్ణనాదు లుద్దీపనములు. రుషాశీభాషణ - వ్యాకులవచన - మధురముఖరాగ-హృష్టతను-త్రాసరహిత-సుకుమారావిష్టలలితస్ఖలితనయన ఘూర్ణనాదులనుభావములు. అన్యగ్లాని-అసూయా-శ్రమమోహహర్ష ధృతిస్మృతిచపలతా- అశ్రు-గర్వ-ఔత్సుక్య-నిద్రా-అమర్ష - స్తంభ-వేపథు - రోమాంచ - పులకాదులు వ్యభిచారులు.

౯. మోహము:- అవలోకనావసావధారణాకులాలంబనములు. సంస్కృతి ప్రదేశదర్శన - ఇష్టగుణాకర్ణన ఋతుమాల్యానులేపన - ఉపనతి ప్రభృతు లుద్దీపనములు. గుణగ్రహణ కాకలీగీతాదులను భావములు. నిర్వేద - గ్లాని - శంకా - ఆవేగ-శ్రమ-దైన్య-చింతా-మతి-స్మృతి - చపలతా - వ్రీడా - అవహిత్థ- జడతా-విషాద-ఉన్మాదాదులు వ్యభిచారులు.

౧౦. చింత - పరద్రవ్యాపహారము- దారిద్ర్యము - ఇష్టజన వియోగము మొదలగునవి యాలంబనములు ప్రారబ్ధాసిద్ధి - సమీహితానవాప్తి దేశభ్రమణాదు లుద్దీపనములు. సంతానధ్యానాధోముఖ్యాలను భావాదు లనుభావములు. శోకభయవిస్మయవిషాదనిద్రానిర్వేద గ్లానిశంకాశ్రమదైన్యమోహస్మృతి వైవర్ణ్యాదులు వ్యభిచారులు.

౧౧. స్మృతి - అస్వాస్థ్య - అపరాత్రప్రబోధ - సమానదర్శనోదాహరణ - దైవాదు లాలంబనములు. పూర్వానుభూతార్థ విషయ - ధ్యానాదు లుద్దీపనములు. శిరః కంపన - భ్రూసమున్నమన-శూన్యావలోకన - అంగుళివిహంగాదులను భావములు. హాసశోక క్రోధోత్సాహభయ జుగుప్సా విషాదౌత్సుక్యాసూయోగ్రతా గర్వత్రాస రతి స్తంభ స్వేద రోమాంచవేపథు వైవర్ణ్యాశ్రు స్వరభేదాదులు వ్యభిచారులు.

౧౨ మతి – శాస్త్రోపదేశ – మంత్రాదులచే నర్థనిర్ధారణాదు లాలంబనవిభావములు. విద్యావృక్షసంయోగాధ్యయనాధ్యాపన తద్విద్యావిత్సంభాషణాదు లుద్దీపనములు. తత్త్వాభినివేశ దేశకాలానుసరణాదు లనుభావములు. గ్రహణశక్తివికాసాదు లన్నియు వ్యభిచారి భావము లగును.

౧౩. వితర్కము:– సందేహవిమర్శాదు లాలంబనవిభావములు. సమానానేకధర్మోపపత్తి ప్రతిపత్తి విశేషాదు లుద్దీపనములు. భ్రూక్షేప మంత్రసంగ్రహాదు లనుభావములు. నిర్వేదగ్లానిశంకాశ్రమవిషాద విస్మయదైన్యచింతా మోహస్మృతి మతివ్రీడావేగజడతా స్తంభ స్వేదాదులు వ్యభిచారులు.

౧౪. మోహము.– విస్మయవ్యామోహవిషాదాధ్యవసాయా విషయసాహసాదు లాలంబనములు. వినయబలపరాక్రమదేశకాల శక్తిసంపత్ప్రతాపాదు లుద్దీపనములు. గాంభీర్యాదు లనుభావములు క్రోధాసూయామర్ష చింతాస్మృతి మతిగర్వావేగ రోమాంచస్వేదాత్సుక్యోగ్రతాదులు వ్యభిచారులు.

౧౫ క్రోధము:– ఆక్షేపానృతవచనోపఘాత వాక్పారుష్యద్రోహ మాత్సర్యాదు లాలంబనములు తాడన పీడన పాటనభేదచ్ఛేదన ప్రహరణాదులుద్దీపనములు నయనరాగ భ్రుకుటి దంతోష్ఠపీడన గండస్ఫురణ హస్తనిష్పేషాదులనుభావములు. సంమోహోత్సాహామర్షావేగ చపలతా గద్గదాదులు వ్యభిచారులు.

౧౬. అమర్ష – విద్యైశ్వర్యధనబలాధికారావిక్షేపావసానాదు లాలంబనములు. స్వావస్థాలోకనమధురాలాపశ్రవణకామినీ ప్రోత్సాహాదు లుద్దీపనములు. శిరఃకంపాధోముఖధ్యానాధ్యవసాయోపాయ సహాయాన్వేషణాదు లనుభావములు. క్రోధాసూయాతాపోగ్రతావేగ వైవర్ణ్యాదులు వ్యభిచారి భావములు.

౧౭. అసూయ:- పరైశ్వర్య సౌభాగ్యమేధావిద్యాదు లాలంబనవిభావములు. దోషఖ్యాపనగుణోపఘాతచక్షుఃప్రణిధానాధోముఖ్య భ్రుకుటిక్రియాదు లుద్దీపనములు. అవజ్ఞాపరాధ ద్వేష వేషకుత్సాదు లనుభావములు. ఆవజోపహాసితస్వరభేదాదులు వ్యభిచారులు.

౧౮. ఈర్ష్య:- సమానకుల శీలరూప విద్యావయో విభవబల పరాక్రమము లందును సపత్న్యు లందును క్రమముగా ప్రతిప్రాసాద స్థానదానసమానాదు లాలంబనములు. అమర్షావలోకనాదు లుద్దీపనములు. మన్యువ్యలీకవిప్రియ ప్రణయకలహోపాలంభాదు లనుభావములు. క్రోధోత్సాహవిస్మయ వితర్క దైన్య జుగుప్సామోహ నిర్వేదాసూయామర్ష వేపథు వైవర్ణ్యాశ్రుస్వేద గద్గదాదులు వ్యభిచారులు.

౧౯ చౌర్యాభిగ్రహము – నృపాపరాధ సంబంధప్రలాపాద్యాలంబనములు. ద్రవ్యాపహారభారాకనివేశాదులుద్దీపనములు. తాడన పీడనవధ బంధభర్త్సనాస్వరగాదలనుభావములు. క్రోధోత్సాహ విస్మయజుగుప్సాసూయాస్మృతిమతి మోహచపలతాహర్షామర్షమదా వేగవైవర్ణ్యాశ్రుగద్గదాదులు వ్యభిచారులు.

౨౦ జుగుప్స:- సుహృద్విప్రియకథన శ్రవణదర్శన పరికీర్తనాదు లాలంబనములు తత్స్వరూపవికారక్రియావిపరిణామాదు లుద్దీపనములు. సర్వాంగసంహారాక్షిసంకోచముఖవికూణనహృల్లేఖ నిష్ఠీవనోద్వేజనాదు లనుభావములు. విస్మయ నిర్వేద భయగ్లానిశంకా మోహస్మృతి జడతావేగ విషాదాపస్మారమద వేపథుస్వరభేద వైవర్ణ్యాశ్రుమూర్ఛాప్రలాపాదులు వ్యభిచారులు

౨౧. విస్మయము:- అసంభావ్యమాన కౌతుకకర్మ చిత్రశిల్ప విద్యాతిశయాదు లాలంబనములు. దివ్యజన సంభాషణోపవన దేవకులవిహారదర్శనాదు లుద్దీపనములు. నయనవిస్తారానిమేష ప్రేక్షణ

భ్రూవిక్షేపసాధువాదప్రబంధహాహాకారాదు లనుభావములు. జడతా మోహామూర్ఛాదులు వ్యభిచారులు

౨౨. నిద్ర:- దౌర్బల్యము శ్రమక్లమాలస్యచింతాత్యాహార స్వభావాద్యవస్థ లాలంబనములు. మంద సంతోషనిశ్చింతతా వివిక్త స్థానలాభానుకూలాదు లుద్దీపనములు. శిరోవేదనగౌరవశరీరచలన నేత్రఘూర్ణనజృంభణ గాత్రమర్దనిశ్వసితోచ్ఛ్వసితస్రస్తగాత్రతాక్షి నిమీలనసర్వాంగక్రియాదు లనుభావములు. మోహజడతాపస్మార స్తంభస్వేదస్వరభేదవేపథువైవర్ణ్యాస్రాదులు వ్యభిచారులు.

౨౩. స్వప్నము:- నిద్రాదు లాలంబనములు. నిద్రాదికారణము లుద్దీపనములు. అక్షిమీలనస్వప్నాయితాదులను భావములు. సామాన్యముగా రత్యాదు లన్నియు వ్యభిచారిభావములు.

౨౪. ప్రబోధము:-నిద్రాచ్ఛేదాహారపరిణామ స్వప్నాంతతీవ్ర శబ్దస్పర్శాదు లాలంబన విభావములు. ప్రాగ్దృష్టపదార్థావలోకనారబ్ధస్మరణ మిత్రాదికార్యగౌరవాచారపరిపాలనాదు లుద్దీపనములు. జృంభణోన్మేషనిమేషాక్షిమర్దన శయన మోటనాంగవలనాదు లనుభావములు. ఉత్సాహచింతాస్మృతిమతిస్వరభేదాస్రాదులు వ్యభిచారులు.

౨౫. చపలత – రాగద్వేషమాత్సర్యేర్ష్యామర్ష ప్రాతికూల్యాదు లాలంబనములు. పదార్థమానోత్కర్షప్రోత్సాహ నాపకారస్మరణాదు లుద్దీపనవిభావములు. వాక్పారుష్య దండపారుష్య అర్థదూషణాదు లనుభావములు. హాసక్రోధోత్సాహవిస్మయజుగుప్సాహర్షావేగ విషాదోగ్రతాత్రాసరోమాంచవేపథుస్వేదస్వరభేదాదులు వ్యభిచారులు.

౨౬. ఆలస్యము – గర్వమదమాంద్యనైరాశ్యశ్రమక్లమాదులాలంబనవిభావములు × × × × స్రస్తగాత్రతాదులను భావములు. నిర్వేదశ్రమవిషాదనిద్రాదైన్యమోహజడతావ్యాధి స్వేద వేపథు స్తంభాదులు చారులు భావములు.

౨౭. ఆవేగము:- విద్యుదుల్కానిర్ఘాతన చంద్రసూర్యోపరాగ కేతుదర్శనభ్రమణ ప్రియాప్రియశ్రవణ దుఃస్వప్నదుర్నిమిత్తదర్శన వ్యసనాభిఘాతాదు లాలంబనములు ఉక్తవిషయకీర్తనానుభవ సంప్రధారణాదు లుద్దీపనవిభావములు. సర్వాంగస్రస్తతావగుంఠనాక్షిమర్దన త్వరితగమనాంగపీడన ప్రధావనచ్ఛన్నాశ్రయణ ధూమాకుల విధూనన త్వరితాపసర్పణ పశ్చాదవలోకనాభ్యుత్థానాలింగన భూమిశయనపరిదేవితవిలాపాక్రందిత దేవతానుస్మరణాదు లనుభావములు శోకభయవిస్మయ శంకాశ్రమచింతావైవర్ణ్యాశ్రుప్రలయాదులు వ్యభిచారులు.

౨౮. అశ్రువు - శోకక్రోధహర్షధూమాంజనజృంభణభయానిమేషప్రేక్షణ శీతరోగాదు లాలంబనములు. కార్యకరణానుబంధ ప్రబంధాదు లుద్దీపనములు. నేత్రసమ్మార్జన బాష్పమోక్షత్రివిధరోదనాదు లనుభావములు. ఇందు ఫుల్లకపోలత, అంగనిమీలితాస్యము. అపర్యాప్తముక్తాస్రము. అస్వస్థగాత్రము, సంభ్రమిపాతవిచేష్టితవిలాపదుఃఖజము ప్రస్ఫురితోష్ఠకపోలము, నిశ్వాసము, సశిరఃకంపభ్రూకటాక్షాదులు యథాసంభవముగా నుండును.

౨౯. ప్రలయము:- మూర్ఛాశ్రమాభిఘాతనిద్రామోహాదు లాలంబనములు. శ్రమాదికారణము లుద్దీపనములు. నిశ్చైతన్యభ్రమణ పతన ఘూర్ణనాదర్శనాదు లనుభావములు. గ్లానిజడస్తంభవైవర్ణ్యాదులు వ్యభిచారులు.

౩౦. జడత - ఇష్టానిష్టశ్రవణ దర్శన వ్యాధ్యాదు లాలంబనములు. తంద్రామణీయకోద్వేజనాదు లుద్దీపనములు. కార్యాప్రతిపత్తి-అకథనము - అభాషణము - తూష్ణీంభావము - అనిమేషనిరీక్షణాదు లనుభావములు. నిర్వేదగ్లానిశ్రమదైన్యమోహవిషాదనిద్రాస్తంభవైవర్ణ్యాదులు వ్యభిచారులు.

3౧. శమము:- తత్త్వజ్ఞానాదు లాలంబనములు. యోగాభ్యాసాదు లుద్దీపనములు. రోమాంచహర్షధృత్యాదులు వ్యభిచారిభావములు.

నాలుగు విధము లగు శృంగారములందు సంగతము లగు సర్వభావములకు విభావాదిభావసంచారిసంకర మిట్లు నిరూపితమైనది.

"వ్యక్తః స తైర్విభావాద్యైః స్థాయీ భావో రసః స్మృతః"
ఆ విభావాదులచే నభివ్యక్త మగు స్థాయిభావము రస మగును. ఇట్లభివ్యక్త మగు శృంగారరసము సంభోగము విప్రలంభ మని రెండు విధములు.

సమవాయే య ఉద్భూతశ్చిరం యశ్చావతిష్ఠతే
భావః స్థాయీతి సవిజ్ఞేయో వ్యభిచారీ తతోఽన్యథా.

భావ స్థాయిభావములవివేకమీలక్షణమునగలదు. విభావాదుల సంబంధసమవాయమున సముద్భూతమై చిర మవస్థానము పొందు భావము స్థాయిభావమగును. చిరావస్థితిలేనిభావము వ్యభిచారిభావమగును. ఆలంబన ముద్దీపన మని విభావము రెండువిధములు. అనుభవసంస్కారమున జనకముగా నుండునది యాలంబనవిభావము. రెండవది యయిన యుద్దీపనవిభావము రెండు విధములు. అంతరుద్దీపన మొకవిధము బహిరుద్దీపన మొకవిధము. స్మృతీచ్ఛాద్వేషయత్నము లంతస్సంతానముగా జెప్ప దగియున్నవి. నాగారంభములు వప్రురారంభములు బహిరారంభములయిన యుద్దీపనములు.

వ్యభిచారిభావము విభావములతో ననుభావములతో సంబంధించినదై జన్మ - అనుబంధము - ప్రవృద్ధము - సంపృక్తము - అనువర్తనము అను నయిదు విశేషములు కల దగును. భావములకు విభావముల వలన జన్మ కలుగును. ఉద్దీపనవిభావమున ననుబంధము కలుగును. అనుభావముల వలన ప్రవృద్ధభావము కలుగును. వ్యభిచారిభావములతో భావము సంబంధము కలదేని సంపృక్తావస్థ కలుగును.

సంస్కారానుబంధముతో నుండు నేని యనువర్తనావస్థ కలదగును. వ్యభిచారిభావములను స్థాయిభావమువలన సంఘర్షము కలిగి నప్పుడు జన్మానుబంధప్రవృద్ధసంపృక్తాను వర్తనముల యనుషంగము వలన స్ఫురణము కలుగును. దీనిచే భావము లనుగతి కల వగును. ఇట్లు భావములందు తత్తల్లక్షణసంబంధమున నయిదు విధములు సంభవించును. అట్టి పంచప్రపంచముల నిక నుపవర్ణింతుము శృంగారావిర్భావహేతువులు శృంగారప్రభావములె. ఆ రత్యాదిభావములు నలుబది తొమ్మిది యని యనుట "నాధికా న న్యూనాః" అంతకన్న నధికము లేవని తక్కువ కావని యనుట యగును.

"మనోనుకూల ఏవాత్మనస్సుఖానుభవో రతిః"

మనస్సున కనుకూల మయిన యాత్మసుఖానుభవమునకు రతి యని వ్యవహారము. ఈ రతి యష్టవిధము:

నైసర్గికి - సాంసర్గికి - ఆభియోగికి - ఆధ్యాత్మికి
ఔపమానికి - వైషయికి - సాంప్రయోగికి - ఆభిమానికి.

౧ నైసర్గికరతి. జన్మాంతరసంస్కారము వలన స్వభావసహజముగా సహజసంస్థానమున నుండు రతి నైసర్గికరతి అట్టిదియు జాత-అనుబంధ - ప్రవృద్ధ - సంపృక్త - అనువర్తన రూపమున నుండు నదై పంచవిధ మగును

౧. జాతరతి - ఆలంబనవిభావము వలన నుత్పన్న మయినదై నైసర్గికజాతరతి ప్రకాశించును. ఉదా:

ఇయం మహేంద్రప్రభృతీనధిశ్రియ
శ్చతుర్దిగీశానవమత్య మానినీ
అరూపహార్యం మదనస్య నిగ్రహాత్
పినాకపాణిం పతిమాప్తుమిచ్ఛతి.

సంపన్ను లయిన యింద్రాగి దిక్పాలకుల నీమె నిరసించి మన్మథనిగ్రహమువలన రూపహార్యుడు కాని పినాకపాణి శివుని పతిగా నొందగోరుచున్నది. ఇందు పార్వతీరతి జన్మాంతరసంస్కార సంబంధము కల దగుట స్పష్టము.

౨ అనుబంధరతి.— ఉత్పన్న మయిన రతి యుద్దీపనవిభావ ముల వలన నుదీప్యమానమయి యనుబంధసహిత మగును. గావున అనుబంధరతి యగును. ఉదా,

యథాశ్రుతం వేదవిదాం వర త్వయా
జనోయముచ్చైః పదలంఘనోత్సుకః
తపః కిలేదం తదవాప్తిసాధనం
మనోరథానామగతిర్న విద్యతే.

నీవు వినినట్లె యీ నే నున్నతపద మభిలషించుచున్నాను. నా యీ తపమును తత్ప్రాప్తిసాధనమె కోరిక లంతట సాగును కదా !

3. ప్రవృద్ధరతి— అనుబంధ ముదయింపగా సంస్కారము నిరంతరము ప్రబోధము పొందును. అపుడు స్మరణేచ్ఛాద్వేషప్రయ త్నములు కలుగును మనోవాగ్బుద్ధిశరీరారంభము లయిన యను భావములు కలుగును. సముచిత సంచారిభావము లుదయించును వీని సంబంధము కల దయిన రతి ప్రాప్యవిషయమున ప్రకర్షావస్థ పొంది నదై ప్రవృద్ధరతి యగును. ఉదా,

అలం వివాదేన యథాశ్రుత స్త్వయా
తథావిధస్తావదశేషమస్తు సః
మమాత్రభావైకరసం మనః స్థితం
న కామవృత్తిర్వచనీయమీక్షతే॥

వివాద మేల? నీ వెట్లు వింటివో యట్లే యాత డగుగాక. నా మన సాతని యందు భావైకరసముగా నున్నది. ఇచ్ఛాప్రవృత్తి

కలవారు లోక మనుటను జూడరు. పార్వతి యిట్లనుటలో నామె ప్రకర్ష పొందిన రతి ప్రవృద్ధి యున్నది.

౪. సంప్రవృత్తరతి ఆలంబనానుభవ సంస్కారమునను ఉద్దీపనస్మృత్యాదికమునను సంచారిసంభావమునను సమానబలసంపత్తి కల భావాంతరముల సంబంధము కలుగగా రతికి సంప్రవృత్తస్థితి కలుగును ఉదా·

సంతాపసంతతిమహావ్యసనాయ తస్యా
మాసక్తమేతదనపేక్షితహేతు చేతః
పాయచ్ఛుభం చ విదధాత్య పభం చ జంతోః
సర్వంకషా భగవతీ భవితవ్యతైవ.

ఇది మాధవుని భావనము ఆ మాలతి యందు నా చేత మహేతుకముగా నాసక్త మైనది. నాకు సంతాపసంతతి మహావ్యసన మయినది. సర్వంకష యయిన భవితవ్యతయే మానవునకు శుభ మశుభ మాధానించును కదా!

౫. అనువృత్తరతి : అసామాన్యానుభూతిబలము కల భావాంతరమున నభిభూత మయినను సంస్కారమాత్రమున ననువర్తించి యుండునది యనువర్తిని రతి యగును. ఉదా,

శైలాత్మజాపి పితురుచ్ఛిరసోఽభిలాషం
వ్యర్థం సమీక్ష్య లలితం వపురాత్మనశ్చ
సఖ్యోస్సమక్షమితి చాధికజాతలజ్జా
శూన్యా జగామ భవనాభిముఖీ కథంచిత్.

పార్వతియు సమున్నతు డయిన తన తండ్రి యభిలాషము వ్యర్థ మగుటను చూచి, తన లలితదేహము వ్యర్థ మగుట భావించి, సఖీసమక్షమున నని యధికముగా లజ్జ కలదై శూన్యహృదయమున భవనమున కెట్లో చేరినది. ఇందు భావాంతరముల వలన నభిభవము సంస్కారమాత్రమున రతి స్పష్టము.

ఇట్లీచట నైసర్గికరతి సంబద్ధము లయిన జన్మానుబంధప్రవృద్ధ సంప్రస్తానువృత్తివిశేషములు సూచితము లైనవి. ఇట్టి విశేషములు సాంసర్గికాదులకును గలవు. సంసర్గమునఁగలుగునది సాంసర్గికము. అభియోగప్రభవ మాభియోగికము. అధ్యాత్మభవ మాధ్యాత్మికము. ఇంద్రాముష్మికమౌ రతి ననుభవింప జేయును. ఉరస్స్వభావము లారతి నిచట ననుభవింప జేయవు. ఉపమానములతో గూడి యుండునది యౌపమానికము. విషయముల వలన గలుగునది వైషయికము. శబ్దస్పర్శరూపరసగంధభేదమున విషయము లయిదు విధము లగుటచే వైషయికరతి పంచవిధత్వము పొంది జాతానుబంధాదిసంబంధమున మరల నయిదువిధము లగును. గావున నిరువది యయిదు భేదములు కలదగును. సంప్రయోగజన్యము సాంప్రయోగికము. జాతానుబంధాది సంబంధ మిందును గలదు. అభిమానప్రభవ మాభిమానికము. ఇందు కతిపయభేదముల కతిపయలక్ష్యముల నిట్లు భావింపదగును.

సాంసర్గికభేదమున అనుబంధరతి. ఉదా;

ద్యూతే పణః ప్రణయకేలిషు కంఠపాశః
క్రీడాపరిశ్రమహరం వ్యజనం రతాంతే
శయ్యా నిశీథకలహే హరిణేక్షణాయాః
ప్రాప్తం మయా విధివశాదిదముత్తరీయం.

ఈయుత్తరీయము ద్యూతమున పందెము. ప్రణయక్రీడలలో కంఠపాశము. రతాంతమున సురతక్రీడాశ్రమ పోగొట్టు వ్యజనము. నిశీథకలహములలో నా హరిణేక్షణకు శయ్య. అదృష్టవశమున నిది సంప్రాప్తమయినది. దీనిలో నుత్తరీయసంసర్గమున రత్యనుబంధముస్పష్టము.

ఆభియోగికభేదమున జాతరతి. ఉదా,

స్తిమితవిలసితానా ముల్లసద్భ్రూలతానాం
మసృణముకులితానాం ప్రాంతవిస్తారభాజాం

ప్రతినయననిపాతే కించి దాకుంచితానాం
వివిధమహమభూవం పాత్రమాలోకితానాం.

మాలతీమాధవమున మాధవుని యనుభూతి ప్రకాశ ముందు నిరూపిత మయినది. స్తిమిత విలసితములు, ఉల్లసదూర్ధ్వలతములు, మసృణ ముకులితములు ప్రాంతవిస్తారములు, నా చూపు పడగా నాకుంచితములు నయిన చూపులకు నేను వివిధముగా పాత్రమైతిని.

ఆభియోగిక భేదమున ప్రవృద్ధరతి ఉదా,

పశ్యామి తామిత ఇతః పురతశ్చ పశ్చాత్
అంతర్బహిః పరిత ఏవ వివర్తమానాం
ఉద్బుద్ధముగ్ధకనకాబ్జనిభం వహంతీం
ఆసక్తతిర్యగపవర్తిత దృష్టి వక్త్రం.

వికసిత సుందర సువర్ణపద్మ సదృశ మయిన ప్రక్కగా త్రిప్పిన దృష్టి కల ముఖము వహించు మాలతి నిటు నటు ముందు వెనుక అంతర్బహిః అంతట చూచుచున్నాను.

ఆధ్యాత్మిక భేదమున సంప్రవృత్తరతి. ఉదా,

ఇదముపగతమేవం రూపమక్లిష్టకాంతి
ప్రథమపరిగృహీతం స్యాన్న వేత్యవ్యవస్యన్
భ్రమర ఇవ విభాతే కుందమన్తస్తుషారం
న చ ఖలు పరిభోక్తుం నైవ శక్నోమి హాతుం.

కాంతియుత మయిన యీ రూప మిట్లు ప్రాప్తము కాగానిది మొదట గృహీతమా? కాదా? నిశ్చయింప లేకున్నాను. ప్రభాత మున లోపల మంచు కల కుందపుష్పము భ్రమరము వలె ననుభవించుటకు గాని విడనాడుటకు గాని శక్తుడను కా లేకున్నాను.

ఔపమానిక భేదమున అనుబంధినీరతి. ఉదా;

త్వామాలిఖ్య ప్రణయకుపితాం ధాతురాగైశ్శిలాయా
మాత్మానం తే చరణపతితం యావదిచ్ఛామి కర్తుం

అస్రైస్తావన్ముహురుపచితైర్దృష్టిరాలుప్యతే మే
క్రూరస్తస్మిన్నపి న సహతే సంగమం నౌ కృతాంతః

ప్రణయకుపిత వయిన నిన్ను ధాతురాగములచే శిలపై లిఖించి, నన్ను నీపాదముల పడి యున్నట్లుగా నొనర్ప వలె నని తలచు నప్పుడు నా దృష్టి బాష్పములు కలదయినది. క్రూరదైవము చిత్రమున గూడ మన సంగమము సహింపదుకదా! ఇట్లు యథానురాగ మనుబంధముననున్నది.

వైషయిక భేదమున శాబ్దప్రవృద్ధరతి ఉదా,

మ్లానస్య జీవకుసుమస్య వికాసనాని
సంతర్పణాని సకలేంద్రియమోహనాని
ఆనందనాని హృదయైకరసాయనాని
దిష్ట్యా మమాప్యధిగతాని వచోమృతాని.

వాడి పోయిన జీవితకుసుమమును వికసింప జేయునవి సంతృప్తి నిచ్చునవి సకలేంద్రియములకు మోహనము లగునవి యానంద పెట్టునవి నాకును హృదయైక రసాయనము లగునవి యగు మాలతీవచోమృతము లదృష్టవశమున లభించినవి. వచోమృతము లనుట శబ్దజన్యత స్పష్టము. ప్రవృద్ధగతియు స్పష్టము.

వైషయికమున స్పర్శవిశేషమున ప్రవృద్ధరతి ఉదా,

వినిశ్చేతుం శక్యో న సుఖమితి వా దుఃఖమితి వా
ప్రమోహో నిద్రా వా కిము విషవిసర్పః కిము మదః
తవ స్పర్శే స్పర్శే మమ హి పరిమూఢేంద్రియగణో
వికారశ్చైతన్యం భ్రమయతి చ సమ్మీలయతి చ.

నీ స్పర్శస్పర్శమునను నా యింద్రియములను సమ్మూఢపరచిన యొక వికారము చైతన్యమును భ్రమింప చేయుచున్నది. సమ్మీలిత మొనరించుచున్నది. ఇది సుఖమో దుఃఖమో ప్రమోహమో నిద్రయో విషవిసర్పమో మదమో నిశ్చయింపశక్యముగ లేదు. స్పర్శకృత మైన యనురాగ ప్రవృద్ధి యిందు పరప్రకర్షముతోనున్నది.

వైషయిక భేదమున గంధసంబంధి యనువర్తిని రతి. ఉదా;

గేహాజిరేషు నవశాలి కణావపాత
గంధానుభావ సుభగేషు కృషీవలానాం
ఆనందయంతి ముసలోల్లసనావధూత
పాణిస్ఖలద్వలయపద్ధతయో వధూభ్యః

నవధాన్యకణముల పరిమలరమ్యము లయిన కృషీవలగృహ ప్రాంగణములందు ధాన్యము దంపు నప్పుడు రోకలి పట్టి విడుచు సమయమున నాఁడువారి చేతుల గలగల మను వలయపద్ధతు లానందము కలిగించు చున్నవి.

సాంప్రయోగిక భేదమున అనుబంధరతి. ఉదా,

ఉన్నమయ్య సకచగ్రహమాస్యం
చుంబతి ప్రియతమే హఠవృత్త్యా
హుం విముంచ మమ వేతి చ మందం
జల్పితం జయతి మానవతీనాం

సంప్రయోగము ప్రియసంభోగము. తజ్జన్యరతి యిందున్నది. ప్రియుడు హఠవృత్తిగా కేశగ్రహణ మొనరించి ముఖమెత్తి చుంబింపఁగా 'నాఁడి విడిచి పెట్టుము' అను మానవతుల మందజల్పితము జయతి.

ఆభిమానిక భేదమున సంపృక్తరతి. ఉదా,

ఇయం గేహే లక్ష్మీరియమమృతవర్తిర్నయనయోః
అసావస్యాః స్పర్శో వపుషి బహులశ్చందనరసః
అయం బాహుః కంఠే శిశిరమసృణో మౌక్తికసరః
కిమస్యా న ప్రేయో యది పరమసహ్యస్తు విరహః

ఈ సీత గృహమున లక్ష్మి. ఈమె నయనముల కమృతవర్తి ఈమె యీ స్పర్శ దేహమున గందపు పూఁత. ఈ చేయి కంఠమున

చల్లని నున్నని ముత్యాలపేట. ఈమె కేది ప్రియము కాదు? మరి పరమసహ్యము విరహము.

సంప్రయోగప్రయోజనమున నున్నచో రతియె ప్రీతియగును. ఇదియు నెనిమిది విధములు. ఇందు సాంప్రయోగికమునకు మారుగా ఆభ్యాసిక ముండును. ఈ యెనిమిది విధముల నున్న ప్రీతి విశేషము లును జాతానుబంధాదిసంబంధమున భేదములు కలవి కాగా బహు విభేదముల నుండును.

సైష భావో రతిర్నామ కామకల్పద్రుమాంకురః
సౌహృదాంకురకందశ్చ ద్విప్రకారోపి దర్శితః
భావాంతరేభ్యః సర్వేభ్యో రతిభావః ప్రకృష్యతే
కవివర్గః సమగ్రోపి తమేనమనుధావతి.

ఇట్లు నిరూపిత మయిన రతిభావము కామకల్పద్రుమాంకు రము. సౌహృదాంకురకందమును. ద్విప్రకార మయిన రతిభావ మిట్లు ప్రదర్శిత మయినది. సర్వభావాంతరముల కన్నను రతిభావము ప్రకృష్టము. సమగ్ర కవివర్గ మీ రతిభావ మనుధావన మొనర్చి నిరూపింప యత్నించును. రతిభావము కామకల్పవృక్షమునకు అంకుర మనుట సౌహృదాంకురమునకు కంద మనుట యిందు సంభావనీయము. ఇది యున్ననె కామసౌహృదములు ప్రకాశింప గలవు

నిసర్గసంసర్గముఖైః ప్రభేదైః
జన్మానుబంధాతిశయాదిభిశ్చ
ఇదం వినిశ్చిత్య నివేశయంతః
కవీంద్రకీర్తిం కవయో లభంతే.

కవులు కవీంద్రకీర్తి సంపాదించుట కిది యుపాయము. నైసర్గి కము సాంసర్గికము మొదలగు నెనిమిది భేదములతో జన్మ అను

బంధ - ప్రసర్గ ప్రభృతి ప్రభేదములతో నుండు నీ రతిభావమును సమ్యగ్రూపమున గుర్తించి నిశ్చయించి కవులు తమ కావ్యములందు నివేశింప జేయవలెను. అట్లొనర్చినచో "కవీంద్రకీర్తిం కవయో లభంతే"

## త్రయోదశ ప్రకాశము

### రతి ప్రకాశన ప్రకాశము

---

శృంగారప్రకాశము లోని యనంతర భాగముల నన్నిటిని సాహిత్య ప్రకాశము పేరుతో సారసంగ్రహముగా నిరూపింపవలసి వచ్చినది. పంచ దశాదులు కొన్ని ముద్రితములే కాలేదు. కొన్ని ముద్రితము లైనను అనుగతి కలుగునట్లుగా నిరూపించితిని. శృంగార ప్రకాశ గ్రంథము సాహిత్య ప్రకాశమని భోజదేవుని సంకేతము. అది యిందు కేతనమయినది. ఈ వివేచనమునకై ముందుగా విషయ ప్రకాశము నిరూపితము, ఇదిసాహిత్య ప్రకాశ పద్యా సంకేతము. అస్తు.

---

శ్రీ

# శృంగార ప్రకాశము

## సాహిత్య ప్రకాశము



ఇక నిటుపై నీ విషయముల సమీక్షా ప్రకాశమా సూత్రిత మగును ఇది కావ్యజీవితము.

౧. హార్దాదుల పంచావస్థాప్రకాశము – సంయోగ సమాశ్రయభావములు – విప్రలంభసమాశ్రయములు.

౨. రత్యాద్యాలంబనవిభావ ప్రకాశము – ఆలంబన విభావములు – నాయకభేదములు – నాయికా భేదములు – చతుర్వర్గ ఫలలాభము.

౩. ఉద్దీపన విభావ ప్రకాశనము – సప్తవిధత – చతుష్షష్టికలలు – కామాశ్రయములు – ద్యూతాశ్రయములు – శయనోపచారకములు – ఉత్తరకలలు.

౪. అనుభావ ప్రకాశనము–మనోవాగ్బుద్ధి శరీరారంభములు–శారీరాన్య భేదములు.

౫. ధర్మ శృంగారము – ధర్మ త్రివిధత – నివృత్తి ధర్మము–ధీరోదాత్తగుణములు – వర్గ త్రివిధత – సహృదయావతంసము.

౬. అర్థ శృంగార ప్రకాశనము – అర్థ త్రైవిధ్యము – ధీరోద్ధత గుణములు – జాత్యాది గుణములు – విశిష్ట గుణములు.

౭. కామ శృంగార ప్రకాశము – కామ నిర్వచనము – ద్వైవిధ్యము – సంప్రయోగము – ధీరలలితగుణములు – కావ్యదైవతము.

౮. మోక్ష శృంగారము–ధీరశాంతగుణములు – శాస్త్ర సర్వస్వము – శృంగారసారము.

౯ అనురాగ స్థాపనము – కామ శృంగార ప్రధానత అనురాగము చతుష్షష్టి ప్రకారము – ప్రతిపత్రికార మెనిమి దివిధములు – నిత్యానురాగాది స్వరూపము – భేదములు – నైమిత్తిక భేదములు.

౧౦. సామాన్యానురాగ భేదములు–విశేషానురాగ భేదములు.

౧౧. ప్రకాశము చతుర్వింశతి భేదములు–ప్రచ్ఛన్న భేదములు–అకృత్రిమ భేదములు – కృత్రిమ భేదములు – సహజవిభేదములు.

౧౨. సర్వభేద సంకలనము – ౧౨౨౮ భేదములు.

౧౩ విప్రలంభసంభోగ ప్రకాశము – సంభోగచతుష్టయము–విప్రలంభ చతుష్టయము – పూర్వము విచిత్రము – పరము రాగవర్ధనము – సంభోగద్వాదశవిధత.

౧౪ విప్రలంభోదయము – విప్రలంభనిరుక్తి – ప్రకృత్యర్థములు – ప్రత్యయార్థములు.

౧౫, ప్రథమానురాగనిర్వచనము – మానపదనిరుక్తి – ప్రవాసనిరుక్తి – కరుణనిరుక్తి – ప్రత్యయోత్పత్తికాలములు.

౧౬. సాధర్మ్య వైధర్మ్య పరీక్ష – భావజన్మాదులు – ప్రత్యక్షానురాగము – శ్రవణానురాగము – శాబ్దభేదములు – అభియోగవిధి – సంకేతవిభేదములు – అభిసరణము.

౧౭. దూతవిశేషములు – దూతకర్మలు–దూతీసంప్రేషణ పరిజ్ఞానము – ప్రథమవర్గము ౪౦ ద్వితీయవర్గము ౮.

౧౮. మానప్రకాశము – మానభేదములు – మానజాతులు మాన లక్షణములు – మానోపశాంతి – నాఖ్యములు.

౧౯. ప్రవాసవిప్రలంభము – భేదములు – మిశ్రణము–స్కంధత్రయసంబంధము – ప్రాప్తిస్కంధము – వ్యాప్తిస్కంధము–సమాప్తిస్కంధము.

౨౦. కరుణ విప్రలంభము—కరుణ నిరుక్తి—శోక కరుణభేదము. కరుణ విప్రలంభభేదములువ— పంచావస్థావిశేషములు — ముఖప్రతిముఖాదులు.

౨౧. సంభోగారంభము — సంభోగనిరుక్తి — కాలిదాసరీతి - నాగరిక సంభోగము — భుజ్ ధాత్వర్థముల సంగతి.

౨౨ ప్రథమానురాగానంతరసంభోగము - మానానంతరరీతి - మానగ్రహ నివృత్తి - ప్రవాసానంతరరీతి - తద్విధములు - కరుణ విప్రలంభానంతర సంభోగము — ప్రకృష్టత — పుష్పకేతు జీవితము.

౨౩. సంభోగావస్థాప్రకాశము —సంభోగభేదములు—అభివ్యక్తి సంకీర్ణత - అనుబంధ సంపూర్ణత, ప్రేమపాకము.

౨౪. కామసర్వస్వము—కావ్యజీవితము - శృంగార ప్రకాశము— సాహిత్యప్రకాశము - కర్ణావతంసోత్పలం.

ఈ చతుర్వింశతి విషయములు వరుసగా సంగ్రహముగా నిచట ప్రకాశితములగును.

౧. హర్షాదిప్రకాశమున వాని పంచావస్థాప్రకాశనము స్వరూప గౌరవము సంపాదించును. జన్మ - అనుబంధ - పరివృద్ధి - సంపృక్త- అనువర్తినీరూపములు పంచావస్థలు. ఆలంబనవిభావముల వలన నుత్పన్నమాత్రత - ఉత్పత్త్యనంతర ముద్దీపనములచే నుద్దీప్యమానమై సానుబంధమగుట - అనుబంధము కలుగగా సంస్కారప్రబోధమున ననుభావవ్యభిచారిభావసంసృజ్యమానమై పొందదగిన ప్రకర్ష ను పొందుట - ఆలంబనోద్దీపనానుభావసంచారు లుండగా తుల్యబలము లయిన భావాంతరములతో సంపర్క ముండుట - అసామాన్యబలము కల యనుభవాంతరమున ననభిభూతసంస్కారమున ననువృత్తమగుట- పంచావస్థల స్వరూపము.

హర్షాదిభావములు ప్రథమవర్గము - ఇవి సంయోగసమాశ్రియములు. ౨౪ కలవు హర్ష - రోమాంచ - తృప్తి - హాస-గర్వ-మద - ఉత్సాహ - మతి వితర్క - విస్మయ - భయ-త్రాస-శంక-స్తంభ - స్వేద - స్వరభేద - వేపథు - వ్రీడ - అవహిత్థ - చపలత-ఆలస్య - నిద్ర - సుప్త - ప్రబోధరూపములు.

ద్వితీయవర్గమున విప్రలంభసమాశ్రియములు ౨౪ కలవు. ఉత్కంఠ - చింత - స్మృతి - క్రోధ - అమర్ష - అసూయ - ఈర్ష్య ఉగ్రత - ఉన్మాద - వ్యాధి - గ్లాని - శ్రమ - విషాద - మోహ - శోక - దైన్య - వైవర్ణ్య - ఆవేగ - అశ్రు - ప్రసుప్తి - జాడ్య - జుగుప్స - నిర్వేద-శమరూపములు. ఇవి రతితో గూడి ౪౯ అగును. వీని కన్నిటికి జన్మాద్యవసానపంచక మున్నది. మొత్తము ౨౪౦ విధముల వీనిని భావింపవలసి యున్నవి. ఇవి యన్నియు శృంగారవ్యక్తి హేతువులు. రతివిస్మయాదికము ప్రకర్షము పొందినదై రస మగు ననుట సమంజసము కాదు. అవి ప్రకర్షసముపేతములై భావములె యగును.

౨. రత్యాద్యాలంబనవిభావప్రకాశమున విశిష్య రతిస్వరూప ప్రకాశనము తద్విభావవిశదీకరణము తద్భేదప్రతిపాదన మపేక్షితము. విభావములు రెండువిధములు. ఆలంబనవిభావములు - ఉద్దీపనవిభావము లని. ఆలంబనము ౨ విధములు నాయకుడు - నాయిక యని నాయకుడు ౪ విధములు. ధీరోదాత్త - ధీరోద్ధత - ధీరలలిత - ధీరశాంతు లని. నాయకగత ధీరత్వము భావనీయము. ఈ నలుగురు నాయకులు నాలుగు రీతుల ననుసరించి నాలుగువిధముల నగుదురు. గుణ-ప్రకృతి - ప్రవృత్తి - పరిగ్రహములు తద్రూపములు. ఇందు గుణములు ౨౪ విధములు. గుణవిశేషముల ననుసరించి నాయకులుత్తమ - మధ్యమ - అధములు నగుదురు. రెండవది యగు ప్రకృతి సాత్విక - రాజస - తామసభేదమున 3 విధములు. మూడవది యగు

ప్రివృత్తి. అనుకూల – దక్షిణ–శఠ – ధృష్టభేదమున ౪ విధములు. నాల్గవది యయిన పరిగ్రహము (ప్రియాసంఖ్య) అసాధారణ మని సాధారణ మని ౨ విధములు. ఇట్లు ౧౨ ద్వాదశ భేదభిన్న మయిన నాయక సంఖ్య ప్రధానభేదగుణనమున ౧౦౪ అగుట సమాలోచనీయము ధీరోదాత్తుడు ౨౬ ధీరోద్ధతుడు ౨౬ ధీరలలితుడు ౨౬ ధీర శాంతుడు ౨౬ మొత్తము ౧౦౪ ఈ విభాగసంఖ్య సరస్వతీకంఠాభరణమున సుజ్ఞేయము. ఈనాయకప్రపంచ మసదృశభంగి మనోహరము.

నాయిక ప్రధానముగా ౪ విధములు. స్వకీయ – పరకీయ – పునర్భూ – సామాన్య యని. ఇందు స్వకీయ పరకీయలు ఉత్తమ – మధ్యమ – కనిష్ఠభేదముల, ఊఢ – అనూఢభేదముల, ధీర – అధీర భేదముల, ముగ్ధ – మధ్య – ప్రగల్భభేదముల నుండుదు పునర్భూ ౪ విధములు అక్షత – క్షత – యాతాయాత – యాయావర యని. సామాన్యాభేదములు ౫ కలవు. ఊఢ–అనూఢ–స్వయంవర–స్వైరిణి–వేశ్యయని. వేశ్య గణిక – విలాసిని – రూపాజీవ యని ౩ విధములు. నాయికల యవాంతరభేదసంకలనమున ౧౪౩ అగును. స్వకీయానాయికలయందు ధర్మార్థ కామము లున్నవి శ్రుతిప్రవృత్తివలన ధర్మము, అపత్యలక్షణ మయిన యర్థము, విస్రంభజన్య మయిన కామము స్వకీయలందే యుండును, ఇతరవనితల యందన్నియు నుండవు.

శ్రుతిప్రవృత్తితో ధర్మః తథార్థోఽపత్యలక్షణః
ప్రాయో విస్రంభజః కామః స్వకీయాస్వేవ తిష్ఠతి

పరకీయాభేదములును ౧౪౩ కలవు. పునర్భూసామాన్యాభేదములను యథాసంభవముగా గ్రహించునది. వేరొకవిధమున నాయికా భేదముల గుర్తింప వచ్చును. నాయికలు, వాసకసజ్జిక – అభిసారిక విప్రలబ్ధ – ఖండిత – కలహాంతరిత – ప్రోషితపతిక–స్వాధీనపతికయని ౮ విధములనున్నారు. ఇట్లు బహువిధభేదములు కల యంగనల నిజ నిజ పటుభంగి భావనీయము. ఇవి నాయికా నాయకభేదప్రపంచనము

"చతుష్ప్రకారం తమముం నిబధ్నన్
కవిశ్చతుర్వర్గఫలం లభేత"

నాల్గు విధముల నీ విధాన నిబంధన మొనరించు కవి చతుర్వర్గ ఫలము పొందును. ఇది మాన్మథసర్వస్వము. ఇది యాత్మభూజీవిత ఫలము. తామసోన్యపహిత మహామకల మృగనయనల కిదిసౌఖ్యము లకు కులభవనము.

3. ఉద్దీపనవిభావప్రకాశన మనంగసంజీవనము ఆత్మసుఖాయత్తనము. శృంగారజీవనము — ఉద్దీపనోపనిషత్తు. స్మరవైజయంతి త్రిభువనవిజయపతాక. ఉద్దీపనవిభావములు ౬ విధములు. ఋతువులు — ఉపకరణములు — ఇతిహాసశ్రవణము — దేశము — కాలము — చతుష్షష్టికలలు — వయస్సు అని. వీనిలో ఋతువు లారింటికి ౪ స్థితు లున్నవి. సంధి — ఉత్పత్తి — ప్రౌఢి — అవసితి యని. ౬×౪=౨౪ భావనీయములు. ఉపకరణములు మలయానిల — అంగరాగాదులు. ఇతిహాసశ్రవణము ప్రాచీనము లగు ప్రేమకథలు వినుట—చదువుట— వ్రాయుట — దేశము ౬ విధములు. గ్రామ — పట్టణ — ఉపవన కాంతార — సరిత్—పరిత్—నాగరాదరూపములు కాలము రాత్రి — పగలు — సూర్యోదయ — చంద్రోదయాదులు. ఋతూపకరణములు— ఇతిహాసోపవర్ణనములు — దేశకాలోపసేవనము లనునవి "పుష్పధనుషః తీక్ష్ణమాయుధం"

కలలు — చతుష్షష్టి. ఈ ౬౪ మూలకళలు. వాని వర్గీకారము నాలుగు విధములు కామాశ్రయములు ౨౪ ద్యూతాశ్రయములు ౨౦. శయనోపచారికములు ౧౬. ఉత్తరకలలు ౪. మొత్తము చతుష్షష్టి యని ప్రసిద్ధి. ద్యూతాశ్రయములలో నిర్జీవములు ౫. సజీవములు కలలకు సంబంధించిన గ్రంథములలో నవాంతరకల లింకనుగలవు.

౧. కామాశ్రయకలలు ౨౪. గీత — వాదిత్ర—నృత్త — నాట్య చిత్ర—పుస్తకర్మ — పత్త్రచ్ఛేద్య—లిపిజ్ఞాన — వచనకౌశల — వైచక్షణ్య—

మాల్యవిధి - గంధయుక్తి - ఆస్వాద్యవిధాన - రంజనవిధాన - రత్న పరీక్ష - సీవ్య - ఉపకరణక్రియ - ఆజీవజ్ఞాన - తిర్యగ్యోనిచికిత్సిత - మాయాకృతి - పాషండసమయజ్ఞాన - క్రీడాకౌశల - సంవాహన - శారీరసంస్కారకౌశల రూపములు.

౨. ద్యూతాశ్రియములు ౨౦. ఇందు నిర్జీవములు ౧౫ ఆయ ప్రాప్తి - రక్షావిధాన - రూపసంఖ్య - క్రియామార్గ-జీవగ్రహణ - నయజ్ఞాన-కరణజ్ఞాన - చిత్రాచిత్రవిధి - గూఢరాశి - తుల్యాభిహార- క్షిప్రగ్రహణ - అనుప్రాప్తి - లేఖస్మృత్యనుక్రమ - ఛలవ్యామో హన - గ్రహణాదాన - రూపములు. సంజీవములు ౫. ఉపస్థానవిధి- యుద్ధవిధి తతవిధి - గతవిధి - నృత్తవిధిరూపములు.

శయనోపచారిక కలలు ౧౬. స్త్రీపురుషభావగ్రహణ-స్వరాగ ప్రకాశన - ప్రత్యంగదాన - నఖక్షతవిచార - దంతక్షతవిచార-నీవీ స్రంసన - గుహ్యస్పర్శానులోమ్య - పరమార్థకౌశల - హర్షణ - సమానార్థత - కృతార్థప్రోత్సాహన - మృదుక్రోధప్రవర్తన-క్రుద్ధ ప్రసాదన - గుహ్యాగూహన - రూపములు.

ఉత్తరకలలు ౪. సాశ్రుపాతం రమణస్య వీక్షణం - స్వయం శపథక్రియా - ప్రస్థితానుగమనం - పునర్నిరీక్షణం'' అనునవి.

ఏడవది యగు వయస్సులో ౪. అవస్థలుకలవు. సంధి-ఉత్పత్తి ప్రౌఢి - అతిప్రౌఢియని. వయస్యోపదేశ - సందేశ-ఉపచార - దైవ సంపత్ - ఉపచారస్మరణము లాయోజ్యములు

సంజీవనమనంగస్య సుఖాయతనమాత్మనః
ఋత్వాదీనామియం భంగిః శృంగారస్యాపి జీవకం.
ఉపనిషదుపదిష్టా సేయముద్దీపనానాం
త్రిభువనవిజయాప్త్యై వైజయంతీ స్మరస్య

ఇట్టి యీ యుద్దీపనప్రకాశ మత్యంతము సంభావనీయము.

౪. అనుభావప్రకాశము రసానుభూతి వివేక సూచకము "మనోవాగ్బుద్ధిశరీరారంభా అనుభావాః". అనుభావములు నాలుగు విధములు - మానసారంభములు - వాగారంభములు - బుద్ధ్యారంభములు. శరీరారంభములునని, మన ఆరంభానుభావములు ౧౨ భావ-హావ - హేల - శోభ-కాంతి-ఉద్దీప్తి- మాధుర్య - ధైర్యప్రాగల్భ్య-ఔదార్య - స్థైర్య - గాంభీర్య రూపములు. వాగారంభములు ౧౨ ఆలాప-ప్రలాప-విలాస - అనులాప-సంలాప - అపలాప-సందేశ-అతిదేశ-నిర్దేశ-ఉపదేశ-అపదేశ - వ్యపదేశ రూపములు. బుద్ధ్యారంభములు రీతి వృత్తి ప్రవృత్త్యాశ్రియములుగా ౧౨ విధములనున్నవి. రీత్యాశ్రియములు ౪ పాంచాలి - గౌడి - వైదర్భి-లాటీయములు. వృత్త్యారంభములు ౪. భారతి - ఆరభటి - కైశికి - సాత్వతి యని ప్రవృత్త్యాశ్రియములు ౪. పౌరస్త్య - ఔఢ్రమాగధి-దాక్షిణాత్య-ఆవంత్య రూపములు శరీరారంభానుభావములు ౧౨ లీల - విలాస-విచ్ఛిత్తి-విభ్రమ - కిలికించిత - మోట్టాయిత - కుట్టమిత - బిబ్బోక-లలిత-విహృతి - క్రీడిత - కేళిరూపములు,

శారీరారంభానుభావములలో నింకను భేదములు కలవు. అధర కణ్ఠాదుల గూడి యివి యనేకరీతుల నుండును అధరారంభములు ౪. విసర్గ-వినిగూహన-సందష్టక-సముద్గమరూపములు. కపోలారంభములు క్షామఫుల్లాదులు ౪. హాసారంభములు స్మితహసితాదులు ౬. ఉత్క్షేప పాతనాదులు భ్రూకర్మారంభములు. భ్రమవలనాదులు తారాకర్మారంభములు. ఉన్మేషనిమేషాదులు అక్షిపుట కర్మారంభములు సమ సాచి ప్రభృతులు దృష్టి ప్రకారారంభములు. ఇంకను ౩౬ దృష్టి విశేషములు కలవు.

విభావములచే ప్రబుద్ధసంస్కారులైన నాయకాదులకు స్మృతి - ఇచ్ఛ - ద్వేష - ప్రయత్న సంజాతము లయిన మనోవాగ్బుద్ధిశరీరా

రంభము లగునవి అనుభూయమానము లగుట వలన, రత్యాద్యనంతర సమయ సముత్పన్నము లయి సందున అనుభావము లనదగి యున్నవి. ఇట్టి వన్నియు కావ్యక్రియోపకరణార్థ మవశ్యగ్రాహ్యములు.

> భావాః సంచారిణో యే చ స్థాయినో యే చ సాత్త్వికాః
> సవిభావానుభావా స్తే శృంగారస్య ప్రకాశకాః
> ప్రకృతిజమతోఽభిమానసంజ్ఞం సమమనుభావవిభావవర్గః
> స్వమవసరము పేయివానుపా స్తే, నృపతిమివాధికృతేషు నీతివర్గః.

సంచారులు స్థాయిభావములు సాత్త్వికములు విభావము లనుభావము లు శృంగారమునకు ప్రకాశములు అనుభావవిభావవర్గము సర్వము అభిమానసంజ్ఞకల ప్రకృతిజన్య మయిన తత్త్వమును స్వావసరమున సంగతమై యుపాసించును. అధికృతుల సమూహమున నీతివర్గము నృపతిని సేవించువిధమున నీవిభావాదివర్గ మభిమాన నుపాసించును.

౫. ధర్మశృంగారము పురుషార్థశృంగారములలో మొదటిది. ఇట్లె అర్థ శృంగారము కామశృంగారము మోక్షశృంగారము భావనీయము. శ్రుతిస్మృతివిహితాచారము ధర్మము. ఈ ధర్మము మూడు విధములు. ప్రవృత్తిధర్మము - నివృత్తిధర్మము - నియమధర్మము అని వీనిలో ప్రవృత్తిధర్మము మూడు విధములు. అవాంతరభేదము లతో ౧౦ విధములు. వాక్ప్రవృత్తి, హిత - ప్రియ - సత్య-ఆప్తభేదమున చతుర్విధము, మనఃప్రవృత్తి, ఆస్తిక్య - దయా - పరస్వానీప్స భేదమున త్రివిధము. కాయప్రవృత్తి గురూపాసన-దాన-ఆర్త త్రాణ భేదమున త్రివిధము కాగా వీని సంకలనమున ప్రవృత్తిధర్మము పద విధము లయినది. నివృత్తి ధర్మమును పదివిధములు నృశంసత - పరస్వాదాన - నిషిద్ధసేవన - స్తేయ - హింసాదుల నుండి నివృత్తి పొందుట. నియమధర్మము వాఙ్మనః క్రియాదులచే ౧౦. విధములు.

నిమిత్తనైమిత్తికాత్యాగము. స్వజాతిధర్మావిచలనము - సదృశసంబంధము - లోకాగమవిరుద్ధాసంసర్గము - న్యాయతోర్థాధిగమము - గుర్వాజ్ఞానతిక్రమము - అప్రార్థనాభంగము - ప్రతిజ్ఞానిర్వాహము - సమరాదపలాయనము - గోబ్రాహ్మణులకై ప్రాణాదిపరిత్యాగము. ధర్మశృంగారమున నాయిక స్వకీయ నాయకుడు ధీరోదాత్తుడు. ధీరోదాత్తుని లోని ధీరత్వ మనునది.

"ఇంద్రియావికారకారణం చిత్తధర్మః"

ధీరోదాత్తగుణములు ౫౦ కలవు. వీనిలో మొదటి వర్గమున ౧౬. గుణములున్నవి.

అభ్యుదయాదిభిరనుత్సేకః - శోకాదిభిరవైక్లవ్యం
వ్యసనాదిభిః దీనత్వం - రాగాదిభిస్తు ధర్మబాధా
చకితేషు ఉత్తమస్పర్ధా - నీచేష్వర్థేషు జుగుప్సా
శక్తిసద్భావే క్షాంతిః - ప్రమాదస్ఖలితేషు అనుశయః
సదాచారేషు ఆదరః - పరగుణేషు అమాత్సర్యం
పరవ్యసనేషు న ప్రహర్షః - పరాపవాదేషు న ప్రవృత్తిః
అస్థానేషు న క్రోధః - ప్రారంభేషు న అనిర్వాహః
కర్మాతిశయైః న విస్మయః - జాత్యాదిభిః న అభిమానః

రెండవవర్గమున ౮ గుణము లున్నవి. శీల - దాక్షిణ్య - స్థైర్య - గాంభీర్య - ప్రాగల్భ్య - శోభ - కృతజ్ఞత - అవికత్థనత, యనునవి. మూడవవర్గమున ౨౬ గుణములున్నవి. అనుకూలము లందాసక్తి - అనవగీతము లందు ప్రీతి - ఉత్తములందుత్కంఠ - ధర్మార్థకామ చింత - ఉత్తరపక్షమతి - అవ్యాహతక్రమస్మృతి - తత్త్వానుపాతి వితర్కము - ఫలానుసారి శంక - వివిక్తనిద్ర - నిశీథస్వాపము - అపరరాత్రిప్రబోధము - స్వశ్లాఘాది వ్రీడ - సర్వతాత్రవహితత - సంభవాధిక్యమున ధృతి - పరార్థసిద్ధిలో హర్షము - పరాపదానమున రోమాంచము - స్మితమాత్రహాసము - మహారంభము లందుత్సాహము -

వ్రితాతిశయాదులలో గ్లాని-స్వశక్తి దర్పణమున క్రోధము-మహాదుఃఖములలో శోకము-దుఃఖాధిక్యమున బాష్పము- ప్రారంభాతిరేకమున స్వేదము - ఆయాసాతిశయమున శ్రమ - మహాప్రహారాదులలో మూర్ఛ-గర్వాది హేతువులున్నను గర్వాదులు లేకుండుట - ఇట్టి యీ ధర్మశృంగారప్రకాశము ధర్మద్రుమ బాలపల్లవోచ్చయము. శ్రుతిమార్గగోచరమగు నిది సహృదయధర్ముల కవతంసమగును.

౬ అర్థశృంగారప్రకాశ మనంతర ప్రాప్తము. "ఆత్మనః సుఖసాధనానాం కలత్రమిత్రాదీనాం అర్జనం అర్థః" తనకు సుఖసాధనము లయిన కలత్రమిత్రాదుల నార్జించుట యర్థ మనదగును. అర్థము మూడు విధములు. నవము = స్వయంసంపాదితము - భూతపూర్వము పరిణష్టానీతము - పిత్ర్యము కులక్రమాగతము - ఇందు,

నవము ౧౦ విధములు. విద్య - భూమి-పశు-ధాన్య-హిరణ్య-భాండ - ఉపస్కార - కలత్ర - పుత్ర - మిత్ర రూపములు. భూతపూర్వము పిత్ర్యము రెండును ఎనిమిది ఎనిమిది భేదములతోనున్నవి. ఇవి నవభేదములతో సమానములు.

అర్జనము ౪ విధములు. అలబ్ధలాభ-లబ్ధపరిరక్షణ-రక్షిత వివర్ధన రక్షితోపయోగరూపములు, అర్జన ప్రయోజనములు ౧౦ కలవు వినయ - వార్త - వ్యవహార - రక్ష-మంత్ర - ఉపాయ-విక్రమ-యుద్ధ - ఉపనిషత్ - ప్రశమరూపములు. ఇవి యర్థశాస్త్రవిభాగములు. ఇట్లార్జించిన యర్థము ధర్మకామమోక్షముల కుపకరించునది కావలెను.

"ప్రవృత్తౌ తదవాప్త్యభిమానః అర్థశృంగారః"

"ప్రవృత్తిలో దాని సంపాదింపవలె నన్న యభిమాన మర్థశృంగారము. ఇందు నాయకుడు ధీరోద్ధతుడు. రీతి వృత్తి ప్రవృత్తి పరిగ్రహముల ననుసరించిన ధీరోద్ధతుని గుణములు ౪౪ విధముల నుండును.

ధైర్య ముద్ధతము – అభ్యుదయాదులచే నుత్సేకము – శోకాదులచే వైక్లబ్యము – వ్యసనాదులచే దీనత్వము – రాగాదులచే ధర్మబాధ – చకితులయం దసదృశస్పర్ధ – నీచార్థములందు సజుగుప్స – అశక్తిలో నక్షాంతి–స్ఖలితులం దనుశయము లేమి–సదాచారములం దనాదరము – పరగుణములందు మాత్సర్యము – పరవ్యసనములందు ప్రహర్షము – పరాపవాదములందు ప్రీతి–ఆస్థానములందు క్రోధము–ప్రారబ్ధములం దనిర్వాహము – కర్మాతిశయములచే విస్మయము – స్వజాత్యాదులచే నభిమానము.

జాత్యాదిగుణములు ౨౪ కలవు. జాతి – అన్వయ – అభిజన–నివాస–ఆస్పద–పద–పిత–శాస్త్ర–వాగ్మిత – కలావైదగ్ధ్య–చాతుర్య – రూపసంపద – సౌభాగ్య – త్యాగ – శౌర్య – అదీన వాక్యత – శక్తి దక్షత మొదలగునవి

ఔద్ధత్యమునకు సంబంధించిన విశిష్టగుణములు ౮ యున్నవి. మాన – తేజ – శౌండీర్య – విలాస – వికత్థన–అస్థిరత్వ–అగంభీరత – సాహస–రూపములు ధీరోద్ధతులు మూడువిధములనుందురు. ఉత్తమ–మధ్యమ–కనిష్ఠు లని. అర్థశృంగారసంశ్రయ మైన ధీరోద్ధతవృత్తము సర్వలోకప్రసిద్ధము. విద్యాద్యుపాయములచే నార్జిత మయిన అర్థమును నాయకు డభిమానహృదయమున శృంగారతంత్రమున విని యోగించుట అర్థ శృంగారము

౭. కామశృంగారము శృంగార సర్వస్వముగా కీర్తిత మైనది. వాత్స్యాయనకామసూత్రము తద్వ్యాఖ్యాన మైన జయమంగలవృత్తి కామ శృంగారనిరూపణమున సహకారులు

"కామో నామ ఆత్మనః సుఖాభిమానః విశేషగుణః"

కామ మనునది తన సుఖాభిమానాత్మక మైన విశేషగుణము. కామము సామాన్యరూప మని విశేషరూప మని రెండు విధములు. మొదటిది పంచేంద్రియములకు మనస్సున కానందప్రదము. రెండవది

మధురహృదయానుభూతికి నిదానము, ప్రధాన మప్రధాన మని వైశేషికరూపము రెండువిధములు. మొదటిది స్త్రీస్పర్శసుఖానుభూతి. రెండవది స్త్రీసౌందర్యభావనారూపము కామము సరసమనుము లందును "సుఖాభిమానవతీ ఇంద్రియప్రవృత్తిః" కావున వసంతోపకరము లయిన యనుభూతులును కామశబ్దవాచ్యములె. కామభేదములు ౭ కలవు. విశేషసంప్రయోగము–తత్సంప్రత్యయము–సంస్కారము – స్మరణము – అభిలాషము – మనఃప్రవృత్తి – సంకల్పము నని

సంప్రయోగము ౨ విధములు అంగసంప్రయోగము (పుష్పాదులు) - అధిష్ఠానసంప్రయోగము (స్త్రీ) అని ఈ యధిష్ఠానసంప్రయోగము. రెండువిధములు బాహ్యము (సంయోగము) - అభ్యంతరము (రతము) అని. కామశృంగారమున ధీరలలితుడు నాయకుడు. ధీరలలిత విశేషములు ౪౪ కలవు. ధీరలలితుని లాలిత్య ప్రకాశని చిత్తమును చేష్టల ననుబంధించి యుండును. నానావిధగుణ సంబంధమున ధీరలలితు డుత్తముడు మధ్యముడు కనిష్ఠుడు నగును. ఏకోనపంచాశద్భావము లీ యుత్తమాదులకు సంబంధించియుండును. ధీరలలితగుణములు రెండు వర్గములుగా నున్నవి. మొదటివర్గమున ౧౫ విశేషములు. అభ్యుదయాది ప్రమోదము–శోకాది వైక్లవ్యము – వ్యసనాది దీనత్వము –విలాసవ్యసనాభినివేశము –విషయాత్యాసంగము– ధర్మార్థానాదరము –అనర్థజన సంసర్గము – హాసప్రవృత్తి– శరీరానాస్థ – సర్వనాశనమునను అననుశయము – సులభావమానము – దుర్లభాకాంక్ష – స్వవర్ణనోత్కర్ష – చాటూక్తి ప్రాగల్భ్యము–జాత్యాద్యభిమానము – అనునవి. విశేషగుణములు ౮ కలవు. సువేషత – సంప్రియత – యౌవనము – స్థూలలక్షత – ప్రియంవదత్వము – లాలిత్యము - మాధుర్యము – దృఢభక్తిత యనునవి.

స ఏవం కామశృంగారః తదేతత్కావ్యదైవతం
తదేతద్విశ్వసర్వస్వం తదేతజ్జన్మనః ఫలం.

కామశృంగారము కావ్యదైవతము విశ్వసర్వస్వము. జన్మ ఫలము. జన్మాంతరానుభవ సంస్కారమున సుఖార్థమై యింద్రియ సంప్రయోగములచే సంపన్నమగు నూతనానుభవము స్వాత్మాభిలషితఫలము సర్వవిస్మరణస్వభావము కామము ఈ కామశృంగారమె శృంగారసర్వస్వము.

మోక్షశృంగారము పురుషార్థశృంగారములలో చివరిది తత్త్వజ్ఞానాదులచే నిశ్శ్రేయసము కాంక్షించు వానికి గార్హస్థ్యమున గూడ తదభిగమాభిమానము మోక్షశృంగారమగును. యోగ్యచిత్తము కల వాని యభిమానము మోక్షశృంగారము. ఆ యభిమానము నివృత్తము కాగా నభిమాన ముండదు గావున మోక్షము సిద్ధమగును. మోక్షశృంగారమున నాయిక స్వకీయ నాయకుడు ధీరశాంతుడు. ధీరశాంతనాయక గుణము లీ విధమున నున్నవి. సుఖదుఃఖయోర్మాధ్యస్థ్యం - వ్యసనోత్సవయోః అవిశేషః - ఇంద్రియార్థేషు అనాస్థా-విలాసేషు ఉపహాసః - శరీరాదౌ అనాత్మబుద్ధిః-ప్రశంసాసు న ఉత్కర్షః - నిందాస్వపి న కోపః - భవ్యప్రాణిషు పరిమోదః - సర్వభూతేషు అనుకంపా-సాధుజనేషు మైత్రీ-అధార్మికేషు ఉపేక్షా-సదాచారేషు ఆదరః-సర్వమరక్షసు ఫలానీప్సా - రాగాదిభిః న ధర్మబాధా - కర్మాతిశయైః అవిస్మయః-జాత్యాదిభిః న అభిమానః - ఈ ౧౬ సామాన్యగుణములు. విశేషగుణము లెనిమిది కలవు. క్షమ వశిత్వము - సంతోషము - పరిశ్రమము - శౌచము-ఆర్జవము-వైశారద్యము-వైరాగ్యము నని.

ఇట్లు మనసిశయమహాస్త్రము శాస్త్రసర్వస్వము నిరుపమరమణీయము శృంగారసారము నిరూపిత మయినది

౯. అనురాగస్థాపనము

ఈ విశ్వములో ద్వితీయాశ్రమము సకలసత్త్వోపకారక్షమము. ఆ యాశ్రమమున నివసించు సకలవర్ణముల వారును ఉభయలోక

సిద్ధమై ధర్మార్థకామలక్షణ మైన త్రివర్గ మను పురుషార్థము సేవింతురు. అందును ధర్మార్థశృంగారములకు హేతు వయి నందున ఫలభూత మై నందునను కామశృంగారమె ప్రధానము. సామాన్యరూప మైనను విశేషరూప మైనను కామము సుఖాత్మకము. కామము నను రాగ మందురు. అది యభిలాషాదిభేదమున చతుష్షష్టి ప్రకార మనిరి:

| | | | |
|---|---|---|---|
| అభిలాషము | ఆకాంక్ష | అపేక్ష | ఉత్కంఠ |
| ఈప్స | లిప్స | ఇచ్ఛ | వాంఛ |
| తృష | లాలస | స్పృహా | లౌల్యము |
| గర్థ | శ్రద్ధ | రుచి | దోహదము |
| ఆశ | ఆశీః | ఆశంస | మనోరథము |
| ఆస్థ | అభినివేశము | అనుబంధము | ఆగ్రహము |
| విమర్శ | మనీష | అభిప్రాయ | పక్షపాత |
| లోభ | ఆసంగ | అభిష్వంగ | సక్తి |
| మోహ | ఆకూత | కుతూహల | విస్మయ |
| రాగ | వేగ | అధ్యవసాయ | వ్యవసాయ |
| కామన | వాసన | స్మరణ | సంకల్ప |
| రతి | ప్రీతి | దాక్షిణ్య | అనుగ్రహ |
| వాత్సల్య | అనుక్రోశ | విశ్వాస | విస్రంభ |
| భావ | రాగ | వశీకార | ప్రణయ |
| ప్రాప్తి | పర్యాప్తి | సమాప్తి | అభిమానాప్తి |
| స్నేహ | ప్రేమ | ఆహ్లాద | నిర్వృతులు |

ఈ యనురాగము చతుష్షష్టిప్రకార మయినను ప్రతిప్రకార మెనిమిది విధము లగును.

| | |
|---|---|
| నిత్యానురాగ | నైమిత్తికానురాగ |
| సామాన్య | విశేషానురాగ |
| ప్రకాశానురాగ | ప్రచ్ఛన్నానురాగ |
| అకృత్రిమానురాగ | కృత్రిమానురాగ |

వానిలో

౧. కాలాదికారణవిశేషానపేక్షము నిత్యము
౨. కాలాదికారణవిశేషసాపేక్షము నైమిత్తికము
3. జాతివిషయము సామాన్యము
౪. వ్యక్తివిషయము విశేషము
౫. స్వాంగనాదిగోచరము ప్రకాశము
౬. పరాంగనాదివిషయము పరిచ్ఛన్నము
౭. ప్రయోజననిరపేక్షము అకృత్రిమము
౮. తద్విపరీతము ప్రయత్ననిర్వర్త్యము కృత్రిమము

౧ ఇందు నిత్యానురాగము, విషయ - ఆశ్రయ-ఆలంబన - ఉద్దీపన - స్థాన - సంస్థాన - రూప-స్వరూపము లను వానికి ప్రత్యేకముగా త్రైవిధ్యము వలన చతుర్వింశతిభేదములు కలుగును. అందు, ఎవరియం దనురాగము కలుగునో వారు విషయము. ఎవరి కనురాగము కలుగునో వా రాశ్రయము. దేని నవలంబించి యుండునో యది యాలంబనము ఏది యుద్దీపింప జేయునో యది యుద్దీపనము. ఎందుండునో యది స్థానము. దేనిచే సుశ్లిష్టమగునో యది సంస్థానము, దేనిచే శోభించునో యది రూపము దేనిచే నిరూపిత మగునో యది స్వరూపము వీనిలో,

| | | | |
|---|---|---|---|
| ౧. విషయానురాగము, | ఉచ్చము | నిమ్నము | సమము |
| ౨. ఆశ్రయానురాగము, | ఉత్తమ | మధ్యమము | కనీయాన్ |
| 3. ఆలంబనానురాగము, | శీఘ్ర | మధ్యమ | చిర |
| ౪. ఉద్దీపనానురాగము, | మృదు | మధ్య | చండ |
| ౫. స్థానానురాగము, | సదృశ | విసదృశ | అసదృశ |
| ౬. సంస్థానానురాగము, | సమ్యక్ | మధ్య | అతిశాయి |
| ౭. రూపానురాగము, | చారు | అచారు | ఉభయాత్మ |
| ౮. స్వరూపానురాగము, | గంభీర | ఉత్కట | ప్రకట |

భేదములతో నుండును. ఉచ్చజాతిలో గలుగునది యుచ్చము నిమ్నజాతిలో నిమ్నము, సమజాతిలో సమము స్త్రీపురుషులకు పరస్పరానురాగమున్న ఉత్తమము వనితానురాగమున్న మధ్యమము పురుషానురాగమున్న కనీయాన్. ప్రకృతివశమున జను నందు శీఘ్రకాల మవలంబించిన శీఘ్రము మధ్యకాలాలంబనము మధ్యమము చిరకాలాలంబనము చిరము. రాగానుగుణ్యమున మృదూపక్రమము మృదువు. మధ్యోపక్రమము మధ్యము. చండోపక్రమము చండము, గుణాధిక పురుషునందు గాని వనితయందు గాని సముత్పన్న మగునది సదృశము తద్విపరీతము విసదృశము. గుణము లోకనికి అధికముగానున్న నితరుస కల్పముగా నున్న నసదృశము. పరస్పర మనురాగసామ్యమున్న సమక్ ఒకరికి ప్రాతికూల్యమున్న మిధ్య. ఒకరి కతిశయాధిక్యమున్న అతిశాయి. వయోరూపజాత్యాదులకు పరభాగ మున్న చారువు. విపర్యయమున్న నచారువు. గుణదోషములున్న నుభయాత్మకము. అప్రకాశ మగునది గభీరము. అంతగా ప్రకాశము కానిది యను త్కటము. అతిప్రకాశము ప్రకటము.

౨ నైమిత్తికానురాగమును ఇరువదినాలుగు విధములు. కాల సమయ వేల ఉపాధిసాధనసమావేశదేశప్రకీర్ణకములు మూడువిధములు కాగా ౨౪ భేదములు కలుగును, వానిలో,

౧. కాలము హేమంత వసంత వర్షాదికము. తన్నిమిత్తముగా హైమంతికము వాసంతికము వార్షికమునని మూడు విధములు

౨. సమయము ప్రవాసారంభ ప్రత్యాగమ ప్రథమసంగమాదికము. తన్నిమిత్తముగా ప్రావాసికము ప్రాత్యాగమికము ప్రాథమ సంగికము నని త్రివిధము.

3. వేల. ప్రదోష నిశీథ ప్రభాత రూపము. తన్నిమిత్తముగా ప్రాదోషికము నైశీథము ప్రాభాతిక మని త్రివిధము.

౪. ఉపాధి తమస్సు చంద్రోదయ జ్యోత్స్న తన్నిమిత్తముగా తామసము చాంద్రోదయము జ్యౌత్స్న మని త్రివిధము

౫. సాధనము స్నానము విలేపనము మాల్యము తన్నిమిత్తముగా స్నానీయము విలేపనీయము మాల్యీయ మని త్రివిధము

౬. సమావేశము. ఉపసరము ప్రాసాదము మదము. తన్నిమిత్తముగా ఔపసరము ప్రాసాదికము మదజము నని త్రివిధము.

౭. దేశము. వివిక్తము గహనము సేవ్యము. తన్నిమిత్తముగా వివిక్తనిమిత్తము గహననిమిత్తము సేవ్యనిమిత్త మని త్రివిధము.

౮. ప్రకీర్ణకము. గీతము ఉత్సవము చూతాదులు. తన్నిమిత్తముగా గీతనిమిత్తము ఔత్సవము చూతాదినిమిత్త మని త్రివిధము.

౧౦. ౩. సామాన్యానురాగమును చతుర్వింశతి ప్రకారము

| | | | |
|---|---|---|---|
| ద్రవ్యగోచర | గుణగోచర | కర్మగోచర | సంక్షిప్త |
| విక్షిప్త | సమస్త | వ్యస్త | శుద్ధ |
| సంకీర్ణ | సాధర్మ్యకృత | వైధర్మ్యకృత | మహావిషయ |
| అల్పవిషయ | దేశహేతు | కాలహేతు | ధర్మవిషయ |
| అధర్మవిషయః | సమయజన్మ | సంబంధజన్మ | ప్రాకృత |
| వైకృత | వయఃకృత | వైదగ్ధ్యకృత | సౌభాగ్యకృత |

౪. విశేషానురాగమును చతుర్వింశతి ప్రకారము

| | | | |
|---|---|---|---|
| జాతికృత | క్రియాకృత | గుణకృత | ద్రవ్యకృత |
| సాధారణ | అసాధారణ | ప్రతీయమాన | అభిధీయమాన |
| బాహ్య | అభ్యంతర | సదృశ | అసదృశ |
| స్వప్రకాశ | అన్యాభిభావి | ఉల్లేఖవాన్ | అనుల్లేఖవాన్ |
| అతిరిక్త | అనతిరిక్త | నైసర్గిక | సాంసర్గిక |
| స్వసంమత | స్తోకసమ్మత | బహుసమ్మత | సర్వసమ్మత |

౧౧. ౫. ప్రకాశానురాగము చతుర్వింశతి ప్రకారము.

| | | | |
|---|---|---|---|
| స్వకీయావిషయ | స్వయంవరా | కన్యావిషయ | పునర్భూ |
| వేశ్యావిషయ | సామాన్యోఢా | నవోఢా | ప్రౌఢా |
| స్వాధీనభర్తృకా | ప్రోషితపతికా | విరహోత్కంఠితా | కలహాంతరితా |
| ఖండితా | వాసకసజ్జా | ఏకచారిణీ | సపత్నీవిషయ |
| జ్యేష్ఠా | కనిష్ఠా | సుభగా | శుద్ధాంతచారిణీ |
| ధర్మానుబంధ | అర్థానుబంధ | కామానుబంధ | నిరనుబంధ |

౬. ప్రచ్ఛన్నానురాగము చతుర్వింశతి ప్రకారము.

| | | | |
|---|---|---|---|
| పరాంగనావిషయ | స్వాంగనా | స్వైరిణీ | కుమారీవిషయ |
| ధీరావిషయ | అధీరా | ప్రవృద్ధా | అభిసారికా |
| సులభ | దుర్లభ | సన్నికృష్ట | విప్రకృష్ట |
| సంబద్ధ | అసంబద్ధ | సాపదేశ | నిరపదేశ |
| భయనిమిత్త | లజ్జానిమిత్త | దేశనియత | కాలనియత |
| నాగర | ఉపనాగర | గ్రామ్య | ప్రకీర్ణ |

౭. అకృత్రిమానురాగము చతుర్వింశతివిధము. సహజ యౌవనజ ఆహార్యజ విస్రంభజము లను ననురాగముల భేదములకు, ఉపభేదములు ప్రభేదములు సంభేదములు విభేదములను వాని సంకలనమున నిరువది నాలుగు భేదములు గలుగును. సహజాదులు నాలుగు భేదములు.

౧. జన్మాంతరానుభవజన్మము నిష్కారణ ప్రవృత్తము ప్రకర్ష గామి యగునది సహజము. ఇది యుపభేదమున రెండు విధములు. ఏకవిషయ మనేకవిషయ మని.

౨. తారుణ్యోద్రేకమున శరీరధాతువు లుపచీయమానములు కాగా దర్పాతిరేకమున గలుగునది యౌవనజ మయిన యకృత్రిమానురాగము. ఇదియు నుపభేదమున ద్వివిధము. శరీరము మాన

౩. చక్షుఃప్రీతి కలిగినంత మాత్రమున నుపచారములచే ప్రకర్షము పొందునది యాహార్యము. ఇదియు స్థిరము భంగురము నని రెండు విధములు.

౪. కాలక్రమమున విశ్వాసము ప్రరూఢము కాగా ప్రకర్షము పొందినదై యుపచారముల నాదరింపని యనురాగము విస్రంభజము, ఇదియు ముగ్ధము ప్రగల్భ మని ద్వివిధము.

ఇప్పటి కివి పండ్రెండు భేదములు. భేదరూపముల ప్రభేదానుసారమున నారు విధములు కలుగును.

సహజయౌవనజము సహజాహార్యజము సహజవిస్రంభజము
యౌవనాహార్యజము యౌవనజవిస్రంభజము అహార్యవిస్రంభజము

ఇప్పటి కివి యష్టాదశభేదములు. భేదరూపముల సంభేదానుసారమున నాలుగు భేదములు కలుగును.

నిస్సహజ నిర్యౌవనజ నిరాహార్యజ నిర్విస్రంభజములు వీనితో నిరువది రెండు భేదము లయినవి. భేదరూపముల విభేదానుసారమున రెండు భేదములు కలుగును.

సహజాది సమూహజము సహజాదివిపర్యయజము మొత్తమివియు నిరువది నాలుగు విధములు.

౫. కృత్రిమానురాగము పూర్వము లేకున్నను కార్యనిమిత్తముగా నుపాయములతో ప్రవృత్తమగునది. ఇదియు చతుర్వింశతి ప్రకారము.

నిత్యానుకారి నైమిత్తికానుకారి సామాన్యానుకారి విశేషానుకారి
ప్రకాశానుకారి ప్రచ్ఛన్నానుకారి సహజానుకారి
యౌవనజానుకారి ఆహార్యానుకారి విస్రంభానుకారి సాలంబనము
నిరాలంబనము ప్రసిద్ధవిషయ అప్రసిద్ధవిషయ సుప్రయుక్త
దుష్ప్రయుక్త సప్రయోజన అన్యప్రయోజన సప్రతిభేద
నిష్ప్రతిభేద స్త్రీకృత పురుషకృత ఉభయకృత అనుభయకృత

౧౨ ఈయనురాగభేదము లక్ష్యము సర్వభేదసంకలనమున "ద్వాదశైవం సహస్రాణి సాష్టాశీతిశతద్వయా" పండ్రెండువేల రెండు వందల యెనుబది యెనిమిది ౧౨౨౮౮ యగును. ఇంకను వీని సంబంధమున సామ్యాధిక్యాల్పతాకృతము ఏకద్విత్ర్యాదియోగకృతమైన భేదావధి గణింప శక్యము కాదు. ఈ చెప్పినవి కామశృంగారమున మూలప్రకృతులు. వీనిని పరిశీలించి సమీక్షించి శ్రోత్రనుగుణముగా ననురాగవ్యతికరము నిబంధింప వలెను. ఇది అనురాగస్థాపనము.

౧౩ శృంగార మవస్థాద్వైతభేదమున ద్విప్రకారము. సంభోగశృంగారము విప్రలంభశృంగారము నని. అభిలషణీయము లగు నాలింగనాదులు సంప్రాప్తము లయినచో సంభోగ శృంగారము. ఇది నాలుగు విధములు

ప్రథమానురాగానంతరము మానానంతరము
ప్రవాసానంతరశృంగారము కరుణానంతరము

అభిలషణీయాలింగనాదులు సంప్రాప్తములు కాకున్నచో విప్రలంభశృంగార మగును. ఇదియు నాలుగు విధములు.

ప్రథమానురాగవిప్రలంభము మానవిప్రలంభము
ప్రవాసవిప్రలంభము కరుణవిప్రలంభము

౧. విప్రలంభానంతర సంభోగమునందు సుఖవిశేషానుభూతి యున్నది. స్త్రీపురుషులకు పరస్పరము ప్రథమదర్శన ప్రథమశ్రవణాదుల వలన గలుగు మనః పక్షపాతవిశేషము ప్రథమానురాగవిప్రలంభ మగును. ఈ విప్రలంభము వారి వారి రూపగుణవయస్సంపదుపకారాపేక్షము తదనపేక్షము నగును. సాతిశయమై యీ విప్రలంభ మగును. ఇట్టి విప్రలంభము కలుగగా వారలకే ప్రథమసంగమాదులలో నభిలషణీయాలింగనాదిలాభ మున్నచో ప్రథమానురాగానంతరసంభోగ మగును.

౨. మానవిప్రలంభము మానానంతరసంభోగము నిరూపించు గ్రంథము లుప్తమయినది. ఇందలి విశేషమును నా రచిత భావ ప్రకాశమున జూడ దగును.

3. అనురాగ ముదయించిన యనంతరము నాయికా నాయకు లకు దైవదుర్విపాకాదుల వలన గలిగిన విదూరదేశవాసము ప్రవాస విప్రలంభము. ఆ విప్రలంభ మభివృద్ధిపొందగా ఉత్కంఠాతిశయము కల వారలకు మరల సమాగమమున అభిలాషాదులు కలుగుట ప్రవా సానంతర సంభోగము.

౪. రాగాతిశయము కల స్త్రీ పురుషులలో నొకరు గతిం పగా నితరవ్యక్తికి గలుగు హృదయదారణ మయిన దుఃఖాతిరేకము కరుణవిప్రలంభము. వారల కదృష్టవిశేషాదిసంపదచే తదున్మజ్జన ముచే గలిగిన గతించిన వారి సముజ్జీవనమున గలిగిన సవిశేషమగు మనః ప్రమోదాతిశయము కరుణానంతరసంభోగము.

ప్రథమానురాగాది విప్రలంభములకు తదనంతరాత్మకము లైన సంభోగములకు నాల్గింటికి వేరువేరుగా కలయికలో పూర్వపూర్వము విచిత్రము పరము రాగవర్ధనము నగును. వైచిత్ర్యములో రాగవర్ధన మున్నను సంభోగము కన్న విప్రలంభమె యంతట బలవత్తరము. నిత్యము కన్న నైమిత్తికము, సామాన్యము కన్న విశేషము, ప్రకా శము కన్న ప్రచ్ఛన్నము, కృత్రిమము కన్న నకృత్రిమము రాగవర్ధ నమున బలవత్తరము. వైచిత్ర్యమునం దైనచో, అకృత్రిమము కన్న కృత్రిమము ప్రచ్ఛన్నము కన్న ప్రకాశము, విశేషము కన్న సామా న్యము. నిత్యము కన్న నైమిత్తికము బలవత్తరము. నిత్య సామాన్య ప్రకాశకృత్రిమములలో పూర్వపూర్వము రాగవర్ధనము, పరపరము విచిత్రము నగును. నైమిత్తిక విశేషప్రచ్ఛన్నా కృత్రిమములలో పూర్వపూర్వము విచిత్రము పరపరము రాగవర్ధనమునగును.

ఇట్లే మృగు - చాటు, సమ్యక్ - అతిశాయి, వాసంత - వాస్తక. ప్రాసాదిక - పంకజ, సముయబన్మ - సంబంధజన్మ, సాధారణ - అసాధారణ, సాంసర్గిక-నైమిత్తిక, ప్రోషితావిషయ-సమోధావిషయ, ప్రోషితపతికావిషయ - విరహోత్కంఠితావిషయ, స్వాంగనావిషయ - పరాంగనావిషయ, సులభ - దుర్లభ, అహార్య-విప్రంభజ, నిత్యానుకారి - నైమిత్తికానుకారి, ప్రకాశానుకారి - ప్రచ్ఛన్నానుకారి అనువానిలో ప్రథమముకన్న ద్వితీయము బలీయము. ఇట్టివానిలో రాగవర్ధనమున వైచిత్ర్యమున విశేషమును యథాయథముగా యోజనమొనరింప దగును.

సంభోగము ద్వాదశవిధము.

| | | | |
|---|---|---|---|
| స్వాంగనావిషయ | పరాంగనా | సామాన్యా | ఉత్తమావిషయ |
| మధ్యమావిషయ | కనిష్ఠా | ముగ్ధా | మధ్యావిషయ |
| ప్రగల్భావిషయ | సర్వవిషయ | సర్వకాల | సర్వర్తుచర్యా |

ఇట్టిది యనేకప్రకారము లగును. తత్ప్రత్యనీకముగా విప్రలంభమును ద్వాదశప్రకారము. ప్రథమానురాగాదులలో పూర్వకాలభావితను సంభోగ మనంతరకాలభావి యగుటను గుర్తింప వలెను. ఇందిది విశేషము

౧౪. సంభోగము విప్రలంభము లేకున్న ప్రకర్షగామి కాదు విప్రలంభ మిట్లుదయించును. నాయికానాయకు లసంగతు లయినను సంగతవియుక్తు లయినను పరస్పరము దర్శనశ్రవణాదుల వలన జనించిన పరస్పరానురాగము అన్యతరానురాగ మయినను అభిలషణీయాలింగనాదులు సంప్రాప్తములు కాకపోయినచో విప్రంభశృంగార మను పేరుగలది యగును. సముత్పన్నము లయిన యుత్కంఠాది వ్యభిచారిభావములచే, మనోవాగ్బుద్ధి సంజాతము లయిన యను భావములచే ననువిద్ధమై పొందవలసిన ప్రకర్షను పొందినదై విప్ర

లంభశృంగార మగును. పరస్పరానురాగమున్నచో నుత్తమము. నాయికానురాగమున్న మధ్యమము. నాయికానురాగమున కనిష్ఠము నగును. ఇందు ప్రథమానురాగ మాన ప్రవాస కరుణ విప్రలంభ రూపము లయిన భేదములు కలుగును. ఇవి అసంగతులకు సంగిత వియుక్తులకు కలుగు ప్రాగసంగతులకును మానప్రవాసకరుణములు కలుగును. సంగత వియుక్తులకునుప్రాగసంగతులకు మాత్రమె ప్రథ మానురాగ విప్రలంభముండును. స్త్రీపురుషుల మనఃపక్షవిశేష మనురాగమని యది యభిలాషాది భేదమున నరువదినాలుగు విధము లని ఉచ్చాదిభేదమునను హీనసమాధిక సంబంధమున ననంతప్రకార మగునని నిరూపిత మయినది.

ప్రథమానురాగమున గాని తదనంతరసంభోగమున గాని దృష్ట శ్రుతానుమితాపరాధముల వలన మిథునమానసము లంగు రోషము మాన మని, పూర్వానురాగమున గాని సంభోగమునగాని స్త్రీ పురు షుల దూరదేశవాసము ప్రవాస మని, రాగాతిశయము కల వారలకు దైవదుర్విపాకాదులచే నొకరు గతింపగా వేరొకరికి గలుగు హృదయ దారుణ దుఃఖాతిరేకము కరుణమని, ప్రతిపాదిత మయినది. ఇంకను గొన్ని భేదము లుండును.

"డు లభష్ ప్రాప్తౌ" యను ధాతువు వి ప్ర శబ్దపూర్వము కాగా విప్రలంభరూప మేర్పడును. లభి ధాతువు ప్రాప్త్యర్థక మయి నను ప్రోపసర్గయోగమున వంచనమున ప్రవర్తించును. ప్ర యనునది ప్రకృతి విపరీతార్థవాచకము. ప్రాప్తి విపరీతార్థము వంచనమె. వంచనము నాలుగు విధములు. ప్రతిశ్రుత్యాదానము విసంవాదనము కాలహారణము ప్రత్యాదానము నని. అది వివిధము విరుద్ధము వ్యావి ద్ధము విప్రతిషిద్ధము నని విశేషము బోధించు "వి" ఉపసర్గ మున సూచిత మగును.

ప్రతిశ్రుత్యాదాన మను ప్రకృత్యర్థము వివిధ మను నుపసర్గార్థము ప్రథమానురాగమున సుఘట మగును. అందింగితాకారాదులచే స్వానురాగప్రకాశనము ప్రతిశ్రవము. ఇది పారతంత్ర్యమున లజ్జాదికమున నిర్వాహణము పొందక పోవుట శాసనీయము. విసంవాదన మను ప్రకృత్యర్థము విరుద్ధ మను నుపసర్గార్థము మానమున సంగత మగును. అందు మనోభిలషితాలింగనాదులు లభింపక పోవుట విసంవాదము. అదివ్యలీకాదుల వలన గలిగిన ఈర్ష్యాదులచే నుత్పన్నమై విరుద్ధమై యగును. కాలహరణ మను ప్రకృత్యర్థము వ్యావిద్ధ మను నుపసర్గార్థము ప్రవాసమున ననుషక్త మగును ఇందు దేశవిప్రకర్షము వలన నాలింగనాదుల యప్రాప్తి కాలహరణము అది కాల విప్రకర్ష వలని యుత్కంఠాదులచే సుదీర్ఘమై వ్యావిద్ధ మగును. ప్రత్యాదాన మను ప్రకృత్యర్థము ప్రతిషిద్ధ మను నుపసర్గార్థము కరుణమున సంబద్ధ మగును. ఇందిష్టసంగమాదులలో దైవమె ప్రతిరోధము కల్పించిన దని భావన ముండును. ఈరీతి యెవనికి నెప్పుడు కలుగరాదని విశేషముగ తలచుటచే విప్రతిషిద్ధమై యగును.

ప్రతిశ్రుత్యాదానము లను నాలుగు ప్రకృత్యర్థములు వివిధాద్యుపసర్గార్థములు నాలుగు ప్రథమానురాగాది చతుష్టయమున వ్యవసాసంప్లవములలో గోచరించును. అయిన నిది భావింపవలెను. సంజ్ఞా శబ్దముల వ్యుత్పత్తిదర్శనమున రూఢి బలము కలదగును. ప్రతిశ్రుత్యాదానాద్యర్థములు మానాదు లందును సంభవించును. అయినను ప్రతిశ్రుత్యాదానము వైవిధ్యము ప్రథమానురాగమున సంవిధానకములలో నిరూపిత మగునట్లు ఇతరములలో నిరూపితము కాదు విసంవదనాదులును విరోధాదిసహాకృతములై ప్రథమానురాగమున నుండును. కాని ప్రతిశ్రుత్యాదానమున వైవిధ్య మున్నట్లితరము లుండవు. అందునని ప్రతిశ్రుత్యాదాన మను ప్రకృత్యర్థము వివిధ మను నుపసర్గార్థము ప్రథమానురాగముననె సుఘట మగును.

౧౫. ఇట్లె మానాదులలో విప్రలంభశబ్దార్థనిరుక్తులను గ్రహింపవలెను. ప్రథమానురాగాది సంజ్ఞాదుల యన్వర్థల నిట్లు గ్రహింపవలెను. "రంజ్ రాగే, రాజృ దీప్తౌ" ధాతువులకు భావకరణాద్యర్థములలో ఘఞ్" ప్రత్యయము కూర్పగా రాగ పదము నిష్పన్నమగును. రాగ మనుగతము అనురూపము నగు-నో ననురాగమగును. రాగపదమునకు 'అను' పదముతో సమాసము కలుగగా 'అనురాగ' మయినది. 'అను పశ్చాత్ సహ వా అనురాగః' అనువృత్తి వర్ణాంతరాపత్తి చెప్పు 'రంజయతి' యుగ్రాహ్యము. భోజనము నందను రక్తుడు. వస్త్రము కషాయ రక్తము.

౧. "రజ్యతి అనుషజ్యతే విషయేషు అనేన ఇతి రాగః
౨. "రజతి అనేన ప్రతియోగిన మాత్మానం వా రాగః"
౩. "రజ్యతే స్వేదరోమాంచవైవర్ణ్యాదిభిః
వర్ణాంతరమాపద్యతే విషయ ఆశ్రయో వా యేన స రాగః"
౪. "ఉభయోర్వ్యక్తిప్రేక్షితాదిభిః చేష్టావిశేషైః ప్రమాణవిశేషైః
రాజతే శోభతే అనేన సమానేకవయోరూపవ్యాపారేషు ఇతి రాగః
౫ "రాజతే దీప్యతే పరం ప్రకర్షమాపద్యతే రతిరనేనేతి రాగః"

ఇట్లు రాగపదవ్యుత్పత్తి విశేషములు భావనీయములు. సహార్థమయిన "అను" శబ్దమున సమాసము రాగా స్త్రీకి పురుషునకు సమకాలముననె రత్యుత్పత్తియున్నచో ఉత్తమము. అనురాగ శబ్దము అనంతరార్థమున – పశ్చాదర్థమున సమాసము రాగా పురుషునకు రాగము పశ్చాదుత్పన్న మయినచో నది మధ్యమము. స్త్రీకి పశ్చాదనురాగము కలిగిన కనిష్ఠానురాగము.

"అనురూపో రాగః అనురాగః' అను నర్థమున సమాసమొనరింపగా నా యనురాగమున నుద్గతములగు లావణ్యాదు లుత్తమత్వము కల వగును. అనురాగశబ్దమున సమాస మేని పురుషే

చ్ఛానువర్తనమున వనితకు మధ్యమానురాగ మగును. పురుషుడు స్త్రీచ్ఛానువర్తనమున నున్న కనిష్ఠ మగును.

ఈ ప్రతిపాదనమున అన్యతరానిచ్ఛలో ననురాగాభాసమున్నను ఆనురూప్యము గుర్తించునది. పురుషున కిచ్ఛ లేదేని యుత్తమము స్త్రీకి ఇచ్ఛయుండని మధ్యమము. వనిత శత్యనురాగమున కనిష్ఠము.

ఇట్లనురాగశబ్ద మర్థయుక్తము కాగా ప్రథమశబ్దమున సమాస మిట్లు సంభావ్యము. "ప్రథమశ్చాసౌ అనురాగః" "ప్రథమం అనురాగః" "ప్రథమాయాం అనురాగః" "ప్రథమే ఉత్కృష్టే అద్వితీయే అనురాగః" ప్రేమగతి స్వభావకుటిల మయి నందున నీ యనురాగము కుటిలత నవలంబించి "మానము" అనదగిన దగును. మాన పద నిరుక్తి యిట్లు భావనీయము. "మాన పూజాయాం-మన జ్ఞానే మను బోధనే - మాఙ్ మానే" అను ధాతువుల నుండి "మాన రూపము సిద్ధమగును.

౧. "మాన్యతే పూజ్యతే అనేన ఇది మానః"

౨. మన్యతే దుఃఖైకహేతుమపి సుఖసాధనం ఏనం

౩. మనుతే బుధ్యతే అస్మాత్ ప్రేమాస్తిత్వం

౪. మిమీతే పరిచ్ఛినత్తి ప్రేమ్ణః ప్రమాణం అసౌ

శిష్టప్రయోగ మున్నందున మానశబ్దము పుంలింగము. మహాభాష్యమున "అస్తి క్రియా..........సోఽసావనుమానగమ్యా. కోఽసావనుమానః" అని యున్నది. ఇట్టి శిష్టప్రయోగదర్శనమున నీ మాన రూపము పుంలింగముగా ప్రయుక్తమయినది.

అనురాగమె దేశాంతరవ్యవధానమున ప్రవాసనామము పొందును. ప్రవాసనిరుక్తి యిట్లున్నది. "వస నివాసే, వస ఆచ్ఛాదనే" అను ధాతువులు "ప్ర"పూర్వములు కాగా ఘఞ్ ప్రత్యయము

కూర్పగా ప్రవాసపదము నిష్పన్న మయినది. ప్ర పూర్వక మయిన ధాతువు విపరీతార్థ వాచి కాగా ప్రవసనము ప్రవాస మగును. ప్రవాస వ్యుత్పత్తి యిట్లు భావ్యము.

౧. "ప్రకర్షేణ వాసయతి ఆనురంజయతి తన్మయతాం
నయతి కామినోః చిత్తమితి ప్రవాసః

కాముకుల చిత్తమునకు అనురంజనము సంపాదించునది తన్మయత నాపాదించునది ప్రవాసము.

౨. "ప్రవాస్యంతే హాస్యంతే వియోగినః ప్రవాసః"

వియోగము పొందిన వారు ప్రవాసితు లగుదురు హాతు లగుదురు. కావున ప్రవాసము,

౩. ఆవసతే ఆచ్ఛాదయంతి అస్మిన్ వియోగిన్యః
విశేషవేషాదికం ఇతి ప్రవాసః.

వియోగినులీ సమయమున విశేషవేషాదికమును ఆచ్ఛాదనముగ స్వీకరింతురు కావున ప్రవాసము.

అనురాగమె యన్యతరవినాశమున దుఃఖానుభవాదులు కలుగగా కరుణసంజ్ఞ కల దగును. కరుణనిరుక్తి యిట్లున్నది. "కరోతి కిరతి" ధాతువులకు కర్త్రర్థమున "ఉనన్" ప్రత్యయము రాగా కరుణపదము సిద్ధమగును. "కరోతి" అభూతప్రాదుర్భావమున, ఉచ్చారణమున, నిక్షేపమున అభ్యంగమున వర్తించును. "కిరతి" విక్షేపమున నున్నది. విశిష్టమగు క్షేపము విక్షేపము. వైవిధ్యము విరుద్ధతవ్యావిద్ధత ప్రతిషేధము అను నవి విశేషములు. కరుణరూపము "కిరతి" వలన గలిగిన దయినచో వివిధ – వ్యావిద్ధ–విప్రతిషిద్ధ – దీర్ఘశోకమె కరుణ శబ్దార్థము. కరుణము కల ప్రాణి సాంసారికసుఖముల నుండి విక్షేపము పొందును, కరుణము కరోతి వలన గలిగినచో అభూతప్రాదు

ర్థాన న్యర్థవాచి యగును అప్పుడు స్త్రీపుంస విషయ మయిన రాగము పరూమో౭౩ ౭ యినాత్రిమై పునస్సమాగమ ఫలక మగు నని కరుణశబ్దార్థ మగును, ఇట్లుగా కరుణావ్యుత్పత్తులను గ్రహింప దగును.

౧. దుఃఖాతిరేకాదభూతాన్కరోతి ఆవిర్భావయతి

౨. విలాపాదిభిస్తద్గుణానుచ్చారయతి

౩. మరణజీవితయోరవేన ఏకత్ర సాపయతి

౪. కరోతి అభ్యంజయతి బహిరంతశ్చ వ్యాప్నోతి విప్రంభోత్పత్త్యా స్త్రీపుంసయోరన్యతరస్యాః యంహృదయ మితి కరుణః

దుఃఖాతిరేకమున నభూతార్థముల నావిర్భవింప జేయునది. విలాపాదులచే తద్గుణముల నుచ్చరింప జేయునది, మరణజీవితములలో నొకచో గూర్చునది. స్త్రీ పురుషులలో నొకరి హృదయమును విప్రంభోదయమున బహిరంతర్వ్యాపించునది కరుణ మగును.

అనురాగ మింత వరకు విప్రలంభాదులలో ప్రత్యయార్థ ముప సర్జనము కాగా ప్రకృత్యర్థము నిరూపిత మయినది. ప్రకృత్యర్థ ముప సర్జనమయి ప్రత్యయార్థము ప్రధానముగా నుండుటయు సంభావ నీయము. భావము కర్మ కరణము సంప్రదానము అపాదానము అధి కరణము కర్తహేతుకర్త భావకర్త కర్మకర్త కర్తృకర్మ భావకర్మ యనునవి ప్రత్యయార్థములు.

ఈ ప్రసంగమున ప్రత్యయోత్పత్తి కాలముల గుర్తించుట యుక్తము. భూతము భవిష్యము వర్తమాన మవ్యక్త మని కాలము నాలుగు విధములు

౧. భూతము. పరోక్షభూతము భూతానద్యతనము.

౨. భవిష్యము. భవిష్యద్భూతము భూతభవిష్యము
భవిష్యదన్యతనము
3. వర్తమానము. వర్తమానము భూతసామీప్యము
భవిష్యత్సామీప్యము
౪ అవ్యక్తము. అవ్యక్తము అతిపన్నము సంకీర్ణము

అను భేదముల కూడుకొని యన్నియు పదివిధము లగుచున్నవి ఈ చెప్పినవి క్రియా పరిచ్ఛేదకము లయిన కాలవిశేషములు. క్రియా సాధనరూపములు కొన్ని కలవు. అవి నిత్య నైమిత్తిక స్వాభావిక నైపరామర్శికము లని నాలుగు విధములు. ఇందవాంతర భేదములు కలవు.

౧ నిత్యము శాశ్వతికము వైకల్పికము నైయోగికము
౨. నైమిత్తికము ఔద్యోతిక ఔపభోగిక ప్రాయోగిక
3. స్వాభావికము. ఆగంతుక నైసర్గిక స్వాభావిక
౪. నైపరామర్శము. సంకీర్ణ ప్రకీర్ణ విప్రకీర్ణ
అను భేదములచే నన్నియు ద్వాదశవిధము లగును.

౧ శాశ్వతికము. క్షణ నిమేష నాడికా ముహూర్త ప్రహరాహోరాత్ర రూపము.

౨. వైకల్పికము. దిన రాత్రి పక్ష మాస ఋతు అయనరూపము.

3 నైయోగికము. సంవత్సర యుగ కల్ప మన్వంతర ప్రలయ మహాప్రలయ రూపము,

౪. ఔద్యోగికము. ప్రాతః ప్రత్యూష ప్రాహ్ణ మధ్యాహ్న అపరాహ్ణ సంధ్యారూపము.

౫. ఔపభోగికము. నిశాముఖ ప్రదోష నిశీథ అపరరాత్ర చంద్రోదయ చంద్రాస్తమయరూపము.

౬. ప్రాయోగికము శరత్ హేమంత శిశిర వసంత గ్రీష్మ వర్షా రూపము.

౭ ఆగంతుకము. మధ ప్రమ దాభ్యుదయోత్సవ వ్యసన పరిహారాది రూపము.

౮. నైసర్గికము, బాల్య కౌమార యౌవన మౌగ్ధ్య మాధ్యస్థ్య ప్రాగల్భ్య రూపము.

౯. సాంసర్గికము. పరాపరయోగపద్యాయోగపద్య చిర క్షిప్ర రూపము.

౧౦. సంకీర్ణము దేశ్య క్రీడా కేలి ద్యూతవ్రత గోష్ఠీ ప్రేక్షాదిరూపము

౧౧. ప్రకీర్ణము. వివిక్తదీర్ఘికోద్యాన సౌధ క్రీడాది దర్శనాది రూపము

౧౨. విప్రకీర్ణము. అష్టమీచంద్రక ఇంద్రోత్సవ యక్షరాత్రిక కుంద చతుర్థీ వసంతక మదనత్రయోదశ్యాది రూపము.

౧౬. విప్రలంభమునకు సంబంధించిన ప్రథమానురాగాది చతుష్టయము నందు సాధర్మ్యపరీక్ష వైధర్మ్యపరీక్ష యావశ్యకము నాలుగు భేదములలో భేదమున్నను సాధర్మ్యమును కొంత భాసించును. సాధర్మ్య మున్నను వైధర్మ్య భాసించును. పూర్వానురాగమును మాన ప్రవాస కరుణముల సంబంధమున నుండును. అనురాగావస్థలు నాలుగు కలవు. భావ భావజన్మ భావానుబంధ భావప్రకర్ష ములను నీ నాలుగు సమృద్ధి విశేషములు.

"భావజన్మానుబంధప్రకర్షాను రూపాః అవస్థాః సమృద్ధయః"

భావస్కంధము ఆలంబనమున సంబంధించి యుండును. ఉద్దీపనమున గూడ సంబద్ధము. నాయికా నాయకులీ సంబంధమున దర్శన శ్రవణ ప్రీతి ననుభవింతురు. దర్శనశ్రవణము లనేకవిధము లనున్నవి. దర్శనభేదము లారుగలవు. ప్రత్యక్ష – అనుమాన–ఉపమాన అర్థాపత్తి – సంభవ–అభావములు. శ్రవణభేదము లారు కలవు. శబ్ద–

ఐతిహ్య - శబ్దానుమాన - శ్రుతోపమాన - శ్రుతార్థాపత్తి-శ్రుత సంభవములు. "న సోస్తి ప్రత్యయో లోకే యః శబ్దానుగమాదృతే శబ్దానుగమము లేని జ్ఞానము లోకమున నుండదు కావున ననురాగము శ్రవణానురాగము దర్శనానురాగము నగును దర్శనానురాగము ప్రత్యక్షానురాగ మని యనుమానానురాగ మనియు వ్యవహృత మగును. దర్శనశ్రవణాను రాగములకు ప్రమాణముల సంబంధము కలదు. తత్త్వదర్శన ములకు సంబంధించిన పరిజ్ఞాన మావశ్యకము. నాయికా నాయకుల పరస్పర దర్శన శ్రవణ విధానములలో ప్రేమప్రపంచ మంతయు సంగత మయినది.

ప్రత్యక్షానురాగ మనగా "అక్షమక్షం ప్రతి గతం విజ్ఞానం ప్రత్యక్షం" సర్వేంద్రియముల ననుగత మగు విజ్ఞానము ప్రత్యక్షము. ఇది యారు విధములు. సాక్షాత్ - ప్రతిబింబ-ప్రతిభాన-ఉత్ప్రేక్ష-స్మృతి - స్వప్నరూపములు. స్వప్నములు ప్రమాణాభాసము లని కొంద రందురు అయిన నివి రాగసూచకములు కాగలవు. అనుమానానురాగ మనగా లింగిదర్శనమున లింగిప్రతిపత్తి. కాని లింగమె యనుమాన మనుట సమ్మతము అనుమానాభాసముకూడ ప్రథమానురాగనిబంధ మగును. అనుమానము నారు విధములు. సామాన్యతో దృష్ట - విశేషతోదృష్ట - ప్రత్యక్షదృష్ట-పరోక్షదృష్ట-విద్యమాన విషయ-అవిద్యమాన విషయములు. ఉపమానానురాగ మారు విధములు సాధర్మ్య-వైధర్మ్య-ముద్రాశిల్ప - సంజ్ఞా - అభినయములు. ఉపమానమేమి ప్రమాణ మని కొంద రందురు. కాని వింధ్యవాసి మునిన ట్లుపమానమె ప్రధాన ప్రమాణము. అర్థాపత్త్యనురాగ మారు విధములు ప్రత్యక్ష - అనుమాన - ఉపమాన - అర్థాపత్తి-సంభవ-అభావ పూర్వకములు. సంభవానురాగ మారు విధములు. సంభావనా - సంశయ-వితర్క-ప్రాయోవాద-సంప్రత్యయ - ప్రత్యనుసంధి

రూపములు. అభావానురాగ మారు విధములు ప్రాగభావ - ప్రధ్వంసాభావ - అన్యోన్యాభావ - అత్యంతాభావ - సంబంధాభావ - సర్వాభావరూపములు. ఇట్లివి దర్శనానురాగప్రకారములు సంభావనీయములు.

శ్రవణానురాగము శ్రావణప్రమాణములచే భాసించును. "శబ్ద విజ్ఞానాదసన్నికృష్టే అర్థజ్ఞానం శాబ్దం" శబ్దవిజ్ఞానమున నసన్నిహితమున నర్థజ్ఞానము కలుగుట శాబ్దము ఇది యూపదేశిక మని విధియని రెండువిధములు, ఉపదేశ మారు విధములు విధివాద-అర్థవాదసంజ్ఞానవాద - స్వరూపానువాద - మంత్రవాద - అనువాదరూపములు. ప్రవృత్తి నివృత్తి విధాయకము విధి. నాలుగు భేదము లిందుగలవు ఉత్పత్తివిధి. నియోగవిధి-ప్రయోగవిధి- అధికారవిధియని. ఉపదేశములలో రెండవది యయిన అర్థవాదము నాలుగు విధములు. స్తుతి-నింద - పురాకల్ప-పరాకృతి యని. స్తుతి పురాకల్పములు-ప్రవర్తికములు - నిందపరాకృతులు నివర్తకములు. మూడవది యగు సంజ్ఞావాదములో సంజ్ఞ నాలుగు విధములు. అన్వర్థక-పారిభాషిక - నైమిత్తిక - యాదృచ్ఛికములు. కవులు కావ్యములలో నీ నామములను సార్థకముగా ప్రయోగించిరి. అది యుచితము. నాల్గవది యైన స్వరూపానువాదము నాలుగువిధములు. జాతి-గుణ-క్రియా - ద్రవ్యములు. మంత్రవాద మయిదవది. మనన త్రాణధర్మాణః శబ్దదేవతాత్మానో మంత్రాః" మంత్రములు నాలుగు విధములు. వైదిక - పౌరాణిక - సైద్ధాంతిక - లౌకికములు. సైద్ధాంతికము శాక్తమంత్రములకు సూచకము. అనువాద మారవది. ఇది నాలుగు విధములు. విధి - నిషేధ - స్తుతి - నిందారూపములు. శబ్దప్రమాణమునకు సంబంధించిన యుపదేశ మిట్లు ఇరువది నాలుగువిధము లయినది. వీని ద్వారమున ననురాగము ప్రకాశిత మగును.

శబ్దము యొక్క రెండవ విధానము విధి. ఇది విధ నని షేధముల రూపమున నుండును. శబ్దప్రమాణము లారు. శబ్దాంతర - అభ్యాస - సంజ్ఞా - సంఖ్యా - గుణ - ప్రకరణములు. ఇందు శ్రుతి - లింగ - వాక్య - ప్రకరణ - స్థాన - సమాఖ్య లారు సహకారులు. శ్రుతి - అర్థ - పాఠ - స్థాన - ముఖ్య - ప్రవృత్తిక్రమములు సహకరించును.

అభియోగవిధి ప్రకాశమున సంకేత మభిసార మను రెండును సంభావనీయములు నానావిధము లగు పరిస్థితులలో నాయకులు సంకేతమున విహరింతురు.

సంకేత మిరువది నాలుగు విధములు

| | | | |
|---|---|---|---|
| ఉపచార | మనోరథ | ఉత్కంఠ | హర్షణ |
| ఆశ్వాస | ఆగమ | భ్రంశ | విఘ్న |
| ఉపఘ్న | భంగ | అనుషంగ | ఆశయ |
| అపశయ | ప్రార్థన | బహుమాన | వాత్సల్య |
| అనుక్రోశ | ఆక్షేపణ | అభిరక్ష | తాత్పర్య |
| ఉపజాప | ఉపాలంభ | విప్రలంభ | ఆశీః ప్రశ్న |

అభిసరణ మష్టాదశవిధము :

| | | |
|---|---|---|
| విరహావిస్ఫూరణ | సఖీసంప్రశ్న | ఇతివృత్తాఖ్యాన |
| సఖిశిక్ష | ధ్వాంతప్రతీక్ష | ధ్వాంతానుశోచన |
| ధ్వాంతసత్కార | చంద్రికాభిసరణ | చంద్రికానిర్వేద |
| చంద్రోదయనింద | చంద్రతిరస్కారము | అభిసరణసాధ్వసము |
| అభిసరణోత్సాహ | అభిసారికావృత్తాంత | పరిభోగదర్శన |
| సఖివ్యాజగర్హా | అవినయగూహన | చిహ్నానిహ్నవములు |

తన ప్రియుని పొందుటకు ప్రియురా లనుసరించు విధానములు ప్రియుని కలియుట తన భావనివేదనము తన సంకేతము తన భావవేగము సర్వము సంభావనీయము.

ఏవం సంకేతదానాదిచేష్టాకూపార పారగా
ఇత్యుచ్ఛేదసమాధాన ప్రచ్ఛాదన విశారదా
దేశకాలేంగితాకారభావోపాయాభియోగవిత్
నారీ నరేషు సర్వేషు, నరో నారీషు సిద్ధ్యతి

సంకేతదానాదిచేష్టాసముద్రము దాటి, రతిప్రకటనసరిచ్ఛాదనములు తెలిసి, దేశకాలాద్యనుసారమున నభియోగము గుర్తించిన నారీనరులు నరనారు లందరిలో రాగసిద్ధి పొందుదురు.

౧౭. దూతవిశేష దూతకర్మోపవర్ణనమున పూర్వానురాగమునకు సంబంధించిన విశేషము లవభాసించును. పూర్వానురాగవిప్రలంభమున దూతప్రేషణ మావశ్యకము. దూతలు ప్రేమసందేశహారకులు. వీరంద రెనుబదినాలుగు విధముల నున్నారు వారి ప్రధాన విధులు పది యున్నవి.

జాతిః గుణః క్రియా ద్రవ్యం సంబంధోఽర్థః ప్రయోజనం
ప్రయోగో యోగ్యతా స్త్రీత్వం దూతభేదేషు హేతవః

వీటిలో నవాంతర భేదములు కలవు. జాతి, దేవ-మనుష్య - కిన్నర - వానర - శుక - శారిక - పారావత - హంసభేదమున - నెనిమిది విధములు. గుణములు, పితృపితామహ - అదృష్టవైకృతి - అవిసంవాదక - అలోభశీల - అమంత్రివిస్రావి - ధార్మిక - భావసహిష్ణురూపమున నేడు విధముల నున్నవి. క్రియలు తొమ్మిది విధములు. సహపాంసుక్రీడిత - ఉపకారసంబద్ధ - జన్మాంతరార్జిత-సహాధ్యయన-సమానశీలవ్యసన - మర్మరహస్యవిజ్ఞాన - అన్యమర్మవిజ్ఞాన ద్విత్రి సంతానము - సహసంవృద్ధ విశేషములు. ద్రవ్యము నవవిధము మాలాకార తాంబూలిక గాంధిక శౌరిక పీఠమర్ద విట విదూషక పాషండి స్నిగ్ధులు. సంబంధ మెనిమిది విధములు. గురు సఖి శిష్య ప్రేష్య ఆత్మజ్ఞాతి ఔరస కనీయాన్ అని. అర్థ మేడు విధములు

అర్థాంతరార్థప్రతీఘాత - సహార్థత - ప్రాప్తి-ప్రతారణ-ఆనృణ్య - కృతి - ప్రతీతిరూపములు. ప్రయోజన మెనిమిది విధములు, నయా స్నేహ కుతూహల అభిప్రాయోపాలంభ పూర్వప్రార్థన అన్యతర ప్రార్థన శీల సంఘర్ష రూపములు. ప్రయోగ మెనిమిది విధములు. ప్రచ్ఛన్న ప్రకాశ హీన ఉత్కృష్ట ఉద్ధత ఉదాత్త ధృష్ట శఠరూపములు. యోగ్యత నాలుగువిధములు. నిసృష్టార్థ పరిమితార్థ పత్రహారక మూకదూతి రూపములు. స్త్రీత్వ మెనిమిది విధములు ఈక్షణిక భిక్షుకి సఖి ధాత్రేయిక విధవ దాసి శిల్పకారిక శిల్పిని యని.

సంభావనాయ విశ్వాసః ప్రవృత్తిర్మంత్రసంగ్రహః
మనోనిర్వాణం ఉత్సాహ ఆశ్వాసః కార్యనిర్ణయః

ఇందు నిరూపితము లయిన విశ్వాసాదులు యోగ్యతాసంపాదకము లయిన విశేషములు వాగ్మిత భావన మనువానికి సంబంధించిన దూతగుణము లింక నెనిమిది గలవు. శుశ్రూష శ్రవణ గ్రహణ ధారణ విజ్ఞాన ఊహ అపోహ తత్త్వాభినివేశ రూపములు. మొత్తమివి యన్నియు చతురశీతి విశేషము లయినవి.

దూతకర్మ లిరువది నాలుగు గలవు.

ప్రవేశ విశ్వాసన ఉపావర్తన అనువర్తన కార్యోపన్యాస అవస్థానివేదన ఇంగితాకారజ్ఞాన ఉపాయజ్ఞాన ప్రకరణజ్ఞాన ప్రతారణ సమాశ్వాసన అత్యయప్రతీకార ప్రయోజ్యప్రేషణ సంధిరక్ష ప్రతాప వ్యావర్ణన ప్రయోజ్యపజాప పరాక్రమణ బంధురత్నాపహారమిత్రోపగ్రహ సుహృద్భేదచార జ్ఞాన గూఢదండాతిచారచారసమాధానములు సమాధిమోక్షములు

జాతిక్రియాదియోగేన యస్య దూతస్య యో విధిః
యుజ్యతే తత్ర మేధావీ తమేవ వినియోజయేత్

ఏ దూతకే విధానము జాతిక్రియాదియోగమున చేరి యుక్తమో పరిశీలించి మేధావి యుం దాతని నియమింప వలెను.

మాతవిశేష కర్మపరిజ్ఞానానంతరము మాతసంప్రేషణ పరిజ్ఞాన మావశ్యకము. మాతసంప్రేషణాదులు నలుబది యెనిమిది కలవు. మొదటి వర్గమున నలుబది యిట్లున్నవి.

| | | |
|---|---|---|
| దూతసంప్రేషణ | సందేశదాన | సుపాత్రప్రణిధాన |
| దూతానుగమ | సఖివిగర్హణ | మార్గోపేక్షణ |
| గమాగమచింత | చిరయద్విమర్శ | దూతాగమన |
| ఆకారపరీక్ష | దూతప్రతిభేద | దూతపరిప్రశ్న |
| దూతవ్యవహార | దూతవాక్యాకర్ణన | గమనవృత్తాంత |
| ప్రవృత్త్యుపలంభ | ప్రియసందేశ | సుహృత్సంమంత్రణ |
| అవస్థానుభావ | సహాయోత్సాహన | ప్రియదూతాగమన |
| దూతప్రతిపత్తి | వార్తాభిధాన | కార్యపర్యనుయోగ |
| దూతవాక్య | ఉత్తరాభ్యుపపత్తి | దూతప్రతివాక్య |
| దూతవాక్యాక్షేప | దూతాభిభర్త్సన | పరిజనక్షోభ |
| గురుజనాశంక | సహాయావేగ | ఇతికర్తవ్యత |
| స్వయంప్రవృత్తి | నాయకాయన | ప్రియాభిగమన |
| ఉపసాన | సంభ్రమవికల్ప | నాయికాప్రతిబోధన |

సుహృత్పరిహాసలాపములు చత్వారింశత్.

ద్వితీయవర్గమున నెనిమిది గుణములున్న :

| | |
|---|---|
| దూతపురస్కార | ఇతివృత్తాఖ్యాన |
| అవస్థాజ్ఞాన | అవధాన |
| సంవిధాన | శక్తివివేచన |
| సమాగమోపాయ | సమీహితసిద్ధి |

వీనిలో నవాంతరభేదములు గలవు. మూడవది యయిన యవస్థాజ్ఞానము నందలి జ్ఞానము దృష్ట శ్రుత అనుమానముల మూడు విధములు. నాల్గవది యైన యవధానము నాలుగు విధములు దేశ కలా కాలపాత్రము లని ఆరవది యైన శక్తివివేచనము నాలుగువిధములు.

ప్రభుశక్తి ఉత్సాహశక్తి మంత్రశక్తి దైవశక్తి యని. ఏడవది యైన సమాగమోపాయము చతుర్దశవిధము. తపస్య - సాహస - మాయ - ఛద్మ - ఛలితక - హార - వేశ - రూపాంతరాపత్తి - ఇంద్రజాల - వినిర్గమ - లేఖ - చేష్టానువర్తన - కార్యోపదేశ - సాహాయ్యములని.

మానప్రకాశము సుందరము. ప్రవాసమునకన్న మానమున వైచిత్ర్య మున్నది. రమ్యోపమానములతో దీని నిట్లు భావింప వచ్చును. ఇది దోషమయినను మతంగములలో మదము వంటిది. విగ్రహమైనను మాకందము లందు సహకారము వంటిది. కార్శ్యాది హేతు వయినను సాత్త్వికులలో తపః ప్రబంధము వంటిది. ప్రియ వినోదాత్మక మయినను వదాన్యులలో త్యాగము వంటిది. కటువయి నను పాడబములలో మరీచాపచూర్ణము వంటిది కలుష మయినను వనితాలోచనము లందలి కజ్జలనివేశసదృశము. దురాసద మయినను ప్రసూనసంస్తరము లందలి భ్రమర సదృశము. వక్ర మయినను కవి వాక్యముల లోని ఉక్తివిశేషసదృశము. ఇట్టి మానము యువమన ముల నుత్పన్నమై ప్రేమసంపదకు సముత్కర్షము సంపాదించును.

మానినీమణికి మాన ముండుట యుత్తమము పురుషున కది కనీ యాన్. ఇద్దరకు మాన ముండుట మధ్యమము. మానము చతుర్వింశతిప్రకారము. మానవిషయాశ్రయాలంబనభేద, మానజాతి, మాన విశేష, విషయప్రకీర్ణ, ఆశ్రయప్రకీర్ణ, ఆలంబనప్రకీర్ణ, విషయకర్మ ఆశ్రయకర్మ, ప్రకీర్ణకర్మ, మానవికార, మానోపలక్షణస్థాన, మానో త్పత్తికరణ, మానోపలక్షణ, మానోద్దీపన, మానవిలాస, మాన మోట్టాయిత, మానసుఖానుభవ, మానోత్పత్తిప్రకీర్ణ, మానోపాధి భంగ, మానభంగకారణ, మానోపశాంతి, మానోపశాంతి, మానోప శమలక్షణ, మానభంగావధి, మానానుభవసౌఖ్యములు ఇరువది నాలుగు. "ఇతి చతుర్వింశతిరర్థాః"

౧ మానవిషయాశ్రయాలంబనములు మూడును ప్రత్యేకముగా పన్నెండు విధములు. మొత్తమివి ౩ × ౧౨ = ౩౬ ముప్పదియారు విధములు. దేని నుద్దేశించి భావ ముల్లసించునో యది విషయము ఎవరి నాశ్రయించి భావ ముండునో వా రాశ్రయము. విషయమునకు సంబంధించి భావోల్లాసమున కాధార మగునది యాలంబనము. ఇట్లు మానమునకు సంబంధించి విషయాశ్రయాలంబనభేదములు గ్రాహ్యములు.

౨ మానజాతు లిరువది నాగులు.

భామ - కోప - క్రోధ - ఉత్ప్రాస - రోష - ఈర్ష్యాయిత - మంత్రియుత - అసూయిత - వైమనస్య - ఉన్మాద - మన్యు - మాత్సర్య - అభినివేశ - అవాక్యజ్ఞ - విస్ఫూరణ - వైలక్ష్య - అనుశయ - కాలుష్య - క్షోభ - ఆవేగ - అమర్ష కోపాతిరేక - ఉగ్రత - ప్రణయకలహములు

3 మానవిశేషము లిరువదినాలుగు.

సహజ - ఆహార్య - యౌవనజ - విస్రంభజ - స్థిర-భంగుర-సమ - విషమ - ప్రకాశ - గూఢ - చండ-మృదు-ఉద్భట-మసృణ-ఋజు - వక్ర-సాధ్య-కృచ్ఛసాధ్య-యాప్య అసాధ్య - పురాణ జీర్ణ - పునర్నవ - నవములు.

౪ విషయ ప్రకీర్ణములు ౨౮ భేదములు
౫. ఆశ్రయ ప్రకీర్ణములు ౮ ,,
౬. ఆలంబన ,, ౮ ,,

పరిహాస - ఆశంస - జిజ్ఞాస - కుతూహలములు
కైతవ - కారణ - ప్రతాప — ౭ ములు

౭, ౮. విషయాశ్రయకర్మలు ప్రత్యేకముగా ౬ విధములు.

మానవైకృత - మానవితర్క - మానభంగోపాయ - మానపరిప్రశ్నో - చిత్రచాటూక్తి-ప్రియోపాలంభములు

ఇంక మానవైకృతవిశేషములు ౧౨ విధములు
వైలక్ష్య - అనుశయ-జ్ఞానాన్యథాత్వ-చాయాభ్రంశ-
ఉత్కంఠావేశ-వైక్లవ్య-ప్రవిలాప సంతాప-విస్మయ
వ్యావృత్తి - ఆరంభ - అభిశంకా రూపములు
మానవితర్క విశేషములు ౬.

సత్త - ఆనుబంధ - ప్రకర్ష - సంపర్క - అనుగమ - పునః ప్రాదుర్భావ రూపములు.

మానభంగోపాయములు ౪ సామదానభేదదండములు. సామము ప్రియవచనము అనువృత్తి ప్రణామ మని, భేదము శంకాస్యోత్పాదన ఇంద్రజాల మాయారూప మని, దండము ఉపేక్ష ప్రతికోప ప్రస్థాన రూప మని పరిగ్రాహ్యము. ప్రియోపాలంభములు ద్వాదశవిధములు.

ప్రకీర్ణకర్మలు సప్తవిధములు.
ప్రతిబోధన - సమాశ్వాసన - పరిహాస - ఉపదేశ -
ప్రతిషేధ - ఉపజాప - స్ఖలితగోపనములు.

౧౦. మానవికారములు ౬
జాయతే - వివర్ధతే - విపరిణమతే - అపక్షీయతే-వినశ్యతి -

౧౧ మానోపలక్షణ స్థానములు ౬
హృదయ - చక్షు - వక్త్ర - వాక్ - వపుః-చేష్టితములు.

౧౨. మానోత్పత్తికారణములు ౧౨
ప్రియాకరణ - ప్రియాకరణ - వారితవామత - కామచార - స్వరూపాన్యత - శాఠ్య - ప్రతారణ - ఖండన - అవజ్ఞ-అకృతజ్ఞత- సపత్నీ నామగ్రహణ - గోత్రస్ఖలనములు.

౧౩. మానోపలక్షణములు ౧౨
అవజ్ఞాన - అత్యాదర - వికృతవీక్షణ - అనాలోక - అసంభాషణ - వాక్పారుష్య - అభ్రూద్గమ-దీర్ఘనిశ్వాస-విలక్షస్మిత-వ్యాజనివృత్తి - అత్యంతానుకూల్య - ప్రసాధనాగ్రహణ రూపములు.

౧౪. మానోద్దీపనములు ౧౨

వయస్యావాక్య - విపక్షసన్నిధి-సఖీవైలక్ష్య - సపత్నీ ఉపహాస-సౌభాగ్యదర్శన - దాక్షిణ్యోక్తి-అత్యంగోపేక్షి - దరిష్టవ్యపరిలాప-అపరాధస్మరణ - విపక్షానుకంప-ఆర్ద్రాపరాధ-ప్రియానునయములు.

౧౫. మానవిలాసములు. మానసమయమున స్త్రీల వక్రోక్తి విశేషములు. ౧౬. మానమోట్టాయితములు మానవిలాసములె కాక్వాదులచే నతివక్రములు కాగా గలుగు పేరు

౧౭. మానసుఖానుభవములు ౬ బహుమత - జిఘృక్షిత - అనుబద్ధ - రక్షిత - ఉపద్రుత - విద్రుతములు.

౧౮. మానోపాధిభంగములకు సంబంధించిన ఉపాధులుపండ్రెండు విధములు. అంగ-చక్షుః - చిత్త - చాటు - ధైర్య - కార్యశక్తి - ఆకార - దేశ-కాల - పాత్ర - సంజ్ఞారూపములు.

౧౯. మానభంగకారణములు ౧౨ మద - త్రాస - భయ - ఋతూపాగమ- ఉపవనవికాస - సురభివనవాత - కోకిలాన్యాలాప- ప్రదోష - ప్రవాసారంభ - వివిక్తరూపములు.

౨౦. మానోపశాంతులు ౧౮ విధములు. విరోధి ప్రాదుర్భావ - ప్రతిపక్షాభియోగ-ప్రత్యనీకధర్షణ - విపక్షాభిభవ - పరిభ్రంశ అవస్రంసన - స్ఖలన-విఘట్టన-ఉన్మూలన - పలాయన - పునర్భావములు.

౨౧. మానోపశమలక్షణములు ౧౦. విధములు, నయననిమీలన - ముఖప్రసాద - బాష్పమోక్ష - పులకోద్భేద-రోమప్రతిభేద - అకృమనింద - మనోజుగుప్స-మానానుశయ-మానమోగ్య - మానానుశయ - యోగరూపములు.

౨౨ మానభంగోపాధులు ౧౨ విధములు. నిద్ర-మద-త్రాస-భయ-అజ్ఞాన - ప్రసంగ - ప్రమద - దేశకాల-కార్య-పాత్ర-సుప్త రూపములు.

౨౩, మానానుభవసౌఖ్యములు ౧౨ విధములు. పాదపతన - ప్రసహ్యాశ్లేష - హారకచగ్రహ - చుంబనబలాత్కార - ప్రియప్రణయోక్తి - ఉపాలంభసూక్తి - స్నేహపరీక్షవిపక్షాభిభవ-సఖీశ్లాఘ-బంధుబహుమాన - లాభవిశేష - శృంగారవృద్ధిరూపములు

ఇప్పటి కివి యన్నియు సంక్షేపముగా నిరూపితములు "ప్రాజ్ఞైరనుక్తమనుమీయతాం" వీని ప్రకారములను మాటలతో జెప్పుట శక్యము కాదు. సాగరజలము దోసిట బట్టుగా రెవరు? ఈ మానమేణనయనా మనఃపరమ బాంధవము.

౧౯ ప్రవాసవిప్రలంభము ప్రస్తుతము. ఇది యధ్వగవిలాసినీ ముఖసరోజ సంధ్యాతపము రతిసముద్రచంద్రోదయము మానానంతరము కరుణమునకు పూర్వము ప్రవాసము నిరూపణార్హము. దీని వలన రాగవర్ధనత విచిత్రత సూచిత మగును. విప్రలంభమునకు సంబంధించిన ప్రథమానురాగాదులు నాలుగును నాలుగు చిత్తవృత్తుల ననుసరించి యుండును. విక్షేప-వికాస - సంక్షేపములిందలి చిత్తరీతులు. ప్రవాసము మూడువిధములు. దైవప్రవాస - ధర్మప్రవాస - అర్థప్రవాసమని యివి ప్రధానభేదములు సామాన్యవిశేష రీతులతో గూడుకొనిన ప్రవాసభేదములు ౫౨ కలవు. ఇందు సామాన్యభేదములు ౨౪. విశేషభేదములు ౨౮.

సామాన్యభేదములు భూతపూర్వ - అభూతపూర్వ - సాధారణ - అసాధారణ - సహజరాగ - వివృద్ధరాగ - ప్రాప్తసమయ - సప్రతివిధాన - నిష్ప్రతివిధాన - సన్నికృష్ట - విప్రకృష్ట-సావధి - నిరవధి - అల్పకాల - దీర్ఘకాల-సంసృష్టఅసంసృష్ట - ప్రకాశకృత- ప్రచ్ఛన్నకృత- సోపసంహార - నిరుపసంహార - నాయికానిమిత్త - నాయకనిమిత్తరూపములు.

విశేషభేదములు దైవధర్మార్థకృతములు మూడును ప్రత్యేకముగా నాలుగు విధము లయినందున ౧౨ విధముల నుండును. వీని మిశ్రణమున షోడశభేదము లేర్పడును, మొత్తమివి ౨౮ భేదములు

దైవకృతము శాప - పాప - సంభ్రమ - విభ్రమభేదములను, ధర్మకృతము సాభిప్రాయ - నిరభిప్రాయ - సానుతాప - నిరనుతాప భేదములను, అర్థకృతము సాభ్యనుజ్ఞ - నిరభ్యనుజ్ఞ - సోపధాన - నిరుపధానభేదములను పొందగా నివి ౧౨ విధములు.

మిశ్రణము నాలుగు విధములు. దైవధర్మాపన్నప్రవాసము - దైవార్థాపన్నము - ధర్మార్థాపన్నము - దైవార్థాపన్నమునని, ఇందు దైవధర్మాపన్నము ప్రకృతిప్రకోపముల - కఠోర - పరిణతభేదములను. దైవార్థాపన్నము గ్రామ్య - నాగర - ఉపనాగర - విప్రకీర్ణభేదములను ధర్మార్థాపన్నము హిత - అహిత - సుఖ - దుఃఖభేదములను, దైవార్థాపన్నము వివృత - ఆయత - త్ర్యస్ర చతురస్రభేదములను పొందగా నివి పదునారు భేదము లయినవి

మొత్తమీ ౪౨ భేదములును ప్రాప్తిస్కంధ - వ్యాప్తిస్కంధ - సంపత్తిస్కంధభేదము పొందగా ౪౨×౩=౧౨౬ అగును. ఇవి ప్రత్యేకముగా నెనిమిది యవాంతస్థితులను పొందగా మొత్తము ౧౨౬×౮=౧౦౦౮ భేదములు కలుగును.

ప్రాప్తిస్కంధమున ౮ ప్రకాండములు కలవు.

౧ ప్రవాసాశంక ప్రియ విప్రయోగ సంభావన ౪ భేదములు

౨. ప్రవాసారంభము నాయకుని ప్రియాపరిత్యాగయత్నము ,,

౩ ప్రియాప్రస్థానము నాయకుడు గృహమునుండి వెడలుట ,,

౪. ప్రియానుగమము సీమాంతము ప్రియురాలు ప్రేమతో ననుగమించుట ,,

౫. ప్రియాప్రశ్నము ప్రియజనపరిత్యాగము ౫ భేదములు

౬. ప్రీతినివృత్తి ప్రియాప్రీతినివృత్తి ప్రియప్రస్థానము ,,

౭. ప్రవాసచర్య ప్రియురాలి యేకాంతజీవనము ౩ త్రి ,,

౮. ప్రవాసవృత్తాంతము. ఇందితర భేదములు కలవు.

వీనిలో నేడవది యయిన ప్రవాసచర్య దేశ – కాల – కార్య – పాత్ర – ఔచిత్య – శక్తి – సాధన – ఉపాయభేదముల ౮ విధములు. ప్రత్యేకము చాతుర్విధ్యమున ముప్పదిరెండు విధము లగును. దేశము స్వకీయ – పరకీయ – స్వకీయపరకీయ – అనుభయరూపము. కాలము సాధారణ – అసాధారణ – ఉల్లేఖవాన్ – అనుల్లేఖరూపము, కార్యము సామాన్యవత్ – విశేషవత్ – నిత్య – నైమిత్తికరూపము. పాత్రము ఉత్తమాదిక – ఉదాత్తాదిక – ముగ్ధాదిక – ధీరాదికరూపము. ఔచిత్యము జాతి – గుణ – క్రియా – ద్రవ్యరూపము. శక్తి ఔత్సాహిక – దైశిక – సాహాయక – దైవికరూపము. సాధనము ఉపాదాన హేతు – కరణ – అధికరణరూపము. ఉపాయము స్వాభావిక – ప్రాయత్నిక – సార్వలౌకిక – యాదృచ్ఛికరూపము.

ప్రవాసచర్య లోని విశేషములు కొన్ని ప్రవాసవృత్తాంతము నను గలవు. ఇందలి దేశకాలాదుల సవ్యవిధమున భావింపనగును. దేశము గ్రామ్యము – అరణ్యము – సాధారణరూపము. కాలము ఉపక్రాంతము – ప్రక్రాంతము – వ్యతిక్రాంతమునగును. కార్యము నిర్వర్త్య వృత్త్యాదికము పాత్రము ఉత్తమ – మధ్యమ – కనిష్ఠరూపము. ఔచిత్యము స్నేహము – ఉద్యోగము – ఔత్సుక్యము రూపము.

వ్యాప్తిస్కంధము ౮ విధములు. వియుక్తస్వరూప – వియుక్తావస్థ – విరహోద్దీపన – విరహప్రతీకార – సహాయాశ్వాసన – సహాయోపాలంభ – ఉత్కంఠావినోద – సందేశాదానరూపము. ఇందలి వియుక్త

స్వరూపమున విరహాంగతము లయిన నానావిశేషము లుండును. వియు క్తావస్థలో, మనసులో చింత - అనుస్మరణము - దృశి ప్రజాగరము విషయవ్యావృత్తి - వక్త్రే లజ్జాపరిణాశము - ఉన్మాదము-వాచి గుణ కీర్తనము - విలాపము - వపుషి కార్శ్యము-వ్యాధి- చేష్టాజాడ్యము - మూర్ఛ యని ౧౨ విధములు. మనో దృక్ వక్త్ర వాక్ చేష్టలలో నిది యభివ్యాప్తము. విరహోద్దీపన మెవిమిది విధములు. దేశ - దేశచిహ్న - కాల - కాలచిహ్న - వస్తు వస్తుచిహ్న-కార్య-కార్య చిహ్న రూపము అని. దీని యందితర భేదములును గలవు స్మరణ - ఇచ్ఛ - ద్వేష - ప్రయత్న - చిత్తారంభ - వాగారంభాదు లున్నవి. వీని భేదసంఖ్య బహులము శబ్దబ్రహ్మవివర్తము లయిన వ్యక్తా వ్యక్తాత్మల పర్యంత మపరిజ్ఞేయ మయినట్లు విరహోద్దీప్తి సంజాతము లయిన వికల్పముల పర్యంత మపరిజ్ఞేయము.

ఈ వ్యాప్తిస్కంధానుబంధముగా, విరహప్రతీకార-సహాయా శ్వాసన - సహాయోపాలంభ - ఉత్కంఠావినోద- ప్రణయలేఖాత్మక సందేశదానములును సంభావనీయములు.

సమాప్తిస్కంధము ౮ విధములు ప్రవృత్త్యాగమ ప్రవృత్తి పరిప్రశ్న - అవధిప్రతీక్ష - మార్గోదీక్షణ-దైవనిమిత్తశకునోప శ్రుతి- సుస్వప్నదర్శన - సునిమిత్తానుభవ - ప్రియప్రత్యాగమములు. ఈ యుదాహరణపద్ధతి యిట్లు నిరూపిత మయినది. "దిశానయానుస ర్తవ్యమనుక్తమపి సూరిభిః" చెప్పకున్న నీదిశ ననుసరించి పండితు లితరములను గూడ సంభావించి నిరూపించునది. అనంగవిహంగ మునకీ ప్రవాసము వసతిద్రుమము. ఇది కుసుమబాణుని జీవితము. ఇది ప్రియజనమనోహేమనికషము.

౨౦. కరుణవిప్రలంభము ప్రేమోద్యానము నందలి ప్రణయ తరువు నందు విస్రంభ సుమనోనివాసైకస్థానీ సురభి రూపము.

సంధులవలె నీ యనుభావములలో నయి దవస్థావిశేషములు కలవు. అవస్థకు షోడశానుభావము లున్నవి.

౧. ముఖావస్థానుభావములు. వ్యసనాభిఘాత-అంగాభిభావ - చేష్టాసమ్మీలన - మోహసమావేశ-చేతనాపరిత్యాగమ - మూర్ఛావిచ్ఛేద - శోకప్రత్యగ్రత - శోకావేగ - దుఃఖనిర్యాతన - దుఃఖావసాద - దుఃఖసందీపన - దుఃఖవ్యవహార - దుఃఖాతివాహన-బాష్పమోక్ష - అవస్థానుభావ - అవస్థాంతరావేశరూపములు ౧౬.

౨. ప్రతిముఖానుభావములు పరిదేవన - అనుశోచన - గుణసంస్మరణ-స్వభాగ్యగర్హణ - విలాప - ప్రలాప-పరివిలాప విప్రలాప-ఆత్మనింద-హృదయోపాలంభ-జీవితజుగుప్స - దైవధిక్కార-శోకోన్మాద-దుఃఖసంభేద-సహాయాపేక్షణ-సహాయానునీతిరూపములు ౧౬

3. గర్భరీతికి ౧౬ అనుభావములు, సుహృత్పరిదేవన-సుహృత్పరిలాప - పరిజనానుశోచన - పరిజనాక్రంద - గురూపరోదన - గురువిలాప - సహాయాక్రందన-సహాయాభ్యుపపత్తి-సహాయభాషణ-సహాయప్రశ్న - సాహసాగ్రహ - మరణాభినివేశ-సహాయాభ్యర్థన - సహాయశిక్షా - మరణోపక్రమ - మరణాధ్యవసాయములు.

౪. విమర్శరీతికి ౧౬ అనుభావములు. సమాశ్వాసన-ఉద్ధర్షణ-ప్రతిబోధన - ఉత్సాహన - అనుకంపన - విస్రంభణ - ప్రలోభన-ఉపపత్తిదర్శన - ప్రశ్వాసన-సత్యాపన-పరిత్యాయన - ఆప్యాయన-తన్మతవ్యాక్షేప - భయోపదర్శన - ఉపాలంభన - ప్రతికోపములు.

౫. నిర్వహణరీతికి ౧౬ అనుభావములు. మరణాధ్యవసాయవిద్రవ - శోకతిరస్కార - శోకలాఘవ - శోకవినోద - తపస్యోద్యోగ - దైవసంపద్యోగ - త్రికాలదృష్టదర్శన-తదుపదేశ-సహాయస్వీకరణ - తదధ్యవసాయ - ప్రత్యాహాశమన - ప్రత్యాశానుబంధ-

సమయపరితీక్ష – సంవిధానకప్రకార – ప్రత్యుజ్జీవన – పునస్సమాగమములు.

ఇంతగా నున్న ఈ కరుణవిప్రలంభ నిర్ణయము ఆత్మజన్మన కాబంధనము. నిరీతిశృంగారరసమునకు జీవితము. ప్రణయ పరా కాష్ఠ. ఈభావమున నీ భోజదేవభావ సూక్తిసౌందర్యముసంభావ్యము.

తదేతదాబంధనమాత్మజన్మనః
నిరీతిశృంగారరసస్య జీవితం
పరా చ కాష్ఠా ప్రణయస్య జీవితా
ప్రియేణ యత్ప్రీత్య పునస్సమాగమః.

౨౧. సంభోగప్రారంభము విప్రలంభసమాప్తిలో సంభావనార్హము. చతుర్విధవిప్రలంభానంతరము చతుర్విధసంభోగశృంగారములు సంభావనీయములు. పూర్వానురాగానంతరసంభోగము – మానానంతరసంభోగము. ప్రవాసానంతరసంభోగము – కరుణానంతర సంభోగము నని.

సంభోగపద నిరుక్తి పరిశీలనమున "భుజ్ ధాతువు సమ్ ఉపసర్గ ఘఞ్ ప్రత్యయము" భాసించును. ఈ భాగము లన్నియు సంభోగపదము యొక్క నాలుగు విధము లయిన భావములకు సూచకములు. పాలనము – కౌటిల్యము – అభ్యవహారము–అనుభావ మను నాలుగు భుజి ధాత్వర్థములు. సంక్షేప – సంకర – సంపూర్ణ – సమ్యగ్రీతులు సమ్ ఉపసర్గార్థములు. ఘఞ్ ప్రత్యయార్థము లెనిమిది. భావము – హేతువు – ఆరు కాలములు ప్రత్యయోత్పత్తి కాలము లెనిమిది. భూత – వర్తమాన – భవిష్యత్ – వ్యక్త–భూతవిశేష – వర్తమానవిశేష – భవిష్యద్విశేష – వ్యక్తవిశేషములు. ఇవి యన్నియు పశుభాష–వృక్షభాష – నాయకభాషలనుండి సంగ్రాహ్యములు కాళిదాస కుమారసంభవ తృతీయసర్గలో నివిసంభావ్యమాన మనోహరములు.

సైషా పాలనకౌటిల్యాభ్యవహారానుభూతిభిః
వర్ణితా కాలిదాసేన ప్రేమప్రస్థానపద్ధతిః

ఈ ప్రేమ ప్రస్థానపద్ధతిని పాలన - కౌటిల్య - అభ్యవహార - అనుభూతి యనువాని విశేషముగ కాళిదాసు ప్రదర్శించి నాడు.

పైన చెప్పిన విధానము తిర్యక్సంభోగమును భావించునది. ఇదియె సామాన్యసంభోగము. నాగరికసంభోగము విశేషసంభోగము. నిరుక్తిసహితముగ నీ యుపపాదనము సంగ్రాహ్యము.

౧. ప్రథమానురాగానంతరం హి ప్రథమం రతి రుత్పద్యతే

౨. ఉత్పన్నా చ నాయకాభ్యాం ప్రియాచరణ - విప్రియాకరణాభ్యాం పాల్యతే.

౩. తత్ర చ సంతుష్టానా మేవ ఆలింగనాదీనాం వికల్పతః ప్రయోగో భవతి,

౪ తతః ప్రేమగతేః స్వాభావకుటిలత్వాత్ ద్వితీయావస్థాయాం రతిః స్వాభావకుటిలతా మవలంబతే.

౫. సంకీర్ణశ్చ తత్ర ఉపచారాణాం ప్రయోగః, సంకీర్ణాశ్చానుభావా భవంతి.

౬. తత్ర ఉద్భూతాయాం కామావామతాయాం సులభాం అవమన్యతే - దుర్లభా మాకాంక్షతి. ప్రాయోవాదాత్ పరంప్రకర్ష మారోహంతీ రతిః తృతీయా యామవస్థాయాం అభ్యవహ్రియతే. సముచ్చయేన చాలింగనాదయః ప్రయుజ్యంతే. ఏవం చ సా సంపూర్ణత్వ మాసాదయతి.

౭. చతుర్థావస్థాయాం విస్రంభోత్పత్తేః పరం ప్రకర్ష మాపన్నా అనుభూయత ఏవ. న కశ్చిదుపచారః తత్రాద్రియతే. ఏవమస్యాః సమ్యక్త్వం భవతి. ఏవం మానానంతరసంభోగాదిష్వపి.

ల. సంక్షిప్తా పాల్యతే - సంకీర్ణా కుటిలీభవతి - సంపూర్ణా అభ్యవహ్రియతే - సమ్యగ్భూతా అనుభూయతే."

ప్రథమానురాగానంతరము మొదట రతి యుదయించును. అప్పుడు ప్రేయసీప్రియులు ప్రియమాచరింతురు. అప్రియము నాచరింపరు. రతి పాలింతురు. అచట సంక్షిప్తముగా నాలింగనాదులు వికల్పతః ప్రయుక్తములగును. ప్రేమగలిగి కుటిలములు కావు. ద్వితీయావస్థలో రతి స్వాభావకుటిలమగును. అప్పుడుపచారములు అనుభావములు సంకీర్ణములుగా నుండును. కామవామతి యుదయింపగా సులభ నవమానించుట దుర్లభ నాకాంక్షించుట యుండును. తృతీయావస్థలో రతి పరిపక్వత పొందును. ఆలింగనాదులు సముచ్చితములై ప్రయుక్తములగును. అప్పుడది సంపూర్ణరతి యగును. నాల్గవ యవస్థలో విశ్వాస ముదయించును. గావున రతిపరిపక్వత పొంది యనుభూతి మగును. ఏ యుపచారమునకు నప్పుడాదర ముండదు. ఇది సమ్యగ్రతి. ఇట్లు మానానంతరసంభోగాదు లందును గ్రహింపవలెను. సామాన్యతః విశేషతః ఈ యంశములు రూఢములయినవి. పూర్వానురాగానంతరసంభోగమున సంక్షేప - పాలనములు, మానానంతరసంభోగమున సంకర - కౌటిల్యములు, ప్రవాసానంతరసంభోగమున సంపూర్ణ - అభ్యవహారములు. కరుణానంతరసంభోగమున సమ్యక్ - అనుభవములు సంబంధించియుండును.

భుజ్ ధాతువునకు సంబంధించిన యర్థములు వైయాకరణసమ్మతములే. ఇంతవఱకు నిరూపించిన పాలన - కౌటిల్య - అభ్యవహార - అనుభవములలో నవాంతరభేదములు గలవు. లబ్ధపరిరక్షణము - రక్షితవివర్ధనము - వివృద్ధోపయోగము - అలబ్ధప్రతీక్ష యను నాలుగు పాలనభేదములు. వైపరీత్యము - వైయాత్యము - వైదగ్ధ్యము - వైచి

త్ర్యము అను నాలుగు కౌటిల్యభేదములు శ్రద్ధ - నితాంతాసక్తి - పర్యాప్తత - కృతార్థత యనునవి నాలుగు అభ్యవహారభేదములు. సమ్యక్ జ్ఞానము - ప్రియాధ్యవసాయము - కార్యానుష్ఠానము - ఫలాధిగమము అనునవినాలుగు అనుభవభేదములు. ఈ నానావస్థానుసారముగా, అనురాగారంభము అనురాగాభివృద్ధి - అనురాగవ్యాప్తి కలుగును. పాలనము కౌటిల్యమగును. కౌటిల్యము పాలనమగును. ఇట్లే యితరములును పరస్పరము సంప్లవము కలవియగును. ఈ సంభోగశృంగారము "పుష్పధన్వనః ప్రాణితం"

౨౨. ప్రథమానురాగానంతరసంభోగము చతుష్షష్టివిధానముల నిరూఢ మగును. విస్రంభణము - ప్రేక్షోదీక్షణ - పరిహార-పరిహారవిలాప - కందుకక్రీడ - కేలిద్యూత - ఋతూపయమః.............. సమాయాతః - కాలావస్థానుభవ - పూర్వాహ్ణిక - మధ్యాహ్నిక - అపరాహ్ణిక - అస్తమయ. సంధ్యాతప-చంద్రోదయ - జ్యోత్స్న-ప్రాదోషిక-విషిద్ధ-రాత్రిపరావృత్తి - ప్రాభాతిక - వనవిహారగమన-వనవిహార - పుష్పావచయ - శ్రమానుభవ - ప్రచ్ఛాయాదిసేవ - జలక్రీడ - నేపథ్యయోగ - క్రీడాపర్వతవిహార - ఏకశాల్మలి - నవలతిక - పాంచాలానుయాన - నవపత్రిక - కదంబయుద్ధ-బిసఖాదిక - ఇంద్రోత్సవ - కౌముదీప్రచార-యక్షరాత్రిక - అష్టమీచంద్రిక - కుందచతుర్థి - సువసంత - సహకారభంజిక - డోలావిలాస - ఉదకక్ష్వేడక - మదనోత్సవ - గృహప్రత్యాగమన - సహాయవ్యాపార - ప్రసాదనగ్రహణ - గోష్ఠీవిహార - వాసగృహోపాగమన-అభిసారికాప్రతీక్షణ - దూతీవిసర్జన - స్వయంగమన - ఆగతోపచార - పరిచరణ - విసర్జన - కంచుకాదిమోక్ష - రతారంభ - రత - రతావసాన - నిద్రానుభవములు. ఈ విస్రంభణాదులు క్రియాత్మకములు. సంభోగ భేదావచ్ఛేద హేతువులు.

మానానంతరాది సంభోగప్రకాశము పేరిట మిగిలిన త్రివిధ సంభోగముల నిరూపణ మవశిష్ట మపేక్షితమును. మానానంతరసంభోగము ప్రవాసానంతర సంభోగము కరుణానంతర సంభోగము సంభోగ స్వరూపావిష్కారమున సమర్థములు.

మానాగ్రహము పోవుట లోని విశేషములు ౪౯ విధముల నున్నవి. మానశైథిల్యము - మానాపగమలింగములు - మానాపహ్నవ - మానాపగమ - ప్రసాదన - ప్రియాభ్యుపపత్తి - ముధాప్రతిషేధ - పరిసాంత్వన - చిత్రచాటూక్తి - స్ఖలితగోపన - ప్రియోత్థాపన - అశ్రుప్రమార్జన - మానశేష - అపరాధస్మరణ - ప్రేమవైమనస్యము - స్తనోత్కంప - నిశ్వసిత-స్వేదరోమాంచ కపోలోష్ఠస్పందన - ముఖప్రసాద - వ్యాజశపథ - వక్రవీక్షిత - ఉపాలంభ - ప్రత్యుత్తర - ఆజ్ఞాభంగ - ప్రేమావిర్భావ-ప్రేమాలింగన - ప్రియోపరోధ - శృంగారవృద్ధి - హాసకచగ్రహ - ప్రసహ్యాశ్లేష - పాణితాడన - పాదాభిఘాత - దయితాయాతన - పత్యనునయ - ప్రేమవక్రత - లజ్జాగమ - మానరామణీయక - విస్రంభసంభాషణ - మానాసక్తి - మానప్రతిపాదన - సఖీపరిహాస - మానానుశయ-మనవించ- మానానుచింతన - మానప్రధ్వంస - మానాపునర్భవములు. ఈ రీతుల వలన మానినీమానము క్రమముగా తగ్గిపోవును.

ప్రవాసానంతరసంభోగము ప్రియుని ప్రవాసవార్తా శ్రవణారంభముగా సమాగమపర్యంతము కల విశేషములతో నుండును. ఇందలి యవస్థావిశేషము లిరువదినాలుగుగలవు ప్రియాగమనవార్త- ప్రియసఖీవాక్య - దిష్ట్యావృద్ధి - ప్రీత్యాది - సంభ్రమ-అభ్యుత్థాన- ప్రియాభ్యాగమ - సందర్శన - ప్రియాభ్యుపపత్తి-పరిజనప్రమోద - మంగలసంవిధాన - మనఃప్రహర్ష - ఉత్సవ-భావనాప్రతిసంస్కార- కార్యాశ్చర్యద్యుపలంభ-ప్రహర్షోపచయ-ప్రేమపుష్టి-ప్రసాధనగ్రహణ-

వృత్తాంతస్మరణ – అవస్థానివేదన – దుఃఖాదిపరిప్రశ్న – దేశసంపదుప వర్ణన – స్వాంతఃఖపంక్తిర్తన – శృంగారవృద్ధి – యను నీ యవస్థావిశేషములచే సంభోగపుష్టి కలుగును.

కరుణావిప్రలంభానంతర సంభోగమున గలుగు నవస్థావిశేషములు ఇరవై. ప్రియాసందర్శన – సంభ్రమాకులత – ప్రమోద వృద్ధి – చిత్తవిస్మయ – ప్రియాభిభాషణ – జీవితేఽతిలజ్జా – ప్రియోపచ్ఛందన – సుహృదపేక్ష – వృత్తాంత కథన – విప్రలంభోత్పత్తి – ఇతికర్తవ్యయోగ – బాంధవాగమ – ప్రియజనాభ్యుపపత్తి – గురుజనస్నేహ – జ్ఞాతిజనాభినందన – భాగ్యప్రశంస – నైపథ్యాదిగ్రహణ – పురప్రవేశ – నాగరికక్షోభ – గృహోపగమన – ఉత్సవానుభవ – దయితసాహచర్య – శృంగారపుష్టి – సౌఖ్యపరంపర యనువాని ననుసరించి యితర భేదముల నభ్యూహించునది.

అనంతరాణాం సర్వేషామయమేకః ప్రకృష్యతే
రతిర్విప్రలంభజాస్మిన్హి నిష్కంపత్వం ప్రపద్యతే

ఇతి గదితమశేషం విప్రలంభస్వరూపో
పహితనిజసమృద్ధేః శ్లాఘ్యశృంగారనామ్నః
రతిసముదయరూపం జీవితం పుష్పకేతోః
నివసతు సుకవీనాం సర్వదా మానసేషు.

సర్వసంభోగములలో నీ సంభోగమే ప్రకృష్టము. విప్రలంభజన్యమయిన రతి నిష్కంప మగును గదా! విప్రలంభములచే సమృద్ధమయిన శృంగారము యొక్క రతిసముదయరూపము. పుష్పకేతు జీవిత మిట్లు నిరూపిత మయినది. ఇది సుకవుల మానసములందు సర్వదా నివసించు గావుత.

౨౩. సంభోగావస్థాప్రకాశము సర్వవిధసంభోగసౌందర్యప్రకాశము. సత్తి – అభివ్యక్తి – అనుబాధ – ప్రకర్ష రూపమున సంభోగావస్థలు నాలుగు గలవు. నాయికా నాయకుల సమావేశమున రతికి

మూలముగా నుండునది. "సత్త్వ" యగును. విభావానుభావ వ్యభిచారిభావముల వలన గలుగు రతి స్ఫుటత "యభివ్యక్తి". విభావాదుల సంబంధమువలన స్థాయిభావమునకు గలుగు విశేషము. సముల్లసిత మయిన రతి సర్వావస్థలలో ననుగతముగా నుండుట. విరుద్ధావిరుద్ధానభిభూతస్థితి "యనుబంధము." రతి సముల్లసితమై శృంగార రసస్థితి పొంది యుండుట "ప్రకర్ష" యగును. ఈ నాలు గర్థములలో "సమ్" ఉపసర్గార్థములు నాలుగు సంగతము లగును. సంభోగార్థము విశద మగును. సత్త్వ సంక్షిప్తముగా భోగ మావిష్కరించును. అభివ్యక్తిలో భోగము సంకీర్ణ మగును. అనుబంధములో సంపూర్ణ మగును. ప్రకర్షలో సమ్యక్త్వము పొందును.

సంభోగమున ముఖ్యభేదములు రెండు గలవు. సామాన్యము విశేషము నని - పశుపక్ష్యాదులకు సామాన్యము. నాగరికులకు విశేషము. విశేషసంభోగము ౧౨ విధములు. వీనికి సంక్షిప్త - సంకీర్ణ సంపూర్ణ - సమ్యక్ అను అవస్థల సంబంధ మున్నది. సత్త్వ సంక్షిప్త రాగము ౧౨ విధములు. సాత్త్వికనాయకు నందు ౪ విధములుగా నుండును. హరిద్రారాగ - రోచనరాగ - కౌంపిల్యరాగ - రీతిరాగములు. రాజసనాయకునందు కుసుంభరాగ-లాక్షారాగ - అక్షిబరాగ మాంజిష్ఠరాగము లుండును. తామసనాయకు నందు కర్దరాగ - కాషాయరాగ - సకలరాగ - నీలీరాగములు నాలుగుండును.

అభివ్యక్తిసంకీర్ణమను దశలో ప్రేమ ౧౨ విధములు. ఆవృత్తి వ్యాజ - అనువృత్తివ్యాజ - పరిణత - అధ్యాహృత - కృత్రిమ - అపేక్షిత - అంతః - బహిః - ఉభయ - బహు - నిర్వ్యాజ - సర్వ వ్యాజరూపములు.

అనుబంధసంపూర్ణదశలో ప్రేమ ౧౨ విధములు. ధర్మానుబంధ - అర్థానుబంధ - ధర్మార్థానుబంధ-అధర్మార్థానుబంధ ప్రముఖములు, ప్రకర్షసమ్యగ్దశలో ప్రేమరీతులు ద్వాదశవిధములు.

ప్రేమపాకములు కొన్ని సంధార్యములు. పిచుమందపాకము - కపిత్థపాకము - క్రముకపాకము - ఖర్జూరపాకము - మృద్వీకపాకము నారికేలపాకము-ఆమ్రపాకము-మొదలగు పాకములు ౧౨ విధములు. కామశృంగారము నందే రతి ప్రకర్ష యున్నది.

తదేతత్కామసర్వస్వం తదేతత్కావ్యజీవితం
యఏష ద్విప్రకారోపి రసః శృంగారసంజ్ఞకః.

శృంగారరసము కామసర్వస్వము. ఇది కావ్యజీవితము. విదగ్ధులు లేని గోష్ఠి శృంగారము లేని యంగన, కిరణములు లేని సూర్యుడు, జ్వాల లేని యగ్ని, ప్రతాపము లేని ప్రభువు, శృంగారము లేని నరుడు శోభింపరు. శశిచే నిశ భాసించును. నిశచే శశి భాసించును. శృంగారముచే నంగన యంగనచే శృంగారము శోభించును. మేఘము లేని మెరుపు మెరుపు లేని మేఘము శోభింపదు. ఆశృంగారాహంకారము అనహంకారశృంగారము శోభింపదు. ఇది యనంగసర్వస్వము. దీనిని భావుకులు బాగుగా మనసా భావించి తదనుభవ సముత్థానంద సమ్మీలితాక్షులై పరిషత్తులలో పరితోషము పొందుదురు గావుత,

యావన్మూర్ధ్ని హిమాంశుకందలభృతి స్వర్వాహినీధూర్జటేః
యావద్వక్షసి కౌస్తుభ స్తబకితా లక్ష్మీర్మురద్వేషిణః
యావచ్చిత్తభువస్త్రిలోకవిజయప్రౌఢం ధనుః కౌసుమం
భూయా త్తావదియం కృతిః కృతధియాం కర్ణావతంసోత్పలం

సాహిత్యప్రకాశాఖ్య శృంగార ప్రకాశమున శ్రీ భోజదేవ యాశంసనమిట్లున్నది. చంద్రకలాధారి ధూర్జటి శిరమున స్వర్వాహిని యుండునంతవఱకు, కౌస్తుభ స్తబకిత లక్ష్మి విష్ణువక్షమున నుండునంతవఱకు, త్రిలోక విజయ ప్రౌఢమయిన కుసుమధనువు కుసుమ

[illegible]గుణున కుండునంతవఱకు ఈ కృతి కృతీ బుద్ధులకు కర్ణావతంసోత్పలా [illegible].

"యావద్గోపాల కృష్ణార్యభావ సంతాన సంతతిః
యావన్మాధవరాయాఖ్య వాచా వైదగ్ధ్య వైభవం
యావత్ శ్రీభోజభూపాల వాగ్దేవీ ప్రాభవం మహః
యావత్సహృదయాహ్లాది సా: సారస్వతం వచః"

"తావన్మే సర్వసౌభాగ్యం తావన్మే మధురంవచః
తావచ్ఛృంగార సర్వస్వంతావత్సాహిత్య వైభవం"

ఆతీదం కవిభావానాం, భావజీవన భోజినాం
వచః పాండిత్య వైదగ్ధ్య, సాహురస్యోపజీవినాం.



# ఆత్మ ప్రకాశము

శ్రీ తాతా రాయుడు శాస్త్రి శిష్యుడనై నేను తెనాలి సంస్కృతకళాశాలాధ్యాపకుడనుగా నున్నపుడు 1932 వత్సరమున శ్రీశాస్త్రిగారు వేసవిలో బెంగుళూరుచేరిరి నేను నా వ్యాసంగమునకు వారి సన్నిధి జేరితిని. శ్రీ యదుగిరి యతిరాజ సంపత్కుమార రామానుజముని చరణులు రాయుడుశాస్త్రి గారికి శృంగారప్రకాశము బహూకరించిరి దానిలో 22, 23, 24 ప్రకాశములె కలవు "సద్వితీయుడవైన నీవు శృంగారప్రకాశము" అని 8-6-1932 నాడు నా కా గ్రంథము నిచ్చిన మా రాయుడు భావము నాకు తెలిసినది. అప్పుడె కలిగిన సంకల్పమును ఇంటికి వచ్చి నా కామాక్షి హైమవతీదేవికి చెప్పితిని అప్పటి ప్రచారములో నున్న "జనవాణి" నా శృంగారరసము ప్రకటించినది. నేను భోజదేవ శృంగారప్రకాశము రాయుడు సన్నిధిలో అధ్యయనముచేసితి నని భావుకులు భావించిరి. అది ఆంధ్రప్రకాశము కావలె ననిరి. సద్వితీయుడనుగా సంకల్పించిన నేను ప్రస్తుత మద్వితీయుడనుగా నిట్లు చేయగలిగితిని.

శ్రీ యతిరాజస్వామి 1919లో భోజకృతి యన్నట్లు గుర్తించెను. సమగ్ర గ్రంథమునకు యత్నించియు 1926లో మూడు ప్రకాశములె ముద్రించెను. నా కది 1932లో నందినది. అప్పుడు నేను పంచవింశ వర్షప్రాయుడను. రాయుడి బలమున్నది. వ్రాయగలను. మా రాయుడు, మిత్రులు శ్రీ కుప్పుస్వామిశాస్త్రి పాదుల షష్టిపూర్తి మహోత్సవసభాధ్యక్షులుగా విజయనగరము విచ్చేసి నపుడు వర్ధించు నన్ను చూపి "ప్రస్తుతము శృంగార ప్రకాశము . .. "అనుచు పలికి నది నాకు సర్వబల మిచ్చినది. వారిద్దరు నవ్వులలో చూపులు కలిపి నన్ననుగ్రహించిరి

శ్రీ సి. పి. రామస్వామి అయ్యరు అధ్యక్షులుగా మైసూరులో నేర్పడిన ప్రాకాశ్య ప్రకాశక సంఘము భోజకృతిని ప్రకటించుటకు యత్నించినది 1956 లో శ్రీ గోమఠం రామానుజ జ్యౌతిషిక యత్నమున ఈ గ్రంథము 1-8 ప్రకాశములు ముద్రితము లయినవి 1963లో 9-14 ప్రకాశములు ముద్రితము లయినవి. మదరాసు విశ్వవిద్యాలయమున 1931 - 1934 పరిశోధన మొనరించి 1939లో శ్రీ వి. రాఘవన్ ఆంగ్లభాషా నిబంధనరూపమున ప్రకాశగ్రంథము వెలయించ జేసిరి. 1963లో తన ఆంగ్లకృతిని శ్రీరాఘవన్ సర్వసుందరముగా ప్రకాశిత

మొనరించిరి ఆనాటి నా సంకల్పమునకు ఈ ప్రకాశములు సహకరింపగా నే నీ గ్రంథము నిట్లు సారస్వతేయుల కందింప గలిగితిని.

వీనిలో ప్రథమప్రకాశమునకు ప్రకృత్యాది ప్రకాశ మని పేరు ఏకాదశము నకు రసావియోగ ప్రకాశ మని, ద్వాదశప్రకాశమునకు పరిబంధాంగ చతుష్షష్టి చతుష్టయ ప్రకాశ మని పేరు. త్రయోదశప్రకాశమునకు రతిప్రకాశమని పేరు. వీనిని మాత్రము నామ నిర్దేశముతో సంగ్రహ పఱచి పరిమితముగా ప్రతిపా దించితిని.

శృంగారప్రకాశ మునకె సాహిత్యప్రకాశ మనియు నామము కలదు భోజ దృష్టిలో సర్వము సాహిత్యప్రకాశమె. దానిని రాజవచనముగ దేవవాక్యముగ భావించితిని అయిన ననంతరవిషయము సాహిత్యప్రకాశ మని యనుకొనుట కుగా నిట్లు రూపించితినా! ఆ యభిఖ్యను తలపై నుంచికొని నా యీ కృతి సుకృతి గా దలచినది

అందుననె 14 – 36 ప్రకాశార్థములు సాహిత్యప్రకాశ కలాకంచుకావరణ మునమన్నవి. ఇట్లేని సూచించుటకు శ్రీరాఘవన్ కృతి యాధారము 1–8 ప్రకాశ పరామృష్ట విషయము లన్నియు వ్యాకరణపరామర్శ ప్రధానములు, వాని స్వరూప పరిచాయకముగ ప్రథమప్రకాశము నిరూపించితిని.

"శబ్దార్థౌ సహితౌ కావ్యం" శబ్దము ద్వాదశవిధము, అర్థము ద్వాదశ విధము, శబ్దార్థముల సంబంధరూప మయిన సాహిత్యము ద్వాదశవిధము, ఇట్లు 36 విషయములను భోజుడు ప్రతిపాదింప నిశ్చయించెను. ఇందు ద్వాదశవిధ శబ్దవిశేషములలో నొక ప్రకృతిని మాత్రమె నే ననుకొనిన విధమున ప్రతిపాదిం చితిని. అర్థవిశేషములు క్రియాదులు ద్వాదశవిధములు వానిని నేను నిరూపింప లేదు, అట్లే ద్వాదశవిధసాహిత్యరీతులలో ఏకాదశప్రకాశమున నున్న రసావియో గమునే నిరూపించితిని కాని, అభిధావివక్షాదుల సూచింపనే లేదు భావ ప్రకాశ నములో కొంత నిరూపించితిని, అయిన నిందు వ్రాయవలసినదే. దోషహా నము గుణోపాదానము, అలంకారయోగము అను వానిని నిందు వ్రాయనేలేదు. వీనిని నే నేల రూపింప లేదు? నాకు నేను ఏమి యేని చెప్పికొందును. "విషయ పకాశమా! నీవు నీ భావయితలకు భావ్యము సూచింపుము.

శ్రీ సర్రా గోపాలకృష్ణయ్య నా లోకనాథ మిత్రగోష్ఠిలో కొందరికి నిర్దేశించి "మేము మీ సాహిత్యశాస్త్రగ్రంధములను ముద్రింప వలెనని నిశ్చయించితిమి." అనెను . నా సాహితి సంతుష్టి యయినది. ఒక సంవత్సరారంభ మహోసభలో శ్రీగోపాలకృష్ణయ్య కలము సిరా కాగితములు పరికరములు నాకు సమ్మానముగ నిచ్చి శాలువలు గప్పి పూలపూజ లిచ్చి "శృంగారప్రకాశము ముద్రణమునకు తగిన విధమున వ్రాయుటకుగా నిది స్వీకరింపుడు"అనెను నే నాడు భోజదేవుని వాగ్దేవీమంటపములో నున్నట్లయినది, ఈ సాధారణ సమారంభ మహాసభలో శ్రీగోపాల కలాభవనమున కృతిస్వీకారము చూచి వాగ్దేవి వీణాక్వాణము వెలయింపజేసినది. స్ఫూర్తి శ్రీ భాస్కరరావు ప్రరోచనము పలుకుట శ్రీ పసల సూర్యచంద్రరావు సభాధ్యక్షులై సాభిమానముగ సర్వసంవాదము సూచించుట భోజదేవునకును ఆనందము. నా యీ గ్రంధమునకు ఆముఖ ప్రకాశము కూర్చిన శ్రీ సూర్యచంద్రరావుగారి సచివ శ్రీ సంపత్తి సకల కలానిదానము.

భోజదేవరచిత గ్రంధము లనేకములు కలవు. కొన్ని లక్ష్యగ్రంధములున్నవి. రామాయణచంపువు భోజకృతి అందీ లక్షణసమన్వయము నన్వేషించి నిరూపించుట సాహితీ లోకమునకు నవామోదము ఆ యా శ్లోకములలో సమన్వయమును కని భోజుడు గుణాలంకారరసభావముల పేరు పేరున నిర్దేశించెను చెప్పినవన్నియు నెందున్నవో రాజవాక్యముగ గ్రహింపవలెనా? వ్యాకరణసూత్రకార్యసమన్వయ విశేషములు కలవి యనేకములు కలవు. వ్యాకరణప్రియులు విశిష్టానుసంధానమున వానిని గుర్తింతురు కావుననే భోజరీతి సర్వ మిందు లేదు. మహాభాష్యమున ప్రశ్నోత్తరభాష్యములు వ్యామిశ్రములై యున్నవి

ఇందలి పంక్తులు భాష్యపంక్త్యనుసారులు ఇందలి ప్రశ్నోత్తరపంక్తులను నేను నిరూపింపగలిగితినా? సాంప్రదాయిక వ్యాకరణవిద్యా సంవేదనము కలవారు ఇందలి వ్యాకృతివిషయ ప్రస్తారమును సమీక్షించుట యావశ్యకము మొదట అసంగత మనువారును స్మృతి సముల్లాసమున సుసంగత మనగలరు. సర్వసమీక్షాదక్షులై భోజాంతర్వాణి వాణీభావన మొనరించుట యుక్తము సాహితీ సౌందర్య సమీక్షలో చతురముగా సరసముగా ప్రవర్తించిన భోజుడు వ్యాకరణ చర్చల నిరూపించి శర్కరాసికతల గలిపినాడేమి? కవి కింత కార్యభారముండునని సూచించుట యగునా? భావుకు లిట్లు భావించిననె భావుకు లగుదు రని భోజ

వేదశాస్త్రి భావించెనా? ఆ యా శాస్త్రములకు సంబంధించిన విషయముల నున్న వాని నున్నట్లు వ్రాయుటలో తెలిసి వ్రాసితినో? తెలియక వ్రాసినట్లు భావింపను. శబ్దగర్భమున నున్న నానారమ్యాతిరమ్య విధానముల గుర్తించుట కిది యుపకరించునో! అవశము భావావేశమున వ్రాసితిని ఆవిష్టమతినై తెలిసియే వ్రాసి యుందును అనావేశస్వభావమున సర్వము నాకే నవముగా నవనవముగా భాసించును. భోజదేవుడు నా యీ భూదేవదేహమున సమావిష్టుడై వ్రాసెననుటకు నేను కవినా? భోజదేవునకు వాగ్దేవీసమావేశమున్నది నేనును నా "వాచాందేవి" నారాధింతును. నాకుగా నేను చెప్పలేని వానినావిష్టుడనై యలవోకగా వ్రాసితినో!

శృంగారప్రకాశమునకు సంస్కృతమున వ్యాఖ్యాన మపేక్షితము భోజోదాహృతముల యౌచిత్య మప్పుడవభాసించును. కాని యీ పని యిప్పట జరుగునది కాదు ఇందు పారిభాషిక పదములు వెయివేలుగా గలవు. ఇవి శబ్దకోశముల లేవు. కేవల శాస్త్రపరితులకు, కేవల కావ్యపాఠకులకు గోచరములు కావు. వేదశాస్త్ర కావ్య నాట్య తంత్ర సర్వభోజుల కసావధానతలో గోచరింపక పోయినచో నీ గ్రంథసంభావనమున నవి సుగోచరములు కావచ్చును విభాగములను జెప్పుటలో భోజుడు "ఆదయః" అనెను. ఈ "ఆదుల" యన్వేషణ మావశ్యకము అంతర్వాణు లాలోచనాసక్తులగుట లేదు. భోజమార్గమున సంచరింప గలవారు ఏమేని గుర్తింతురు.

అభిమానమయ-అహంకారమయ స్వరూపనివేదనమునకై భోజు డుదాహరించిన భావములు మనోమయ భూమికా విశేషములకు సంబంధించి యున్నవి. భవభూతి భావనెట్ల సంగత మయినది. భూతి భావముల క్రోడీకరించి కూర్చిన భోజసిద్ధాంత మేర్పడునా? భోజునిది లక్షణము భూతిది లక్ష్యము. సమన్వయసాధనము చక్కని కార్యము. ప్రబంధములలో మహత్త్వరమణీయత్వములు కలవని భావించు ఆంధ్రప్రబంధప్రియులు ఇందలి ముప్పది ప్రబంధలక్షణములను భావించి ప్రతిప్రబంధమునను లక్షణత్రింశము సరిపడునట్లు సమన్వయించి సరిచూచుట పరిభావించుట యుక్తము. ఒక ప్రబంధము నందేని భోజలక్షణ సమన్వయసంగతి చూచిన సర్వప్రబంధ సమన్వయసరణి చూడవచ్చును. రాయలాంధ్రభోజుడు కదా! భోజరాజ భాష గుర్తించి యుండును[1] ప్రబంధలు ప్రబంధముల తదనుగుణముగ రచించి యుందురా? పరిశీలింతము. ఈ భావముననె

ఈ శృంగారప్రకాశము నందించుచున్నాను. ఈ దృష్టితో నిందలి ఏకాదశ ద్వాదశ ప్రకాశములను సంభావించుట మన పని.

భోజుడు నిరూపించిన యీ ప్రబంధలక్షణముల ననుసరించి యొక యాంధ్ర ప్రబంధమును రచించుట యుక్తకార్య మయినను శక్యకార్యము కాదు. లక్షణా - సరణ ప్రగల్భ మతుల కశక్యకార్యము కాదు. సర్వలక్షణసంగత కావ్య మెట్లుండునో తెలియ జేయుట కాంధ్రప్రబంధము లందున్న ఆ యా విషయముల నేర్చి కూర్చి ప్రబంధసంకలన మొనరింపవచ్చును. అది సుశ్లిష్టముగ నుండుట కగు యత్న మసుకరము కాదు. ఇట్టి సంపన్నసృష్టి వచ్చినచో నిది యందర కుపాదేయమై సర్వప్రబంధాతిశయితముగా నున్న దన్న ప్రత్యయము కలుగజేయునదై ప్రకాశింప గలదు. అట్టి సృష్టి సాహిత్యప్రకాశము కాగలదు సాహిత్య ప్రకాశము పేరిట నొక నవీన నిబంధన గ్రంథ రచన మావశ్యకము. భోజప్రకాశములో ప్రాచీనసర్వశాస్త్ర మేలన మున్నది అట్లు సా హి త్య ప్ర కా శ గ్రంథమున నవీనశాస్త్రముల సమ్మేలనము నవీనసాహిత్యవాదముల సంకలనము సూత్ర కారికా స్వరూపమున వివరణ స్వరూపమున నిరూపింపజేయుట యావశ్యకము. ఇట్టి మహాకార్య నిర్వహణమునకు నవీనభోజుడు కావలెను. నవీన మాధవవిద్యారణ్యుడు కావలెను. అభిజ్ఞు లనేకు లరణ్యవిద్య లగుట దేశమున కుభోదర్కము కాదు. ఈ మహాకార్య మేకవ్యక్తి సాధ్యము కాదు. షట్త్రింశ సంఖ్యాక సమీక్షాదక్షులు ఏకలక్ష్యమున సర్వవాదసామరస్యము సంపాదింపవచ్చును. అట్టి దృష్టిసృష్టికై నే నీ సాహస మొనరించితిని. అలబ్ధభోజభోజనుల కిది యొకింతగా నయిన క్షుదుపశమన మొనరింప గలదు.

భోజనిరూపణములో ప్రాచీనులు ప్రతిపాదించిన నిర్వచనములకు తాత్పర్యము నిర్ణయించుటలో విశేష మున్నది స్వాభీష్టార్థమును భోజుడు భావించుట, అట్లే ప్రతిపాదించుట స్వీయభావములకు వారి ప్రామాణ్యసంపాదనమున కగునా? అస్ఫుటస్ఫురితముగా నున్న ఆ విషయము నట్లు గుర్తించుట యుక్తమా? భోజుని రససిద్ధాంత నిరుక్తి క్షోదక్షమమె యగునా? అభినవ గుప్తుని సంవిచ్ఛాస్త్ర ప్రక్రియ ప్రత్యభిజ్ఞామహార్ఘ మటంచి యనుట కిందు విచారణీయ చర్చ భాసింపదు. శృంగారమాధుర్యము సర్వప్రాణిసులభ మయినందున లోకామోదమునకు భోజు డిట్లుపపాదించెనా! శాస్త్రీయసమీక్ష కిది యాగునా? "శాంతము సిద్ధరసము

మహారసము. ఇతరములు సాధ్యములు కాల్పనికములు" అని యభినవు డనుట, "శాంతమున నన్నియు పుట్టును శాంతమున నన్నియు పర్యవసించును" అని భరతాభినవభావమును సారస్వతేయులు నిశ్చయించుట భోజున కుత్సాహ మిచ్చినది. వీనిని శృంగారపరముగా నిరూపించుట భోజుని యాస్థస్వాస్థ, ఇది సమర్థనీయ మగునా? ఈ వాదమును బాగుగా పరిశీలించి పాశ్చాత్యభావసంవాద మూహించి, కొంతకాలము శాస్త్రీయముగా చర్చించి పరిష్కరించిన రూపసౌష్ఠవ మేర్పడునో! కాని అభినవుడు అభినవుడె. ఇట్లను నేను అభినవదాసుడనా! అయిన నది నాకు భూషణము. బహుజనభాష యిట్టి వానిలో నుపాదేయము కాదు. ఉన్నది కాదనుటను విశేషముగ భావించు బాలుర కబాలసులభ తత్త్వపరిశీలన మేల? కాశ్మీరికలను భోజుడు రాజుగా.. ... అనెను. భోజస్మృతి అటునుండి దక్షిణాశావలంబనమున నుండవలసి వచ్చినది,

శారదాతనయుడు భావప్రకాశనములో పలయు స్థలమున భోజు ననుసరించియు నభినవానుయాయి యయినాడు, "శృంగారప్రకాశమును భోజు డొకడే సంకలనము చేసి యుండునా? అనేకులు రాజాజ్ఞ ననుసరించిరా?" అని యను వారు భోజగౌరవభావనల యభిశాపము పొందవలసి వచ్చును భోజు నంతటి వాని కిట్టి దశక్యక్రియ కాదు. గ్రంథరచనావిధానమున ధారావాహిక విషయ సంపత్తికి వ్యవధాయకములు కొన్ని యున్నవి అవి చిత్తక్లేశ మిచ్చునవియు నగును. అయినను రాజగౌరవమున భావుకులు వానిని పట్టించుకొనరు? ఇందలి లక్ష్యలక్షణసమన్వయ విశిష్టతను భావించినచో అసాధారణరమ్యత భాసించును ఇట్టి రీతి నాంధ్రకావ్యముల సమీక్షించిన సంతృప్తి కలుగును. అతృప్తియు కలుగును. తృప్త్యతృప్తులను భావించిన భావుకులు సమీచీన లక్ష్యనిర్మాణమున నయత్ను లయినచో భావకులకు భావతృప్తి కలుగును.

ఇందు నే నుపయోగించిన భాష భోజభాష, అట నట ననుసంధానము చేయవా భాష యున్నది ఇట్టి గ్రంథముల కిట్టి భాష ఇంక నిట్టి భాష యావశ్యకమని భోజు డనగలడు. నే నెంతగనో వ్రాయ దలచియు నింతగనె వ్రాసితిని. ఆనతికాలమున మరల దీని ముద్రించి నా కర్తవ్యము పాలింతును. అస్తు.

---